శివధర్మ గ్రంథమాలికా - ౧౨ బిల్వము.

# పాలకురికి
# సోమనాథకవి





గ్రంథకర్త:
"విమర్శకాగ్రేసర"
బండారు తమ్మయ్య

# పాలకురికి
# సోమనాథకవి

గ్రంథకర్త:

"విమర్శకాగ్రేసర"

శ్రీ బండారు తమ్మయ్య గారు.

సహాయులు

వీరశైవ మహాజనులు, వల్లభాపురము

ప్రథమ ముద్రణము 500 ప్రతులు.

ప్రకాశకులు,

శివధర్మ గ్రంథమాల

మటికె నాగయ్య ధర్మ-నిలయము

సికింద్రాబాదు

# గ్రంథము దొరకుచోటులు

(౧) గ్రంథకర్త శ్రీ బండారు తమ్మయ్యగారు, మేనేజరు
కిర్లంపూడి ఇస్టేటు, బొబ్బిలి. విశాఖపట్టణ మండలము

(౨) శివధర్మ గ్రంథమాల
౪౨౬౮ సజన్ లాల్ వీథి
సికింద్రాబాదు (దక్కన్)

(3) శివధర్మ గ్రంథమాల
జంగమవాడిమఠము.
బెనారస్ సిటీ.



వెల 2-8-0

(సర్వస్వామ్యములు గ్రంథకర్తవి)



బెజవాడ ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల
యందు ముద్రింపబడి ప్రచురింపబడియె.
1948

# FOREWORD (తొలిపలుకు)

I deem it a privilege to have been called upon by Sri Bandaru Thammiah to write a foreword to this brochure, which exhaustively deals with the life and works of Palkuriki Somanatha Kavi, that eminent poet, philosopher and saint of the Kakatiya period. The great renaissance of Kalyan which convulsed the entire length and breadth of Karnataka in the 12th century and which gave to the Kannadigas a virile, original and truly national literature, did not fail to have its profound influence on the neighbouring territory of the Andhras. The two protagonists of that Revolution—*Hariharadeva* of Hampi and *Somanadha* of Palkuriki—interpreted that new and soul stirring message by their memorable and immortal poetical works and inaugurated a new era in the history of Kannada and Telugu languages. They set at nought the stale and stereo-typed conventions and traditional dogmas and chalked out a bold and independent path - diverting literature from the traditional path of imitation to that of self-expression.

If that great, pioneer poet Nannaya Bhattaraka can be hailed as the Father of Telugu poetry, Somanatha is truly the Father of Telugu National Poetry. He made a rich contribution to the Telugu literature by his prolific writings which include " *Basavapuranamu* " " Panditaradhya Charitramu " " Anubhava Saramu " "Chaturveda Saramu ", Vrishadhipa Satakamu and a host of other minor works. His versatile genius, his unrivalled erudition in Sanskrit, Telugu, and Kannada and his intimate knowledge of Tamil and Marathi languages are reflected in his works. But it is his revolutionary and nationalistic outlook, his original and independent conception of eternal values, his great skill in selecting the appropriate vehicle for conveying his message to the scholars and the common-folk alike and above all his discovery of the genius of the indigenous Telugu language that have given

him a unique place in the history of Telugu literature. An unbiassed student of Telugu literature does not fail to perceive the great influence that his works have wrought upon the later poets such as Tikkana Somayaji, Bammera Potana and Srinatha, though Somanatha is more popularly known to be the fore-runner of a distinct and a separate school of Telugu Poets, who are now little known in the Telugu country.

It is singularly unfortunate that the works of Palkuriki Somanatha have not received the attention and regard that they deserve from the Andhra people of the modern age, though the champions of "Pragati Sahitya" owe a deep debt to him Very little is known about his life, and his times and the Telugu literature is the poorer for this neglect on the part of the Andhra scholars. Sri Bandaru Thammiah, the well known scholar and research worker, has made a deep and searching study about this long-forgotten poet and has published several articles in the Telugu periodicals which have thrown a new light on the age of Somanatha and have evoked interest in his works, which are now slowly seeing the light of day. He has now earned the gratitude of the reading public of the Andhra and the Karnataka by compiling an authentic and authoritative biography of Somanatha, which was hitherto an unwritten chapter in the history of Telugu literature. The scheme of this work, which is systematic and scientific, affords a model for those who seek to write the lives of ancient poets. It embraces all aspects of the subject matter and leaves nothing to be desired. It is eminently useful for the students of Telugu literature as also for the Kannadigas, who know Somanatha through Bhima Kavi but as the author of "Basava Puranamu" and as a deified *Sharana* through Tontada Siddhalinga Kavi. The learned author has exhaustively dealt with several controversial points regarding Somanatha and has made authoritative pronouncements on them. He has made a scholarly and critical review of all the available works of the poet

and has dealt with the notable characteristic features of his style, the diction, the prosody, the grammar and the like against the back ground of the then prevalent literary forms. He also enables his readers to have a peep into that past by touching upon the religious and social conditions of that age and has shown how the spirit of that age has found its expression in the works of Somanatha

The author wields a facile pen. The Telugu reading public is not unacquainted with the virile yet graceful and charming style of the author which is known for its purity of diction, easy flow and artistic skill of no mean order His work is a valuable addition to the modern Telugu literature and I am sure it will evoke popular interest and enthusiasm in the works of this long forgotten poet, Somanatha. I fervently hope that many such literary works will emerge from the powerful pen of this author and enrich Telugu literature.

AMALAPURAM,
15—4—48.

T. H. M. SADASIVAYYA,
M A., B. L.
*Subordinate Judge.*
(The Madras Judicial Service).

# మహాదాతలు

(గుంటూరుజిల్లా, తెనాలి తాలూకా, వల్లభాపుర వాస్తవ్యులు)

౧. శివశ్రీ చుక్కా వీరయ్యగారి పుత్రులు. పాపయ్యగారు.

౨. ,, రాచంశెట్టి వీరయ్యగారి పుత్రులు. బాలకోటయ్య బసవయ్య, నాగయ్య, సాంబశివయ్య గారలు.

౩. ,, రాచంశెట్టి లింగయ్యగారి పుత్రులు కోటివీరయ్య నాగయ్య, బసవయ్య గారలు.

౪. ,, రాచంశెట్టి బసవయ్యగారి పుత్రులు కోటినాగయ్య వీరభద్రయ్య, కోటి వీరయ్య గారలు,

# దాతృపరిశంస

చ॥ సిరులకుఁ దానకంబగుచు ♦ శ్రీకర శంభు . పదాబ్జచింతనా
పరులగు భక్తవర్యులకు ♦ వాసమునౌచుఁ. దెనాలిసీమలో
బరఁగును గృష్ణయొడ్డునను ♦ బావనమై విలసిల్లువల్లభా
పురమన నీసతీమణికిఁ ♦ బొల్పెసలారెడు కంఠహారమై

ఉ॥ ఆపురివీర శైవులది ♦ రా ! యదియెట్టి విశిష్టపుణ్యాలీ
లాపరిపాకమో శివవి ♦ లాసమొగాని యశంబునొందఁదా
మైపరమాదరంబునవ్య ♦ యంబువహింపఁగ ముద్రణంబుకై
ప్రాపుగనిల్చిరీ కృతిసు ♦ వార్తనుగాంచి విభూతిపత్రికన్

చ॥ అసమగుణాఢ్యుఁడైన బస ♦ వాధిపు పాద సరోరుహంబులన్
వసిగొనిగొల్చు పాల్కురికి ♦ వంశవిభూషణుఁడైన సోమనా
థసుకవి వీరశైవమత ♦ ధార్మికవల్లభు సచ్చరిత్రమున్
వసుమతి వల్లభాపురని ♦ వాసులెదీప్త మొనర్చునట్టియా
రసికత యెల్లకాలము స్థి ♦ రంబుగసన్నుతులొంది వెలుతన్

గీ॥ మహితయశుఁడు "విభూతి" సం♦పాదకుండు
శ్రీచిదిరెమఠ వంశ్యుండు ♦ శివచరితుఁడు
వీరభద్రశర్మాహ్వాయ ♦ విబుధ వరుఁడు
ఎలమి దీనినాచేతవ్రా ♦ యించుటెఱిఁగి

గీ॥ భక్తిమైవారిఁ దమవల్ల ♦ భాపురంబు
వేడ్కఁదోడ్కొని పూజగా ♦ వించెఁగరము
ప్రథిత చుక్కాకులాబ్ధిజై వాతృకుండు
వీరయార్యుని పుత్త్రుండు ♦ విశ్రుతుండు
పాపయార్యుండు పుణ్యావి ♦ భ్రాజితుండు

గీ॥ ఉత్సుకతతోడ బంధులఁ ♦ బ్రోత్సహించి
తాను, రాచమసెట్టిస ♦ ద్వంశ విధులు
విమలచరిత్రులు నల్వురు ♦ వీరయార్య
సుతులు మఱిలింగయార్యుని ♦ సుతులు మువురు
బసవయార్యుని సత్పుత్రి ♦ వరులు మువురు
శర్మగారికి నత్యంత ♦ సంతసంబు
వఱలఁ జేయుచునీకృతి ♦ ప్రకటనకయి
తగినద్రవ్యంబు నొసఁగిరం ♦ దఱును గూడి,

ఉ. క్షేమము స్థైర్యమున్ జయము ♦ శ్రీయును నాయువు నొంది సుస్థిర
శ్రీమహిమాఢ్యులై సతము ♦ శ్రేయములొందుచు భక్తలోకమం
దీమహివన్నెకెక్కఁ బర ♦ మేశ్వరుఁడవ్యయుఁ డెల్లవేళలం
దీమహనీయు లందఱను ♦ దీర్ఘకృపామతి నోముఁ గావుతన్

గీ॥ దాతృవర్యుల పావన ♦ ద్రవిణ మెపుడు
ధర్మమును బెంప సత్పాత్రి ♦ దత్తమగుచుఁ
గల్పవృక్షంబు వోలెసం ♦ కల్పఫలము
లొసఁగి దేశముక్తికివిని ♦ యుక్తమౌత

ఇట్లు,
గ్రంథకర్త.

# పీ ఠి క.

ఆంధ్రభాషయందు వీరశైవవాఙ్మయావతరణమునకుఁ గారణమయిన శ్రీ పాలకురికి సోమనాథ మహాకవి యిప్పటికి ముప్పది యేండ్లకు ముందు భాషాసేవకులు పలువురకు విస్మృత ప్రాయుఁడుగ నుండెనని చెప్పఁదగును. ఆంధ్రకవుల చరిత్రము నందు శబ్దరత్నాకరమునం దుదాహృతములయిన కవుల నామములందు నీ కవివరుని పేరు చేరియున్నను, ఆ గ్రంథకారు లీతని ప్రాశస్త్యము సరిగా గ్రహించి యందు గణించియుండ లేదు. అందుకు ముఖ్యకారణ మప్పటి కీతని గ్రంథములు చాలవఱకు ముద్రితములు కాకుండుటయు, ముద్రితములయిన ప్రధాన కావ్యము లొకటి రెండయినను బరిశుద్ధముగ బరిష్కృతము లయి తగిన ప్రచార మొందకుండుటయునయి యున్నది. దీనికిఁ దోడవి కేవలము మతగ్రంథములవుటఁ బఠన క్లేశమునకోర్చి కావ్యదృష్టితో వానిని బరిశీలించి యందలి మెఱుంగులఁ దిల కించు కుతూహలము భాషాభిజ్ఞుల కంతగా లేకుండెను. అందుచే నీ పరిస్థితుల గమనించి యీ కవివరుని చరితమునుగూర్చియు నాతని ప్రధాన కృతులయిన బసవపురాణ పండితారాధ్య చరి తము లందలి కావ్యకళనుగూర్చియుఁ గొంత చర్చించుచు వానిని బరిశుద్ధముగఁ బరిష్కరించి ప్రకటింపవలసిన యావశ్యకత నుగ డించుచు ఆంధ్రపత్రిక దుందుభి (1922) సంవత్సరాది సంచికకు విపులవ్యాస మొకటి పంపితిని కాని స్థలసంకోచముచే నదిసంగ్రహ ముగ మాత్రమే ముద్రింపఁ బడినది. అయినను దానిని జదివిన మీఁదటఁ గీర్తిశేషులు, చిరస్మరణీయులు శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు నే నొనర్చిన యుద్బోధమును బాటించి సోమనాథుని బసవపురాణ

పండితారాధ్య చరిత్రములను వృషాధిపశతకమును దమ యాంధ్రగ్రంథమాలికలోఁ బండిత పరిష్కరణములతో విపులములగు పీఠికలతోఁ బ్రకటింపఁజేసి యాంధ్రలోకమునకు మహోపకారమొనరించిరి. ఇందువలన వీరశైవులేగాక భాషాభిమానులగు మతాంతరులు గూడ నభిరుచిగ్రోసీతని గ్రంథములను జదివి యందలి కావ్యకళాసౌందర్యముల కానందించి సోమనాథున కాంధ్రవాఙ్మయమున నీయఁదగిన మహోన్నత స్థానము నిప్పటికిఁ జాలవఱకు గుర్తించియున్నారు. అందుచేఁ దద్విషయమం యిందు వేఱుగ నుగ్గడింప నవసరము లేదు. సోమనాథుని యనుభవసార చతుర్వేదసారములను, బసవోదాహరణ పంచ ప్రకార గద్యాదిక లఘుకృతులను గూడఁ బరిశుద్ధముగఁ బరిష్కరించి ముద్రించుటకయి భాషాభిమానులిఁకఁ బ్రయత్నింతురుగాక.

దుందుభి సంవత్సరాది సంచికలోని వ్యాసముగాక యటు తరువాత మఱి పదిసంవత్సరములకు ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారి కాకతీయ సంచికకుఁ గూడ నీ సుకవి సోముని చరిత్రాదికములఁ గూర్చి యొక విపుల వ్యాసమును బంపియుంటిని. కాని యదికూడ స్థలసంకోచముచే నందు సంక్షిప్తముగనే ప్రకటింపఁబడినది. ఆంధ్రగ్రంథమాలికలోఁ బ్రకటితములయిన యీ కవివరుని యీ మూఁడు కృతులందలి పీఠికలలోను దత్పరిష్కర్తలు వెలువరించిన భ్రమప్రమాదములను భిన్నాభిప్రాయములను విమర్శించుచు మఱికొన్ని విపుల వ్యాసములనుగూడ ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, సమదర్శిని, విభూతి

మున్నగు పత్రికలలో బ్రకటించియుంటిని. నా వ్యాసములను గొన్నిటిని జదివిన భాషాభిమానులు కొందఱు సోమనాథుని జీవిత చరిత్రాదికములఁ గూర్చి ప్రత్యేకగ్రంథ మేదయిన వ్రాసి యున్నచో దాని ప్రతి యొకటి పంపుమని నాకు వ్రాయు చుండిరి. కాని యట్టి సమగ్ర గ్రంథ మేదియు రచించియుండ నందున వారి కా విషయము నివేదించుచు నీ కవినిగూర్చి నేఁ బ్రకటించిన వ్యాసములు గల పత్రికల వివరములే వారికిఁ దెలుపవలసినవాఁడ నైతిని. ఈ పరిస్థితుల నెఱిఁగి సోమనాథుని గుఱించిన ప్రత్యేక చరిత్ర గ్రంథప్రకటనావశ్యకతను గుర్తించి, విభూతి పత్రికాధిపతులు, పండితప్రకాండులు, వేదతీర్థ, స్మృతి తీర్థ, కావ్యతీర్థ, ధర్మాచార్య, సాహిత్యవిశారద, విద్యారత్న, విద్యానిధి ప్రముఖ బహుబిరుదపదవీవిరాజిత పట్టభద్రులు శివశ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మగారొనర్చిన యాదేశా దరానురోధముల వలననే శ్రీ వారి శివధర్మ గ్రంథమాలికలో నొక కుసుమముగా వాఙ్మయ నిర్మాతృచరిత్ర ప్రణాళిక (Men of Letters Series) ననుసరించి యిప్పు డీరీతి నీ గ్రంథ మును రచించి ప్రకటించితిని. వారి ప్రోత్సాహమే లేకున్న నిది యవతరించెడిది గాదు. అందుకయి వారికి నా కృతజ్ఞతాభివంద నముల నర్పించుచున్నాను. గ్రంథముద్రణమునకు వలయు ధన సాహాయ్య విషయమున శ్రీ వీరభద్ర శర్మగారు విభూతి పత్రికలో గావించిన హెచ్చరికపయి ఆంధ్రవీరశైవులలో ధనా ఢ్యులు పలువురు మిన్నకున్నను గుంటూరుజిల్లా, తెనాలి తాలూకా వల్లభాపురము వాస్తవ్యులు శివశ్రీ చుక్కా—

వీరయ్యగారి పుత్రులు పాపయ్యగారు, వారి యాత్మబంధువులు, శ్రీ రాచంశెట్టి వీరయ్యగారి పుత్రులు బాలకోటయ్య, బసవయ్య, నాగయ్య, సాంబశివయ్య గారలు, శ్రీ రాచంశెట్టి లింగయ్యగారి పుత్రులు కోటివీరయ్య, నాగయ్య, బసవయ్య గారలు, శ్రీ రాచంశెట్టి బసవయ్యగారి పుత్రులు కోటి నాగయ్య, వీరభద్రయ్య, కోటివీరయ్య గారలు ముందంజవైచి గ్రంథ ప్రకటనమునకును శ్రీ వీరభద్రశర్మగారి కొనర్చిన సాహాయ్యమునకును వారికి నా ధన్యవాదముల నర్పించు చున్నాను. ఆంధ్ర వీరశైవ కవివల్లభుని చరిత్ర గ్రంథప్రకటన మున కుపకరించిన యీ వల్లభాపుర వీరశైవుల వాల్లభ్య మాంధ్రలోకమునఁ జిరస్మరణీయమై వెలయఁగలదు. పరమేశ్వ రుఁడు వారికి సంతతాయురారోగ్యైశ్వర్యాదికములఁ బ్రసా దించుఁ గావుతమని ప్రార్థించుచున్నాను వల్లభాపుర వీరశైవు లలో, చుక్కావారి వంశము చాల విఖ్యాతమైనది. పూర్వోదాహృతులైన శ్రీ పాపయ్యగారి తాతలలో శ్రీ సెట్టిగారి వీరయ్యగారు, శ్రీ బసవయ్యగారు అనువారలు విశేషమహిమాన్వితులై విఖ్యాతిగాంచిరి. వీ రిరువురు నొక నాఁటి సాయంకాలము తమ యింటివద్దనుండి కృష్ణానది యొడ్డు నకుఁ గాల్యకృత్యముల కేఁగియుండిరఁట. అప్పుడు వా రచ్చట నుండి యదృశ్యమగు నొక మహాశక్తి వలన నెక్కడికో కొని పోఁబడి యా రాత్రి తెల్లవారుసరికి దూర ప్రదేశమునఁ గొందఱు మునీశ్వరుల సన్నిధి నుండిరఁట. అప్పు డా మునీశ్వ రులు వారి జిహ్వాగ్రములపై కొన్ని బీజాక్షరములు లిఖించి

శ్రీ సెట్టిగారి వీరయ్యగారి కనన్యదుర్లభంబయిన యోగతానాగతాది విజ్ఞానము లభించుననియు, శ్రీ బసవయ్యగారికి విశేష పాండితీవిభవము కలుగుననియుఁ బ్రసాదించిరఁట. అనంతరము వా రచ్చటనుండి కొంతకాలమునకు నిజావాసమగు వల్లభాపురమునకు మరలివచ్చి మునీశ్వరు లాశీర్వదించినప్రకార మా యా విజ్ఞాన విశేషములతో విరాజిల్లి విఖ్యాతినందిరఁట. నూఱేండ్లులోపల జరిగి నేఁటికిని నాప్రాంతమునఁ బ్రశంసింపఁబడు నీ వృత్తాంత మవిశ్వసనీయమనుటకు వీలు లేదు. ఇట్టి మహనీయుల వంశ్యుల యొక్క పావన ధనసాహాయ్యమున మహానుభావుఁడైన సోమనాథుని చరిత్రము వెలువడుట గూడ మహాపుణ్యవిశేషమని సంభావించుచున్నాను.

సోమనాథుఁ డేకవింశతిదీక్షాసంపన్నుఁడవుట నీ చరిత్రమును గూడ నేకవింశతి ప్రకరణాత్మకముగ రచించితిని.

"సోమనాథుని కాలము" అను నిందలి పదియవ ప్రకరణము ముద్రణము ముగిసిన కొంతకాలమునకు నా మిత్రులు శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఫిబ్రవరి 1945 భారతిలోఁ గాకతీయ చక్రవర్తుల సామంతుఁ డగు శ్రీ అంబయదేవమహారాజులు శా॥ శ॥ 1212 (1290 A. D.) సంవత్సరమునఁ ద్రిపురాంతక వాస్తవ్యుఁడు రెంటేవుల మల్లినాథయ్యంగారికి వినుకొండ సీమలోని మొల్లకల్లూరు గ్రామము దాన మొసంగుచు వెలయించిన నీలగంగవరము శిలాశాసనమును, అందు నసంగతముగ శాసనభాగ మంతయు ముగిసిన పిదపఁ జిట్టచివర వేఱుగా లిఖింపఁబడిన యొక సంస్కృత శ్లోకములో గల దోచ

మాంబ నామోల్లేఖనమును బురస్కరించుకొని యా వ్యక్తు లిరువురు సోమనాథుని బసవపురాణావతారికలో నాతని సమకాలీన భక్తులుగా నుదాహృతులైన రెంటాల మల్లినాథ దోచమాంబలే కానోపుననెడి యభిప్రాయముతో సోమనాథుండు రెండవ ప్రతాపరుద్రుని కాలమువాఁడై యుండుననను ప్రాఁత నిర్ణయమును బునరుద్ధరించుచు నొక వ్యాసమును బ్రకటించి యున్నారు. అందలి యసంగతులఁ గూర్చి చర్చించుచు సవిమర్శ వ్యాసమును ఆగస్టు 1945 భారతిలోఁ బ్రకటించి యున్నాను. దానిపై శ్రీ సోమశేఖరశర్మగారు బదులు వ్రాయలేదు. కాని శ్రీ చిలుకూరి నారాయణరావుగారు మాత్రము శ్రీ శర్మగారి నిర్ణయము పండితారాధ్యచరిత్ర పీఠికలోని తమ నిర్ణయమునకు సహాయకమవునని దాని నామోదించుచు నా పునర్విమర్శవ్యాసములోని విషయములకుఁ దగు సమాధానము లేమియుఁ జెప్పకయే సెప్టెంబరు 1945 భారతిలో నొక వ్యాసమును బ్రకటించినారు. అందుపై నేను మఱొక వ్యాసమును వ్రాసి పంపినను భారతి పత్రికాధిపతులు దానిని బ్రకటింపరైరి. అందుకుఁ గారణముల వివరింప నవసరము లేదు. నారాయణరావుగారు పండితారాధ్యచరిత్ర పీఠికలో నొనర్చిన సోమనాథుని కాలనిర్ణయమునకై వారు గైకొనిన శాసనముల స్వరూపము నీ గ్రంథమునఁ బరామర్శించియే యున్నాను. కావున నభిరుచిగల పాఠకులు ఫిబ్రవరి, ఆగస్టు

1945 భారతి సంచికలలో శ్రీ సోమశేఖరశర్మగారు నేను బ్రకటించిన రెండు వ్యాసముల నిందలి పదియవ ప్రకరణమున కనుబంధముగ జదివికొన బ్రార్థించెదను.

ఇక నా మిత్రులు శ్రీ ఇవటూరి పాపయ్యశాస్త్రి గారు బళ్లారిజిల్లానుండి విశేష వ్యయప్రయాసలతో నాయొద్ద కరుదెంచి సోమనాథుడు నేను నిర్ణయించునట్లు సహజ వీరశైవుడగు జంగముడు గాక యారాధ్యబ్రాహ్మణ వంశజుడేయనియు బయిగా దమ యివటూరి వంశమునకు జెందినవాడనియు దమకు నాతనికి మధ్య నిప్పటికి అరువదినాలుగు తరములు గడచిన వనియు దమపూర్వులలో నొక్కరుడు సోమనాథునకు బదునాఱవ తరమువాడు నగు ఇవటూరి గౌరప్ప యను వారు క్రీ॥ శ॥ 1860 ప్రాంతమున బైడిముక్కల యగ్రహారము ఫయసలు కాలమున ఇనాం కమీషనరువారియొద్ద దాఖలు చేసిన వంశవృక్షము యొక్క నకలు తాము సంపాదించితి మనియు దానినిబట్టి పయిసంగతులు ధ్రువపడుననియు నుడువుచు నాకీ నడుమ దద్వంశవృక్షము చిత్తునకలును జూపియున్నారు. అందు వారు తమ యభిప్రాయమున కాలంబనముగ గయికొను ప్రధానభాగము నీ క్రింద జూపి యాయా వ్యక్తులకు వారు చెప్పెడు సంబంధములను గుండలీకరణములం దుదాహరించుచున్నాను.

కోటిపల్లి యారాధ్యదేవుఁడు (మల్లికార్జున పండితుని దీక్షాగురువు. ఇతనికే పాలంకి విశ్వారాధ్యుఁడను నామాంతరమఁట)

(కొడుకు) సోమనాథయ్య (పండితారాధ్యచరిత్ర పర్వతప్రకరణాంతమున మల్లికార్జున పండితుని శైవసంతానములో నుగ్గడింపఁబడిన ఇనటూరి సోమనాథుఁడే యితఁడఁట)

(కొడుకులు) సూరీశ్వరుఁడు | విశ్వనాథప్పయ్య | సింగనమంచి

- సూరీశ్వరుఁడు
  - (కొమరిత) గౌరాంబ
    - సూరాధ్యుఁడు (ఇతఁడే పండితారాధ్యచరిత్ర (శ్రీ)లయుఁ బాలకురికి సోమనాథుని మద్దుమఱఁదియును నగు పాలకురికి సూరనామాత్యుఁడఁట)
    - (కొమరిత) ఉమాదేవి
- విశ్వనాథప్పయ్య
  - వీరపోశేశ్వరుఁడు (పాలకురికి సూరనామాత్యుని దీక్షాగురువు)
- సింగనమంచి
  - సోమనాథుఁడు (ఇతఁడే మనకవి పాలకురికి సోమనాథుఁడఁట. పెదతండ్రి సూరీశ్వరునకుఁ దత్తుఁడయి యాతని దౌహిత్రియుఁ బాల్కురికి సూరనామాత్యుని సోదరియు నగు ఉమాదేవిని వివాహమయ్యనఁట.)
    - చెన్నబసవయ్య (ఇతఁడే చతుర్ముఖ బసవేశ్వరుఁడఁట)

ఈ కడపటఁ జూపిన చెన్నబసవయ్యకు నలువురు పుత్త్రులనియు వారిలో మూఁడవవాఁడగు సోమనాథయ్య సంతతిలోఁ దమపూర్వు లుద్భవించిరనియు శ్రీపాపయ్యశాస్త్రి గారు చెప్పుచున్నారు.

పండితారాధ్య చరిత్రము చివర సోమనాథుఁ డా గ్రంథ రచనాకాలమునాఁటికి జీవించియున్న మల్లికార్జున పండితుని యాత్మసంతానమునకుఁ జెందిన మనుమలను, తచ్ఛైవ సంతానము (శిష్యసంతానము) నకుఁ జెందిన ఇవటూరి సోమనాథయ్యను నాతని పుత్త్రులు సూరీశ్వరుఁడు, విశ్వనాథప్పయ్య, సింగనమంచి యను మూవురను పేర్కొనినాఁడు. ఆ సందర్భమున సోమనాథుఁడు ప్రయోగించిన "తచ్ఛైవ సంతానము" అను పదమునకుఁ బ్రకృత మనుసరించి యస్మదాదుల మన్వయించునట్లు మల్లికార్జున పండితుని శిష్యసంతానమని గాక గ్రంథాదిని పేర్కొనఁబడిన యాతని గురువు కోటిపల్లి యారాధ్యదేవుని యాత్మసంతానమని యర్థము చెప్పవలెనని శ్రీ పాపయ్యశాస్త్రిగారి యభిప్రాయము. ఇట్టి విపరీతపూరాన్వయము సహృదయ సమ్మతము కాదని వేఱ చెప్పనక్కఱ లేదు. మల్లికార్జున పండితుని గురువగు నారాధ్యదేవుని యింటిపేరు "కోటిపల్లి" అయి యుండఁగా నది 'పాలంక' యని యెట్లు మాఱెనో, ఆతనికే విశ్వారాధ్యుఁడను నామాంతర మెట్లు లెప్పు డేర్పడెనో, ఆతని కుమారుఁడు సోమనాథుని యింటి పేరంతలోనే మరల "కోటిపల్లి," "పాలంక"లలో నేదియుఁ గాక "ఇవటూరు" అని యెట్లు మాఱెనో, మఱియు మనకవి సోమ

నాథు డాతని మనుమఁడే యైనచో నాతని యింటిపేరు తిరిగి పాలకురికి యని యెట్లు లేర్పడెనో యస్మదాదుల బుద్ధి కూహింపశక్యము కాదు. ఇందుకు శ్రీ పాపయ్యశాస్త్రిగారు సరియైన సమాధానముల నొసంగఁ జాలరైరి. సోమనాథుఁడు నాతని ప్రశిష్యులు చెప్పిన (సహజ వీరశైవుల) భృంగి గోత్రి జత్వము గూర్చి కూడ వీరు తగు సమాధానము చెప్పరైరి.

ఇవటూరి సోమనాథుఁడు నాతని పుత్త్రుఁడు విశ్వనాథ ప్పయ్యయు వాస్తవముగఁ దన తాత తండ్రులే యైనచో మల్లి కార్జున పండితుని శైవసంతానములో వారిని చేర్కొనినప్పుడు మన కవి సోమనాథుఁ డా విషయము నించుకయినఁ దన గ్రంథ మునఁ జెప్పకుండునా ? పయిగాఁ బండితారాధ్యచరిత్రశ్రోత పాలకురికి సూరనామాత్యుని దీక్షాగురునిగా గ్రంథావతారికలో దా నుదాహరించిన వీరపోచేశ్వరుఁడు తన యగ్రజుఁడే యైనచోఁ దద్విషయము గూడ నించుక సూచింపకుండునా ?

సోమనాథుఁడు బసవపురాణావతారికలో "భ్రాజిష్ణుఁ డగు విష్ణురామిదేవుండు। తేజిష్ణువగు శ్రియాదేవియమ్మ యును। గారవింపఁగ నొప్పు గాదిలి సుతుఁడ" అను వాక్యము లకు శ్రీ పాపయ్యశాస్త్రిగారు చెప్పు నర్థ మిది. విష్ణురామి దేవుఁడు ద్వాదశాదిత్యులలో విష్ణునామముగల సూర్యుఁడను నీశ్వరుఁడనఁగా సూరీశ్వరుఁడఁట. శ్రియాదేవియమ్మ యనఁగా లక్ష్మీదేవి యొక్క తల్లి గంగయఁట. లక్ష్మి సముద్రగర్భము నుండి యుద్భవించినదవుట సముద్రుని భార్య యగు గంగ నామె జననిగా గ్రహింపవచ్చుననియు, సూరీశ్వరునకు గంగాంబ యను

భార్య యుండియుండుననియు నా పెంపుడు తలిదండ్రులనే పయి పంక్తులలో సోమనాథుఁడు పేర్కొనెననియు శాస్త్రిగారి తలంపు. మోఁకాలికి బట్టతలకు ముడివెట్టునటు లుండు విపరీతార్థములు, కల్పితసంబంధములు చరిత్రకారులకు గ్రాహ్యములు కానేరవనియు నట్టివాని ననుసరించిగాని, వారు చూపిన వంశవృక్షముల నకళ్ళవంటి యప్రమాణ లేఖ్యములఁ బట్టిగాని చారిత్రకవిషయ నిరూపణము చేయరాదనియు, వారి యన్వయ విధానము నిర్ణయము నాకు సమ్మతములు కావనియు నెంత చెప్పినను వారి యభిప్రాయములఁ గూడ లోకమున కించుక వెలువరింపుమని శ్రీపాపయ్యశాస్త్రిగారు కోరుటచే వారి కోరిక ననుసరించి యీ విషయముల నిటు లీ పీఠికయం దుదాహరించితిని. ఎంత యసంగతములయినను నితరుల వ్యక్తిగతాభిప్రాయముల యావిష్కరణమున కడుతగులుట నా కభిమతము కాదు.

క॥ వినఁదగు నెవ్వరు సెప్పిన ॥
వినినంతనె వేగపడక వివరింపఁదగున్।
విని కల్లనిజముఁ దెలిసిన।
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ॥

అను నీతిధర్మమే యెల్లరకు నాచరణీయము. కావున శ్రీ పాపయ్యశాస్త్రిగారి వాదము నందలి గుణాగుణములను విమర్శించి తజ్ఞులు సత్యమును గ్రహింతురు గాక యని ప్రార్థింతును

ఈ గ్రంథ ముద్రణ ముద్యమించునంతలో శ్రీ వీరభద్ర శర్మగారు వీరశైవ పంచాచార్య పీఠములలో నొక్కటయిన కాశీక్షేత్రమందలి శ్రీ జగద్గురు విశ్వారాధ్యజ్ఞానసింహాసనాధ్యక్ష పదవికి నియుక్తులయి తారణ సంవత్సర విజయదశమీ దినమునఁ బట్టాభిషిక్తులగుట ప్రాప్తించినది. అప్పటి నుండియు నీ మూఁడున్నర సంవత్సరములు నా రాజగద్గురుపీఠము నలంకరించి విశేషఋణగ్రస్తమై న్యాయస్థాన నియుక్తులయిన రిసీవరు పాలనములో నున్న యామఠమును ధానిస్వామ్యములను బంధములనుండి విడిపించుటకయి యహోరాత్రములు నిరంతర కృషి యొనర్చి 1945 సంవత్సరములో రిసీవరు స్వాధీనమునుండి యాస్తులను వశపఱచుకొని యాపిమ్మట మఠౌన్నత్యమునకు, ఋణభార విమోచనమునకు మిక్కిలి యెక్కువగాఁ బరిశ్రమ మొనర్చుచుండిరి. దీనిచే నారోగ్యము చెడి యెనిమిది నెలల నుండి వ్యాధిగ్రస్తులయి తుదకు సర్వజిన్నామసంవత్సర పుష్యశుద్ధ పూర్ణిమా భానువాసరము (ది 25-1-48) రాత్రి గం 7-30లకు తమ నలువదిరెండవయేట నకాలముగ లింగైక్యమొంది వీరశైవలోకమును విద్వల్లోకమును విషాదాంబుధిలో ముంచివైచిరి. కాశీవిశ్వారాధ్యపీఠము నధిష్ఠించిన యీ స్వల్పకాలములో నా రామఠమున కొనర్చిన సేవ నిరుపమానమయి యా మఠ చరిత్రమునందు జగజ్జేగీయమానముగ వెలయఁ గలదు. శిష్యలోకమునుండి విరాళపూర్వకముగను ఋణపూర్వకముగను విశేషధనమును సేకరించి మఠముయొక్క బంధవిముక్తి గావించుటయే గాక యా మఠావరణమునందు మహావ్యయముతో

దివ్యమగు జ్ఞానమందిరమును నిర్మించి యజరామరణయశంబు నార్జించిరి. "విభూతి" పత్రిక నుద్ధరించి జ్ఞానమందిర పక్షమున "జ్ఞానశ్రీ" అను పేరితో దానిని వివిధభాషలయందు వెలువరింపఁ దలంచుచు నందుకు వలయు ముద్రణాలయాది పరికరములఁ గూడ నొనగూర్చియుండిరి. కాని శ్రీ మహాస్వాముల వారి మహోన్నతాశయముల ఫలమును భారతీయులు, వీరశైవులు ననుభవింపకుండ నింతలో నాకస్మికముగా వారస్తమించుట దేశదౌర్భాగ్యము యున్నది. ఈ గ్రంథమును దమయమూల్యమగు యవతారికతో నలంకరించి "వీరశైవ మతము"ను గూర్చిన యొక యనర్ఘవ్యాసమునుగూడ ననుబంధముగఁ జేర్చి ప్రకటింప శ్రీవారుద్దేశించిరి. కాని దైవ దుర్విపాకమున నవి యీ కృతికి దుర్లభములగునవి. నిర్యాణ దినముననే శ్రీవారీగ్రంథమునకు ముఖపత్రము, మహాదాతల నామములు మున్నగునవి వ్రాసి నిర్యాణసమయమున కొక గంట ముందు సాయంకాలము 6_30 లకు స్వహస్తములతోఁ జరమ సందేశ పూర్వకముగ నొక సంతాపకర లేఖను నాపేర లిఖించి దానిలో నీగ్రంథమునుగూర్చి కొన్ని సూచనలఁగావించి చివర "మేము శివలోకయాత్రకు సిద్ధము" అను వాక్యముతో విరమించి, మఱియొక గంటలోపున నవతారమును జాలించిరి. ఇప్పటి కిరువదియైదు సంవత్సరములనుండి శ్రీవారితో వారి ప్రాణావసాన నిమేషములవఱకుఁగూడ ననన్య సామాన్యమగు ప్రేమానుబంధముతోఁ గట్టువడియున్న నేను దుదకు శ్రీవారి యకాలలింగైక్యవార్త నాకస్మికముగ ది 31_1_48 తేదీని

గాశీనుండి వచ్చిన లేఖవలన వినియు వారి వెంట శివలోకమున కేఁగు భాగ్యమును బడయనేరక జీవచ్ఛవంబునయి నిలిచి చేయు నది లేక చింత దిగ్భ్రమింగి, పరమేశ్వరుఁడు శ్రీవారి యాత్మకు శాశ్వతానందశాంతిసౌఖ్యములఁ బ్రసాదించుఁ గావుతమని సభక్తికముగఁ బ్రార్థించుచున్నాను. మఱియు నిదివఱలో శ్రీ వారి యనుమతిపయి పితౄణముక్తికయి నాజనకుల కంకిత మొనర్చిన యీ కృతిని శ్రీవారి స్మారకచిహ్నముగ వారి చర ణారవిందపీఠములకుఁగూడ సమర్పించుచున్నాఁడ. పాలకురికి సోమనాథుని తరువాత నాంధ్రవీరశైవలోకమున నంతటి యుద్దండ పాండితీవిభవవిభూషితులు శ్రీ వీరభద్రశర్మగారు తప్ప మఱెవరు నుదయింపలేదు. సమానధర్మసమన్వితుఁడగు సోమనాథ సుధీంద్రుని చరిత్రరూపకముగ నే నొనర్చిన యీ సమ ర్పణము శ్రీవారి యాత్మ కానందవహమయ్యెడుఁ గావుత మని యభిలషింతును.

ఈ గ్రంథము 5 వ ప్రకరణములో సోమనాథుని తండ్రి పేరు అనుభవసారపద్యమందలి "గురులింగ తనూజుండ" అను విశేషణమునుబట్టి గురులింగార్యుఁడని పలువురు తలంతురనియు నయినను, గురులింగమనునది యాతని తండ్రియొక్క వాస్తవ నామముగాక దీక్షాగురువున కాతఁ డుపయోగించిన విశేషణ మయి యుండునని సోపపత్తికముగ నేను వ్రాసియుంటిని. అందుఁ గూర్చి శ్రీవీరభద్రమహాస్వాములువారు నాకుఁ బంపిన చరమ సందేశములో నిట్లు వ్రాసిరి. "గురులింగ తనూజ శబ్దమునకు

సరియైన అర్థము చేయలేదు. తనూజ అనఁగా పుత్త్రుడే కాని శిష్యుఁడు కాఁడు. ప్రాచీనగ్రంథకర్త లందఱు అట్లే చెప్పిరి. మఱి ప్రతికూలత లేదయ్యె. కావున మీ యిష్టమగుచో ఆ పేజీలు మార్చిన బాగుండును."

తనూజ శబ్దమునకు రూఢార్థము పుత్త్రుఁడనుట నిర్వివాదమే. అది కాదనువారెవ్వరు లేరు. కాని నే నుదాహరించిన సోమనాథుని యితరోదాహరణములఁబట్టి సందర్భములఁబట్టి, దీక్షనొందినవారు గురుపుత్త్రులుగానే భావింపఁబడుదురు గావునఁ దనూజ శబ్దమును సోమనాథుఁడు తన యనుభవసారములో నట్టి భావమునందే యుపయోగించి యుండునని నేఁ దలంచుచున్నాను. కేవలము "గురులింగ తనూజుండ" అను దానినిబట్టి సోమనాథుని తండ్రిపేరు గురులింగార్యుఁడని స్థూలదృష్టితో నిరూపించుట కెట్టి ప్రత్యవాయము లేదు. తోంటదార్యుఁడు గూడ సోమనాథుని తలిదండ్రులు గురులింగ మంగళాంబిక లని వ్రాసినాఁడు. కాని సోమనాథుని తల్లి మంగళాంబ యనుటకు సోమనాథుని గ్రంథములలో నాకరము లేదు. "శ్రియాదేవి యమ్మ" అను దానికే తోంటదార్యుడు "మంగళాంబ" అని వ్రాసియుండునేమో.

పూర్వోక్తములైన కారణములచే 1944 సంవత్సరములో నుద్యమించిన యీ గ్రంథప్రకటన మింతవఱకు ననివార్యముగ నాలస్యమయినందుకు లోకము క్షమించుఁగాక! గ్రంథప్రకాశకులగు శ్రీ జగద్గురు వీరభద్రమహాస్వాములువారును, గ్రంథ

కర్తనగు నేనును దూరమందున్నను సాధ్యమయినంత వఱకు గ్రంథముద్రణమునందు శ్రద్ధవహించి నిర్వహించిన శ్రీ ఆంధ్ర గ్రంథాలయ ముద్రాశాలాధికారులకు నాకృతజ్ఞతాభి వందనముల సమర్పించుచున్నాను. ముద్రణము ప్రారంభమయిన నొక టిన్నర సంవత్సరములనుండి శ్రీ జగద్గురువులవారి యవతారికాదుల కొఱకే యీకృతిప్రకాశ మందలేదు విరామములేని రాజకీయోద్యోగముల నియుక్తులయ్యుఁ గొంతతీఱిక చేసికొని యభిమానముతో నీ గ్రంథము వ్రాఁతప్రతికి సాపులువ్రాసి యచ్చునకిచ్చుటలోఁ దోడ్పడిన చిరంజీవులు నాయల్లుఁడు నూతికట్టు కోటయ్య బి. ఎ., బంధువు దేవిసెట్టివీరభద్రము బి. ఎ., గారల నభినందించి, సర్వేశ్వరుఁడు నిజకరుణాకటాక్షవీక్షణప్రసారమున వారికి దీర్ఘాయురారోగ్యాభ్యుదయములఁ బ్రసాదించుఁ గావుత మని ప్రార్థించుచున్నాను. ఆదరపూర్వకముగ నీగ్రంథమును సాంతముగఁ జదివి Foreword (తొలిపలుకు) వ్రాసిపంపిన విజ్ఞానఖనులు శివశ్రీ తెలిగెపాిరెమఠము సదాశివయ్య M. A, B. L., (సబుజడ్జి) గారికిని, తమయమూల్యాభిప్రాయముల నను గ్రహించిన రసజ్ఞశేఖరులు ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులు శ్రీసర్ కట్టమంచి రామలింగారెడ్డి M. A., గారికిని. శివశ్రీ భోగిసెట్టి జూగప్ప M. A., కవిరత్న లక్కన మల్లికార్జునుడుఁ గిద్దలూరు చెంచు బసవరాజుగారలకును నాకృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

| | |
|---|---|
| కిర్లంపూడి<br>సర్వధారిశ్రావణము | ఇట్లు విన్నవించు విద్వద్విధేయుఁడు<br>బండారు తమ్మయ్య.<br>కిర్లంపూడి ఎస్టేటు మేనేజరు. |

# అంకితము

పార్వతీ పరమేశ్వర ◆ ప్రతినిధులయి
పట్టైమాభిఖ్య లింగయా ◆ హ్వాయత నెలసి
లింగ గర్భమునందున◆ లీనమయిన
నాదు తలిదండ్రుల కిది ప్ర◆ణామ కలిత
భక్తినర్పించెదఁ బితౄణా◆ముక్తి కొఱకు;
మఱియు నిదిగూర్పఁ బ్రోత్సాహ ◆ పఱచినన్ను
దీని ముద్రణమునకు ను◆ దీర్ణ కృషిని
జలిపియుండియుఁ దత్ప్రకా ◆ శమును గనక
మున్నె లోకంబు శోకాబ్ధి ◆ ముంచి, నాకుఁ
జరమ సందేశమును స్వహ◆ స్తమున వ్రాసి
సర్వజిత్పుష్య పూర్ణిమా◆ సరసిజాప్త
వాసరంబునఁ గైలాస◆ వాసులయిన
శ్రీ జగద్గురు పట్టవి ◆ భ్రాజితులగు
వీరభద్ర శివాచార్య◆ విబుధవరుల
స్మారకంబుగఁ దచ్చర◆ ణారవింద
ములను నిది పూన్తు గురుభక్తి ◆పూర్వకముగ.

◆గట్టుపట్టి = పార్వతి

## ప్రాస్తావికములు

శ్లో॥ ఆదాభృంగిరిటిః పురా కృతయుగే నామ్నా సు కేశీప్రభు ।
స్త్రేతాయాం వరవీరశైవ శరణ శ్రేష్ఠో మునిఃపాణిని ।
ర్ద్వాపారే శివమంత్రసిద్ధి కలిత స్సానంద నామాంకితః ।
ఏవం భక్త హితార్థతః కలియుగే పాల్కురికి సోమేశ్వరః ।
(అనుశ్రుతము)

ఉ॥ తేనియ సోనలన్ జిలుకు తేటగు జాను తెనుంగుఁబల్కులన్ ।
వీనులఁ దన్పు కబ్బములు నిక్కపు దేసి తెనుంగుః గైతకున్ ।
బ్రాణము వోసినట్టి బుధవ ంద్యుని శ్రీ బసవేశ చింతనా ।
సూనృత చిత్తుఁ బాల్కురికి సోమకవీంద్రుని సంస్మరించెదన్ ।
(మదీయము)

# పండితాభిప్రాయములు

(1)

Sir C. Ramalingareddi, M. A., (Cantab) Kt., D. Litt.,
*Vice-Chancellor.*
Andhra University, Waltair, Maharanipeta,
22-4-48.

I am so sorry there has been all this delay regarding your great book on "Palakuriki Somanadha Kavi." It is by far the best book on one of our greatest poets, who for some reason, which may not be desirable to specify, has not received from the Telugu public and scholars the attention and respect due.

Both from the point of view of historical criticism and literary valuation, your book leaves nothing to be desired. I notice also from other sources that you have unearthed a large number of Veerasaiva poets and have added to the richness and variety of Telugu literature.

I need not say that Palakuriki Somanadha Kavi ranks amongst the greatest of our poets by reason of a style which appeals, to all people and penetrates deep into the heart.

I must also congratulate you on your own wonderfully fine prose. Prose is not such an easy composition as people imagine. It also requires artistic skill of a high order.

—O—

Sri B. Joogappa, M. A.,
Deputy Director of Industries and Commerce,
Triplicane, Madras

5-5-'48

With great pleasure I have perused Sri Banda Thammayya's book on " Palakuriki Somanatha Kavi " Thammayya is well known to the Telugu public for i erudition and research work in Telugu literature. H works & writings on Srinatha Kavi have already won t admiration of the Telugu public. But his present book par excellence, the best in which he has portrayed the l and genius of one of our greatest poets, Palakuri Somanatha Kavi, whose works, for a long time, we eclipsed by religious dogma; for he was the first Andh Viramaheswera scholar and poet that espoused S Basaweswara who though a Kannadiga Brahmin by bir embraced the Veerasaivism and preached the fundame tals of this faith i. e., Universal love, Brotherhood, Equ lity and Service as against the Orthodox School Th apart now in this age of Gandhism, I am sure, his wo particularly, his "Basavapuranamu" in Dwipada Kav will be read with great zeal and reverence as Sri Basavan of the 12th century preached and practised Gandhian w which alone inspired Somanatha Kavi to write his fame "Basava Puranam."

Mr. Thammayya has in fact resurrected one of greatest poets who was, for long for-gotten. He h brought to bear his profound knowledge of Veerasai philosophy and literature in his comment and critic both literary and historical. He has brought home to t Telugu public the richness and soul-thrilling simple st of Palakuriki Kavi which appeals to one and all a touches the heart most.

Mr. Thammayya deserves to be congratulated on having brought out this book on the lines of "Men Ltters series," which he has done so well, he being hims semaster prose-writer. The book is a very valuable ad taon to the Telugu literature and deserves to be on helf of every Telugu Library and Scholar.

ఉ. నీపితతమ్మయార్యుఁడు - నిచ్చలుసౌఖ్యములొంది శుద్ధుఁడై
శ్రీ పరమేశసత్కృపఁబ - సిద్ధముగామని పెక్కులేండ్లుదా
దీపటిమన్ జరించుచును - ధీనుత సేవలు సల్పుఁగాత ! నీ
వో పరమాదరంబుగని - పొల్పొదుఁగాక ! చరిత్ర రత్నమా !

## శివశ్రీ గిద్దలూరు చెంచు బసవరాజుగారు, భాషాప్రవీణవిద్యా

రేపల్లె గుంటూరు జిల్లా. (30-4-48)

సీ॥ శ్రీవీర శైవనీ - రేజదినాకరుఁ । డనుభవసార కా - వ్యప్రవక్త
పండితారాధ్యపా - వనచరిత్ర ప్రణేత । బసవపురాణప్ర - బంధకర్త
దుర్మతాచారవి - దూరాధ్యసంచారి। పరమతమదహ స్తి - హరివిభుఁ
శ్రీభృంగిగోత్రాఖ్య. క్షీరాబ్ధిసోముండు అసమానసుకవితా. రసనిమగ్న

గీ॥ డైనపాల్కురికిసోమనా థార్యుచరిత సతతతత్కృతిరసాస్వాద
తత్పరుఁడగు-బండారు. తమ్మసూర్యుఁ డర్థిరచియించుట మనభాగ్య
గా

మ॥ మునుశ్రీసోమునిఁగూర్చికొందఱిదియే. పోవ్రాసిరే కాని, చ
క్కనిరీతిన్ విరచింపరైరవుర; ని క్కంబైనచారిత్రమున్
గుణుతింపందగు రీతిగానిపుడుసు. స్మాన్యుండు న్యాయజ్ఞుఁడౌ
ఘుఁ బండారుకులాబ్ధిపూర్ణశశివే. డ్కన్ వ్రాసెధీచాతురిన్

మ॥ దురితధ్వంసక సోమనాథకవితో. దూృతామృతాస్వాదత
త్పరచిత్తుండుసుధీమతుండయినహా. తమ్మయ్యనిర్మించె ని
క్కరణిన్ సోమునిసచ్చరిత్రమిదిలో. కంబందుసత్పూజ్యమై
సరతంబుంబరమ ప్రమాణముగనుఁ. దేహంబులన్ బాపుతన్

చ॥ తెలుచుగ వీరశైవమత. ధర్మములున్. మతసంప్రదాయముల్
ఎఱిఁగినవారెసోమనుత. వీంద్రుచరిత్రమువ్రాయనర్హతన్
బొఁగుమగానితక్కరులు. వ్రాసినచోమదిఁబాటిసేసి యె
వ్వరునదియెప్పుడొప్పరనఁ. బండితుకా! గ్రహింపనేర్తురే !

చ॥ ఇలఁవురువీరశైవులెగి -రీంద్రసుతావరణచింతనా
నిరతులె. కావ్యకర్తలె,వి- నీతచరిత్రులె యంతుసాద్యుఁడా
వరసుతి సోమనాథకవి - వల్లభుఁడింక నొకంటనేఁడు తి
చ్చరితము వ్రాయుతమ్మయప్ర. సన్నమతిం బ్రణుతింతువారిఁన్

# విషయసూచిక



కీర్తిశేషులు

శ్రీ జగద్గురు కాశీవిశ్వారాధ్య జ్ఞానసింహాసనాధీశ్వర
వీరభద్రశివాచార్య మహాస్వాములు వారు
(పూర్వాశ్రమమున)
వేదతీర్థ, స్మృతి తీర్థ, కావ్యతీర్థ, ధర్మాచార్య,
సాహిత్య విశారద. విద్యారత్న, విద్యానిధి
శ్రీ పండిత, చిదిరెమఠము వీరభద్రశర్మగారు

ఓం

శ్రీ మ దుమామహేశ్వరాభ్యాం నమః

# పాలకురికి సోమనాథ కవి

## ౧. వాఙ్మయము - మతము

శ్రీమ దనంత కళ్యాణగుణగ ణాకరుండగు పరమే శ్వరుఁడు సకల విద్యలకు నధీశ్వరుఁడు. "ఈశాన స్సర్వ విద్యానా మీశ్వర స్సర్వభూతానామ్, బ్రహ్మాధిపతి ర్బ్రహ్మ ణోఽధిపతి ర్బ్రహ్మ శివో మే అస్తు సదాశివోమ్" అను పంచ బ్రహ్మమంత్రములలోని యీశానమంత్ర మీ విషయము నుద్ఘోషించుచున్నది. విద్యేశ్వరుండగు మహేశ్వరుని తత్త్వ మును దెలిసికొనుటయే సమస్త విద్యలకును బ్రయోజనముఁ బరమార్థము నైయున్నది. కావుననే మతాభినివేశముగల ప్రతిదేశమునందును నందు ముఖ్యముగ భారతభూమియం దును బరమేశ్వర తత్త్వజిజ్ఞాసాపరమగు మతమునకు వాఙ్మ యమునకు నవినాభావసంబంధ మేర్పడినది. భారతీయార్యులు వాక్కు నొక దేవతగాను శబ్దము నొకబ్రహ్మముగాను గణించి యారాధించిరి. "పృచ్ఛామి వాచః పరమం వ్యోమ" "బ్రహ్మాయం వాచః పరమం వ్యోమ" అను శ్రుతు లిందుకుఁ బ్రాణములు. "అనాదినిధనం బ్రహ్మ శబ్దతత్త్వం ప్రచ క్షతే। వివర్తతేఽర్థభావేన ప్రక్రియా జగతోయతః" అని పర

మార్గ విదుడగు భర్తృహరి వాక్రుచ్చెను. భారతీయ
ప్రాచీన వాఙ్మయమగు శ్రుతులు, స్మృతులు, ఉపనిషత్తులు
ఆగమములు, పురాణములు నిట్టిపరమార్థ సిద్ధికొఱకే కూర్పఁ
బడియున్నవి.

భాషా వాఙ్మయముల యీ ప్రయోజనమును శక్తి
గుర్తించి దేవుని, దేశమును సేవించుటకయి వాని నుత్కృష్ట
సాధనములుగ గ్రహించి, చరితార్థులయిన యాంధ్ర మహా
జనులలోఁ బాలకురికి సోమనాథుఁ డగ్రగణ్యుఁడు. ఈతని
దేశభాషాభిమానములు నిరుపమానములు. గీర్వాణభాష య
దఖండ పండితుఁడయి, వేదవేదాంగ పారంగతుఁ డయ్యునితఁ
మతవాఙ్మయ రచనమునకు సంస్కృత భాష నాధారముగా
గొను ప్రాచీన మర్యాదను ద్రోసిరాజని మాతృభాష య
తెలుఁగు నెడ, నెనలేని యభిమానమును బూని తెలుఁగుఁబలు
లనుగూడ వేదములపాటిగ గణింపుఁ డని లోకమును హెచ్చ
రించి వేదార్థముల విరివిగ వెదఁజల్లు నాంధ్రకృతులఁ దేట
ముగ రచించి, యాంధ్రజాతీయ గేయములను ఛందముల
నాదరించి, వాని యాలంబనముతో జన వశీకరణమునకు శై
మత ప్రచారమునకుఁ గడంగి తన్మూలమున నాంధ్రదేశము
నాంధ్రభాషను ననన్యసామాన్యములగు భక్తివిశ్వాసముల
నారాధించి పరమేశ్వరానుగ్రహమునకుఁ బాత్రుఁడయి
తార్థుఁడయ్యెను. మహనీయుఁడగు నిట్టి మహాకవి జీవితచరి
మును లిఖించి, పఠించి, ప్రచారముగావించి మనముగూ
జరితార్థుల మయ్యెదముగాక !

## ౨. చరిత్రరచనమున కాధారములు

సోమనాథుని జీవితచరిత్రమును లిఖించుట కాతఁడు స్వయముగ రచించిన గ్రంథములు నాతని శిష్యప్రశిష్యులు పిడుపర్తి సోమనాథాదులు రచించిన గ్రంథములును ముఖ్యాధారములై యున్నవి. పిడుపర్తి సోమనాథకవి కించుక సమకాలీనుఁడగు తోంటద సిద్ధలింగకవి (విరక్తతోంట దార్యుఁడు) కన్నడమునఁ బాల్కురికి సోమేశ్వర పురాణమను పేరితో సోమనాథుని చరిత్రమొకటి లిఖించి యున్నాఁడు. సోమనాథుఁడు స్వయముగ లిఖించిన యాతని యాంధ్రగ్రంథ ములలోని వ్రాఁతలకు విరోధము లేనంతవఱకు మన మీ కన్నడ గ్రంథమునుగూడఁ గొంత ప్రమాణముగఁ గైకొన వచ్చును. ఏకామ్రనాథుఁడను కవి తెలుఁగులో "ప్రతాప చరిత్రము" అను పేరితోఁ గాకతీయ చక్రవర్తుల చరిత్ర మును వచనరూపమున రచించి యున్నాఁడు. దానిలోఁగూడ మన సోమనాథునిఁగూర్చి కొన్ని వివరములు గలవు. కావున నితరత్ర లబ్ధములగు బలవత్ప్రమాణములకు వైరుధ్యము లేనంతవఱకు మనమీ కృతినిగూడఁ గొంత యాధారముగ గ్రహింపఁదగును. ఇఁక మిగిలినవి యాంధ్రకర్నాట కవులు తమ కృతులలో సోమనాథుని గుఱించి యొనరించిన స్తుతులు. అవిగూడ నీతనిచరిత్ర నిరూపణమునఁ గొంతవఱ కుపకరింపఁ జాలును. ఆ యా సందర్భములలో వాని నుదాహరింతును.

పిడుపర్తి సోమనాథకవి పాలకురికి సోమనాథుని తరు వాత రమారమి ౩౦౦ సంవత్సరములకు వెలసినవాఁడు. అతని

పూర్వులు శివరాత్రి కొప్పయ్య మున్నగువారు మన సోమనాథునివలన శివదీక్షనుబడసి యాతని శిష్యులుగా నుండిరి. వారికి సోమనాథుఁడు తన శిష్యులగు కాకతీయ రాజులచేతను, రాజమంత్రులచేతను దోగిపట్టు, పిడుపట్టు మున్నగు గ్రామముల నగ్రహారములుగ నిప్పించెను. ఇందుచే నీ పిడుపర్తి కవులు సోమనాథునిఁ దరతరములనుండి తమ కులగురువుగ నారాధించుచుండిరి. అందుచే సోమనాథుని గ్రంథముల తరువాత వీరి కృతులకే సోమనాథుని చరిత్ర విషయమున విశేష ప్రామాణ్యము నీయఁదగును. ఈ పిడుపర్తి కవులలో పిడుపర్తి నిమ్మనార్యుఁడు, బసవకవి, బసవకవి పుత్రుఁడు సోమనాథకవి, సోమనాథుని తమ్ముఁడు పాలనార్యుని తనయుఁడగు, బసవప్ప కవి, పేర్కొనఁ దగినవారు. వీరిలో సోమనాథకవి తన తండ్రి యానతిచే మన పాలకురికి సోమనాథకవి ద్విపద బసవపురాణమును బద్యకావ్యముగఁ బరివర్తన మొనరించి యా సోమనాథునికే యంకిత మొసంగినాఁడు. కావున సోమనాథుని గ్రంథావతారికలతో పాటు పిడుపర్తి సోమనాథుని పద్య బసవపురాణావతారికగూడ మనకు సోమనాథుని చరిత్రమును దెలియుటకయి చాలవఱకుఁ దోడ్పడఁ గలదు. పాలకురికి సోమనాథుఁడు రచించిన గ్రంథములను బెక్కింటిని బిడుపర్తి సోమనాథుఁడు తన గ్రంథావతారికలో నిట్లు పేర్కొనినాఁడు.

సీ. "బసవపురాణంబు పండితారాధ్యుల
చరితంబు ననుభవ సారమును జ
తుర్వేదసారసూక్తులు సోమనాథభా
ష్యమ్ము శ్రీరుద్రభాష్యమ్ము బసవ

రగడగం గోత్పత్తి రగడశ్రీబసవాఢ్య
రగడయు సద్గురు రగడ చెన్న
మల్లుసీసములు నమస్కారగద్య వృ
షాధిపశతకంబు నక్షరాంక

గీ. గద్యపద్యముల్ పంచప్రకారగద్య
యష్టకము పంచకము నుదాహరణయుగ్మ
మాదియగుకృతుల్ భక్తహితార్థబుద్ధిఁ
జెప్పె నవిభక్త సభలలోఁ జెల్లుచుండు.''

ఈ పద్యమందలి "ఆదియగు కృతుల్'' అను పదముచే నిం దుదాహృతములైన కృతులుగాక సోమనాథ రచితములు మఱికొన్ని గలిగియుండు ననుట విశదము కాఁగలదు. పదల్ మందుఁ జెప్పబడిన సోమనాథుని యాంధ్రకృతులలో అనుభవసారము, బసవపురాణము, వృషాధిప శతకము, చతుర్వేదసారము, పండితారాధ్య చరిత్రము ముఖ్యమయినవి. ఇందులో బసవపురాణము, పండితారాధ్య చరిత్రము ద్విపద కావ్యములు. అనుభవసారము పద్యకావ్యము. వృషాధిపశతక ముత్పల చంపక వృత్తములతోఁ గూర్పఁబడినది. చతుర్వేద సారము "బసవలింగ'' అను మకుటముతోఁ గూడిన సీసపద్య శతకము. సోమనాథుని చరిత్రమును గూర్చుటలోఁ దక్కిన కృతులుకన్న నివి యెక్కువగ నుపకరింప నేర్చును.

## ౩. సోమనాథుని జన్మస్థలము

సోమనాథుఁడు శుద్ధాంధ్రదేశీయుఁడు. ఆంధ్రత్వము «ఆంధ్రతేజము నాతని దివ్యశరీరమునం దంతటను మూర్తీభ

వించి కవితా ప్రవాహరూపమున నాతని కృతులయం దెల్ల వెల్లివిరిసినది. పాలసముద్రమునఁ జంద్రుఁడు వోలె నీ సుకవి సోముఁడు పాలకురికి యను జనపదమున నుదయమందెను. ఈ గ్రామ మాంధ్రచక్రవర్తుల రాజధానియై యాంధ్రనగరము, ఏకశిలానగరము నను పేళ్లతో వ్యవహరింపఁ బడిన యోరుగంటికిఁ (Modern warangal) బండ్రెండు క్రోసుల దూరమున నేఁటి నిజామురాష్ట్రమున నల్లగొండజిల్లా, జనగామ తాలూకాలో నున్నది. పేరిలోఁ గొంత వికృతిని జెంది నేఁడిది పాలకుర్తి యని వ్యవహరింపఁబడుచున్నను సోమనాథుని కాలమున దీనికిఁ బాలకురికి యనియే వ్యవహారముండినట్లు సోమనాథుని కృతులవలననే విశదము కాఁగలదు. బసవపురాణ, పండితారాధ్య చరిత్ర గద్యలలో "సుకృతాత్మ పాలకురికి సోమనాథ, సుకవిప్రణీత..........." అని యాతఁడు ప్రాసస్థానమునఁ బాలకురికి యనియే వ్రాసినాఁడు. తన కృతులలోని తక్కిన తావులఁగూడఁ దన యింటిపేరిని జేర్కొనుటలోఁ బాలకురికి యనియే యుదాహరించినాఁడు. పిడుపర్తి సోమనాథుఁడు పద్య బసవపురాణావతారికలో-

చ. "అసదృశ తన్మహామహిమ మారవితారకమై చెలంగ శ్రీ
బసవ పురాణమున్ సకల భక్తకథామణి సూత్రభాతిగా
నసరచియింపు మీవు పృథివీస్థలికిం జనినాఁగ భృంగి సం
తసమునఁ బుట్టెఁ బాల్కురికి నామపురీ వరసోమనాథుఁడై"

అని యాతని జన్మస్థలమును బాల్కురికి యనియే పేర్కొనినాఁడు. మన సోమనాథుని మఱియొక శిష్యప్రశిష్యుఁడు

(నామము సరిగఁ దెలియకున్నను నీతఁడు బహుశః పిడుపర్తి వంశ్యుఁడే కాఁదగును.) సోమనాథుని కంకితముగా రచించిన "అన్యవాద కోలాహలము" అను సీసశతకములో సోమనాథుని నెలవు పాలకురికి యనియే యుదాహరించినాఁడు.

సీ. భవదీయ సంబంధ బంధురం బయ్యె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
భవదంఘ్రి పూజనా పరుల కిమ్మయ్యె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
యుష్మద్విహార సంయుక్తమై వెలసె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి
యుష్మదీ యాశ్రమా భ్యున్నతిం జెందె నే
భాగ్యంబు చేసెనో పాలకురికి.

ఆ. పాలకురికి యెట్టి భాగ్యంబు చేసెనో
నీ స్వనామ పూర్వ నిహితమయ్యె
నీహితాను షంగ! యేకామ్రగురు చిత్త
నలినభృంగ! సోమనాథలింగ!

ఇట్లు వర్ణింపఁబడిన యీ పాలకురికిలోఁ గొండపై నొక శివాలయ మున్నది. అందలి శివలింగమునకు సోమేశ్వరుఁడని పేరు. సోమనాథుని పూర్వులా సోమేశ్వరస్వామికిఁ బారంపర్యముగ వచ్చెడి యర్చకులని తెలియుచున్నది. ఆ స్వామి నామమును బట్టియే మన కవి తలిదండ్రు లాతనికి సోమనాథుఁడని పేరు పెట్టి యుందురు. ఆ స్వామి వరప్రసాద మననే వారి కాతఁ డుదయించినట్లు కూడ వాడుక గలదు. ఆంధ్రులలో గ్రామనామములఁబట్టి గృహనామము లేర్పడుట చాలఁ బరిపాటి. కావునఁ బూర్వోక్తమయిన పాలకురికి యను

గ్రామమును బట్టి యింటిపేరును, అందలి సోమేశ్వరస్వామిని బట్టి నామమును, మన కవివరున కేర్పడెనని తలంపఁదగును. పలువురు పరిశోధకు లీ నిర్ణయము నంగీకరించి యున్నారు.

ఇట్టి సందర్భములలో శ్రీ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు పయి నిర్ణయమును బాగుగ నెఱిఁగియుండియు ఆంధ్రగ్రంథమాలికలోఁ బ్రకటితమయిన పండితారాధ్య చరిత్రము (నూతన ముద్రణము) నకుఁ దాము వ్రాసిన పీఠికలో నొక వింత పుంతను ద్రొక్కి మైసూరు రాష్ట్రమునందలి తుముకూరుజిల్లాలోని "హాల్‌కురికె" యను ఏకారాంత నామక గ్రామమును "హాలకురికి" యని మార్చి యదియే సోమనాథుని జన్మస్థలమయి యుండునను విపరీతవాదమును వెలువరించినారు. దీనికి ముఖ్యకారణములు పూర్వోక్తమైన పాలకురికికి నేటికాలమున నిజాము ప్రభుత్వమువారు ప్రకటించిన గ్రామనామముల పట్టికలో పాలకుర్తి" యను పేరే గాని "పాలకురికి" యను పేరు ప్రకటితము గాకుండుటయు, మైసూరు ప్రభుత్వము వారు ప్రకటించిన పట్టికలలో "హాల్కురికె" యను పేరు గానవచ్చుటయు, తెలుఁగు నందలి 'ప' వర్ణము కన్నడములో "హ" వర్ణముగా నుచ్చరింపఁ బడుటచే నదియే సోమనాథుఁడు జననమందిన పాలకురికి యయి యుండు నని, "కురికి" ప్రత్యయాంతములగు గ్రామములు కన్నడదేశమునను, నాంధ్రకర్ణాట దేశముల సరిహద్దులను గాని యాంధ్ర దేశమున లేవని, సోమనాథుఁడు కర్ణాటదేశమున జన్మించినవాఁడవుటచేతనే కర్ణాటకవులుకూడఁ గొందఱాతని నుతించు

టకుఁ గారణమని శ్రీ నారాయణరావుగారు భ్రమించి తలం చుటయు నయి యున్నవి. గ్రామనామములు ప్రకటితమయిన పట్టి పట్టికలు మాత్రము తిరుగవేసి తక్కిన స్థలసన్నివేశములు సంగతి సందర్భము లేమియు విచారింపకయే యొక శుద్ధాంధ్ర కవి నెలవును గర్నాట దేశమున నిరూపించుట యందలి యసామంజస్యము శ్రీ నారాయణరావుగారి బుద్ధికిఁ దోపకుండుట మిక్కిలి యక్కజము గాకపోదు. నిజాము ప్రభుత్వమువారి పట్టికలోని "పాలకుర్తి" నేఁడు గూడ నా ప్రాంతమునఁ గొందఱచే "పాలకురికి" యనియే వ్యవహరింపఁ బడుటయు, ఈ పాలకురికి (లేక పాలకుర్తి) యందే పూర్వోక్తమైన సోమేశ్వరస్వామి యాలయము సోమనాథుని సమాధిపయిఁ బ్రతిష్ఠిత మయిన సోమనాథ లింగము తదాలయము నిప్పటికిఁ గూడ నిలిచియుండి పూజ లొందుటయు, శ్రీ నారాయణ రావుగారు గుర్తించి యున్నచో; నిట్టి వింత నిర్ణయమునకు వారు పూనుకొని యుండరనియే విశ్వసించెదను. పాలకురికి సోమనాథుని బంధువులు వంశ్యులు నని చెప్పికొనెడివారు, పాలకుర్తి యందును దత్పరిసరములందును నిప్పుడు గూడ నివసించు చున్నారు. అచ్చటి సోమేశ్వరసోమ నాథలింగములకు వారే యర్చకత్వము నెఱపుచున్నారు. జనుల వాడుకయందు నేఁడు "కుర్తి" యని యేర్పడిన రూపము పూర్వము "కురికి" యను రూపముతోఁ గూడనుండినట్లు శాసన ప్రమాణములు గూడ నున్నవి. పాలకుర్తి సమీపమున నేఁడు "ఎలకుర్తి" "ఉఱుకుర్తి" మున్నగు పేళ్లతో వ్యవహరింపఁబడు

గ్రామములు పదిరెండు పదిమూఁడు శతాబ్దులనాఁటి శాసన్న
ములలో; ఎలకురికి, ఉఱుకురికి మొదలగు రూపములతో వ్య
వాడఁబడి యున్నవి.

"కాకతి రుద్రదేవుని నాఁటి ధర్మసాగరము శాసనము (నాలుగ
వైపు ౧౨, ౧౩, ౧౪ పంక్తులు)

"రెండుపాడ్లు ఎలుకుర్కి ప్రిసన్న విశ్వేశ్వరదేవరకు సమర్పించి
నందుల వినియోగము భోగమువారు......"

కాకతి గణపతిదేవుని నాఁటి కొండిపర్తి శాసనము (శా. శ. 1136
(తూర్పువయిపు 38–40 పంక్తులు)

"శ్రీ చౌండసైన్యపతి రారవీందుతారం గ్రామం సమగ్రమప.....
స్నుఱుకుర్కి సంజ్ఞం" (తెలంగానాశాసనములు)"

సోమనాథుఁడు తన శిష్యులకు నగ్రహారముగా నిచ్చి
చిన దోకిపర్తియు నాతని గురులలో నొక్కఁడగు కట్టకూ
పోతిదేవర నివాసమగు కట్టకూరును బయిఁని జెప్పిన పాలకు
సమీపమునందే యున్నవి. మఱియుఁ బిడుపర్తి సోమనాథుఁ
తన పద్య బసవ పురాణావతారికలో నొకనాఁ డోరుగంటి
స్వయంభూదేవుని యాలయమున భక్తులు పాలకురికి సోమన
థుని బసవ పురాణమును జదువు చుండఁగాఁ గాకతి ప్రతా
రుద్రుఁ డచ్చటికివచ్చెననియు, నాతఁ డదియేమని ప్రశ్నింపఁగ
ధూర్తవిప్రుఁ డొకఁడు పాలకురికి సోమపతితుఁడు ప్రాసవ
వెట్టి యప్రమాణముగా నూతనముగా రచించిన ద్విపద బస
పురాణమనిచెప్పి నిందింప భక్తులీవార్త సోమనాథుని యొ
కేఁగి విన్నవింపఁగా నతఁడు ప్రతివాదుల జయింప నోరుగ
కేతెంచి మహిమలు చూపి శత్రులకుఁ దలవంపులు ఘటిల్ల

ప్రతాపరుద్రునిచే బూజింపఁబడెనని వ్రాసియున్నాఁడు. సోమనాథుని నెలవగు పాలకురికి యోరుగంటి ప్రాంతమున నున్నప్పుడే యట్టి కార్యమాదినములలో జరగుట కనువుగా నుండునుగాని మైసూరు రాష్ట్రస్థమగు "హాల్ కురికె" యందు సోమనాథుఁడున్నచో నట్టిది జరగియుండదు. కావున నెన్ని విధములఁ జూచినను నిజాము రాష్ట్రమునందలి పాలకురికియే సోమనాథుని జన్మస్థలమని నిస్సంశయముగ నిర్ణయింప నగును. మైసూరు రాజ్యమండలి హాల్కురికె యందు సోమనాథ సంబంధకములగు సన్నివేశము లొక్కటియుఁ గానరావు. ఉన్నట్లు శ్రీ నారాయణరావు గారైనను జెప్పనేరరు. అది శుద్ధకర్ణాట దేశము. పూర్వము వర్తకమునకయి వలసవచ్చిన కొన్ని వైశ్య కుటుంబములవారు మాత్రము వచ్చియు రాని వికృతపుఁ దెలుఁగు మాట్లాడుట గాని యచ్చటనేఁడు తెలుఁగు బాస మాటాడువారే లేరని తెలియుచున్నది. పూర్వమచ్చటఁ దెనుఁగు వారుండిరని తెలుంగు బాస ప్రచారమందుండె నని శ్రీ నారాయణరావుగారు తలంచెడిచో నది వట్టి భ్రమయే యని చెప్పఁదగును. ఆంధ్రదేశపుఁ బొలిమేర యచ్చటి కఱువది మైళ్ళ దూరమునఁ గానిలేదు. సోమనాథునిఁ గర్ణాటకవులు పొందఱు నుతించుటకుఁ గల వాస్తవకారణమును శ్రీ నారాయణరావుగారు గుర్తింప కుండుట శోచనీయము. ఉపలబ్ధము లైన సోమనాథుని కృతులలోఁ గేవలము కర్ణాట కృతియని చెప్పఁదగిన సుప్రసిద్ధ కావ్యమొకటియుఁ గానరాదు. కర్ణాట కవులయినను నట్టి కృతిని దేనిని బేర్కొని యుండలేదు. సోమ

నాథుని వారు సన్నుతించుటకుఁ గల ప్రధానకారణ మ
జన్మముచేఁ గర్ణాటుఁడయి కర్ణాట కావ్యకర్తయై ప్రసిద్ధి
యుండుటకాదు. మఱి కర్ణాట దేశీయుఁడు వీరశైవ మతో
రకుఁడునగు బసవేశ్వరుని చరిత్రమును మహిమాదికము
దొలుదొలుతఁ దనమాతృభాషయగు తెలుఁగున వెలు
తెలుఁగు వారికిఁ గన్నడులకుఁ గూడ నేకరీతిగ నుపయో
బసవ స్తోత్రము లనేకములు రచించి, సోమనాథుఁడు
పురాణమును, బసవ స్తవములను గన్నడమునఁ గూడ
యించుటకుఁ దమకు మార్గదర్శకుఁ డయిన మహనీయుఁడు
యాతని యెడ భక్తిని బ్రదర్శించి కర్ణాట కవులు కొందఱా
నను ముఖ్యముగ వీరశైవులు మాత్రమే యాతనిఁ దమ
లలోఁ బ్రశంసించిరి.

శ్రీ నారాయణరావుగారి యీ వినూత్న వాద
విభూతి పత్రికాధిపతులు శ్రీ చిదిరెమఠము వీరభద్ర
గారు విభూతి సం 2 సం 1 యందును "బసవ పురాణ
తత్కృతి విశేషములు" (విభూతి సం॥ 4 సం
అనువ్యాసమున శ్రీ శేషాద్రి రమణ కవులును గూడ విమర్శ
యున్నారు. ఇతరత్ర మఱికొందఱుకూడ దాని నిరసిం
శ్రీనారాయణరావుగారిందులోఁ వేనికిఁ దగు సమాధా
లొసంగక శ్రీవీరభద్ర శర్మగారికి నివేదన పూర్వక
భారతి సం॥ 20 సం॥ 7 లో "పాల్కురికి" యను శీర్షిక
నొకచిన్న లేఖను మాత్రము ప్రకటించిరి. దానిలోఁ
"పాలకురికి" వాదము కేవలము వినూత్నమనియు, పా

కి గారిమనామ విచారమే క్రొత్తదనియు, సత్యమని తో(చుటచేతనే దానిని బ్రకటించితిమనియు, హాలకురికి ప్రాంతమున నిప్పుడు తెలు(గు బాస విశేషవ్యవహారములో లేకున్నను పూర్వముండి యుండుననియు, "హాలకురికె" పాత కన్నడ శాసనములలో "పాల్కురికె" అనియు( దెల్గు శాసనములలో "పాల్కురికి" అనియు( బేర్కొన( బడినదనియు వ్రాసి యట్టిశాసన ప్రమాణము మాత్ర మొకటియు నుదాహరింపరయిరి. ఇంతతో నూరకొనక పాలకుర్తియే పాలకురికి యనను నిశ్చితవాదమును మొదట( బ్రవేశపెట్టినది నేననియు, నామాటలయందలి విశ్వాసముతో వానిని సమర్థించుటకయి శ్రీ వీరభద్రశర్మగారు తమ హాలకురికె వాదమును ఖండించుటకయి ప్రయత్నించిరనియు( గూడ శ్రీనారాయణరావుగారు వ్రాసియున్నారు. ఇవి కేవలము సాహస వాక్యము లని తెలుపుటకు( జాల విచారమగుచున్నది. ఓరుగంటి ప్రాంతమున నున్న సోమనాథుని పాలకురికి నేడు పాలకుర్తియని నిజామురాష్ట్రమున వ్యవహరింప(బడు చున్నట్లు ఆంధ్ర పత్రిక దుందుభి సంవత్సరాది సంచికలో సోమనాథుని గూర్చి వ్యాసము వ్రాయునప్పటికి నాకు( దెలియనే తెలియదు. అటు తరువాతనే దాని నెఱింగితిని. ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రములోను గొన్ని బసవపురాణము వ్రాత ప్రతులలోను "పాలకుర్తి" "పాలకుర్తి సోమనాథుడు" అనియే యున్నది. కావున( బాలకురికికి "పాలకుర్తి"యను వ్యవహారము నేడు నూతనముగ( గాక కొన్ని వందల సంవత్సరముల క్రిందటనే

యేర్పడియున్నట్లు తలంపనగును. అట్టి వ్యవహార వె
డేర్పడినను సోమనాథుని కాలము నాఁటికి మాత్రి మది:
కుఃకి యనియే వ్యవహరింపఁబడుచుండినట్లు లాతని కృ
వలన వ్యక్తము కాఁగలదు. తోంటదార్యుని సోమే
పురాణమున ఆంధ్రదేశమున శ్రీశైలమున కీశాన్య ప్ర
మున నున్న పాలకురికి యందు సోమనాథుఁడు జన్మించెనని
ఆ ప్రాంతమండలి కొలనుపాకలో వెలసిన సోమేశ్వరస్వా
సేవనమునఁ దలిదండ్రుల కాతఁడుదయించెననియు స్పష్ట
వ్రాయఁబడినది. తోంటదార్యుని సమకాలీనుఁడగు పిడు
సోమనాథుని పద్య బసవపురాణావతారిక వలనఁగూడ సీ
కురికి యోరుగంటి ప్రాంతమండలిదని గోచరింపఁగ
ఏకామ్రనాథుని ప్రతాపచరిత్రము గూడ దానినే వి
రించును. కావునఁ బూర్వాంధ్ర కర్ణాటక వులందఱు సో
థుని నెలవు నేఁడు నిజామురాష్ట్రమండలమున నున్న పాలకు
యని తలంచినట్లు తెల్లమగుచున్నది. కర్ణాటకవిచరిత్రకా
శ్రీనరసింహాచారిగారు కూడ నట్లే భావించిరి. శ్రీ
దొరగారు కూడఁ దమ "Kanarese Literature" అను గ్ర
మున సోమనాథుడు గోదావరి ప్రాంతము వాఁడను న
యముతో గోదావరి జిల్లాలోని పాల్కురికి నివాసియని
యున్నారు. ఇట్టి సందర్భములలో సత్యమును గప్పి
శ్రీ నారాయణరావుగారు పాలకురికి వాదమును దెచ్చి
నేనేయని లిఖించుట మహాసాహసమని చెప్ప నక్కఱ
తృతీయపంథగా నొక వినూత్న వాదమును బ్రకటించు

లాషముతోడనే నామిత్రులు శ్రీ నారాయణరావుగారు ఏకా రాంతరూపము నికారాంతముగా మార్చి క్రొత్తగా పాలకురికి వాదమును వెలువరించినట్లు సహృదయులకుఁ దోఁపకపోదు. ఆంధ్రకర్ణాట కవులలోఁ గాని యాధునిక విమర్శకులలోఁగాని, యింతకుఁ బూర్వ మొక్కరయిన శ్రీ నారాయణ రావుగారి పాలకురికెను సోమనాథుని జన్మస్థలముగా నెంచినట్లు వారు చూపఁ గల్గినచో జోహారులు. హాల్కురికె యే శాసన మందయినను పాలకురికె యని గాని పాలకురికి యనిగాని వ్యవహరింపఁ బడినను నది శ్రీనారాయణరావుగారి వాదమున కుపకరింపఁజాలదు. ఏకనామము గల గ్రామములు భిన్న భిన్న దేశములలో, మండలములలో నిప్పుడు గూడ ననేక ములు గాననగును. కొన్ని యెడల నొక్క జిల్లాలో నొక్క తాలూకాలోనే కూడ నిట్టి యేకనామక గ్రామములు గాన వచ్చును. కావున పాలకురికి యను గ్రామములు వేర్వేఱు తావులఁ గానవచ్చినను, వాస్తవముగా వానిలో నేది సోమ నాథుని జన్మస్థలమో, శృంగగ్రాహికాన్యాయమున నిర్ణయిం చుటయే చరిత్రజ్ఞుల కర్తవ్యము. శ్రీ వీరభద్ర శర్మగారు మైసూరు రాష్ట్ర మందలి తుముకూరు జిల్లా తివటూరు తాలూకాలోని హాల్కురికెను స్వయముగా సందర్శించి యచ్చటి విశేషములఁ గూర్చి వారిపూర్వోక్త విమర్శనానంత రము విభూతి సం. 4 సం 7,8,9లో "హాల్కురికె" యను శీర్షి కతో మఱొక వ్యాసమును బ్రకటించి యున్నారు. దానిని జదివిన వారికి శ్రీ నారాయణరావుగారి వాదమందలి యసా

మంజస్యము మఱింత వ్యక్తము కాఁగలదు. శ్రీ నారాయణ రావుగారు భారతి సం 20 సం 7 లో "పాల్కురికి" యను పేరితోఁ దాము బ్రకటించిన లేఖను వ్రాయునప్పటికి బహుశః శ్రీ శర్మగారి "పాల్కురికి" వ్యాసమును జదివియుండరు. ఆగ్రామ మండలి జను లెవరికి వీరశైవులకుఁ గూడ పాలకురికి సోమనాథుని పేరైన తెలియఁగ రాదని శ్రీ శర్మగారు వ్రాసినారు. సోమనాథుని కాలమునాఁటి కచ్చట శివాలయ మయినను వెలసి యుండలేదు. లది యట్లే కగ్రామము ఇప్పటికి రెండువందల సంవత్సరముల క్రిందటనే యచ్చట నొక శివాలయ మేర్పడెను.

## ౪. పాలకురికి వృత్తాంతము

పరమ పూజ్యుఁడగు సోమనాథుని జన్మస్థానము, గృహ నామము నయి యలరు నీ పాలకురికి యాంధ్రభాషాభిమానుల కెల్లఁ బూజ్యపదమగు నొక దివ్యక్షేత్ర మయియున్నది. కావున నీక్షేత్ర వృత్తాంతము పాఠకులకుఁ గొంత నివేదించుట యావశ్యకము. విభూతి పత్రికాధిపతు లీక్షేత్రమును సందర్శించి వయిశిర్షికతో నొకవ్యాసమును దమ పత్రికలోఁ (సం. ౩. సం. 6.) బ్రకటించి యున్నారు, అందలి విషయములఁ గొన్నిటి నిచ్చట వివరింతును.

వెనుకటి యధ్యాయమునఁ జెప్పినట్లు లీ గ్రామము వరంగలునకుఁ బండ్రెండు క్రోసుల దూరమున జనగామ తాలూకాలో నున్నది. హైదరాబాదు వయిపునుండి వచ్చువారు



పాలకురికి
సోమనాథ లింగాలయ గర్భమందిరము

(పుట ౧౭ చూ)



పాలకురికి శ్రీ సోమనాథకవి - విగ్రహము

నిజాంస్టేటు రైలుమార్గమున జనగాం స్టేషను వద్దను, బెజవాడ వయిపునుండి వచ్చువారు గణపురము (Ghan pur) స్టేషను వద్దను దిగి యయిదారు మైళ్లు మోటారు మీఁదను, దరువాత రమారమి పదునేను మైళ్ళు రెండెడ్ల బండిమీఁదను ప్రయాణముచేసి పాలకుఱికిని జేరవచ్చును. నేఁడిది చిన్న గ్రామముగనే యున్నది. కాని "కొంచెమైన నదియుఁ గొదవగాదు" అని వేమన చెప్పినట్లు గ్రామము చిన్నదయినను క్షేత్రమహాత్త్వమునకుఁ గొఱంత యేమియు లేదు. గ్రామమునకుఁ బడుమర రెండు మూఁడు ఫర్లాంగుల దూరమునఁ బొడవయిన యొక పర్వతమున్నది. దానిపై నొక గుహయందు స్వయంభువగు సోమేశ్వరస్వామి లింగరూపమున వెలసియున్నాఁడు. గుహాముఖ ముత్తరపు వయిపునకున్నది. దాని వ్యాసము చిన్నదిగ నుండుటచే స్వామి దర్శనమునకు వంగి వెళ్లవలసియుండును. స్వామియెదుట శిల్పకళాసంపదమెఱయు ప్రాచీనమగు నీల నందీశ్వరవిగ్రహము గలదు. ఎడమప్రక్కను మఱియొక దొనలో నరసింహస్వామివిగ్రహము గలదు. పూర్వమది యుమాదేవి మందిరమనియుఁ దరువాత నెవరో నరసింహ విగ్రహము నందుఁ బ్రతిష్ఠించిరనియు నచ్చటివారు చెప్పెదరు. ఈ కొండమీఁదనుండి చూచినచో రెండుమైళ్ల దూరములో బమ్మెరపోతనామాత్యుని జన్మభూమియగు బమ్మెర గ్రామము గానవచ్చును. మహాశివరాత్రికేటేట సోమేశ్వరస్వామికి గొప్ప యుత్సవము జరగును. అప్పుడు విశేషముగ యాత్రికు లచ్చటి కరుదెంతురు. ధ్వజస్తంభము కొండమీఁదఁగాక క్రిందనున్నది.

అందుపయి "శ్రీ పాల్కురికి సోమేశ్వరస్వామి" అని చెక్కి యక్షరములు గానవచ్చును. పాలకురికి సోమనాథకవి పూర్వు సోమేశ్వరస్వామికిఁ బారంపర్యముగ వచ్చెడి యర్చకులని నీ దేవుని ప్రసాదమున నుదయించుటచేతనే తలిదండ్రు లీతని సోమనాథుఁడని నామకరణ మొనర్చియుందురనియు నెనుక చెప్పియుంటిని. భక్తి పారవశ్యములోఁ గూడిన యనన్యాదృ కవితామహత్త్వము సోమనాథున కీ స్వామియనుగ్రహమున కలిగియుండునని చెప్పనక్కఱ లేదు. ఇంతియే కాదు. బమ్మె పోతనామాత్యుని కవితా మహత్త్వమునకుఁ గూడ నీ స్వా ప్రసాదమే కారణమని చెప్పుదురు. పాలకురికియందు మహాశి రాత్రికి జరగు నుత్సవములో నిప్పుడుగూడ "పాలకుర్తి నిలయా సోమయలింగా! పాదములకు శరణు ఉరవుగ బమ్మెర పో రాజుకు మీరు కోరినవరములు కృపచేసినారఁట, పాలకు నిలయా" అనుపాటను యాత్రికులు పాడుచుందురు. ఆంధ్ర దేశమునెల్ల భక్తిరసప్రవాహమున నోలలాడించు నిరుపు సుప్రసిద్ధమహాకవులను బ్రసాదించిన యీ సోమేశ్వరస్వామి సందర్శించి సంసేవించుట యాంధ్రమహాశయుల కత్యంత వశ్యకమని విన్నవించుచున్నాను.

సోమేశ్వరాలయమున్న కొండకుఁ దూర్పునఁ గొం సమీపముననే సోమనాథకవి సమాధికలదు. దానిపయి సోమ నాథలింగము ప్రతిష్ఠింపఁబడి చిన్నగుడి యొకటి నిర్మింపఁబడి యున్నది. దీనిని సోమనాథాలయమనియు సోమనాథా లయమనియు వ్యవహరింతురు. ఈ యాలయగర్భమంది

రమున సోమనాథునిసమాధిలింగము ప్రక్కను రాగిరోఁ జేయఁబడిన వీరభద్ర ప్రతిమలు కొన్ని గలవు. మంటప మునఁ గుడిప్రక్క మూలలో సగమువఱకుఁ బాతుకొని పోయిన గణపతి నాగ కన్యా విగ్రహములును, భైరవ ద్వార పాలకులును గలరు. మంటపమునకుఁ దూర్పు వయిపున దగ్గఱగా ధ్వజస్తంభమును దాని యొద్ద జడలు రుద్రాక్షలు హృదయభాగమున హస్తాంబుజ ద్వయముతోఁ బూజించు శివ లింగమునుగల శిలావిగ్రహమును గలవు. విగ్రహము దిగు వను బ్రాఁత తెలుఁగులిపిలోఁ బేరుకూడ లిఖింపఁబడి మిక్కిలి యరగిపోవుటచే సరిగాఁ దెలియక సో, నా అను రెండక్షర ములు మాత్రము పోల్పఁదగియున్నవి. ఇది సోమనాథుని విగ్రహమేయనుటకు సంశయింపఁబనిలేదు. సోమనాథలింగము విశేషమహిమాన్వితమయి భక్తులకు విపన్నులకు రోగగ్రస్తు లకుఁ గామ్యార్థులకు యాత్రారంగమయి యొప్పుచున్నది. చుట్టుప్రక్కలఁ బదియిరువదామడల దూరమునుండి నిత్యము నిచ్చటికి యాత్రికులరుదెంచుచుందురు. వారి యుపయోగమున కయి సోమనాథాలయమున కుత్తరమునను దూర్పునను బది పదియేను ధర్మశాలలు నిర్మింపఁబడియున్నవి. ఇచ్చటి రోగ నివారణాదిమహిమలకు సోమనాథుని యంత్రపురశ్చరణ, అష్ట దిగ్బంధము మొదలగు క్రియాసిద్ధులు కారణములు. ఆలయదక్షిణ భాగమునఁ గొంతదూరమునఁ బొలములోఁ బాతుకొనిపోయిన విగ్రహములును, శిల్పశిలాఖండము లునున్నవి. ఇట్లే యెన్మిదివైపులను యంత్రబంధన స్థానములు

కలవని యాలయాధికారులు చెప్పెదరు. ఇట్టి మహిమలతో గూడినదయ్యు నీ యాలయ మిప్పు డర్చకులు నచ్చటి యధి కారులు తగిన శ్రద్ధ వహింపకుండుటచే జీర్ణించి పడిపోవు స్థితిలో నున్నది. ప్రాకార మసలే కానరాదు. ఈశోచనీయ స్థితిని దొలఁగించి యాలయము నుద్ధరించుటకయి యాంధ్రు లందఱు పూనుకొనవలసియున్నది.

సోమేశ్వరస్వామియాలయమున్న కొండ యొక్క క్రింది సానువులలోఁ బెద్ద తేనెపట్టులు ముప్పదిమూఁడు నిత్యము ప్రత్యక్ష మగుచుండును. ఆలయమున కెవరయిన నశుచిగా వచ్చినచో వారిపయి నా తేనెటీఁగలు దాడివెడలి యెంతదూరము పరుగిడినను విడిచిపెట్టవు. కాని సోమనాథా లయముసన్నిధికిమాత్రము వెళ్ళుచో నచ్చటికవి ప్రవేశింప జాలవు. ఇట్లు పెక్కు మహిమలతోఁగూడిన సోమేశ్వర సోమ నాథ లింగములను సందర్శించుటకయి యాంధ్ర భాషాభిమా నులు జన్మమున నొకపరియైనఁ బాలకురికి యాత్ర గావింప ధన్యులయ్యెదరు గాత!

సరియైన పరిశోధనము నన్వేషణము జరిగినచో పాలకురికియందును, దత్ప్రాంతముననను నలభ్యమగు సోమ నాథుని కృతులును నితరచారిత్రికసామగ్రియుఁ గూడ లభింపఁగలవని తలంపఁదగును.

## ౫. సోమనాథుని వంశము - కుల గోత్రములు.

ఇందుఁగూర్చి భేదాభిప్రాయములు చాలఁగలవు. సోమ నాథుఁడు పాలకురికి యందలి సోమేశ్వరస్వామి యర్చక వం

మునకుఁ జెందిన వాఁడని వెనుకఁ జెప్పియుంటిని. ఆంధ్రదేశ మున శివాలయములలో సాధారణముగ శివద్విజులను బ్రాహ్మణు లర్చకులుఁగా నుందురు. వీరినే హరద్విజులు, నంబులు, తమ్మళులు, (వెలనాటి) పూజారులు మున్నగు పేళ్లతోఁగూడ వ్యవహరింతురు. కాని కొన్ని క్షేత్రములలోని స్వయంభులింగములకు సహజ వీరశైవులగు జంగములే యర్చకులుగ నున్నారు. ఆంధ్ర దేశమున సుప్రసిద్ధమగు శ్రీ శైల మల్లికార్జున స్వయంభు లింగమునకు నిప్పటికిఁగూడ నీ వీరశైవ మతమునకుఁ జెందిన జంగములే యర్చకులుగ నున్నారు. ఇంతయేల! శ్రీశైల క్షేత్రాధిపత్యమే వీరశైవ పంచాచార్య పీఠములలో నాల్గవది యగు పండితారాధ్య పీఠమునకుఁ బూర్వము నుండియుఁ జెంది యున్నది. ఆపీఠమే యిప్పుడు గుంటకల్లునందు భిక్షావృత్తిమఠ మను పేరితో నున్నది. వీరశైవ మతమునకుఁ జెందిన జంగమ శాఖవారామతమందలి భక్తవర్గమునకుఁ జెందిన లింగబణిజులు మున్నగు వారికి గురువులుగా వర్తించెదరు. వారినే యాంధ్రదేశమున నిప్పుడు మఠస్థులని, మాహేశ్వరులని కూడ వ్యవహరించు చున్నారు. పాలకురికి యందలి సోమేశ్వర స్వయంభు లింగమునకుఁగూడ నీ జంగమ శాఖవారే పారంపర్యముగ నర్చకులుగ నుండెడివారు. ఆ శాఖయందే సోమనాథుఁడు జననమందెను. ఇప్పుడుగూడఁ బాలకురికియందలి సోమేశ్వర సోమనాథలింగముల కీ శాఖవారే యర్చకత్వము జరపు చున్నారు. సోమేశ్వరస్వామి యర్చకత్వములో మాత్రము తమ్మళులకుఁ గూడఁ గొంత భాగమున్నది.

జంగమశబ్దము పూర్వ వాఙ్మయమునఁ గుల వాచ్యముగా నంతగా నుపయోగింపఁ బడినట్లు కానరాదు. ("లింగమునకు స్థలము లేదు. జంగమునకుఁ గులము లేదు" అని కన్నడమున నొకసామెత కలదు.) సృష్టియంతయు స్థావరజంగమములను ద్వివిధ విభాగములతోఁ గూడియున్నది. పర్వతాదులు స్థావరములు. చరించు జీవరాసులు జంగమములు. కావుననే సోమనాథసూరి "జం భృశం గచ్ఛతీతి జంగమః" అని జంగమశబ్దమును నిర్వచించినాఁడు. వీరశైవవాఙ్మయమున లింగశబ్దము పరబ్రహ్మమగు శివునకు వాచకము. ఈశ్వరాంశము ప్రతి జీవియందును గర్భితమై యున్నదనుట నిర్వివాదము. శివజీవైక్యతత్త్వమును బ్రతిపాదించునదే వీరశైవమతము. కావునఁ బ్రాచీనమగు వీరశైవ వాఙ్మయమున "చరలింగ" (మానవరూపమునఁ జరించు శివుఁడు) ద్యోతకముగ జంగమశబ్దము వ్యవహరింపఁ బడినది. కావున వీరశైవమతీయులకెల్ల జంగమశబ్దము వర్తించునదే యైనను రానురానిది యిప్పుడు పైఁ జెప్పిన వీరశైవ మతస్థ గురుశాఖకొక సంకేతముగ నేర్పడినది. ఆంధ్రదేశమున స్థలపతి జంగములని వ్యవహరింపఁ బడు వేఱొకశాఖవా రీ గురువర్గమునకుఁ జెందినవారు కారు. వారు భక్తవరమునందే చేరెదరు.

నిగమాగమోపనిషత్ప్రతిపాదితంబగు వీరశైవమతమునకు నాచార్యు లయిదుగురు. వీరు శివుని పంచవదనములనుండి (సద్యోజాత, వామదేవ, తత్పురుష, అఘోర, ఈశానముఖములు) యుదయించి యుగభేదముల ననుసరించి వేర్వేఱ

నామముల ధరించి లోకమున వీరశైవ మతస్థాపన గావింతు రనియు, వీరే తన్మతస్థులకు గోత్రికర్తలనియు సుప్రబోధ * స్వాయంభువాది శివాగమములు చెప్పుచున్నవి. ఈమతా చార్యుల మొదటిపేరులు—వీర, నంది, భృంగి (లేక భృంగి రిటి) వృష, స్కంద—అనునవి. ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర చతురక్షర, పంచాక్షర—ఇవి కృతయుగ నామములు. ఏక వక్త్రి, ద్వివక్త్రి, త్రివక్త్రి, చతుర్వక్త్రి, పంచవక్త్ర, అనునవి త్రేతాయుగాభిధానములు. రేణుక, దారుక, గజకర్ణ, ఘంటా కర్ణ, విశ్వకర్ణ— అనునవి ద్వాపరయుగము నందలి యభి ఖ్యలు. రేవణసిద్ధ, మరుళసిద్ధ, ఏకోరామ. పండితారాధ్య, విశ్వారాధ్య—ఇవి కలియుగ వ్యవహార నామములు. వీరి పీఠము లిపుడు వరుసగ రంభాపురి (మైసూరు రాష్ట్రమునందలి బాలెహొన్నూరు. మొదట నిది త్రిలింగదేశమందలి కొలను పాకలో స్థాపితమయి, రేణుకాచార్యుని కాలముననే మలయా చలము నందలి రంభాపురికిఁ దరలింపఁ బడినది) ఉజ్జిని, (బళ్లారి మండల మందున్నది) హిమవత్కేదారము, శ్రీశైలము, కాశి యనుక్షేత్రములందు నెలకొని యున్నవి. ఈ పంచా చార్యుల తొలుతటి వీర, నంది, భృంగి, వృష, స్కంద నామ ములే యనాదినుండియు వీరశైవమతస్థులగు జంగములకు

---

* శ్లో॥ సద్యోజాతశ్చ ప్రథమో వామదేవో ద్వితీయకః అఘోరస్తు తృతీయశ్చ తత్పురుష శ్చ చతుర్థకః ఈశానః పంచమశ్చేతి ముఖాని మమసర్వశః తాన్యాననాని గోత్రాణి వేదోక్తాని నసంశయః వీరో నందీ తథాభృంగీ వృష శ్చ స్కందఏవచ మత్స్వరూపా త్సముత్పన్నాః పంచగోత్రాధి కారిణః (సుప్ర బోధాగమము)

లింగాంగులకు గోత్రనామములుగా వ్యవహరింపఁబడుచున్న గోత్రకర్తలయిదుగురు కూడ నీశ్వరవదనసంజనితులు కావు నీ వీరశైవులు తామీశ్వరకులజుల మనియు శివకులీనుల నియుఁ జెప్పికొనెదరు. ఈ సంప్రదాయానుగుణముగనే సోమ నాథుఁడు తాను శివకులీనుఁడననియు, భృంగిరిటి గోత్రుఁ ననియు నాతని ప్రథమ కృతిగఁగానవచ్చు అనుభవసారములో నీ క్రింది పద్యమునఁ జెప్పికొని నాఁడు.

"క॥ భృంగిరిటి గోత్రుఁడను గురు
లింగతనూజుండ శివకులీనుఁడ, దుర్వ్యా
సంగవివర్జితచరితుఁడ,
జంగమ లింగప్రసాద సత్ప్రాణుండన్"

తన శివకులీనత్వమును దరువాత రచించిన బసవపురాణములోఁగూడ "ధర 'నుమామాతాపి తారుద్ర' యనెడు వరపురాణోక్తినీశ్వరకులజుండ" అను పంక్తులలోఁగూడ వ్యక్తమొనర్చినాఁడు. ఈతని శిష్యప్రశిష్యుఁడు పిడుప్రర్తి సోమనాథకవిగూడ నీతని కంకితముగా రచించిన పద్య బసవ పురాణములో నాశ్వాసాంత పద్యములలో నాతని నిట్లు సంబోధించినాఁడు.

"క॥ భృంగిరిటి గోత్రసంభవ!
జంగమ పాదార్చనావి, శారద! విలస
త్సంగీత శాస్త్రపారగ!
గంగోత్పత్తి ప్రకార, కావ్యధురీణా!"

భృంగి (భృంగిరిటి) గోత్రజులగు వీరశైవులకు వీరశైవపంచాచార్యులలోఁ దృతీయాచార్యుఁడగు ఏకో

రామాచార్యుఁడు గురువు. సోమనాథున కంకితముగా రచించిన అన్యవాదకోలాహల మను శతకములోఁగూడ నా కృతికర్త "ఈహితానుషంగ! ఏకామ్రి గురుచిత్త, నలినభృంగ! సోమనాథలింగ!" అను మకుటమును గూర్చికొనినాఁడు. ఇందలి "ఏకామ్రి" శబ్దము "ఏకోరామ" శబ్దమునకుఁ బద్యమున సరిపడునట్లు లా కృతికర్త చేసిన హ్రస్వీకరణమని నా యభిప్రాయము. పాలకురికిలో నివసించుచున్న సోమనాథుని వంశ్యు లిప్పుడుగూడ ననూచానముగఁ దాము భృంగిగోత్రులమనియు, ఏకోరామాచార్య పీఠమునకుఁ జేరిన శిష్యులమనియు జెప్పికొనుచున్నారు. ఇట్టి గోత్ర వ్యవహారము సహజ వీర శైవులందే కలదు. స్మార్త బ్రాహ్మణులయందుఁగాని, వీరశైవ మతాచార ధర్మముల నవలంబించిన యారాధ్య (శైవ) బ్రాహ్మణులలోఁగాని కానరాదు. ఆరాధ్య బ్రాహ్మణులలో స్మార్త బ్రాహ్మణులలోవలె ఋషిగోత్రసూత్ర వ్యవహారమే యిప్పటికిని జరగుచున్నది, మఱియు సోమనాథుఁడు భవులు (లింగధారణము నొల్లని శివభక్తివిదూరులు) అగు బ్రాహ్మణులను త్రాటిమాలలు, పచ్చిమాలలు, కర్మ చండాలురునని తన కృతులలోఁ బలుతావుల నిరసించినాఁడు. కావున నీ సంగతుల నెల్ల నవలోకింప సోమనాథుఁడు స్వయముగ వ్రాసికొనిన వ్రాఁతలఁబట్టియు నాతని శిష్యప్రశిష్యుల వాక్యముల ననుసరించియు నాతఁడు కొందఱవిచార మూలకముగఁ దలంచునట్లు బ్రాహ్మణుఁడుగాని యారాధ్యబ్రాహ్మణుఁడుగాని కాక, సహజవీరశైవుఁడగు జంగముఁడని విస్పష్టము

కాఁగలదు. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగా
తమ యాంధ్రకవులచరిత్ర నూతనముద్రణములో నీత
చరిత్రమును లిఖించుచు నందీతఁడు వీరశైవుఁడని మాత్ర
వ్రాసి యూరకొనినారు. అనుభవసార పద్యము
గూడ వారుదాహరించియున్నారు. ఆంధ్రపత్రిక దుందు
(1922) సంవత్సరాది సంచికలో "పాలకురికి సోమనాథకవి
అను వ్యాసములోఁ బయివిషయముల నించుక చర్చించు
సోమనాథుఁడు సహజ వీరశైవుఁడగు జంగముఁడని నా దృఢ
భిప్రాయమని వ్రాసియుంటిని. ఆసందర్భముననే సోమనా
థుఁడు తన పండితారాధ్య చరిత్రమునకు శ్రోతగాఁ గూర్చు
కొనిన ఆపస్తంబ సూత్రుఁడు, హరితస గోత్రుఁడు, ఆరాధ్య
బ్రాహ్మణుఁడు నగు పాలకురికి సూరనామాత్యునిఁ దన ముద్దు
మఱఁదిగాఁ బేర్కొనియుండుటచేఁ గొందఱాతనివలెనే సోమ
నాథుఁడుగూడ నారాధ్యబ్రాహ్మణవంశజుఁడని భ్రమింప
వచ్చుననియు, నట్లు తలంచుట సరిగాదనియుఁ జెప్పియుంటిని
సోమనాథుఁడు సూరనామాత్యుఁడు నిచ్చిపుచ్చుకొన్న సంబం
ధముగల సిక్కు బావమఱఁదు లయినచో సోమనాథుఁడు
దనకు శివసంబంధమగు భృంగిగోత్రమును జెప్పికొని సూరనా
మాత్యునకుఁ బైనిజెప్పిన ఋషిగోత్రసూత్రములు చెప్పుట
పొసఁగి యుండదు. వారి యిరువుర పూర్వులుగూడఁ బాల
కురికి గ్రామవాస్తవ్యులగుటచేత "పాలకురికి" యను గృహనామ
మాయిద్దఱకు నేర్పడి యుండును. (గ్రామనామమునుబట్టి యేక
గృహనామమేర్పడిన భిన్న భిన్న కులములవారి వసంఖ్యాకము

లుగ నిప్పుడుగూడఁ జూచుచునేయున్నాము. వైవాహిక బంధముగల వారిలో నేకగృహనామముగలవారు వేశ్యా కుల ములోఁదప్ప నితరవర్ణములలో నాంధ్రదేశమునఁ గానరారు. సూరనామాత్యునిఁగథా శ్రోతగఁ గూర్చికొనిన కారణములను సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున నిట్లు పేర్కొనినాఁడు.

"వీర పోచేశ్వర విశ్రుతాచార్య,
కారుణ్య హస్తాబ్జ గర్భసంభవుఁడ
చరలింగ, గురులింగ, సాహిత్యలింగ,
చిరసమనిష్ఠైక శీలవర్ధనుఁడ
కడుమించి శివునకుఁ గన్నులర్పించి,
పడసిన దృఢవీర భక్తివర్ధనుఁడ
నీదృగర్పిత పునరాదానరతికి
నీ దానధర్మవినీతికి మెచ్చి
బసవేశు తక్కిన భక్తుండవనియు
నసదృశలీల మా కనుగలంబనియు
మచ్చిక నా ముద్దు మఱఁది వీవనియు,
నెచ్చెలి కాఁడవు, నీవ కాయనియుఁ
జాతుర్య సాహిత్య శాలి వీవనియు
శ్రోతృత్వమునకుఁ బాత్రుండ వీవనియు."

ఇందలి మొదటి నాలుగుపంక్తులఁబట్టియు నంతకుమున్ను చెప్పిన "పరమ పవిత్ర! యాపస్తంబసూత్ర!, హరితసగోత్ర! విద్యాపుణ్యగాత్ర!" అను సంబోధనములఁబట్టియు, సూర నామాత్యుఁడిష్ట లింగధారియగు నారాధ్య బ్రాహ్మణుఁడని విస్పష్టమగును. "సహితానాంభావః సాహిత్యమ్" కావున సాహిత్యలింగ మనఁగా నిష్టలింగము. సోమనాథునకు సూర

నామాత్యుఁడు నిక్కంపు బావమఱఁదియే యైనచో నాతని 'మచ్చిక నాముద్దు మఱఁది' యనియు, నెచ్చెలికాఁడవనియు నుద్బోధించుట యనవసరము. ఇట్టి సంబోధనమునే మహిమ ప్రకరణాంతమునఁ గూడ

"అఱలేనిసఖుఁడ! నూరార్య! నా ముద్దు
మఱఁది! విన్మిది మహిమ ప్రకరణము."

అనిచేసియున్నాఁడు. కావున వీనినెల్లఁబర్యాలోచింప వీ రువురునఱలేని మచ్చికకలిమి బావమఱఁదుల వరుసను బిలిచి కొనెడునెచ్చెలికాండ్రేగాని, వైవాహికబంధముగల యేకకులము వారు కారనియు, నీ స్నేహబాంధవము తిక్కన మనుమసిద్ధుల మామ యల్లుర సంబంధము వంటిదే యనియు, సహృదయు లకుఁ దోఁపకపోదు. ఇట్లు సయుక్తికముగ సప్రమాణముగ సోమనాథుఁడు సహజవీరశైవుఁడగు జంగముఁడని దుందుభి సంవత్సరాది సంచికలో నేనుజేసిన నిర్ణయము గొందఱకు సంచలనము గలిగించుట శోచనీయము. శ్రీ దేశోద్ధారక కాశీ నాథుని నాగేశ్వరరావు పంతులుగారు 1925 లోఁ దాము ప్రకటించిన వృషాధిప శతకమునకుఁ బీఠిక వ్రాయుచు నందులో సోమనాథుని కులగోత్రములఁగూర్చి దుందుభి సంవత్సరాది సంచికలోని నా నిర్ణయము నుదాహరించి దాని నించుక విమ ర్శించిరి. సోమనాథుఁడు చతుర్వేద వేదాంగపారంగతుఁడగు మహాపండితుఁ డగుటచే బ్రాహ్మణేతరుఁడు కాఁజాలఁడనియు, ఓరుగంటి యందలి ధూర్తవిప్రులు పతితుఁడని యాతనిఁగూర్చి చేసిననింద యాతని బ్రాహ్మణకులజననమునే సూచించు

ననియుఁ గావున నాతఁడు మొదట నారాధ్యబ్రాహ్మణకుల మున జనించి రాను రాను బసవేశ్వరునందు నాతని మతము నందు భక్తివ్యామోహములు ముదిరిన తరువాత జంగము లలోఁగలిసి యనుభవసార రచనాకాలము నాఁటికిఁ బ్రమథ గణపరమయిన భృంగిరిటిగోత్రమును జెప్పికొని యుండుననియు, ఆరాధ్యబ్రాహ్మణులుకూడ శివపూజాకాలమున నంది, భృంగి మున్నగు ప్రమథుల స్మరించెదరనియు, నందుచే సోమనాథుఁడు భృంగిగోత్రుఁడనని చెప్పికొన్నంతమాత్రమున నాతనిని జంగముఁడని నిర్ణయింపరాదనియు వీరి వాదము. తరువాత 1926 సంవత్సరములో వారు ముద్రించి ప్రకటించిన బసవ పురాణముయొక్క ప్రస్తావనలోఁగూడ "పాల్కురికి సోమ నాథాది బ్రాహ్మణులు కొందఱు కులగోత్రములను విసర్జించి వీరశైవదీక్షను స్వీకరించి కృతార్థులైరి" అని తమ పూర్వో క్తాభిప్రాయమునే మరలఁ బ్రకటించిరి. వీరు ప్రకటించిన యీ బసవపురాణముద్రణమునకుఁ బరిష్కర్తలు పీఠికారచ యితలునగు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కూడ దుందుభి సంచికలో నే నొనర్చిన నిర్ణయము నెత్తికొని ప్రధాన మగు భృంగిగోత్రత్వము గుఱించి యేమియుఁ బ్రశంసింపక చల్లగ జాఱవిడిచి యీ క్రింది దుర్బలవాదములతో సోమ నాథుఁడు బ్రాహ్మణుఁడే యని సమర్థింపఁ బ్రయత్నించిరి.

1. అబ్రాహ్మణుల కానాఁడందరానివిగానుండి మంచి శిష్టాచారసంపత్తిగల బ్రాహ్మణునకే యెఱుకపడఁదగిన విష యములు, వేదమంత్రములు, వేదభాష్యములు, వైశ్వదేవాది

శ్రౌతకర్మరహస్యములు మున్నగునవెన్నో సోమనాథ కృతులలో నుదాహృతములయి విమర్శింపఁబడినవి.

2. చతుర్వేద పారగుఁడనని పండితారాధ్య చరిత్ర ములో నాతఁడు చెప్పికొనెను.

3. బ్రాహ్మణేతరులు వేదమును జదువరాదనుటకు బ్రమాణములను సోమనాథ భాష్యమున సోమనాథుఁ డుదహరించి యా గ్రంథముననే గాయత్రీ మంత్రము శివపరమే యనుష్ఠేయమని వ్రాసెను.

4. కర్ణాటాంధ్ర కవులు పలువురు సోమనాథు నారాధ్య నామముతోఁ బేర్కొనిరి; కన్నడమందలి పాలకురికి సోమనాథ పురాణమున నతఁడు వేమనారాధ్య వంశము వాఁడని చెప్పఁ బడెను; శైవులయిన బ్రాహ్మణులకే యా నాఁడారాధ్య నామము చెల్లియుండెను.

5. పాల్కురికి సూరనామాత్యుఁడు బ్రాహ్మణుఁడు కావున నాతఁడు తన మఱఁది యని చెప్పికొనిన సోమ నాథుఁడుకూడ బ్రాహ్మణుఁడే కావలెను. సోమనాథుడు తాను శివదీక్షితుఁడవుటచేఁ గులగోత్రాదికమును జెప్పికొనక సూర నామాత్యుఁడు శివదీక్షితుఁడు కాని కారణమున నాతఁడు మాత్రము గోత్రసూత్రములను జెప్పెను. ఏకగ్రామవాస్తవ్యు లగుటచే భిన్నగోత్రులకుఁగూడ నొకయింటిపే రేర్పడవచ్చును భిన్నగోత్రులు లొకేయింటిపేరు, ఒకే కులముగలవారసంఖ్యా కులుగ నగపడుచున్నారు.

6. త్రాటిమాలలు, పచ్చిమాలలు, కర్మచండాలురు నని సోమనాథుఁడు చేసిన బ్రాహ్మణనింద యాతఁడు స్వయముగఁ జేసినది కాదు. బసవేశ్వరాదికథాపాత్రములు చేసిన దానిని సోమనాథుఁ డనువదించెను. బసవపురాణమున బ్రాహ్మణ గర్హ యుండఁగాఁ బండితారాధ్య చరిత్రమున బ్రాహ్మణ ప్రశంస గలదు. బసవేశ్వరుఁడు బ్రాహ్మణ ధర్మములు గర్హించినవాఁడు గావున బసవపురాణమున నట్లు వ్రాయవలసెను. మల్లికార్జున పండితారాధ్యుఁడు బ్రాహ్మణ ధర్మముల నాదరించినవాఁడు గావునఁ బండితారాధ్య చరిత్రమున నిట్లు వ్రాయవలసెను.

6. సోమనాథుని కాలమునాఁటికి జంగమజాతి యేర్పడనే లేదు; అప్పటి వాఙ్మయములో జంగమశబ్దము చరలింగ వాచకముగ మాత్రమే యుపయోగింపఁ బడెను.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణపీఠికలో మతవిషయములఁ గూర్చియేమి, చరిత్రవిషయములఁగూర్చియేమి, భాషావిషయములఁ గూర్చియేమి యొనర్చిన సిద్ధాంతములు కొన్ని బహు భ్రమప్రమాదసంకలితములైయున్నవి. వాని నిదివఱకే యితరత్ర "పాలకురికి సోమనాథకవి కులగోత్ర ప్రశంస" (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సంపుటము 19 సంచికలు 3, 4, 5) సోమనాథ స్తవము (పరిషత్పత్రిక సం 21 సం 3) పిడుపర్తికవులు (పరిషత్పత్రిక సం 23 సం 2) పాలకురికి సోమనాథకవి; కావ్యవిశేషములు (సమదర్శిని 30-7-32, 3-8-32, 6-8-32) ఆచార్య పండితుఁడు

(విభూతి సం. 1 సం. 9, సం. 2 సం. 1, 2) అను వ్యాస
లలో విమర్శించి యుంటిని. వానిలో వేనికి
సమాధానము లింతవఱకు వ్రాయకుండుటచే వారు
యభిప్రాయములను మార్చికొని యుందురనియే విశ్వసి
చున్నాను. సోమనాథుని కులగోత్రములఁ గూర్చి శ్రీ
శ్వరరావు పంతులుగారు, ప్రభాకరశాస్త్రిగారు వెలువరి
పయి భిన్నాభిప్రాయము లన్నిటిని సమగ్రముగఁ బూర్వ
మయిన "పాలకురికి సోమనాథకవి కులగోత్ర ప్రశంస"
విపుల వ్యాసములో విమర్శించి యుంటిని. అందుకు శ్రీ
శ్వరరావు పంతులుగారు కూడ బదులు వలుక లేదు. "
చతురానన" బిరుదాంకితులగు శ్రీ చిలుకూరి వీరభద్ర
పంతులుగారు తమ యాంధ్రుల చరిత్రమందలి కా
యుగ చరిత్రమును గూర్చి యొనర్చిన పునర్ముద్రణ సం
ములోఁ బయిని జెప్పిన నా విమర్శవ్యాసమును బేర్కొని
నాథుని కులగోత్రములఁ గూర్చి నా నిర్ణయమునే యం
చిరి. అయినను బాఠకుల పరిశీలనార్థమయి యా విమర
ముల నిచ్చుటఁ గూడ సంగ్రహముగ వివరింతును.

ప్రభాకరశాస్త్రిగారు వీర శైవమతము బసవే
పజ్ఞమనియు, నతనికి ముందా మతమున్నట్టు లాధార
శాసనావనియు, రేణుకుఁడు మున్నగు వీర శైవాచా
కూడ బసవేశ్వరునకు సమకాలీనులేయనియు, వీర శై
ములుకూడ నప్పుడే కల్పింపబడియుండుననియుఁ బ్రబల
నముతో విపరీత సిద్ధాంతమును వెలువరించిరి. వేదమ

ఉపనిషత్తులు, స్మృతులు, ఆగమములు; పురాణములు మున్నగు భారతీయ మతవాఙ్మయమంతయు బసవేశ్వరుని కాలముననే యనఁగాఁ క్రీస్తుశకము పదిరెండవ శతాబ్ది మధ్యముననే వెలసినదని శ్రీ శాస్త్రిగారు ధ్రువపఱుపఁ గలిగినప్పుడే వారి విపరీతాభిప్రాయమునకు నిలువనీడగలుగునేమో కాని యట్లు కానినాఁడు దానికెట్టి యాశ్రయము కలుగనేరదు. భారతీయమతములలో వీరశైవ మత్యంతప్రాచీనమయిన దనియు, దశవిధ శైవములలో నది యుత్తమముగా గణింపఁ బడినదనియు, నది నిగమాగమోపనిషత్ప్రతిపాదితమనియు, శ్రుతులకుపబృంహణ రూపకములగు స్మృతి పురాణములుగూడ దానిని బ్రతిపాదించుననియు నిరూపించుటకు వలసినంత సాధన సామగ్రి యున్నది. ఆ పురాతన వాఙ్మయము మాట యట్లుండ, నందుండి పెక్కు ప్రమాణముల నుద్ధరించుచు సోమనాథుఁడు రచించిన బసవ పురాణము, పండితారాధ్య చరిత్రము, సోమనాథభాష్యము, చతుర్వేదసారము నను గ్రంథములు గూడ నీమతప్రాచీనతను నిరూపించుటకే రచింపఁ బడిన వను నూహ యీ గ్రంథములఁ జదువు సామాన్యమానవుల బుద్ధికిఁగూడ నప్రయత్న పూర్వకముగ సులభముగ గోచరింపఁ గలదు. అట్టి యెడ బసవపురాణపరిశోధకులగు శాస్త్రిగారిట్టి యభిప్రాయమును బ్రకటించుట మహాశ్చర్యము గాకపోదు. బసవేశ్వరుఁడు వీరశైవ మతము నవలంబించి దానిని విస్తరింపఁ జేసిన యొక మతోద్ధారకుఁడేగాని యామత స్థాపకుఁడు గాఁడనియు, యుగయుగముల నుండియు నామ

భేదములతో నవతరించిన పంచాచార్యులే యీ మతస్థాప
లనియు "ఆచార్య పండితుఁడు" అను వ్యాసమున నిరూపిం
యుంటిని.

వీరశైవులకుఁ బ్రధానాంగ మగు లింగధారణమ
బ్రాహ్మణులలోఁ గృష్ణదేవరాయలకుఁ బూర్వమనఁగాఁ గ్రీస్తు
శకము 1500 పూర్వ ముండెననుట కాధారములు మృగ్యమ
లనియు, "తెలుఁగు నాటి యారాధ్యులు వీరశైవులు గారు
పూర్వకాలమున వీరు లింగధారులుగారు" అనియుఁ గూ
శ్రీ శాస్త్రిగారు తలంచుచుఁ దెలుఁగు దేశపు వారగు పండి
త్రియము (శివలెంక మంచన పండిత, శ్రీపతి పండిత, మ
కార్జున పండితులు) లింగధారు లనుటకు బలవదాధారము
తమకుఁ గానరాలేదనియు, మల్లికార్జున పండితారాధ్యు
శివతత్త్వ సారమున నెందును లింగధారణప్రశంసయే లే
నియు, నిత్యాదిగఁ దమ యూహల కనుగుణముగ శాస్త్రిగారు
చాల నసంగత విషయములఁ బ్రకటించిరి. ఈ దురభిప్రాయ
ములనుగూడ శ్రీ మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగ
శాస్త్రిగారు వారి శైవరహస్యబోధినిలోఁ బ్రకటిత మయిన
"బసవపురాణ పీఠికా విమర్శనము" నందును, పూర్వోక్తము
లయిన "పాలకురికి సోమనాథకవి కులగోత్రప్రశంస" "ఆచార్య
పండితుఁడు"అను వ్యాసములందు నేనును విమర్శించియుంటిమి.
మల్లికార్జున పండితుని శివతత్త్వసారమున లింగధారణ ప్రశంస
లేదనుట పొరపాటు. దొరకినంత వఱకా గ్రంథ మసమగ్రమే.
ఉపలబ్ధ మయిన గ్రంథభాగములో నుదాహృతమయిన శివ

దీక్ష లింగధారణదీక్షయే గాని మఱొకటి కాదు. నేఁటి తెలుఁగు నాటి యారాధ్యులు తమ కూటస్థులుగాఁ జెప్పికొను పండిత త్రియము లింగధారులు గారనుటకంటెఁ బరిహాసాస్పదము మఱియొకటి యుండఁబోదు. బ్రహ్మసూత్రములకు వీరశైవ మతపరమగు శ్రీకర భాష్యమును రచించి, యందు లింగధారణ ప్రాముఖ్యమును బ్రతిపాదించిన శ్రీపతి పండితుని, సోమనాథుని పండితారాధ్య చరిత్రమునకుఁ గథానాయకుఁడగు మల్లికార్జున పండితుని లింగధారులు కారనుట కంటె వింత యుండునా? పండితారాధ్య చరిత్రమునందలి దీక్షాప్రకరణము సరిగాఁ జదివి యర్థము చేసికొన్న వారెవరయిన నిట్లు వ్రాయ సాహసింతురా! మల్లికార్జునపండితుని దీక్షాగురువగు కోటిపల్లి యారాధ్యదేవుఁడును నాతని గురువగు అవాంతర పండితుఁడును, వీరశైవ వ్రతులని సోమనాథుఁడు స్పష్టముగ వర్ణించి మల్లికార్జున పండితునిఁగూడ వీరశైవ వ్రతుఁడనియే పేర్కొనినాఁడు.

శ్రీ శైవసమయ దేశికచక్రవర్తి – పాశమోచన కళా పారీణమూర్తి
శుంభద్దిగంతవిశ్రుత శివకీర్తి – శాంభవ దీక్షాభి జాతానువర్తి
యుత్తమోత్తముఁడు సంయుతవీరభక్తి – వృత్తచిత్తుఁడు..............
అవాంతరయ్య యనంగ హరగణాఢ్యుండు.
వారిశిష్యుండు దుర్వార సంసార – దూరవరవ్రతోద్దురవర్తనుండు
శైవధర్మోత్తమాచార్యుండనంగ – దైవుండు నద్వైత తత్త్వతత్పరుఁడు
..........................................
తంత్రాధిగతవీర తంత్రస్వతంత్ర – మంత్రాధిగతరాజ మంత్రసిద్ధుండు
..........................................

ఆరూఢకీర్తిశుఁడగు కోటిపల్లి - యారాధ్యులనఁగ లోకారాధ్యమూర్తి
అసమశదీయలోకారాధ్య శిష్య - విసరాగ్రగణ్యుండు వీరవ్రతుఁ
.......................................................................
ధన్యుండు దేశికోత్తముఁడు లౌకిక-మాన్యుండు పండిత మల్లికార్జునుఁ

ఇట్టి యీ మల్లికార్జున పండితుఁడు.

"విధినిషేధాతీత వీరశైవోక్త - విధి "సద్గురుభ్యో నివేదయే" త్తనఁగ
ననికలప్రాణదేహార్థముల్ పూర్వ - భవభావిభవ సముద్భవ హరు సకే
భవహరు సాక్షాదభవుజితభావ - భవుశివు శ్రీ కోటిపల్లి యారాధ్య
దేవు శ్రీ పాదుకేందీవరములకు - భావంబెలర్ప నర్పణ మాచరించి
పడసి ప్రాణార్పణ ప్రాణలింగంబు-వడసి త త్తను సమర్పణ ప్రసాదఁ
వడసి తద్ధన సమర్పణ జంగమంబు - వడసి తత్పూజానుభవ భజనంబు
లొడఁబడ వీరవ్రతోద్యుక్తినడువ - బుడివుల్కు వోవుచు భూసురుల్ నసఁ
బండితుఁజూచి సైపక యొక్క-నాఁడు - పండితయ్యా! నీవు పౌరాణికుఁ
సద్విజోత్తముఁడవు సచ్చరిత్రుఁడవు-విద్వాంసుఁడవు వేదవిదుఁడ వట్లయ
భూతియు రుద్రాక్షములు దాల్పనగునె-నీతియె లింగ సన్నిహితమై యున్న
పాదోదకంబుఁ బ్రసాదంబు గొనఁగ - భూదేవతార్హమే వైదిక మతమే!
హరివిరించ్యాదిసురాసుర మునిని - కరముదాల్చినవారుగలరె? మున్నాడి
ననుఁడుఁ గించిద్దరహసితాస్యుఁడగుచు-వారిఁ గనుంగొని బహు విధమ

ప్రమాణములతో విభూతి, రుద్రాక్ష, పాదోదక
లింగార్చన, లింగధారణ, ప్రసాదస్వీకరణమహిమ సిద్ధాం
ముల నెలకొల్పెనని దీక్షాప్రకరణమున సోమనాథుఁడు వి
లముగ వర్ణించియున్నాఁడు. ఇట్టి సందర్భములలో శ్రీ ప్ర
కరశాస్త్రిగారు పండితారాధ్య చరిత్రము నామూలాగ్రము
బఠించి యుండియు మల్లికార్జున పండితుఁడు లింగధారిక

యాతనిశివతత్త్వసారమున నుదాహృతమయిన శివదీక్ష లింగ ధారణ దీక్షకాదని, చేయువాదము సత్యమున కెంత దూరమో వేఱుగ వివరింప నవసరము లేదు.

బసవేశ్వరుని కాలమునాఁటికి బ్రాహ్మణులలో లింగధారణము లేదని తెలిసియో తెలియకయో వాదించు శాస్త్రిగారు తాము బాహ్మణుఁడేయని గట్టిగా నిరూపింపనెంచు సోమనాథుని మాత్రము శివదీక్షితుఁడని యందుచే నాతఁడు తన కుల గోత్రములఁ జెప్పికొనక శివదీక్షితుఁడు కాని తన మఱది పాలకురికి సోమనామాత్యునకు మాత్రము గోత్రసూత్రములఁ జెప్పెననుటలో సారస్యమేమో తెలియకున్నది. సోమనాథుని శివదీక్షకూడ వారిదృష్టిలో లింగధారణదీక్ష కాదు కాఁబోలు. కానిచో నది యెట్టిదో పుట్టిన కులమును, గన్న తలిదండ్రులను విడిచి కేవల లింగధారులగు సహజవీర శైవులలోఁ గలిసిపోయిన బసవేశ్వరునెడ సోమనాథునకంత భక్తి పారవశ్యము కలిగి యాతనిఁగూర్చి పురాణము రచించి బహువిధస్తోత్రములను బహుముఖములుగ నొనర్చి పండితారాధ్య చరిత్రమును నాతనికే యంకితమొనర్చుచునందు

"బసవని పుత్త్రుండ బసవగోత్రుండ, బసవేశు శ్రీపాద పద్మశేఖరుఁడ
బసవనిఁబొగడఁబాల్పడు కవీంద్రుండ, బసవన్నఁబొగడఁబాల్పడు పాఠకుండ
బసవన్న దూతనే బసవన్నబంట, బసవన్న యిలుపుట్టు బానిసకొడుక
బసవన్న లెంకనే బసవన్నలింగి, బసవన్న పన్నల పన్నగావునను"

ఇత్యాదిగా ననుపమేయంబగు భక్తిభావముతో భృత్యాచారముతో వర్ణించుకొనుటకుఁగల కారణమేమై

యుండునో యించుకయుఁ దెలుపరైరి. సోమనాథుఁడు శ
కులగోత్రములను జెప్పికొనిక మాన లేదు. శివకులీనుఁ డ
భృంగిరిటి గోత్రుఁడనని యనుభవసారమున నాతఁడు స్ప
ముగాఁ జెప్పికొనినాఁడు. అతనిశిష్యప్రశిష్యు లావిష
మును బాహాటముగాఁ దమ కృతులలోఁ జాటియున్నాఁ
శాస్త్రిగా ఏది తెలిసియుండియు నేమియు నెఱుఁగనట్లు తే
సమాధానము చెప్పనేరక వాని ప్రశంస చల్లఁగా జాఱవిడి
వితండవాదములకుఁ బూనుకొనిరి. ఉపనయన సంస్కారమ
నంగీకరించి, యజ్ఞోపవీతమును ధరించి, లింగధారణము కూ
నొంది గాయత్రితోపాటు శివపంచాక్షరి మంత్రముఁ జపించ
బ్రాహ్మణు లిప్పుడు తెలుఁగు దేశమున నారాధ్య బ్రాహ్మ
లను పేరితో వ్యవహరింపఁ బడుచున్నారు. పూర్వకా
మందిట్టిబ్రాహ్మణు లేపేరితో వ్యవహరింపఁబడినను న
శాఖ యొకటి బసవేశ్వరునకుఁ జాలఁ బూర్వకాలమునుం
గూడ నున్నట్లు వాఙ్మయమువలనఁ గాననగును. ఆ
శైవము దశవిధ శైవములలో శ్రౌతశైవమునకో మార్గశై
మునకో చేరునని తలంపనగును. కాని స్థూలదృష్టితో న
శైవమతస్థులకుఁ గూడ వీరశైవనామము వాడఁబడుచుం
నట్లు సోమనాథుని కృతులవలన మనకుఁ గాననగును
నేఁటి వ్యవహారము ననుసరించి యీ లింగధారిబ్రాహ్మణు
కారాధ్యబ్రాహ్మణ పదమునే నేనిం దుపయోగించితిని
పండితారాధ్యచరిత్రమునకు శ్రోత్రియగు పాలకురికి సూరన
మాత్యుఁడు వీరపోచేశ్వరుఁడను గురునియొద్ద లింగధారణము

నొందిన యారాధ్య బ్రాహ్మణుడని సోమనాథుని వర్ణనముల వలననే వ్యక్తము కాఁగలదు. లింగధారులుకాని భవులు బ్రాహ్మణులైనను మఱే కులమువారైనను సోమనాథుని వంటి యఘోరవీరశైవాచారధౌరేయునకు వారితోఁ బొత్తు గుదురుట గలలోనైనఁ గలుగనేరదు. ఆనాఁటి యారాధ్య బ్రాహ్మణులు నేఁటి కాలపువారివలెఁగాక భవులగు బ్రాహ్మణులతో నెట్టి సంబంధము లేక సహజవీరశైవులతోనే యెక్కువ సాహచర్యము గలిగియుండెడివారు. అందుచే నాయిరు తెగల వారుకూడ నక్కాలమున నలిలేనిమచ్చికతో మెలఁగుచు నిచ్చి పుచ్చుకొను సంబంధము లేకున్నను బరస్పర ప్రేమ గౌరవములతో నొకరినుండి యొకరు విద్యాదికముల గ్రహించు చుండిరి. అందుచేతనే మల్లికార్జున పండితుఁడు "భక్తి మీఁదివలపు. బ్రాహ్మ్యంబుతోఁ బొత్తు! పాయలేను బసవ! పాయలేను" అని యాక్రోశించి బసవేశ్వరునివలెఁ గేవల వీర శైవులలోఁ గలియకపోయినను బసవేశ్వరునం దఖండ భక్తి గౌరవములను గలిగియుండెను. బసవేశ్వరుఁడుకూడ నాతనిఁ గూర్చి యట్లేవర్తించుచుండెను. సోమనాథ సూరనామా త్యులుగూడ వేర్వేఱు కులముల వారైనను నిట్లే యన్యోన్య సౌహార్దములతో మెలఁగుచుండిరి. వారిరువురుగూడ బ్రాహ్మణులేయని చెప్పుటలో సత్య మిసుమంతయు లేదు. శ్రీ నాగేశ్వరరావుగారు చెప్పినట్టు లారాధ్య బ్రాహ్మణులకుఁ గేవల వీరశైవులకు శివార్చనావిషయమునఁ జాల వఱకు సాధర్మ్యమున్నను నారాధ్య బ్రాహ్మణులు శివపూజా

సమయమున నంది భృంగి మున్నగు ప్రమథుల నాహ్వాని
స్మరించినను గోత్రసూత్ర వ్యవహారములలో వా రనా
నుండియు స్మార్తబ్రాహ్మణులనే యనుసరించుచున్నా
భృంగిరిటి గోత్రు లారాధ్యబ్రాహ్మణులలో నప్పుడు
యిప్పుడుగాని యెప్పుడును లేరు. పంతులుగారు సోమనాథు
బసవేశ్వరు నందలి వ్యామోహము హెచ్చిన తరువాత రా
రాను అనుభవసారరచనము నాఁటికి భృంగి గోత్రము
జెప్పికొనెననుట సరికాదు. గ్రంథనామమునుబట్టి పంతు
గారు అనుభవసారమును సోమనాథుఁడు కడపటి దశ
రచించిన గ్రంథమని భ్రమించిరేమోఁకాని నిక్క మా
చింప నది యంతస్స్వాతంత్ర్యమునుబట్టి యాతనిప్రాథమికకృతిగ
గానవచ్చును. ఆగ్రంథరచనమునాఁటికిఁ గర్ణాటదేశస్థుఁ
బసవేశ్వరునిఁ గూర్చిన విశేషములుగాని యాతని గ్రంథము
తోడి పరిచయముగాని సోమనాథునకుఁ గలిగి యా
యందంతగా భక్తి కుదిరినట్లు కానరాదు. అప్పటికాతఁ
భాషాప్రవీణుఁడు, చతుర్వేదపారగుఁడునై యుండెఁడు.
పురాణములను గొంతవఱకభ్యసించి కవిత్వమును
యాంధ్రదేశీయుఁడగు మల్లికార్జున పండితుని శివతత్త్వసా
దులను బఠించి యాతనియందు భక్తిగౌరవములను
యుండును. అందుచేతనే యనుభవసారములో బసవేశ్వ
పైనైన నెత్తక మల్లికార్జునపండితుని మాత్రము
సీసపద్యములలో నిట్లు స్తుతించి యున్నాఁడు.

సీ. శ్రుతి "యేక ఏవ రుద్రో న ద్వితీయాయ
తస్థే" యనుట యథార్థంబు దలఁప
నవల " నణోరణీయాన్మహతో మహీ
యా" నన నదియె యనూనపదము
పంబి "యవాఙ్గోచరం" బను "నప్రాప్య
మనసా సహ" యనుమాట నిజము
ఏదియుఁగాదని యెడిపరమేశుఁడే
యొంతయునని యెర్గి యెఱుఁగననక

ఆ. వె. యెట్టులనుచు సంశయింపక శివతత్త్వ
సారగద్యపద్య సమితిశివుని
మహిమ చెప్పినట్టి మల్లికార్జునపండి
తయ్యగారిఁ దలఁతు ననుదినంబు.

సీ. "వేదముల్ ధర "సర్వవేదేష్వతో భవతి"
యనఁగఁబరఁగు లింగ మతిశయిల్లు
నెటి "శ్వపచోపిమునిశ్రేష్ఠయస్తు లిం
గార్చనే రత" యనన ట్లునమ్మి
ప్రీతి "సరుద్రైవ భూతలే" యని "తత్ర
సన్నిహితశ్శివ "యన్నయదియు
తగ "సచపూజ్యో యథాహ్యహ" మ్మనఁగను
నేత్రాంగకక్రియా పాత్రమగుచు

ఆ. వె. జంగమంబు గాంచి, చని లింగపరవశ
భాతి నుభయలింగ భక్తి యుక్తి
మహిమఁ దనరినట్టి మల్లికార్జున పండి
తయ్యగారిఁ దలఁతు ననుదినంబు.

సీ. ఆది "రుద్రేణాత్త మన్నంతి రుద్రేణ
పీతం పిబంతి" ప్రఖ్యాత శ్రుతుల
అన్నిగమాంతార "మతికిల్బిషం స్యాద
నర్పితం" బనెడు సిద్ధాంతములను

అవికల సిద్ధాంత నివహోక్తి "లోభాన్న
ధారయే" త్తను శివ ధర్మములను
శివ ధర్మశాస్త్రదృష్టిఁ "బ్రసాద మేవ భో
క్తవ్య" మను పురాణ కాండములను

ఆ. వె. సిదమనుచు వేద సిద్ధాంత శాస్త్ర పు
రాణ తతుల మల హరప్రసాద
మహిమ దెలిపినట్టి మల్లికార్జున పండి
తయ్యగారిఁ దలఁతు ననుదినంబు.

బసవేశ్వరునియందు వ్యామోహము ముదిరిన చ
వయస్సులోనే యాతఁ డీ గ్రంథము రచించియున్నచో బ
శబ్ద శ్రవణముననే మయిమఱచునంతటి పారవశ్యస్థితికి గడ
యాతఁడిందు బసవేశ్వరుని నామస్మరణమయినఁ జేయక
టకుఁ గారణము కానరాదు. కావున నాతఁడీ గ్రంథము
బసవనిఁగూర్చి యంతగా నెఱుఁగని ప్రథమవయస్సులో
రచించియుండు ననుట సంభావ్యము. బసవేశ్వరునందు భ
పారవశ్యము గలిగిన పరిణతప్రాయములో రచించిన పండి
రాధ్యచరిత్రమునం దాతఁడు బసవనిఁగూర్చి చెప్పికొనిన "
వనిపుత్త్రుండ బసవగోత్రుండ" ఇత్యాది సంబంధవిశేష
లను బయిని బేర్కొనియే యుంటిని. బసవేశ్వరు నీతఁడు స్వ
ముగా నెఱిఁగిన సమకాలీనుఁడు కాఁడని కాలనిర్ణయము
గూర్చిన ప్రకరణమున ముందు నిరూపింపఁబడును. ఇతఁడు బ
వని పుత్త్రుఁడు కానట్లే తద్గోత్రుఁడునుగూడఁ గాఁడు. ఆ విశే
షములన్నియు నాతఁడు భక్తిపారవశ్యమునఁ జెప్పికొన్న వేగ
మఱొకటి కావు. అసలు బసవఁడొక గోత్రకర్త కానేకాఁడు

బసవగోత్రిమనునది యెప్పుడు వీరశైవులలోఁగాని తదితరులలోఁగాని వ్యవహారమున లేనేలేదు.

ధూర్తవిప్రుఁడు నిందాపరముగ నుపయోగించిన 'పతిత' శబ్దము సోమనాథుని బ్రాహ్మణ కుల జననమును దదుపరి జరగిన యాతని యన్యమతస్వీకారమును సూచించునని శ్రీ నాగేశ్వరరావుపంతులుగా రభిప్రాయపడుట సరిగాదు. బ్రాహ్మణుల నీతఁడు త్రాటిమాలలు, పచ్చిమాలలు, కర్మచండాలురని నిరసింపఁగా వాదమున నాతని నోర్వలేక కొందఱు విప్రులు నీవంతకన్న మాలవనియో, పాపివనియో నిందించి యుందురు. అట్టి నిందావాచకసూచకముగనే పిడుపర్తి సోమనాథుఁడు "పతిత" శబ్దమును దన పద్య బసవపురాణావతారికలో "ధూర్త విప్రుఁడొకఁడు భర్త్సఁజేరి, పాలకురికి సోమపతితుఁ డీనడుమను, బెనచె మధ్యవళ్ళు పెట్టి ద్విపద" అని యతిస్థానమున నుపయోగించియుండెను. పాల్కురికి సోమనాథుఁడు కేవలము పాపి శబ్దపర్యాయముగనే యీ శబ్దము నాతని కృతులలో నుపయోగించినట్లు కాననగును. చతుర్వేదసారమునందలి యీ క్రింది పద్యమును జిత్తగించునది.

సీ. గిరిజేశునకు "నతః పరమున్నదే" "నాస్తి
లింగాత్పరం" బని లీలమ్రోయు
మృడునకును సరిగలఁడె "నభూతోనభ
విష్యతి" యనుచు సద్వ్యాప్తిఁ బలుక
హరుఁడు సాధారణుండనఁగను గూడునే
"స్థాణుంత్యజో" యనియెడు సూక్తి మొఱఁగి

భవు నొరుంబోల్పఁ బాపంబుగాదె "పతంతి
యమశాసనే" యన నట్లుమఱియు
ఆ. వె. శ్రుతి శిరస్సమూహి "పతిరేకయానీ" త్త
నుచు వచింప దుర్గుణులు మదించి
యితర సురలఁబట్టి పతితులు సన్ముక్తి
బాహ్యులగుటదేమి? బసవలింగ!

పండితారాధ్యచరితమున దీక్షాప్రకరణమున విభ
మహిమ సిద్ధాంత సందర్భమునఁ బ్రియుక్తము లయిన "
త్యేవ న సంశయః" "పాతిత్యం యాతి తత్ క్షణాత్" మున్న
స్మృతి పురాణ ప్రమాణములు గూడ "పతిత" శబ్దమున
యర్థమునే సూచింపఁగలవు. కావునఁ "పాల్కురికి సోమ
తుఁడు" అను ధూర్తవిప్రుని నిందయందలి "పతిత" శబ్ద
సోమనాథుని బ్రాహ్మణకుల జననమును సాధింపఁజాలదు.

సోమనాథుఁడు స్వయముగా వ్రాసిన పద్యములఁ
సుస్థాపితమగుచున్న యాతని సహజ వీరశైవత్వమును గ
నుటకు శ్రీనాగేశ్వరరావుపంతులుగారు, ప్రభాకరశాస్త్రిగా
నిరువురుగూడ విద్యావిషయికమగు బ్రాహ్మణాఽబ్రాహ్మ
ప్రశంస నెత్తికొనుట శోచనీయము అందునను వీరశైవ
బ్రాహ్మణులకన్న నన్నివిధముల నధికులని ప్రతిపాదించు
బలురీతుల బ్రాహ్మణుల నిరసించు సోమనాథుని విషయ
ననా? యిట్టి యభాగ్యవాదమును గయికొనుట! ద్విజుల
యన సంస్కారమునఁ గలుగు నధికారములన్నియు లింగ
రణ దీక్షవలననే, తమకుఁ గలుగునని వీరశైవుల సిద్ధాంత

వారికి లింగమే యజ్ఞోపవీతము, "లింగయజ్ఞోపవీతినే శివ లాంఛనధారకాయ" అని వీరశైవపంచాచార్య పూజామంత్రము లుద్ఘోషించుచుండును, "దీయతే లింగసంబంధః। క్షీయతే చ మలత్రియమ్, "దీయతే క్షీయతే యస్మా । త్తస్మాద్దీక్షేతి కథ్యతే" అని వీరశైవాగమపురాణములలో దీక్షాశబ్దము నిర్వచింపఁబడినది. వేధామనుక్రియాత్మకమగు త్రివిధ దీక్షలచే, ఆణవ కార్మిక మాయా మలములను త్రివిధమలములు విదగ్ధములయి సదాశుచిత్వము ప్రాప్తించునని వీరశైవ సిద్ధాంతము. బ్రాహ్మణులలో స్త్రీలకుపనయన సంస్కారము లేదు. పురుషుల కయినను గర్భాష్టకమునఁ గాని యది జరగదు. వీరశైవులలో స్త్రీపురుషు లిరువురకుఁ గూడ లింగధారణ దీక్ష విధింపఁబడినది. పుట్టిన శిశువునకుఁ గూడ సాధారణముగా నిరువదియొక్క దినముననే యీ దీక్షచేయుదురు. కొన్నియెడల శిశువు గర్భమున నున్నప్పుడే యాశిశువు నుద్దేశించి తల్లికి మఱొక ప్రత్యేక దీక్షకూడఁ జేయఁబడునని తెలియుచున్నది. ఇత్యాది కారణములచే "ఆజన్మశుద్ధానామ్" అనునది వీరశైవులకే యెక్కువగ వర్తించును. నిగమములు (వేదములు) శివుని నిశ్వాసజనితములనియు, ఆగమములు మదనసంజనితములనియు, శైవగ్రంథములలోఁ జెప్పఁబడినది. వీరశైవ పంచాచార్యులు కూడ శివుని పంచవదనముల నుండి యుద్భవించిన వారని సుప్రబోధాద్యాగమములు చెప్పుచున్నవి. కావున నిగమాగమములకు వీరశైవులకు సాజాత్యము స్వతస్సిద్ధము. బ్రాహ్మణులకు శృంగభంగము కలుగునట్లు హావినహళ్ కల్లిదేవయ్య

మున్నగు వీరశైవులు తమ యింటి కుక్కలచేఁ గూడ వే
ములఁ జదివించినారని సోమనాథుఁడు బసవపురాణమున ప్ర
నాఁడు. సహజవీరశైవులగు జంగములలో వేదవిద్యా
న్నులు పూర్వము పలువు రుండెడివారు. ఇప్పుడు గూడఁ గ
దేశమున వీరశైవులు నిర్వహించుచున్న వేదపాఠశా
గలవు. ఇట్టి పరిస్థితులలో సోమనాథుని చతుర్వేదపారగత్వ
అద్వితీయ వైదుష్యము, నాతని సహజవీరశైవత్వమునకు
కములని వాదించుట వట్టి బేలతన మని చెప్పనక్కఱ
మైసూరు ప్రాంతమందలి కెళది (Keladi in Shimoga Dist
సంస్థానమును బరిపాలించిన ప్రభువులు వీరశైవులు. వా
బసవప్ప నాయకుఁడు క్రీ. శ. 1700 ప్రాంతమున రచి
శివతత్త్వరత్నాకరమను సంస్కృత గ్రంథ మాతని యద్వి
పాండిత్యమున కాదర్శముగ నున్నది.

చతుర్వర్ణములలో నుపనయన సంస్కారము
శూద్రులు తప్ప మొదటి మూఁడు వర్ణములవారగు బ్రా
క్షత్త్రియ, వైశ్యులు ద్విజులని వ్యవహరింపఁబడుదురు.
ముప్వురకుఁ గూడ వేదాధికారము గలదనియే భారతదేశ
ననూచానముగ నేర్పడిన వ్యవహారము. క్షత్త్రియు
లశ్వమేధాద్యాగము లొనర్చి విఖ్యాతి నొందిన విషయ
సర్వవిదితము. ఉపనయనమునకు బదు లంతకన్న నె
నిబంధనములతో లింగధారణ దీక్షనొందు వీరశైవులు
ద్విజులుగనే గణింపఁబడుదురు. వీరశైవులు బ్రాహ్మణుల
నధికులని పవిత్రులని మాటిమాటికిని జాటు సోమనాథుఁడు

శైవు లబ్రాహ్మణులని, వారికి వేదాధికారము లేదని యెట్లు తలంపఁగల్గును ? బ్రాహ్మణేతరులకు వేదాధ్యయనాధికారము లేదని సోమనాథభాష్యమున సోమనాథుఁడు చెప్పెనని ప్రభాకర శాస్త్రిగారు వ్రాయుట మిక్కిలి పొరపాటు. సోమనాథ భాష్యమునుండి వారుదాహరించిన పంక్తులనే చిత్తగింపుఁడు. ప్రసాదస్థల మాహాత్మ్య ప్రకరణమున.

"అశుద్ధాత్మాఽశుచి ర్లోభా న్మద్భుక్తం పావనం పరం
భక్షయ న్నాశ మాయాతి శూద్రో హ్యధ్యయనాదివ"

ప్రాచీనాచారము ననుసరించి శూద్రులకే వేదాధ్యయనము చెల్లదని సోమనాథుఁడు చెప్పినాఁడు కాని బ్రాహ్మణేతరుల కని చెప్ప లేదు.

సోమనాథభాష్యమునందలి గాయత్రీప్రశంస సోమనాథుని బ్రాహ్మణత్వమునకుఁ బ్రబలసాధకమని ప్రభాకర శాస్త్రిగారు వ్రాసిన సంగతి కూడఁ బరిహాసాస్పదముగ నున్నది. ఉన్న విషయములను సరిగా వివరింపక శాస్త్రిగారు దమకుఁ దోఁచిన విషయములను సిద్ధాంతములుగాఁ జెప్పఁబూనుట మహాసాహసము. సోమనాథ భాష్యమున "భర్గశబ్ద నిర్వచన"మను ప్రకరణమున "గాయత్రీ హృదయ మకరోత్తత్పదం చింతయామః" అని ప్రారంభించి, సకల కర్మలయందును సంకల్పఫలప్రదుఁడు పరమేశ్వరుఁడనియుఁ, గావున జపకర్మప క్రమముల కెల్ల నధిపతియగు నా పరమేశ్వరునిఁ గూర్చిన జపానుష్ఠానముల కర్తృ ములయిన మంత్రములఁ జెప్పెదనని వచించి "నారాయణోపనిషత్సు —

ఓమ్‌నమశ్శివాయేతి శతరుద్రీయ మధ్యగా నమశ్శివా
గాయత్రీ మంత్రః ప్రతిపాదయతి" అని యుదాహ
"గాయంతం త్రాయత ఇతి గాయత్రీ" (జపించు
రక్షించునది) అను నిర్వచనమునకు వాస్తవముగ లక్ష్య
నది "నమశ్శివాయ" యను పంచాక్షరీ మంత్రమే యని
నాథుడు వచించి మఱియు నీ పంచాక్షరీ విద్యయే
శ్రుతిశిరోగతమయినదనియు, సప్తకోటిమహామంత్రములు
మంత్రములు నిందే విలీనమయి వినిర్గతము లవుచుండు
వాక్రుచ్చి "అముష్య మంత్రస్య చ వైదికత్వాత్
తత్త్వస్య చ వాచకత్వా న్నమశ్శివాయేతి సదా జ
అని ముగించి, "అథగాయత్రీ ప్రకరణం కథయామః"
యుపక్రమించి "తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీ
ధియో యో నః ప్రచోదయాత్" అని బ్రాహ్మణులు
వారు జపించు నీ గాయత్రీ మంత్రమునకుఁగూడ
కొందఱు తలఁచునట్లు సవితృఁడు (సూర్యుఁడు) గాక
వాచ్యుఁడగు శివుఁడే యనియుఁ బ్రతిపాదించుచు "
శ్రుతి స్మృతి పురాణాగమేతిహాసవచనప్రమాణాత్
తు ర్వరేణ్యత్వా ద్ధియః ప్రేరకత్వాత్ శివవాచకత్వా
శబ్ద వాచ్యః పరమేశ్వర ఏవ తథాదిత్యాది దేవతాంతర
వతి॥ అతఏత ద్గాయత్రీ మంత్రాధి పతిః పరమేశ్వర
పర్యవసానమును దేల్చినాఁడు. దీనిని బట్టిసోమనాథుని
యము చదువరులకు గోచరము కాకమానదు. వీర
జపించుపంచాక్షరి యొక్కటియే మంత్రరాజమనియు ని

గాయత్రీశబ్దవాచ్యమయిన దదియే యని నిరూపించుటయు "తత్సవితుర్వరేణ్యమ్......" అను ప్రకరణాంతరగాయత్రికిఁ గూడ శివుఁడే యధిదేవతయగుటచే- దానిని జపించువారు గూడ శివభక్తివిదూరులవుటకుఁ గారణము లేదనుటయు నాతని యాశయమని తెల్లమగును. అంతియేగాని, యీ రెండవ గాయత్రి మాత్రమే యనుష్ఠేయమని గాని వీరశైవులకు విహితమయిన పంచాక్షరికన్న నది మిన్నయనిగాని, నిరూపించుట యాతని యుద్దేశమెంత మాత్రమునుగాదు. చతుర్వేద సారమందలి యీ క్రింది పద్యము గూడ నాతని భావమును విశదము చేయఁగలదు.

సీ. "తప్పక నిత్యంబు "తత్సవితు ర్వరే
ణ్య"మని ప్రాణాయామ మాచరించి
తప్పక నిత్యంబు "తత్సవితు ర్వరే
ణ్య"మని ముమ్మాఱు దా నర్ఘ్యమెత్తి
తప్పక నిత్యంబు "తత్సవితు ర్వరే
ణ్య"మని గాయత్రి దినంబుఁజెప్పి
తప్పక నిత్యంబు "తత్సవితు ర్వరే
ణ్య"మని తాహవ్యక వ్యములు పెట్టి

తే. పె. ప్రణవమూర్తి భర్గుఁబరితృప్తుఁ జేసి త
త్ఫలము నీశుచేతఁ బడసి యితర
సురలఁ గొల్వభక్తి సుస్థిరంబై క్రియా
ఫలము సఫలమగునె బసవలింగ!"

పూర్వులు సోమనాథుని నారాధ్య నామముతోఁ బేర్కొనుట యాతని సహజవీరశైవత్వమునకు సాధకమే గాని బాధకమెంత మాత్రమును గాదు. శైవులయిన బ్రాహ్మణులకే

4

యానా॰ డారాధ్యనామము చెల్లెనని ప్రభాకరశాస్త్రిగా
తలంచుట సరిగాదు. వీరశైవ పంచాచార్యు లందఱు నారా
పద సంకలితులే కావున వారి సంతతియగు సహజవీరశై
చార్యులకే మొదట నారాధ్య శబ్దము వ్యవహరింపఁ బడు
వచ్చినది. ఆరాధ్యపదసంకలితులగు నీ వీరశైవాచా
మతాచారధర్మములను గొన్ని బ్రాహ్మణధర్మములకుఁ దోడు
స్వీకరించిన శైవబ్రాహ్మణులు తక్కిన బ్రాహ్మణుల ను
వివక్షింపఁ బడుటకే వారుగూడ నారాధ్య విశేషణము
జేర్చికొను చుండిరి. సోమనాథుని శిష్య ప్రశిష్య కోటికిఁ జె
యాతనిని దమకులగురువుగా నారాధించుచు వచ్చిన పిడుప
కవులు జంగములు. వారి సంతతివా రిప్పటికిని గుంటూ
జిల్లాలో నివసించు చున్నారు. ఈ పిడుపర్తి కవులలోఁ బ
బసవపురాణకర్తయగు పిడుపర్తి సోమనాథకవి పాల
వంశ్యుఁడును సోమనాథ నామాంకితుఁడు నగు తన బావమ
దిని బేర్కొనుచు నాతనికి నారాధ్య నామమును జేర్చినా
ఈ క్రింది పద్యము చూడుఁడు.

మ. "స్మయ మాయాదివికారదూరు శివపూజా మాతులుఁ మాతులుఁ
బ్రియసంభాషణ భూషణుఁ షడరి భీభిద్భావుకుఁ భావుకుఁ
దయ నన్నక్షర దక్షుఁజేసిన మహాధన్యాత్ములఁ భక్తితో
నయగారప్పయ గారిఁ బాల్కురికి సోమారాధ్యులం గొల్చెదఁ."

మఱియు నీతని తమ్ముని కొడుకు పిడుపర్తి బస
కవి తన పద్యప్రభు లింగలీలను భృంగి గోత్రుఁడగు చల్ల
మల్లయ యను జంగమున కంకితము గావించి కొన్ని పద్య
లలో నాతనిని "మల్లా రాధ్యా" యని సంబోధించినా

కావున నప్పటి వాఙ్మయమును బట్టి చూచిన సహజ వీరశైవు లగు జంగములు నారాధ్య బ్రాహ్మణులు కూడ నారాధ్య పదమును దమ పేళ్ళచివరఁ జేర్చికొనుచుండినట్లు కానగును. ఇంతకు నారాధ్య శబ్దము పూజ్యవాచకము. ఆరాధింపఁ దగిన వాఁడనియే దాని యర్థము. శిష్య సంతతిచేఁ బూజింపఁ బడు ధర్మ మీా యిరు శాఖల వారికిఁ గూడ సామాన్యమే.

"శ్లో॥ ఆగమార్థానుసంధాతా రాగ మోహాది వర్జితః
ధ్యానజ్ఞానసమాయుక్తః; ఆరాధ్య ఇతి గీయతే॥"

అని యారాధ్యశబ్దము కొన్నియెడల నిర్వచింపఁబడినది. కావున నిది కులవాచకము కానేకాదు. "ఆరాధ్యుల" అను గృహనామముగల వీరశైవులును,జంగములును,"పరమారాధ్యుల"అను గృహనామముగల జంగములును (మఠస్థులు) గోదావరీమండలముననను, నిజాం వరంగల్లు మండలముననను నిప్పుడుగూడ నున్నారు. ఈయారాధ్య నామము నితర మతాచార్యులు కూడఁ గొందఱు చేర్చికొని యుండవచ్చును. శక వత్సరము 1670 నాఁటి మాధ్వాచార్యుఁన కొకనికి "ఆరాధ్య తీర్థాచార్య" అనుపేరు వాడఁబడియున్నట్లు మెకంజివ్రాఁతప్రతులలోఁ గలదని శ్రీ. డా॥ చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్యచరిత్ర పీఠికలో వ్రాసినారు. "ఆరాధ్యుల" అను నింటిపేరుగల తెలగాలను (కాఁపులను) గూడఁ గొందఱను అమలాపురము తాలూకాలో నేను గుర్తించియున్నాను.

తాటిమాలలు, పచ్చిమాలలు, కర్మచండాలురు నని సోమనాథుఁడు చేసిన బ్రాహ్మణ నిందకూడ సోమనాథుని

బ్రాహ్మణత్వమునకు బాధకరము కానేరదని ప్రభాకరశాస్త్రి గారు తలంచుట యాశ్చర్యము. వారి యభిప్రాయ ప్రకారము సోమనాథుఁడు వాస్తవముగ స్మార్తబ్రాహ్మణ సంజాతుఁడయి బ్రాహ్మణులయందు గౌరవము కలవాఁడైనచో బసవేశ్వరాదికథా పాత్రములచే వారి నిట్టినీచపదములతోనే మేల నిందింపఁ జేయవలెను? వారేయే పదము లుపయోగించిరో తాను స్వయముగాఁ జూచియుండెనా? ఏసామాన్య నిందావాచకములనో యుపయోగించి కథ సాగించుట కాతనికి సాధ్యము గాకపోయెనా? ఎందుకీ వితండవాదము? సోమనాథుఁడు తానుగూడ బసవేశ్వరమతావలంబియాయి కావుననే యిట్టి తిట్లను దానే స్వయముగఁ దన గ్రంథములలో వాడె ననుటయే సత్యసమ్మతము. ప్రభాకర శాస్త్రిగారెట్లు తలంచినను నీ బ్రాహ్మణనింద సోమనాథుఁడు స్వయముగఁ దాను నోరారఁజేసినదే యని శ్రీ చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్యచరిత్ర పీఠికలో నంగీకరించినారు. బసవపురాణముననేగాని పండితారాధ్యచరిత్రమున నిట్టితిట్లులేవని ప్రభాకరశాస్త్రిగారువ్రాసినది మఱింతదబ్బర. పండితారాధ్యచరిత్రమున మల్లికార్జున పండితుని నోట సోమనాథుఁడు పలికించిన యీక్రిందివాక్యములు చూడుఁడు.

......లింగప్రసాదవిదూరు। లవువేద భారభ రాక్రాంతయనవగవ "సవై బ్రాహ్మణ గార్దభ"యనసె।గడిశ్రుతుల్ మోపరి గాడ్దలై బ్రోబడినబ్రాహ్మణ గార్దభంబులకంటెఁ। గర్మచండాలుర కంటెనామ్నాయనిర్మాణ మెఱుఁగంగ నేరరోయట్లు। దగుశ్రుతి మతము నాద్యస్వీకృతంబునగుప్రసాదంబు నర్సామె॥"

"తామసులగు శాపదగ్ధవిప్రులకు। సామాన్యులకుఁ గర్మచండాలురకును"
(దీక్షాప్రకరణము)

"కుక్కయేయిదిదీనిఁ గుక్కయన్ త్రాటికుక్కలుభువిఁజెడ్డ కుక్కలు కాక"
(మహిమప్రకరణము-నంబెన్నకథ)

ఈలిట్లు బసవపురాణమందలి నిందలను మీఱుచున్నవి. అందు త్రాటిమాలలు పచ్చిమాలలు ననియుండ, నిందు నంత కంటె నీచముగఁ ద్రాటి కుక్కలు గాడిదెలు ననికూడ నింద గావింపఁబడినది. ఇంతకు నిట్టి నిందలు శివభక్తివిదూరులగు భవిబ్రాహ్మణులఁగూర్చి యానాఁడు సహజవీరశైవులు నారాధ్యబ్రాహ్మణులు నిరువురుగూడ సామాన్యముగ నాచ రించినవే యని మనము తలంపనగును.

ఇఁక శాస్త్రిగారు నేఁటి జంగమజాతి సోమనాథుని కాలము నాఁటి కేర్పడనేలేదని మొదటికే మోసము గల్పిం చుచు వ్రాసిన వ్రాఁత యాలోచింతము. జంగమ శబ్దము ప్రాచీన వాఙ్మయమునఁగులవాచకముగఁగాక చరలింగ వాచ కముగనే యుపయోగింపఁబడెనని నేనుగూడ నంగీకరించియే యుంటిని. అంతమాత్రముచే సహజ వీరశైవులలో నేఁడు జంగము లను సంకేతముతో వ్యవహరింపఁబడు గురుపీఠ వర్గమువారు బసవేశ్వరుని కాలమునాఁటికి లేరని తలంచుట కెట్టి యవకాశములును లేవు. మఠస్థులనిగాని, మాహేశ్వరు లనిగాని, లేక కేవలము వీరశైవులనియేగాని, యే పేరితో వ్యవహరింపఁబడుచుండినను సహజవీరశైవులగు భక్తమాహే శ్వరు లాంధ్ర కర్ణాట దేశముల బసవేశ్వరునకుఁ బూర్వము చాలఁ బ్రాచీనకాలము నుండియే వెలయుచుండినట్లు శైవాగ

మములను బట్టియు, నితరవాఙ్మయమును బట్టియు. సుస్ప
క్తము కాఁగలదు. ఇతర గ్రంథములను వేనిని బరిశోధిం
కున్నను సోమనాథుని కృతులను బట్టియే దానిని సులభముగ
నెఱుంగనగును.

బసవేశ్వరుఁడు బ్రాహ్మణ వంశముననే జనించి
వాఁడు. అతని తండ్రి మండంగి మాదిరాజు బసవపురాణము
స్పష్టముగఁ జెప్పకున్నను సామాన్యశైవుఁడగు స్మార్త
బ్రాహ్మణుఁడో లేక యిష్టలింగధారి యగు నారాధ్య
బ్రాహ్మణుఁడోయై యుండుననని చదువరులకు గోచరిం
చును. అనూచానాచారము ననుసరించి యెనిమిదవ
యేట నుపనయన మాచరించుటకుఁ దండ్రి సంకల్పింపగా
బసవేశ్వరుఁ డాతనితో వాదించి యుపనయనవిధిని బహు
విధముల ఖండించి కర్మాతీతుఁడగు తనకు శివునికంటె వేఱు
దైవము, శివపంచాక్షరికంటె జపింపఁదగిన మంత్రరాజము
లేదని వచించి, పుట్టిన కులమును, గన్న తలిదండ్రులను విడ
నాడి వెడలిపోయిన సంగతి బసవపురాణ పాఠకుల కందఱకు
దెలిసిన విషయమే. దీనినిబట్టియే బసవేశ్వరుఁడు వలచి యవ
లంబించిన మతము సామాన్యశైవముగాని, యారాధ్య
బ్రాహ్మణ సంప్రదాయమునకుఁ జెందినదికాని, కాదనియు నవి
దశవిధశైవములలోని వీరశైవమే యనియుఁ దెల్లముకా
మానదు. కావున దేశమున నదివఱకే సహజవీరశైవులు
లేకున్నచో బసవేశ్వరుఁడు జనకులను దన్మతస్థులను ద్యజించిన
తరువాత మతేకులమువారితోఁ జేరియుండును? బసవేశ్వరుని

దృఢవీరభక్తికి సంతసించి యాతని మతమునే యామోదించి తన తనయ నాతనికే పరిణయ మొనరింతునని ప్రతినగావించిన యాతని మేనమామ బలదేవమంత్రి నెఱవేర్చిన బసవేశ్వరుని కళ్యాణము సందర్భమున సోమనాథుఁడు వ్రాసిన యీ క్రింది పంక్తులఁ జిత్తగింపుఁడు.

"రండు భక్తులఁ బిలువుండు మీ రెదురు
వొండు వేగమతోడి తెండు తెండనుచు
నెటవచ్చునయ్యల కెదురువచ్చుచును
నటవచ్చు నయ్యాల కర్థిమొక్కుచును
సింహాసనస్థులఁజేసి యా కర్మ
సంహారమూర్తుల చరణముల్ గడిగి."

ఇందుదాహరింపఁబడిన కర్మసంహారమూర్తులగు నయ్యలు, భక్తులు, నేఁటి జంగములు, లింగధారులువంటి సహజవీరశైవులుగాక మఱెవరయి యుందురు? కాదనువారు వారెట్టివారో వారితో బసవేశ్వరునకుఁ బొత్తెట్లు పొసఁగెనో నిరూపింపఁదగును. అట్లొనర్పక యూరక కాదన్న లాభము లేదు. సోమనాథుఁడు పేర్కొన్న "అయ్యలే" యాతని కుల మునకుఁ జెందిన మాహేశ్వరులు. వారినే నేను జంగములని నేఁటి వ్యవహారము ననుసరించి పేర్కొన్నది. ఇప్పుడుగూడ వీరశైవులలోని భక్తవర్గమువా రాకులము వారిని "అయ్య" లని వ్యవహరించుచుందురు. కావున సోమనాథునికాలము నాఁటికి నిట్టి జాతియే లేదను వితండవాదము నెవరును విశ్వ సింపఁజాలరు.

శ్రీ చిలుకూరి నారాయణరావుగారు ప్రభాకరశాస్త్రి గారి వాదముపయి నేను వెలువరించిన విమర్శనముల నవ కించియుఁ బండితారాధ్యచరిత్రపీఠికలోఁ గొన్ని యసం ప్రసంగముల వెలువరించుట శోచనీయము. వీరి యూహ సర్వసాధారణముగఁ దృతీయపంథ నవలంబించుచు "శ్రో యొక వింత ప్రాఁత యొక రోఁత" యను సూత్రమును భజించు వింతదారులఁ దొరికి్కుచుండును. బసవేశ్వరునకుఁ బూర్వ బ్రాహ్మణులలోను బ్రాహ్మణేతరులలోను గూడ లింగధా దీక్షనొందెడి యాచార మున్నదని, మల్లికార్జున పండి రాధ్యుఁడు బసవపురాణపండితారాధ్యచరిత్ర శ్రో గొబ్బూరి సంగనామాత్య పాల్కురికి సూరనామాత్యు లింగధారులే యని వీరంగీకరించిరి. కాని నాఁడు జంగము గాని, యారాధ్య బ్రాహ్మణులనిగాని, పిలువఁబడు శాఖలే యుండలేదనియు "శివద్విజులు" అని పిలువఁబడు శై బ్రాహ్మణు లుండెడివారనియు, వారిలో సన్న్యాసమును గ కొని వర్ణాశ్రమాచారముల విసర్జించి వీరశైవ మత ప్రచా ఘమునకుఁ బూనికొనిన వారిని జంగములని వ్యవహరించు రనియు, అట్టి శైవబ్రాహ్మణ సన్న్యాసులలోనే నంది, భృ మున్నగు ప్రమథపరమయిన గోత్రవ్యవహార ముండియుం ననియు, సన్న్యాసమును గ్రహింపని శైవబ్రాహ్మణుల మాత్రము ఋషిగోత్రసూత్రవ్యవహారమే యుండెడి దనియు పాలకురికి సోమనాథుఁడు పూర్వాశ్రమమున నీశైవబ్రాహ్మ కులమునకుఁ జెందియుండి సన్న్యాసము స్వీకరించి, జంగమ

డయిన తర్వాత భృంగిరిటి గోత్రమును జెప్పికొని, సన్న్యాసమును స్వీకరింపని తన ముద్దు మఱఁది సూరనామాత్యునికి హారితసగోత్రమును జెప్పెననియు వీరి వాద సారాంశమయి యున్నది. ఈ సందర్భముననే యెడనెడ వీరు సంశయాత్మకములుగ నీక్రింది వాక్యములు లిఖించియున్నారు.

(1) యతులైన జంగములు ద్విజులలో ఎవ్వరయినాసరే పూజ్యులే. అయినా, సోమనాథుని కాలము నాటికి బ్రాహ్మణులయిన శివద్విజులే జంగమములై ఉంటూ ఉండేవారు. శూద్రులలోను పంచములలోను జంగమము లుండేవా రనడాని కాధారములులేవు. వారిలో శివభక్తులనేకులు మహిమవంతులుండేవారు కాని వారు జంగమశబ్దవాచ్యులు కారేమో! అని తోస్తుంది ఎట్లయినా ఆ కాలములో జంగమ జాతి మాత్రము లేదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

(2) శాసనములలో శివద్విజులు శివబ్రాహ్మణులు అనే పేళ్లు తరచుగా కనబడుతున్నవి ఉదాహరణములు ఎ. పి. రిపో॥ సం 1911 నం 530 ర క్రీ. శ. 1030— శివద్విజులు; సం 1909 నం 418 ర క్రీ॥ శ॥ 1243 శివబ్రాహ్మణులు. మొదలయినవి. శివయోగుల ప్రస్తావన కూడా అనేక శాసనములలో కనబడుతున్నది. శివయోగులతోపాటు దేవరడియర్ తపస్వులు, అపూర్వులు, శైవాచార్యులు, కడిగై మధ్యస్థులు, కారణత్తార్, వైఖానసులు మొదలయినవారి పేళ్లు కూడా శాసనములలో కనబడుతున్నవి. కాని ఒక్క దానిలోను ఆరాధ్యబ్రాహ్మణులు జంగమములు అనే పేళ్లు జాతివాచక పదములుగా గానరావు

(3) పైదానిని బట్టి చూస్తే సోమనాథుని కాలములోనేగాక అంతకుపూర్వమున్ను తరువాతను కూడా శైవులలో చాతుర్వర్ణ్యముండేదనిన్ని జంగమములనేవారు గృహస్థాశ్రమము విడిచి సన్న్యాసులవలె శైవధర్మప్రచారముకోసము దేశసంచారము చేసే వారనిన్ని, వారిలో వర్ణవిభేదము పాటింపఁబడేదికా దనిన్ని, అన్నివర్ణముల వారినుంచిన్ని జంగమములలో చేరుతూఉండే వారనిన్ని, జంగమములు కాని శైవగృహ

సులుక్తితమతమ వర్ణాశ్రమాచారములను యథావిధిగా పరిపాలిస్తూ ...
వారనిన్ని వారిలో శైవబ్రాహ్మణులు సాధారణ బ్రాహ్మణుల ...
వేదవేదాంగాది విద్యల కధికారము గలిగి వాటికి శైవపరముగా ...
చెప్పుకొంటూ ఉండే వారనిన్ని తెలుచున్నది. శైవబ్రాహ్మణులు ...
బ్రాహ్మణులట !

(4) వీరశైవులలో వృష, నంది, భృంగి, వీర, స్కందులెప్పటినుంచి గో...
కర్తలుగా ఏర్పడినారో తెలియదు.........ఈ గోత్రములు సన్న్యా...
లయిన జంగమములలోనే ఉండేవికాని సాధారణ వీరశైవ గృహ...
లకు కూడా వర్తించేవో లేదో చెప్పలేము. మధురజిల్లాలోని క...
బంగాళాలోని ఒక శిలాశాసనములో మూడో కులోత్తుంగచో...
పథ్నాలుగో రాజ్య సంవత్సరమునాటి (క్రీ.శ.1192) ఒక శాసనములోని ...
ముండమఠములోని నందికేశ్వర సంతానమునకు చెందిన జ్ఞానమూర్తి ...
పేరున్నది. నందికేశ్వర సంతానమంటే నందిగోత్రమని చెప్పవలెనో ...
తెలియదు. అట్లుచెప్పుకొన్నా ఆ గోత్రముసన్న్యాసి అయినజ్ఞానమూర్తి...
నికిమాత్రమే వర్తిస్తుంది. నందికేశ్వర సంతానమువలె తక్కిన వృష,భృం...
వీర, స్కందుల సంతానములున్ను ఉండేవేమో తెలియదు. శివదీక్ష...
జెందినవారు గురువు గోత్రమును చెప్పుకొనడ మాచారము. ఆ ...
రము చొప్పున పాలకురికి సోమనాథుడున్ను తాను భృంగిరిటి గో...
డనని చెప్పుకొన్నాడో, ఈశ్వరకులజుండ, బసవగోత్రుండ, అని చె...
కున్నట్లే శివగణమయిన భృంగిరిటి గోత్రుడనని చెప్పుకొన్నాడో, ...
యించడము కష్టము. శివబ్రాహ్మణు లాకాలములో భరద్వాజ మొ...
ఋషులను గోత్రకర్తలుగా చెప్పుకొనడము కలదు పాల్కురికి ...
నామాత్యుడుకూడా శివబ్రాహ్మణుడున్ను, నైష్ఠికుడున్ను ఆయా...
సోమనాథునివలె విరాగియై జంగముడు కాకపోవడముచేత ...
గోత్రుడుగానే చెప్పబడియుంటాడు. సోమనాథుడు జంగమ...
కావడముచేత తన పూర్వాశ్రమములోని గోత్రమును ప్రశంసించు...
లేదు. అట్లు ప్రశంసించుకొనుట పాతకహేతువని అతని అభిప్రాయ...
ఒకవేళ కావ్యములో తన పూర్వాశ్రమములోని గోత్రము స్మరిం...

డానికి సందర్భపడకపోయి అయినా ఉంటుంది. సూరనామాత్యుని గోత్రమును చెప్పి బసవపురాణ కథాశ్రోత అయిన గొబ్బూరి సంగనామాత్యుని కట్టి గోత్రమును అతడు చెప్పలేదుకదా? సోమనాథుని పూర్వాశ్రమములోని గోత్రము మనకు తెలియనంతమాత్రమున అతని శివబ్రాహ్మణత్వమునకు క్షతిలేదు. శివబ్రాహ్మణులలో హరితాది గోత్రములుండేవి. వారు భవులుకారు. అట్టి గోత్రములు కలవారు భవులే అయితే భవులంటే కిట్టని సోమనాథు డతనిని "ముద్దుమఱది" అని సంబోధించి పండితారాధ్య చరిత్రశ్రోతగా చేయడమే ఉండదు."

శ్రీనారాయణరావుగారి యూహలు నిర్ణయములు నిట్లే తలచుగా "ఏమో" లతోఁగూడి యుండును. ఎట్టివారయినను నిశ్చయజ్ఞానము లేని విషయములఁ గూర్చి యిచ్చవచ్చినట్లు తాటోటుమాటలను వ్రాసినచో సహృదయులు వానిని బాటింపఁజాలరు. శాసనములలోని "శివద్విజులు" "శివబ్రాహ్మణులు" అను శబ్దములను జూచి వానికర్థమేమో యా శివద్విజులు బ్రాహ్మణులు నెట్టివారో, ఆయా శబ్దములు వాఙ్మయమునఁగూడ నెట్టియర్థమున నుపయోగింపఁబడినవో యావిషయమున శాసనస్థప్రయోగములకును గ్రంథస్థ ప్రమాణములకును వైరుధ్య మేమయిన నున్నదో యను సంగతులేమియు విచారింపకయే వీరిట్టి విపరీతరచనమునకుఁ గడంగిరి. శివద్విజులన్నను శివబ్రాహ్మణు లన్నను శివాలయములలో నర్చన మొనర్చు పూజారులు. వారినే యాంధ్ర ద్రవిడదేశముల నిప్పుడు గూడ శివద్విజులు, శివార్చకులు, నంబులు, తమ్మళులు అను పేళ్ళతో వ్యవహరించుచున్నారు. శాసనము లందును గ్రంథములందును నీ శివాలయము లందలి పూజారు

లకే శివద్విజ, హరద్విజ, శివబ్రాహ్మణ శబ్దములు ప్ర
క్తము లయినట్లు వానిని సందర్భపూర్వకముగ స
ముగఁ బరిశీలించువారికి గోచరింపఁ గలదు. నారాయణ
గారు ఎపిగ్రఫి రిపోర్టులు తిరుగవేసి యుదాహరించిన శాస
లన్నియు నప్పటి భూపాలురు శివాలయము లందలి పూ
కములు సరిగా జరగుట కయి యాయా దేవాలయ
యర్చకుల కొనర్చిన దానములకు సంబంధించినవే యైయు
వలయువా రా శాసనములను గాని ఎపిగ్రఫి యధికా
వారి రిపోర్టులలో వ్రాసిన సారాంశములనుగాని చూడవచ్చు
నుచ్చున కొకటి రెండి క్రింద నుదాహరించు చున్నాను.

(1) "M. E. R. 418 of 1909:— (A. D. 1243) Vyaghrapade
Temple at Sidhalinga madam— Pandya king Jatava
alias Thribhuvana chakravarti Sundara Pandya
13th year.

Records that the **Sivabrahmins of the Temple** a
to provide for offerings in the shrine of Aludaiya Pi
from the interest on 2000 kasus presented to the te
by Arindavan Pallavaraiyana in the time of Koppe
gadeva and now placed in their hands.

(2) M. E. R. 530 of 1911:—On the south wall of the ma
in front of the Subrahmanya shrine in the Kumara
Temple at Ilangi.

Pandya King—Jatavarman alias Thribhuvana ch
varti Konarinmaikonda Kulasekhara Deva· 9 + 1st
Tamil.

The King while encamped at Vasudeva nallur in
warinadu appointed three priests to perform wors
the Temple at Tiruppagisura Mudaiya Naya
Sundarapandya nallur there being none of the **Siva**
**Community** at the place to undertake the work.

సోమనాథుని గ్రంథములందును, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యము మున్నగు కావ్యము లందును గూడ నీశబ్దము లీశివార్చకులఁ గూర్చియే యుదాహరింపఁ బడినవి. ఈ క్రింది దృష్టాంతములు చూచునది.

"కావేరి యామ్య భాగంబునమఱియు - నావులూరను నగ్రహారంబునకును
నిరవురు జంగము లేతెంచినంబి - తిరుపాటలర్థి సంధిల్లఁబాడుచును
వరదానమునకేఁగ వనితా లలామ - విరియనంగె యనంగఁ బృథుభక్తి నిరత
వరగుణయొక్క - శివ ద్విజు రాలు - వరదానమిడుటకు వచ్చి యాలించి
ఇలనొప్పు ద్రవిళ మహీస్థలియందు - నలిఁదిరువారూర నంబియనఁ బేర
వడి సుందరుండు శివద్విజుండైన - జడయారియను పుణ్యశాలికిఁబుట్టె.

(పండితారాధ్య చరిత్రము - మహిమ ప్రకరణము-
ఒడయనంబియను సుందరనంబెన్న చరిత్రము)

సీ. పంచాక్షరీపూత భసిత త్రిపుండ్రాంకి
తాంక భాగములు స్నానార్ద్ర శిఖయుఁ
గ్రమకృతగ్రంథి సూత్రావృత రుద్రాక్ష
భూషణంబులు శైవభాషణములు
నాగుల్భలం బమానాంబుశోణంబైన
తోత్రంబు నుపవీత సూత్రములును
గరగృహీతాభిషేకక్షీరసంపూర్ణ
భాండంబుఁ బుష్పకరండకంబు

గీ. గుండబొజ్జయు నొకపాటి గుజ్జురూపు
- నుత్తరీయంబు దనరంగ యోగిహృదయ
గోచరునిఁగొల్వ శివచిహ్న గోచరాంకుఁ
డొకఁడువచ్చె శివబ్రాహ్మణోత్తముండు.

ఉ. అన మోదించి హారద్విజుం డొదుగఁ జెంచవ్వేళ నేతెంచి పా
వన నిర్మాల్యముఁ జెప్పుఁ గాలఁ గొని ప్రోవంద్రోచి......
(శ్రీకాళహస్తి మాహాత్మ్యము)

ఈ శివద్విజులు స్మార్తబ్రాహ్మణుల వలెనే గ్రా
కమున నుపనయన సంస్కారమును జరగించుకొనెదరు. వా
గూడ ఋషిగోత్ర సూత్రములే వ్యవహరింపఁ బడును. వీరి
వెలనాటి శివద్విజులకు స్మార్తులకు నాంధ్ర దేశమున స
భోజనములు నేఁడుగూడఁ గలవు ఈ శివద్విజులు స్మార్తులవ
నుపనయనమును మాత్రమే గ్రహింతురు గాని నేఁ డారా
బ్రాహ్మణులని వ్యవహరింపఁబడు శైవబ్రాహ్మణులవలె
లింగధారణమును గ్రహింపరు. (నిజాం ప్రాంతమునఁ దక్ష
ణులు కొందఱు లింగధారు లున్నారు. వీ రారాధ్యుల
శిష్యులు) ఆశాఖలోఁ బూర్వులెవరయిన నిష్టలింగ ధారణ
గ్రహించి యున్నచో నట్టి వా రానాఁడు శైవబ్రాహ్మ
శాఖలోనే చేరిపోయి యుందురు. ఇష్టలింగధారణము గ
యారాధ్య బ్రాహ్మణులు నేఁడుగూడ శైవబ్రాహ్మణశబ్దము
యుపయోగించుకొనుచున్నారు. శివద్విజులాశబ్దము నుపయో
గించుకొనుటలేదు. కావున శివద్విజులు (శివ బ్రాహ్మణులు
వేఱు. శైవ బ్రాహ్మణులు వేఱు. మొదటివారికి లింగధా
ణము లేదు. రెండవవారికి లింగధారణము గలదు. ఉపనయ
మిరువురకు సామాన్యమే. పండితారాధ్యచరిత్రమున వా
ప్రకరణమునఁ జేర్కొనఁబడిన మహాబ్రాహ్మణులు శై
బ్రాహ్మణులేకాని శివద్విజులుగారు. మహాశబ్ద మచ్చ

కర్మధారయము; ఉ తమత్వ సూచకముగనే యది ప్రయుక్త మయినది. అంతియేగాని మహాబ్రాహ్మణులను వేఱొక శాఖ లేదు.

"..... రుద్రప్ర
శంసాపరోక్షు లాశ్చర్యం బెలర్పc
బరమ లింగార్చనా పరులు స్వాధ్యాయ
పరులునై చను మహా బ్రాహ్మణోత్తములు
సదువులు వేద భాష్యములు చెప్పుచును
ముదమున నిరుదెస మొ్రక్కుచు నడువ"

పరమలింగార్చనాపరులగు నీమహాబ్రాహ్మణులు పండితారాధ్యునివలె నిష్ట లింగధారులయి యాతని శైవ బ్రాహ్మణ శాఖకుc జెదినవారేయని స్పష్టముగ గోచరించును. వారు శివద్విజ శాఖకుc జెందినవారుకారు. శివద్విజు లప్పటికి నిప్పటికి శైవ బ్రాహ్మణులనుండి వేర్పడియే యున్నారు. వారికి దేవాలయములలో స్థాపితములయిన శివలింగముల నర్చించుటయేగాని యిష్టలింగార్చనము లేదు. ఈవిభేదముల నేమియు గుర్తింపక శ్రీనారాయణరావుగారు చిందర వందరగాc దమ వ్రాతలలో శివద్విజులకు శైవబ్రాహ్మణులకు నైక్యము గల్పించుట శోచనీయము. ఇcక జంగమ శబ్దమును గుఱించిన విచారణములో శివద్విజులలోనేమి శైవబ్రాహ్మణులలో నేమి సన్న్యాసమును స్వీకరించినవారే జంగమ శబ్దవాచ్యులుగా నుండిరని వీరు వ్రాసిన దానికెట్టి ప్రమాణములును లేవు. సోమనాథుని గ్రంథముల నవలోకించినచో జంగమశబ్దము కేవలము చరలింగవాచకముగా వర్ణాశ్రమధర్మవివక్షిత

లేకుండ సంసారులకు సన్న్యాసులకు బ్రాహ్మణులకు బ్రాహ్మ
ణేతరులకుఁ గూడ వాడఁబడినట్లు విశదమగును. మచ్చునకు
గొన్ని యుదాహరణములు చూడుఁడు. బెలిదేవ వేమ
రాధ్యుఁడు, పోరండ్ల సూరసానమ్మ గృహస్థాశ్రమమునందు
డిన శైవబ్రాహ్మణ కులజులని పండితారాధ్య చరిత్రము
వర్ణిత మయిన వారిచరిత్రముఁ బట్టి తెలియ నగును.
వేమనారాధ్యుని మనుమఁడు మన సోమనాథుని విద్యాగురు
లలో నొకఁడు. పండితారాధ్య చరిత్రమున వీరిరువురకుఁగూ
జంగమ శబ్దముపయోగింపఁ బడినది.

"శాంతగుణ కదంబ కాంత సూరాంబ, పేరెన్నఁబడిన శ్రీబెల్దేవి వే
నారాధ్యులాదిగా నలరు జంగములు, దవిలి పండిత విభుదర్శించువే

........................................

సన్నుత లీల మజ్జన మాచరించు, సమయంబునను సూరసానమ్మ జం
మము బెలిదేవ వేమన పండితులును, జనుదేర..."

(దీక్షా ప్రకరణము)

సూరసానమ్మ కథలో శివుఁడు చండాలఁవేమ
నామె యింటికివచ్చి యామె సపర్యలంది భుజించుట గ
బ్రాహ్మణులు రాజుతోఁ జెప్పి తగవుచేయు సందర్భ
నామె చెప్పు వాక్యములలో "కర్మసంహారుని జంగ
నొవ్వఁబలికి, కర్మగతుల పాలుగాఁగ మర్గెదరు" అని యం
జుని విషయమునగూడ జంగమశబ్ద ముపయోగింపఁ బడి
మహాభక్తుఁడగు మడివాలు మాచయ్య వృత్తిచేతను గుల
చేతనుగూడ రజకుఁడు. అది తెలియుటకే మడివాలు శబ్ద
తని పేరికి ముందుదాహరింపఁబడినది. ఆతని వర్ణనము

గూడ బసవపురాణమున

"మత్తియును మడివాలు మాచయ్యనాఁగ
నలలేని వీరవ్రతాచారయుతుఁడు,
శ్రేష్ఠుఁడు జంగమ ప్రేష్ఠుఁడు న్యాయ
నిష్ఠురాలాపమహిష్ఠమండనుఁడు"

అని చెప్పఁబడినది. ఇత్యాదు లనేకము లున్నవి. కావున శైవులగు బ్రాహ్మణులందు సన్న్యాసమును స్వీకరించినవారికే జంగమ శబ్ద ముపయోగింపఁబడెనని, శూద్రులలోను బంచము లలోను జంగమము లుండిరనుట కాధారములు లేవని, శ్రీ నారాయణరావుగారు వ్రాసిన వాక్యములు నిరాధారములనుట వేఱ చెప్పనక్కఱలేదు. వీరశైవదీక్ష నొందిన వారందఱు జంగములే. ఆదీక్షతో వేఱొక జన్మము కలుగునని పూర్వవర్ణాశ్రమవిచారమున కప్పు డవకాశము లేదని వారి మతము. జంగమ శబ్దము, ఆరాధ్య బ్రాహ్మణశబ్దము, జాతి వాచకములుగాఁ బూర్వకాలమున నుపయుక్తములు కాలేదని నేను గూడఁ జెప్పుచునే యున్నాను. ఏపేళ్లతో వ్యవహరింపఁ బడినను నట్టివారు మాత్రము చాలఁ బ్రాచీన కాలము నుండియు నున్నట్లు వాఙ్మయమునుబట్టి తెలియుచున్నది. శాసనములు కూడ నిందుకు విరోధముగ లేవు. వీరశైవమతము లకు గురువులకు నొసంగఁ బడిన శాసనము లనేకము లున్నవి. వానిలో గృహీతల కులముల పేళ్ళు స్పష్టముగఁ జెప్పకున్నను నందు వారి వీరశైవాచార ధర్మములు వర్ణింపఁబడియే యున్నవి.

వీరశైవులలో వృష, నంది, భృంగి, వీర, స్కందులు

గోత్రకర్తలను వ్యవహార మెప్పటినుండి యేర్పడినదో యః నారాయణరావుగారు ప్రశ్నించుటలోఁ బ్రయోజనమేమో తెలియకున్నది. అవి నూతనములనిగాని యొక నిర్దిష్టకాలమున నేర్పడినవనిగాని తాము నిరూపింప నేరనప్పుడు, నందుకాధారములు లేనప్పుడు, శివాగమము లవి యుగయుగములనుండి యేర్పడినవని, ఘోషించుచున్నప్పుడు వీరి కుతర్కమునకు బ్రయోజనమేమి? బ్రాహ్మణులలోని ఋషిగోత్రసూత్ర వ్యవహారమెప్పు డేర్పడెనో వీరు చెప్పఁగలిగిరా? బ్రహ్మసృష్టి కంటె శివునిప్రమథగణసృష్టి ప్రాథమికమని శివయోగి శివాచార్యుని సిద్ధాంతశిఖామణి చెప్పుచున్నది. కావున బ్రమథగణపరమయిన వీరశైవగోత్రవ్యవహారము సనాతనమేగాని నూతనముగాదు. ఈ గోత్రవ్యవహారము సన్న్యాసులయందేగాని గృహస్థులలో నున్నదో లేదో తెలియరాదని వీరు వ్రాయుట మఱింత వింతగానున్నది. తమకుఁ దెలియనప్పుడు వీరశైవ గృహస్థుల నెవరినైన నడిగి తెలిసికొనిన బాగుండెడిది. వీరశైవులకున్న వేయయిదుగోత్రములు. వీరిలో సన్న్యాసులకు గొన్ని సంసారులకు మఱికొన్ని గోత్రములు లేవు. పంచాచార్య సింహాసనస్థులు సన్న్యాసులే. వారుకూడఁ దిమపీఠమున కేర్పడిన గోత్రమునే చెప్పికొనెదరు. ఆపీఠమునకు దాని యుపపీఠములకు సంబంధించిన శిష్యు లందఱు సంసారులయినను సన్న్యాసులయినను సరే యా పీఠమున కేర్పడిన గోత్రమునే తమగోత్రముగా వ్యవహరించుకొనెదరు. ఈసంప్రదాయము ననుసరించియే వీరశైవ

పీఠములలోఁ ద్వితీయమగు ఏకోరామాచార్యపీఠమునకు సంబంధించిన శిష్యుఁడవుటచే సోమనాథుఁడు తాను భృంగి గోత్రుఁడనని చెప్పికొన్నాఁడు. ఆతనికిఁ బూర్వాశ్రమ మొకటి పరాశ్రమము మఱియొకటి లేవు. భృంగి గోత్రుఁడ ననియాతఁడుచెప్పి కొనిన యనుభవసారమే యాతనిప్రాథమికకృతియని ముందే నిరూపించియుంటిని. సహజవీరశైవుఁడవుటచేతనే యందు భృంగిగోత్రమును జెప్పికొన్నాఁడు. పండితారాధ్యచరిత్రమునఁ జెప్పికొనిన "బసవ" గోత్రము బసవేశ్వరునందలి భక్తిపారవశ్యము మితిమీఱిన చరమ వయస్సులో దానిని బ్రదర్శించుచుఁ జెప్పిన సందర్భములోనిదని, బసవ గోత్రమనునదియొకటి వీరశైవులలో నసలు వ్యవహారమున లేనేలేదనికూడ నిదివఱకుఁ జెప్పియుంటిని. సోమనాథుఁడు సన్న్యాసమును దీసికొనెననుట కెట్టి యాధారములును లేవు. తోంటదార్యుని సోమేశ్వరపురాణములో నాతనికిఁజతుర్ముఖ బసవేశ్వరుఁడను పుత్త్రుఁడుండెనని, యాతఁడు తండ్రితోఁగూడి చక్రపాణి రంగనాథాది ప్రత్యర్థుల నోడించెననియుఁ జెప్పఁబడినది. నారాయణరావుగారి యత్యూహాలన్నియు నిరాధారములు. బసవపురాణ కథాశ్రోతయగు గొబ్బూరి సంగనామాత్యుఁడు పాలకురికినూరనామాత్యునివలె లింగధారి బ్రాహ్మణుఁడే వైయుండునని నా యభిప్రాయము. బసవపురాణమున నాతనిగోత్రము పేర్కొనఁబడ కున్నంతమాత్రమునఁ బ్రత్యవాయము లేదు. తమ గోత్రములను గృతిపతుల గోత్రములను దమకృతులలో నుదాహరింపని కృతికర్తలెందఱు

లేరు? బసవపురాణావతారికలో సంగనామాత్యుఁడు కర్ణా
భూమియందలి గొబ్బూరునకు విభుండనియు నా యగ్రహా
రమునందలి మహాజనులలో నుత్తముఁడయిన మండఁగిమాది
రాజువలన లింగదీక్షనొందిన వాఁడనియు వర్ణింపఁబడినది.
ఈ మండఁగి మాదిరాజు బసవేశ్వరుని తండ్రియైనను గాకున్నను
నావంశమునకుఁ జెందిన యాతని పేరిటివాఁడు మఱి యొక్కఁడై
యుండుననుట కెట్టి యభ్యంతరమును లేదు. బసవేశ్వరుని
తండ్రియైన మండెఁగ మాదిరాజుకూడ బాగెవాడి మున్నగు
నగ్రహారము లందలి మహాజననికాయములలో నొక్కఁడయి
నట్లు శాసనములవలనఁ గాననగును. సోమనాథుఁడు పాలకు
సూరనామాత్యునెడఁ జెప్పికొనిన ముద్దుమఱంది సంబంధ మది
లేని మచ్చిక కలిమిచేఁ జెప్పిన యౌపచారిక సంబంధమే గాని
వాస్తవికముగాదని ముందే నిరూపించి యుంటిని. గోత్ర
సూత్ర వ్యవహారములు ఋషి సంబంధికములయినను లింగధా
రణదీక్ష నొందిన శైవబ్రాహ్మణులు స్థూలదృష్టితో వీర
వులుగానే యానాఁడు పరిగణింపఁబడి రనియు వారు భవు
లారనియు సహజవీరశైవులకు వారికి నక్కాలమున నెక్కుడు
గాఁ బరస్పరగౌరవసాహచర్యములు గలిగియుండెననియు
గూడ వివరించియే యుంటిని.

నారాయణరావుగారు పేర్కొనిన యాముండమఠ శా
సనములో నుదాహృతమయిన నందికేశ్వరసంతాన మను
మునకు నందిగోత్రమని యర్థము కానేరదు. ఆమతమున
నందికేశ్వరనామాంకితుఁడగు పూర్వాచార్యుఁ డొకఁడు

యుండును. తరువాత నామతమున కేర్పడిన యాచార్యులాతని శిష్యప్రశిష్యసంతానమునకుఁ జెందిన వారగుదురు. క్రీ. శ. 1194 నాఁటిజ్ఞానమూర్తి దేవుఁడా శిష్యకోటిలోని వాఁడనుటకే యట్లుచెప్పఁబడి యుండును. గోత్రశబ్దపర్యాయముగా సంతానశబ్దము వీరశైవ గ్రంథములలోఁగాని వ్యవహారములోఁగాని ప్రయుక్తమయినట్లు కానరాదు. వృషసంతానము, భృంగిసంతానము మున్నగు వ్యవహారమున్న ట్లిచ్చటను వారిలోవినఁబడదు.

మహాకవు లే కులజులయినను వారి కవితాగౌరవము కతన నెల్లరకును బరమపూజ్యులు. "చరిత్ర చరిత్రకొఱకే" యను సూత్రమునననుసరించి చరిత్రకారులు దురభిమానములను దూరముగఁ ద్రోలి, యెట్టి కష్టనిష్ఠురముల కోర్చియైనను సత్యనిర్ణయమునకై శక్తివంచన లేక ప్రయత్నింపవలెను. లేనిచో వారు లిఖించిన చరిత్రమునకు సహృదయుల దృష్టిలో విలువ గలుగఁజాలదు. మలినజలమున బింబము ప్రతిఫలింపఁజాలనట్టు లభిమానమాత్సర్యము లావరించినచో హృదయమునకు సుస్పష్టవిషయములందుఁగూడ సత్యము స్ఫురింపనేరదు. వసుచరిత్రమును రచించిన రామరాజభూషణుఁడు బ్రాహ్మణుఁడేయని వాదించు మహానుభావులున్నారని నా మిత్రులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగా రొక సందర్భమున వ్రాసి యున్నారు. అట్టి మహాశయులను మన్నింపవలెనో గర్హింపవలెనో నిర్ణయించుటకు సహృదయులే ప్రమాణము.

సుప్రసిద్ధవీరశైవకవివతంసుఁడగు సోమనాథుని సహజ

వీరశైవత్వ మాతని గ్రంథములవలన నడుగడుగునకుఁ బ్రవ్యక్త మగుచున్నను నందుకు సంబంధించిన యాతని సహ కులగోత్రములను వీరశైవ సంప్రదాయానుగుణముగ నాతఁడు స్వయముగఁ జెప్పికొన్నను, వాని నాతని శిష్యప్రశిష్యులు కూడ మరలఁ బేర్కొన్నను, వానినెల్లఁ ద్రోసిరాజని దురభి మానమునే ప్రధానము చేసికొని కొందఱు సత్యదూరము లగు నభిప్రాయము లిప్పటికిని వెలువరించుచుండుటచేఁ దన్ని వారణార్థమయి యీ ప్రకరణమునిట్లు ప్రపంచింపవలసి వచ్చె నందుకు విచారించుచున్నాను. సత్యప్రియులు సత్యము గుర్తించి చరితార్థులయ్యెదరుగాక !

## ౭. సోమనాథుని బాల్యము - తల్లిదండ్రులు

అనుభవసార పద్యమున "భృంగిరిటి గోత్రుఁడను గురు లింగ తనూజుండ" నని సోమనాథుఁడు వ్రాయుటచేఁ గొంద ఱాతని తండ్రిపేరు గురులింగార్యుఁడని భ్రమించిరి. కాని యది సరికాదు. గురులింగమనునది వీరశైవులలో దీక్షాగురువు నకుఁ బ్రయుక్తమగు విశేషణము. గురువు శక్తిపాత మొనర్చి శిష్యునందు హస్తమస్తక సంయోగ మొనర్చి చేయుదీక్ష వేధా దీక్షయనియు, శివపంచాక్షరీ మంత్రమును గర్ణములో నుపదే శించిచేయుదీక్ష మనుదీక్షయనియు, దీక్షాకాలమునఁ దదితర సాధనసామగ్రితో నొనర్చు క్రియాకలాపము క్రియాదీక్ష యనియుఁ జెప్పఁబడును. కావుననే గురుహస్తాంబుజమే తమకు జన్మభూమియనియుఁ బైనిజెప్పిన త్రివిధదీక్షలచే భౌతికశరీరము లింగశరీరముగా మాఱి తమకు వేఱొకజన్మము కలుగుననియు

వీరశైవుల విశ్వాసము. ఇందువలననే సోమనాథుఁడు అనుభవ సారమున గురులింగతనూజుండ నని చెప్పికొనుటయేగాక బసవ పురాణావతారికలో "శరణగణాశ్రియ సకలస్వరూప, గురు లింగవరకరోదర జనితుండ" ననియు; పండితారాధ్యచరిత్రలో "మద్గురులింగ, ఘనకరుణాహస్తగర్భసంభవుఁడ" ననియుఁ జెప్పికొనినాఁడు. పండితారాధ్య చరిత్రమును సంస్కృతీకరించిన గురురాజకవి సోమనాథుఁడు చెప్పిన "మద్గురు లింగ, ఘనకరుణాహస్తగర్భసంభవుఁడ" అను దానికి "గురు లింగార్యస్య దయాహస్తగర్భసముద్భవః" అని చేసిన సంస్కృతీకరణము సరియైనదికాదు. గురులింగమనునది సోమనాథుని దీక్షాగురునామము కూడఁగాదు. కావున "మద్గురు లింగ" అను దానిని "గురులింగార్యస్య" అని యనువదించుట యొప్పిదముగాదు. వీరశైవులలో లింగశబ్దము పరబ్రహ్మమగు శివునకు వాచకమని వెనుకనే చెప్పియుంటిని. ఈ లింగ మూర్తియే హరలింగము, గురులింగము, చరలింగము నని త్రివిధాత్మకముగ నిగూఢమయి యొప్పును. కావుననే వీరశైవ గ్రంథములలో హరునకు, గురునకు, చరునకు (భక్తుఁడు, జంగమము) నభేదము పాటింపఁబడినది. అనుభవసారములో సోమనాథుఁడు చెప్పిన యీ క్రింది పద్యములు చూడుఁడు.

"ఉ. శ్రీగురులింగజంగమ విశిష్టమహా మహిమంబు వేఁడెదఁ
శ్రీగురులింగజంగమము చెప్పఁ ద్రిమూర్తి నిగూఢమై చనుఁ
శ్రీగురులింగజంగమ విశేషము లేకముగాఁ దలంచి యా
శ్రీగురులింగజంగమవశీకృతమామదిఁ గొల్చి సమ్మతిఁ.

క. పరమపరుం బరమేశ్వరుఁ, బరమానందస్వభావు భక్తి నుతింతుర్
గురులింగము హరలింగము, చరలింగము కాంత్యతీతు శంభుని శరణుల్

క. పశుపాశవినిర్ముక్తునిఁ, బశుపాశపతిని భజింతుఁ బశుపాశవిస్ప
ష్టశరీరుని ముక్తిప్రదుఁ,గుశలుని విశ్వేశు, విమలు, గురు, హరు, శరణుల్

క. గురులింగం బుత్పత్తికి,హరలింగమునిత్య సత్క్రియాస్థితికిన్, ద
చ్చరలింగము మాయాసం,హరణమునకు నాదికర్తలని తలఁచిమదిన్.

క. భంగిగఁబూజాక్రియలకు, లింగత్రయమనఁగఁ బరఁగు లెక్కింపఁగనే
కాంగంబైచను శ్రీగురు, లింగంబని త్రివిధలింగలీనాత్ముఁడనై.

కావున సోమనాథుఁడిట్లే తనకథాశ్రోతలను బలువు
తదితర భక్తులను గురులింగకరోదరసంజనితులనియే వర్ణిం
యున్నాఁడు. బసవపురాణ కథాశ్రోత గొబ్బూరి సంగనామా
త్యునిఁ గూర్చి

"భువనపావనమూర్తి బుధచక్రవర్తి - ప్రవిమలకీర్తి సద్భక్తిప్రి
యనివినుతింపఁగ నాశ్చర్యమహిమ-మనుచుండు మండెఁగ మాదిరా
నామహాత్ముని సముద్యత్క్రుపాపూరి-తామృతహస్తకృతావతారు

పండితారాధ్యచరిత్రశ్రోతపాల్కురికి నూరనామాత్యు
గూర్చి.

"వీరమాహేశ్వర విశ్రుతాచార్య - కారుణ్యహస్తాబ్జ గర్భసంభవుఁడు"

అనుభవసారశ్రోత గోడగి త్రిపురారిఁగూర్చి:

క. గురులింగహస్తజాతుఁడు, గురులింగపదాబ్జ భృంగ గురుతరమతి స
ద్గురులింగప్రాణుఁడు శ్రీ, గురులింగాభంగ భక్తకోవిదుఁ డెలమిన్.

తన ప్రథమకృతిగఁ గాననగు అనుభవసారము
సోమనాథుఁడు తన తలిదండ్రులెవరో పేర్కొనలేదు.
బసవ పురాణావతారికలో "భ్రాజిష్ణుఁడగు విష్ణురామి దేవు

దేజిష్ణువగు శ్రియాదేవియమ్మయును, గారవింపఁగ నొప్పుగా దిలిసుతుఁడ, వీరమాహేశ్వరాచారవ్రతుండ'' అనిచెప్పికొను టచే విష్ణురామిదేవుఁడే యాతనితండ్రియనియు, శ్రియాదేవి తల్లి యనియు, స్థూలదృష్టికి గోచరించును. దీనినిబట్టి వీరే యాతని జనకులని దుందుభి సంవత్సరాదిసంచికలోని వ్యాసములో వ్రాసియుంటిని. బసవపురాణ పీఠికలో శ్రీ ప్రభాకరశాస్త్రి గారుకూడ నిట్లే వ్రాసియున్నారు. కాని వీరశైవవంశములో విష్ణుదేవతాపరములగు నిట్టి పేళ్లుండునా యని కొందఱకు సందేహము కలుగవచ్చును. ఇది తగిన కారణముకానేరదు. వీర శైవులకు విష్ణుద్వేషము లేదు. శివారాధనము వలననే విష్ణువు చక్రప్రదానమును, త్రైలోక్యరక్షాధిపత్యమును బడసెనని శైవపురాణములు చాటుచున్నవి. కావున వీరశైవులు విష్ణు వును బరమమాహేశ్వరునిగా గణింతురు.

శ్లో. దుర్వాసకశ్యప విరించి మృకండుపుత్రి, దేవేంద్రిబాణహరి
శక్తిదధీచిరామ, శ్రీవామదేవ కవికుంభజ గౌతమాదీన్
పుణ్యానిమాన్ పరమపాశుపతాన్ స్మరామి.

అను ధ్యానశ్లోకములో శ్రీహరియు నాతని యవతార మూర్తియగు శ్రీరాముఁడును బరమపాశుపతులుగనే పరిగ ణింపఁబడిరి. నిక్కమాలోచింప రామశబ్దము శివపరమే. వీర శైవ పంచాచార్యులలో ఏకోరామాచార్యుఁ డొకఁడు. వీరశైవు లలో ఏకాంతరామయ్య, ఏకోరామయ్య, అచ్యుతలింగము, రామలింగము మున్నగునామములు గలవా రనేకులు మొదటి నుండియు నున్నారు. కావున నితరవ్యతిరేకాధారములు లేన

ప్పుడు సోమనాథుని తలిదండ్రులు శ్రియాదేవీ విష్ణురామి దేవులనియే మనము తలంపవచ్చును. కాని పాలకురికి ప్రాంతములో సోమనాథుని జనకు లాతని బాల్యముననే చనిపోయిరనియు, నందుచే గ్రామాధికారులగు కరణమువంశమువారు పాలకురికి సోమేశ్వరస్వామి యర్చకవంశమునకుఁ జెందినవాఁడని యభిమానమును నతని సహజప్రతిభాశాలిత్వముచేఁ గలిగిన యానందమును గారణములుగా నాతని విద్యాపోషణాదికములనుగూర్చి శ్రద్ధవహించి తలిదండ్రులు లేని లోపము లేకుండ నాతని గారవించిరనియు, జనులు వాడుకగాఁ జెప్పుచున్నట్లు తెలియుచున్నది. ఈకరణము కుటుంబమునకుఁ జెందిన నియోగులు "ఉత్తమరాజు" అనుగృహనామము గలవారు పాలకుర్తి సమీపముననున్న మల్లంపల్లిలో నిప్పుడుగూడ నున్నారట. ఈ కథ నిజమే యయినచో బసవపురాణావతారికలో నుదాహృతులయిన శ్రియాదేవీ విష్ణురామిదేవులు సోమనాథుని నిక్కంపుఁ దలిదండ్రులుగాక యాతఁడు తన్నుఁ బెంచి పెద్దవానిఁగఁజేసిరను గౌరవముతో గురుప్రాయులుగను జనకసమానులుగను సంభావించునప్పటి గ్రామపరిపాలకులగు శైవబ్రాహ్మణకుటుంబమునకుఁ జెందినవారయినను గావచ్చును. ఏదిమెట్లున్నను నిజజనకులో వారిస్థానము వహించు నితరమహనీయులో సోమనాథుని బాల్యమున నాతని విద్యాదికమునుగూర్చి తగినశ్రద్ధవహించి "శైశవేభ్యస్త విద్యానామ్" అనునట్లు లాతఁడా బాల్యమును బీరువుచ్చక విద్యాసంగ్రహణతత్పరతయందే వినియుక్త మొనర్చునట్లు చేసియుం

డురు. శివ ప్రసాదమున జనించిన వాఁ డవుటచే "త్రివేదిశే, ప్రాక్తనజన్మ విద్యాః" అనురీతి నచిరకాలముననే యాతనికి సకల విద్యలు నలవడి యుండును. విద్యాసంగ్రహార్థము, యాత్రార్థము నీతఁడు 'చిన్న నాటినుండియు' ద్రిపురాంతకము, శ్రీశైలము మున్నగు శివక్షేత్రము లకుఁ గూడ నరుదెంచు చుండినట్లు కాననగును. పాలకురికియందు ను దత్పరిసరములందును బూర్వోక్తములయిన శివక్షేత్రములందును సోమనాథుఁడు తన బాల్యయౌవనము లను గడపి విద్యాసముపార్జన మొనర్చియుండును. తోంట దార్యుని సోమేశ్వరపురాణములో సోమనాథుఁడు వేమనారాధ్య వంశజుఁడనియు, గురులింగమంగళాంబికల పుత్త్రుఁ డనియుఁ జెప్పఁబడినది. ఇది భ్రమప్రమాదసంకలితమగు నిరాధారవచనమని చెప్పవచ్చును. ఈ వేమనారాధ్యుఁడు నూత్నవివాహితుఁడయి సర్పదష్టుఁడయి మృతినొందిన భూవర కుమారునిఁ బునర్జీవితునిఁ గావించిన మహిమాన్వితుఁడనికూడ తోంటదార్యుఁడు వర్ణించియుండుటచే నాతఁడు సోమనాథుని పండితారాధ్య చరిత్రములోఁ బురాతన ప్రకరణమున వర్ణితుఁ డయిన బెలిదేవ వేమనారాధ్యుఁడే యని మనము గ్రహింప నగును. బెలిదేవ వేమన సోమనాథునివిద్యాగురువులలో నొకని తాతయేగాని యాతని వంశకర్తకాఁడని పండితారాధ్య చరిత్రావతారికవలన స్పష్టముగఁ దెలియుచున్నది. గురులింగ మనునది సోమనాథుని దీక్షాగురువున కాతఁ డుపయోగించిన విశేషణమని నిరూపించి యుంటిమిగదా! సోమనాథుని జనని

మంగళాంబ యనుట కాతని కృతులలో నెట్టి యాధారము
గానరాదు. కావున నీ విషయమున తోంటదార్యుని వాక్య
లకుఁ బ్రామాణ్య మొసంగఁజాలము.

## ౭. సోమనాథుని దీక్షా - విద్యాగురువులు

"గురులింగతనూజుండ" "గురులింగవర కరోదర జ
తుండ" "మద్గురులింగ ! ఘనకరుణాహ స్తగర్భసంభవుఁడ
నని చెప్పుటయేగాని సోమనాథుఁడు తన దీక్షాగురువు నా
మును దన గ్రంథములలోఁ బేర్కొనలేదు. దీక్షాగురునా
మును బేర్కొనరాదను సంప్రదాయమేదయిన నున్న
నందుచే నిట్లొనర్చెనేమోయనుకొందమన్న నట్టి సంశయము
కవకాశము గానరాదు. అనుభవసార బసవపురాణ పండితా
రాధ్యచరిత్రశ్రోత్రిలగు గోడగిత్రిపురారి, గొబ్బూరి సంగ
మాత్య, పాలకురికి నూరనామాత్యుల దీక్షా గురునామము
నీతఁడు తన కృతులలోఁ బేర్కొనియే యున్నాఁడు. గోడ
త్రిపురారిని

క. గురులింగహ స్తజాతుఁడు, గురులింగపదాబ్జభృంగ గురుతర మహిమ
ద్గురులింగప్రాణుఁడు శ్రీ, గురులింగాభంగభక్తి కోవిదుఁడెలమిన్.

అని వర్ణించినను సంతకుము న్నాతని తండ్రి నారన
ఖ్యుని వర్ణనానంతరము

క. ఆనారనాఖ్యునకు లింగార్పిత భోగవిరహితాత్మునకుఁ బ్రసా
దానూన నిత్య సౌఖ్య, శ్రీనిధికి మహానుభవ వశీకృతమతికిన్.

క. అగ్రతనూజుఁడు సద్భక్తగ్రాహక చెన్న నీలకంఠ పదాంభో
జగ్రహణాంతః కరణ సమగ్రసుఖామృత పయోధి మగ్నుఁడు శ్రీశై

అని త్రిపురారివర్ణన ముపక్రమించుటలో నాతఁడు చెన్ననీలకంఠుని పదాంభోజసేవకుఁడని చెప్పుటచే నీ చెన్న నీలకంఠుఁడే త్రిపురారి దీక్షాగురుఁడని యెఱుంగనగును. అంతకుమున్ను నారనాఖ్యుని ప్రశంసలోఁ గూడ "ఆ మున్నే శ్వర గురుది।వ్యామృత హస్తావతంసుఁ డతికారుణ్యో। ద్దామ తనూజుఁడు" అని చెప్పి యాతని దీక్షాగురువు మున్నయదేవుఁ డని చెప్పినాఁడు.

సోమనాథుఁడు సహజవీరశైవుఁడగు జంగముఁడని వెనుక నిరూపించితిమి. జంగములకు నారాధ్యబ్రాహ్మణులకు లింగధారణశివార్చనాదివిషయములలో సాధర్మ్య మున్నను వీరిలో నన్యోన్య మొకరినుండి యొకరు దీక్షను గ్రహించు నాచారము నేఁడు గానరాదు. "మఠస్థల సముత్పన్నః శాంత శ్శైవాగ మార్థవిత్, మఠస్థల విహీనస్య గురుపట్టం నచేశ్వరి" యున్నగు శివాగమవచనములవలన మఠస్థల సంభవులగు జంగములే వీరశైవదీక్షా గురుత్వమున కర్హు లని తెలియనగును. రేణుకాచార్యుఁ డుద్భవించిన కొలను పాకలో నేఁడుగూడ జంగముల యాధిపత్యముగల యష్టాదశ వర్ణగురుమఠములు గలవు. ఇవి జంగముల యష్టాదశవర్ణ గురుత్వమునకుఁ బ్రతీకములు. కావునఁ బూర్వకాలమున బ్రాహ్మణులుగూడ జంగములనుండియే వీరశైవదీక్షలను స్వీక రించుచుండినట్టు లాధారములు గలవు. అట్టి నిదర్శనము లిప్పుడుగూడఁ గొన్నిటిఁ జూపవచ్చును. కృష్ణాజిల్లా పెడన వాస్తవ్యులు కీర్తిశేషులు శ్రీ అన్నావఝ్ఝల శివరామయ్యగారి

చరిత్రి మిందుకుఁ దార్కాణము. భక్తగణములలో విశే
ప్రచారమందున్న శివకీర్తనములను (చామర్తివారి కీర్తన
లని వీనికి వ్యవహారము) రచించిన చామర్తివారి కుటుంబ
కూడ నిందుకు నిదర్శనము. వరంగలు వాస్తవ్యులు, ఆరా
బ్రాహ్మణవతంసులు కీ॥ శే॥ శ్రీ ముదిగొండ శంకరారాధ్య
వారు విశేషముగ జంగమపాదభక్తి గలిగియుండెడి వా
పండితారాధ్యచరిత్రమును మొదట ముద్రించినది వీ
నాఁడు నేఁడుగూడ జంగమకులజులుమాత్ర మారా
బ్రాహ్మణులనుండి వీరశైవదీక్షల గ్రహించు నాచారము గా
రాదు. కావున సహజవీరశైవుఁడగు సోమనాథుని దీక్షాగురు
మఠస్థల సముత్పన్నజంగముఁడేయయి యుండవలెను. దే
శబ్దమునకుఁ గన్నడబహువచన రూపము "దేవరు" అదే
తెలుఁగులో "దేవర"యని వాడఁబడుచున్నది. జంగములలో
బలువురు తమ నామముల కీ దేవరశబ్దముకూడఁ జేర్చికొ
చుందురు. జంగమదేవరయను వ్యవహారముగూడ సుప్రసిద్ధ
బసవపురాణావతారికలో సోమనాథుఁడు "ఖ్యాతసద్భక్తి
గల కట్టకూరి, పోతిదేవర పదాంబుజ షట్పదుండ" అని ప్ర
కొని, కట్టకూరి పోతిదేవర యను నతనిఁగూడ నొక గురువు
చెప్పికొని యున్నాఁడు. ఈ దేవరయను విశేషణమును
యాతఁడు సహజవీరశైవుఁడగు జంగముఁడని స్ఫురింపఁగల
కొన్ని లక్షణగ్రంథములలో మల్లికార్జున పండితుని కృతి
లోని పద్యముల నుదాహరించుటలో "ఆరాధ్యదేవర శివల
సారమునుండి" ఇత్యాదిగాఁ గొన్ని యుదాహరణము లున్న

దేవరశబ్ద మారాధ్యబ్రాహ్మణుల నామముల చివరఁ జేర్చి కొనుట సాధారణముగ నాచారములో లేదు. పోతిదేవర నివాసస్థలమగు కట్టకూరు పాలకురికి సమీపముననే యున్నది.

ఈ కారణములచే నీకట్టకూరిపోతిదేవరయే సోమనాథుని దీక్షాగురువయి యుండునని నేఁదలంచుచున్నాను. పండితారాధ్యచరిత్రావతారికలో "పేరెన్నఁబడిన శ్రీ బెలిదేవ వేమ, నారాధ్యులను పరమారాధ్య దేవు, మనుమని శిష్యుండ" అని సోమనాథుఁడు మఱియొకగురువును బేర్కొనినాఁడుగాని యాతని నామమునుగాని, గురుత్వ స్వరూపమునుగాని, వివరింప లేదు. బెలిదేవ వేమనారాధ్యుఁడు లింగధారి బ్రాహ్మణుఁడని పండితారాధ్య చరిత్రమునఁ బురాతన ప్రకరణమున వర్ణిత మయిన యాతని చరిత్రమునుబట్టి స్థూలదృష్టికిఁ గానవగును. ఈవేమనారాధ్యుని వంశ్యులమని చెప్పికొనెడి యారాధ్య బ్రాహ్మణులు కొందఱునేఁడుగలరు. ఆతని మనుమఁడు సోమనాథుని విద్యాగురువులలో నొకఁడయియుండును. సోమనాథుని కవితాగురువు కరస్థలము విశ్వనాథకవీంద్రుఁడని యీ క్రింది యుదాహరణముల వలనఁ గానవగును.

(1) ఆ. విమలచిత్ప్రపూర్తి విశ్వేశువరమూర్తి
వినయవర్తి భువన వినుతకీర్తి
విభుకరస్థలంబు విశ్వేశు కారుణ్య
జనిత వినుతకావ్య శక్తియుతుఁడ. (అనుభవసారము)

(2) సకృపాత్ముఁడగు కరస్థలివిశ్వనాథు, ప్రకట వరప్రసాదకవిత్వయుతుఁడ (బసవ పురాణావతారిక)

(3) చరలింగ ఘనకరస్థలి విశ్వనాథ, వరకృపాంచితకవిత్వస్ఫూర్తి...
(బసవపురాణాశ్వాసాంత గద్య)

విశ్వనాథ సోమనాథుల యీగురుశిష్య సంబంధము... బిడుపర్తి సోమనాథుఁడుగూడఁ బద్య బసవపురాణావత... కలోఁ బేర్కొని యున్నాఁడు.

సోమనాథునకు బసవపురాణ కథాసూత్రము ... గించి యా గ్రంథమును బచరించుశక్తిఁ బ్రసాదించిన ... వరులలోఁ గరస్థలి సోమనాథయ్య యొకఁడని బసవపురా... తారికవలనఁ గాననగును. అందాతని వర్ణన మిట్లున్నది.

"తత్త్రిపురాంతక స్థానవాస్తవ్యుఁ-డై త్రిపురాంతకుండభినుతిఁ బేర్చు
నా పురసంహారు నపరావతార - రూపితఖ్యాతని రూఢిఁదలిర్చు
నా సదాశివమూర్తి యవికలైశ్వర్య - సాకార విభ్రమవ్యాప్తిఁ బెం...
నా దేవు వీర వ్రతాచారసార - మేదుర స్ఫురణమై మించి పెంఁ...
జంగమరత్నంబు శరణసమ్మతుఁడు - లింగైక్యవర్తి గతాంగవికారి
పండితారాధ్య కృపాసముద్గతుఁడు - మండిత సద్భక్తి మార్గప్ర...
విలసిత పరమసంవిత్సుఖాంభోధి - నలిఁగరస్థలిసోమ నాథయ్యగారు..."

కుమారాచల నామమునఁ బరఁగు త్రిపురాంతక ... మందు వెలసిన శ్రీ త్రిపురాంతకదేవుని యపరావ... ముగా నీ కరస్థలి సోమనాథుఁ డతి వేలముగ వర్ణింపబడినా... ఈతఁడు త్రిపురాంతకక్షేత్రపరిసరముల నివసించునట్టి మ... శివభక్తుఁడయి యుండును. సోమనాథుని కవితాగురుఁ... విశ్వనాథున కీతఁడగ్రజుఁడు కానోపును. కావున నీవిశ్వనాథు... కూడఁ ద్రిపురాంతక ప్రాంతవాసియై యుండునని నేనూహి...

చున్నాను. ఆతనియున్న సోమనాథయ్యవద్దఁ గూడ మనసోమనాథుఁ డేమయిన విద్యల నభ్యసించి యుండును.

౮. సోమనాథుని మిత్రవర్గము - సమకాలిక భక్తులు

సోమనాథుని సుగుణవిశేషములలో మిత్రవాత్సల్యము, భక్తసౌహార్దము ప్రశంసింపఁదగినవి. తనతోపాటు తనయాప్త మిత్రులఁగూడ స్థిరకీర్తులుగ నొనర్చు నుద్దేశముతోడనే తన ప్రధాన గ్రంథముల కాతఁడు వారిని శ్రోతలుగాఁ గూర్చికొనినాఁడు. ఈతని మిత్రులలో గోడగి త్రిపురారి యనుభవసారమునకు, గొబ్బూరి సంగనామాత్యుఁడు బసవపురాణమునకు, పాలకురికి సూరనామాత్యుఁడు పండితారాధ్యచరిత్రమునకుఁ, గథాశ్రోతలని వెనుకనే చెప్పియుంటిని. వీరిలోఁ బాలకురికి సూరనామాత్యుఁడు మన కవివరున కఱలేని మచ్చికగల నెచ్చెలికాఁడనియు, వారిరువురు ముద్దుగా మఱఁదుల వరుసను బిలిచికొనెడు వారనియుఁగూడ మనము గుర్తించియుంటిమి. ఈ సూరనామాత్యుఁడు కాకతీయ ప్రతాపరుద్రుని యుద్యోగులలో నొకఁడని యేకామ్రనాథుని ప్రతాపచరిత్రములో నుదాహరింపఁబడినది. కాని దీనిని ధ్రువపఱుచు నితరాధారములు మృగ్యములు. ఇతని రాజకీయ పరిస్థితి యెట్టిదయినను సోమనాథుఁ డాతనిఁ గథాశ్రోతగాఁ గూర్చికొనుటకుఁగల కారణములలో ముఖ్యమయిన దాతని దృఢవీరభక్తివ్రతమనియే గోచరించును.

"శదుమించి శివునకుఁ గన్నులర్పించి
పడసిన దృఢవీరభక్తివర్ధనుఁడ

నీదృగర్పితపునరాదానరతికి
నీదానధర్మవినీతికిమెచ్చి"

అను వాక్యము లీ విషయమును విశదీకరించు
విష్ణువు భక్తిపరీక్షణసమయమున శివునకుఁ దన నేత్రి
మర్పించియే సుదర్శనచక్రప్రదానమును బడసెనని పురా
ములవలనఁ దెలియనగును. సూరనామాత్యుఁ డిట్లే
కనన్యమగు భక్తిస్థైర్యములోఁ దన నయనముల
బెటికి యర్పించి యాతని ప్రసాదమున మరలఁ బడ
చుండెడివాఁడనియు, వెన్నుఁడు కన్నప్ప మున్నగు పురా
వీరభక్తిప్రతాప సంపన్నుల కాతఁ డుద్దియనియు
నగును. తోంటదార్యుని సోమేశ్వరపురాణమునఁ
నీతనిమహిమ వర్ణితమయినది. గోడగి త్రిపురారియు, గొ
సంగనామాత్యుఁడుకూడ నిట్లే యఖండశివభక్తియు
లగు సోమనాథుని సుహృత్సత్తములని యాతఁడు వారి
నుపయోగించిన విశేషణములఁబట్టి కాననగును. "వడగా
రామేశు వరశిష్యుఁడనఁగఁ,బడు చెన్నరాముని ప్రాణసఖుం
నను బసవపురాణావతారికలోని వాక్యమునుబట్టి సోమనా
నకుఁ జెన్నరామయ్య యను మహాశ నెచ్చెలి యుండి
విశదమగునుగాని యాతనిఁ గూర్చిన వివరములు మన
దెలియరాకున్నవి.

ఇఁక సోమనాథుని సమకాలికులగు కొందఱు భ
వివరములు మనకు బసవపురాణావతారికనుబట్టి తెలి

చున్నవి. సోమనాథుఁడు తఱచు శ్రీశైలక్షేత్రమునకు యాత్రార్థమై చిన్ననాఁటినుండియు నేఁగుచుండినట్లు కానవగును. ఇట్లు చిరపరిచితమగుటచేతనే చరమవయస్సులో రచియించిన పండితారాధ్యచరిత్రమునఁ బర్వత ప్రకరణమున శ్రీశైలయాత్ర నాతఁ డతిమనోహరముగ ననదృశనైపుణ్యముతో వర్ణింపఁగల్గినాఁడు. బసవపురాణరచనమునకుఁ బండితారాధ్యచరిత్రరచనమునకుఁగూడ నాతనికి భక్తగణముల యుద్బోధన మీ యాత్రా సందర్భమున శ్రీశైల క్షేత్రమున నొడ్డోలగముల జరగినసమావేశముననే జరగినట్టులా గ్రంథావతారికలవలన విశదమగును. బసవపురాణ కథాసూత్రముల నాతని కెఱిఁగించిన భక్తవరులలోఁ బూర్వప్రకరణమున నుదాహృతుఁ డయిన కరస్థలి సోమనాథయ్యయేగాక—

"నిత్య, నియమవ్రతాచార నిరుపమనిష్ఠ, క్రియగొనఁ దత్త్వనిర్ణయము సంధిల్ల;
నతులగోష్ఠి సుఖస్థితిఁ బేర్చుభక్తి, మఱి నియమంబుల"

విలసిల్లు మల్లినాథుఁడను భక్తవరుఁడును,

"ఆదివేదాంత సిద్ధాంత పురాణ – వేదశాస్త్రాగమవిహిత మార్గములఁ
దనుమనోధన నివేదన సమగ్రతను – బనుగొని జంగమార్చనలు నేయుచును
శీలంబుదనర సీమాఉలఁ ఘన వ్ర–తాలంకృతిని బేర్చి యాచారలీల
నసలారఁగాఁగుమారాద్రికిఁ దూర్పు – దెసనుసోపానముల్ దీర్చి పొల్పార
మహితసద్భక్తి సముచితవృత్తి – మహిఁజను"

రెంటాల మల్లినాథుఁడను మఱియొక భక్తవతంసుఁడును.

"నిరతిశయప్రీతి నిత్యంబునైదు – కరవీరపుష్పముల్ హరున కర్పింప
నొక్కనాఁడొకఁడుండుఁ దక్కువయైనఁ – గ్రక్కునఁదననేత్రకమలమర్పించి
శివునిచే ననదృశాంబక మప్డుపడసి – ధువకీర్తిఁ బేర్కొన్న"

దోచమాంబయను వీరభక్తురాలును, అనుభవస్థ కృతిశ్రోత్రియగు గోడగి త్రిపురారియుం గూడం జేర్పం బడిరి. సీమోల్లంఘనవ్రతమనంగాం బొలిమేర దాటకుండ నున్న గ్రామమునందే నివసించియుండుట. ఇది చతుష్షష్టి శీల ములలో నొకటి. ఆనాడు వీరశైవులలో నతులితముగ వీర వ్రతమును నెఱపు భక్తులు భక్తురాండ్రు నసంఖ్యాకముగ నుండెడివారు. పురుషులతోపాటు స్త్రీలకుం గూడ లింగాంగ సామరస్యమున సమానాధికారావకాశములు గలిగించుట వీర శైవమతమునందలి విశిష్టగుణములలో నొకటి. పైని వర్ణింపం బడిన దోచమాంబగారి వీరభక్తి వ్రతమిందుకుం దార్కాణము. బసవపురాణాదులలో నుగ్గడింపంబడిన బెజ్జమహాదేవి, పిట్టవ్వ, నిమ్మవ్వ, సుగ్గళవ్వ, అక్కమహాదేవి, గొడగూచి మున్నగు భక్తురాండ్ర చరితములు గూడ నిందుకు నిదర్శనములు.

అసదృశనియమవ్రతస్థులగు నిట్టి భక్తమిత్త్రులతోడి గోష్ఠీసాహచర్యములు సహజభక్తి సంపన్నుండగు సోమనాథుని జీవితవిధానమునకుం బ్రతిభా ప్రదర్శనమునకుం గవితా సౌందర్య మునకు మిక్కిలి దోహదము గలిగించి వానిని వన్నెకెక్కునట్టు లొనర్చెననుట కెట్టి యభ్యంతరమును లేదు.

## ౯. సోమనాథుని యాచార వ్యవహారములు

సోమనాథుం డఘోరవీరమాహేశ్వరాచారధౌరేయుం డని విశ్రుతిగాంచిన మహనీయుండు.

క. అనయముం బాలకురికిసో
మనాథుండనం బరంగువాండ మానవ సంస

ర్గ నివర్తకుఁడను మఱి భ
క్తి నిరూపితమానసుండఁ గృతకృత్యుండన్.

అని యనుభవసారమునను

"వీరమాహేశ్వరాచారవ్రతుండ-సంభావితుఁడ భవి జనసమాదరణ సంభాషణాది సంసర్గదూరగుఁడ"

అని బసవపురాణమునను

"భవికృతారంభ సంభవ ధాన్య నిచయ । భవినిరీక్షణ రస పాకవితాన భవిహస్తగత ఫలపత్రశాకాది । భవిగృహక్షేత్రాంఘ్రి పథవర్జితుండ భవిజనదర్శన స్పర్శ నాలాప । వివిధ దానాదాన విషయదూరగుఁడ శుద్ధభక్తి స్థలశ్రుతి మతాచార । సిద్ధ వీరవ్రతశీలాన్వితుండ"

అని పండితారాధ్యచరిత్రమునను నాతఁడు స్వయముగాఁ జెప్పికొనినాఁడు. ఈ యాచారసంపత్తినే పిడుపర్తి సోమనాథుఁడు కూడఁ బద్యబసవపురాణావతారికలో

క. "భవిపాక భవిసహోదిత, భవిదృష్టి స్పృష్టి దుష్ట భవికృష్ట మహీ
భవధాన్యభవిఃరద్ర, వ్యవివర్జనశీలునకు దయాలోలునకున్.

అను పద్యమున ననుగ్గడించినాఁడు. భవిశబ్దమునకు భవము (పాపము) కలవాఁడను నర్థము పొసఁగును.

"అభక్తజన సంస్పృష్టపదార్థాదీన్ విసర్జయేత్
అభక్తాలోకితంచైవ యద్ద్రవ్యం పరివర్జయేత్"
"అభక్త స్పర్శనాభావా ద్వ్యేశ్మశుద్ధి రిహోచ్యతే
అభక్తదర్శనాభావా త్పక్వ మన్నం వరాననే!
శాకం తైలాదికం సర్వం పాకశుద్ధి రిహోచ్యతే"

మున్నగు వాతులాగమాదివాక్యముల నవలోకింప

శివభక్తుఁడు కాని వాఁడను నర్థముననే భవిశబ్దము ప్రయుక్తమయినట్లు కానవగును. కాని వీరశైవవాఙ్మయములో నిష్టలింగధారులు కాని వారికిది సాధారణముగ నుపయోగింపఁబడినట్లు పొడగట్టును. బసవపురాణ పండితారాధ్యచరిత్రములలో వర్ణితులయిన పురాతనశివ భక్తులందఱును నిష్టలింగధారులేయని తలంచుట కాధారములు లేవు. ఇష్టలింగధారులు కాకున్నను బూర్వ జన్మవాసనాబలముచే నఖండ శివభక్తి సంపన్నులగు "కన్నప్ప" మున్నగు భక్తుల చరితములు కూడ సోమనాథుఁడు వర్ణించి వారియెడ భక్తిని బ్రదర్శించినాఁడు. వారి నాతఁడు భవులుగాఁ బరిగణించి యుండఁడు గదా! కావున శివభక్తి విదూరులగు పాపాత్ముల యెడనే యాతఁడు "భవి" శబ్దము నుపయోగించియుండునని నేఁదలంచుచున్నాను. భస్మరుద్రాక్షధారణాదిచిహ్నములు గలిగి శివభక్తి సమేతులగు జనులు లింగధారులు గాక పోయినను శైవప్రపంచము ననే చేరెదరు. కావున నట్టివారు భవులుగాఁ బరిగణింపఁబడియుండరు. శివభక్తి రహితులగు జనుల దర్శన స్పర్శన సంభాషణాదులఁగూడ సోమనాథుఁ డొప్పెడివాఁడు కాఁడు. ఇట్టి ఘోరనియమముతో వర్తించినచో శైవమతముపయి ధ్వజ మెత్తి పరవాదుల నీతఁడు జయించి మత ప్రచార మొనర్చుట యెట్లు పొసంగును? సోమనాథుఁడు స్వధర్మనిరతి గల యెంతటి యాచారశీలుఁడయినను లౌకికప్రజ్ఞాధురీణుఁడు. కావునఁ దన వ్రతమునకు భంగము లేకుండ నీతఁడు కాండపటము వెనుక నుండి ప్రతివాదులతో వాదము నెఱపెడివాఁడని తెలియు

చున్నది. పిడుపర్తి సోమనాథుఁ డీతని నిట్లు వర్ణించినాఁడు.

ఉ. శ్రీభసిత త్రిపుండ్రక పరీత విశంకటఫాలు, జాటజూ
టీ భరధారు, నిర్మలపటీ పటలావృత దేహు, నక్షమా
లా భరణాభిరాము, బసవాక్షరపాఠ పవిత్ర వక్త్రుఁ, జి
చ్ఛోభిత చిత్తుఁ, బాల్కురికి సోమయ దేశికుఁ బ్రస్తుతించెదన్.

ఇం దుదాహృతమయిన నిర్మల పటీపటాలావరణము భవిముఖదర్శననిరాకరణమునకయి యుండునని నేనూహించు చున్నాను.

వీరశైవులకు లింగాచారము, సదాచారము, శివాచారము, గణాచారము, భృత్యాచారము నను పంచాచారములును, భూతి, రుద్రాక్షము, మంత్రము, గురువు, లింగము, జంగమము, పాదతీర్థము, ప్రసాదము, అనియెడి యష్టావరణములును విహితమ్ములై యున్నవి. ఈ యష్టావరణ పంచాచారనిర్వహణమేగాక చతుష్షష్టిశీలములని యఱువది నాలుగు తెఱంగుల శీలములుగూడ విధింపఁబడియున్నవి. గ్రంథవిస్తర భయమున వీని వివరముల నుదాహరింప కున్నాను. నిరతిశయంబగు నిట్టి శీలనిర్వహణము సోమనాథునితోనే యంతరించెనని చెప్పెదరు. సోమనాథుని వీరశైవాచారపరాయణత మనబోంట్ల కూహించుటకుఁ గూడ శక్యము కాదని చెప్పినఁ జాలును.

## ౧౦. సోమనాథుని కాలము

దీనిని గూర్చికూడ భేదాభిప్రాయములు కలవు. పిడుపర్తి సోమనాథుఁడు పద్యబసవపురాణావతారికలో నొకనా

ఓరుగంటిలో స్వయంభూదేవు మంటపమున భక్తులు పాల్కురికి సోమనాథుని బసవపురాణమును జదువుచుండిరనియు నప్పుడు కాకతి ప్రతాపరుద్రుఁ డచ్చటికే తెంచి యదియేమి యని ప్రశ్నింప ధూర్తవిప్రుఁడొకఁడు "పాలకురికి సోమనాథుఁడు ప్రాసయతులుగూర్చి నూతనముగ రచించిన యప్రమాణ ద్విపద బసవపురాణమని" చెప్పి నిందించెననియు; నావార్త నచ్చటిభక్తులు పాలకురికికిం జని సోమనాథుని కెఱిఁగింప నాతఁ డోరుగంటి కరుదెంచి నిజమహిమాదికములఁ బ్రదర్శించి బ్రాహ్మణుల నోడించెననియు నుగ్గడించిన కథ నిదివఱ కుదాహరించి యుంటిమి. ఈ గ్రంథావతారికలోనే పిడుపర్తి సోమనాథుఁడు "హరభక్తి వైదికంబని ఖ్యాతులిడిచెప్పెఁ బ్రసిద్ధ సోమేశుఁ డారాధ్యచరిత; సరవి శ్రీనాథుఁడా చరిత పద్యప్రబంధముచేసె ద్విపదలు తఱచునిలిపి" యని వ్రాసి క్రీ. శ. 1365-1450 మధ్యనుండిన శ్రీనాథునిఁ బేర్కొని యున్నాఁడు. అందుచే నాతఁడు క్రీ. శ. 1520 ప్రాంతము వాఁడగును. ఈ సందర్భముననే యీతఁడు తన పూర్వులగు శివరాత్రి కొప్పయ్య మున్నగు శిష్యులకు సోమనాథుఁడు నిజ శిష్యుఁడును బ్రతాపరుద్రుని మంత్రియునగు ఇందులూరి యన్నయ్యచే దోకిపర్తి గ్రామము నగ్రహారముగా నిప్పించెననియు, దేశము త్వరలోఁ దురుష్కాక్రాంతము కానున్నదని చెప్పి సోమనాథుఁడు తన యాచార వ్యవహారముల కచ్చట భంగము వాటిల్లు నని తలంచి యటనుండి వెడలి కర్ణాటదేశమున శివగంగకు సమీపముననున్న కలికె (కళ్య) మను

గ్రామమున సమాధి నేర్పఱచుకొని కొన్నాళ్లు కచ్చట స్థిధి నొందెననియు వ్రాసియున్నాఁడు. ఈ సంగతులఁబట్టి సోమ నాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని (క్రీ. శ. 1290-1326) కాలము వాఁడనుట సంగతముగా నుండును. ఈ ప్రతాప రుద్రుని యనంతరమే కాకతీయసామ్రాజ్య మస్తమించి దేశము తురుష్కుల యధీనమయ్యెను. పయికథలో సోమనాథుని శిష్యుఁడని చెప్పఁబడిన ఇందులూరి యన్నయ రెండవ ప్రతాప రుద్రుని మాతామహియగురుద్రమదేవి కొమరిత రుయ్యాంబి కను బరిణయమయి రుద్రమదేవి కాలమునను రెండవ ప్రతాప రుద్రుని కాలమునను దనయవక్రవిక్రమంబునఁ గాకతి సామ్రాజ్యమును విస్తరింపఁజేసిన పరాక్రమశాలి. ఈతని శాసనములు క్రీ. శ. 1290-1295 ప్రాంతమునఁ గానవచ్చు చున్నవి. కావునఁ బిడుపర్తి సోమనాథుఁడు చెప్పిన కథనుబట్టి పాలకురికిసోమనాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని కాలము వాఁడని పలువురు తలంచుచుండిరి. శ్రీ వీరేశలింగము పంతు లుగా రాంధ్రకవిచరిత్రము మొదటిముద్రణమునందును, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ యాంధ్రుల చరిత్రము రెండవ భాగమునందును, నట్లే లిఖించిరి. కాని యటుతరువాత రచింపఁబడిన కర్ణాటకవి చరిత్రములోఁ దచ్చరిత్రకారులు శ్రీ నరసింహాచార్యులుగారు కన్నడమున నుద్భటకావ్యమును రచించిన సోమరాజనుకవి యా గ్రంథమునఁ బూర్వకవి స్తుతిలో,

మ. ప్రమథానీక కథార్ణవేందు హరి దేవాచార్యనం ధైర్యనం
విమల జ్ఞానసుదీపికాస్ఫురిత చేతస్సద్మనం పద్మనం

సముదంచద్వృషభ స్తవామరమహీజారామనం సోమనం
క్రిమదిందం బలగొండు పేళ్వెనొసెదానీ కావ్యమం సేవ్యమం.

అను పద్యములో మూఁడవ పాదమున బసవ స్తవ[ము]లను కల్పవృక్షముల కారామ సన్నిభుఁడయిన సోముని సు[...] చెదనని చెప్పి.

మ. జననాథో త్తమ సోమరాజను సిరద్ కావ్యంవలం శాలివా
హన శాకాబ్ద మదెర్దె సాసిరదనూఱింసంద నాల్వత్తు నా
ల్కనె యారంజిత చిత్రభానువ వరాశ్వీజోత్సి తైకాదశీ
వనజాతారితనూజవాసరదొళాద త్తల్ల మంగర్పితం.

అను పద్యమునఁ దానాయుద్భటకావ్యమును శా[లి]వాహన శకము 1144 (క్రీ. శ. 1222) సంవత్సరమున రచి[యిం]చితినని చెప్పుటచే నిందుదాహరింపఁబడిన సోముఁడు పాల్కు[రి]కి సోముఁడేయని గ్రహించి యిందుచే నాతఁడు క్రీ. శ. 12[..] సంవత్సరమునకంటెఁ బూర్వుఁడని నిరూపించి యాత[ఁడు] మొదటి ప్రతాపరుద్రుని కాలమున క్రీ. శ. 1195 ప్రాం[త]ముననుండి యుండునని నిర్ణయించిరి. దీనితో సోమనాథుఁ[డు] రెండవ ప్రతాపరుద్రుని కాలమువాఁడను పూర్వాభిప్రాయము నిరాకృతమయ్యెను. కర్ణాటకవిచరిత్రకారుల యీ నిర్ణయము ననుసరించి శ్రీ వీరేశలింగముగారు 1917 సంవత్సరమున ప్రకటించిన యాంధ్రకవుల చరిత్ర (మొదటి భాగము) పు[న]ర్ముద్రణములో సోమనాథుఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమున క్రీ. శ. 1195 సంవత్సరమునకుఁ గొంత పూర్వమే క్రీ॥ శ॥ 1180 సంవత్సర ప్రాంతముననుండి యుండునని లి[...]

చిరి. కన్నడమునఁగాని తెలుఁగునఁగాని బసవ స్తవముల నింత విరివిగా నొనర్చినకవి పాలకురికి సోమనాథుఁడుగాక మఱి యొకఁడెవఁడు నా కాలమునఁగానరాఁడు. కావునఁ బూర్వోదాహృతుఁడయిన కన్నడకవి సోమరాజు పేర్కొనిన సోముఁడు మన సోమనాథుఁడే యనుట కెట్టి యభ్యంతరమును లేదు. ఈతఁడొనర్చిన బసవ స్తవములు (వీని విషయము “సోమనాథుని లఘుకృతులు” అను ప్రకరణమున వివరింపఁ బడును) చాలవఱకు సంస్కృతపదభూయిష్ఠము లగుటచేఁ గర్ణాటాంధ్ర దేశములు రెంటి యందునుగూడఁ బ్రచారము నొందినవి. క్రీ. శ. 1222 సంవత్సరము నాఁటికిఁ గర్ణాటకవి స్తుతి కెక్కిన సోమనాథుఁడు మొదటి ప్రతాప రుద్రుని (క్రీ. శ. 1158-1195 కాలమున నుండి యుండవలె ననుటయే సర్వవిధముల సంగతముగా నుండును. కాని కర్ణాటకవిచరిత్రకారులు సోమనాథుని పండితారాధ్య చరిత్రమును స్వయముగాఁ జూడక, యందుకు గురురాజకవి యొనర్చిన సంస్కృతానువాదమునఁదలి “గురులింగార్యస్య దయాహస్తగర్భ సముద్భవః. బసవేశస్యతనయః బసవేశ్వర గోత్రకః, బసవేశ భుజిష్యాత్మ భవో బసవకింకరః, శ్రీ పాల్కురికి సోమేశ నామాహం సర్వవిత్తమః” అను శ్లోకమును సరిగానర్థము చేసికొనక కింకరుఁడను నర్థమిచ్చు భుజిష్యశబ్దమును శిష్యశబ్దపర్యాయముగా భ్రమించి క్రీ. శ. 1168 ప్రాంతమున లింగైక్య మయిన బసవేశ్వరునకు శిష్య పుత్త్రుడయిన సోమనాథుఁడు క్రీ. శ. 1195 ప్రాంతము వాఁడయి యుండునని తమ నిర్ణయమును సమర్థించుకొనిరి. శ్రీ వీరేశ

లింగము పంతులుగారు కూడఁ బయిశ్లోకములకు మూలములగు సోమనాథుని పండితారాధ్య చరిత్రమందలి ద్విపదపంక్తులను జూడక కర్ణాటకవిచరిత్రకారుల వాక్యములనే యనువదించుట శోచనీయము. సోమనాథునకు వీరశైవమతోద్ధారకుఁడగు బసవేశ్వరు నందలి భక్తి పారవశ్య మపారము. బసవశబ్ద శ్రవణ మాత్రముననే యాతఁడొడలు మఱచును. పండితారాధ్యచరిత్రము నాతఁడు బసవేశ్వరునకే యంకిత మొసగినాఁడు. పురాతన వీరశైవులకుఁ దాము పుత్త్రులమని బంటులమని బానిసలమని తద్గోత్రులమని ఇత్యాదిగా భక్తిభావముగ భృత్యాచారమునఁ జెప్పికొనుట వీరశైవుల మతసంప్రదాయము. బసవేశ్వరునిఁ గూడనీతఁడిట్లే వృషాధిపశతకములో బురాతన శివభక్తులకుఁ బుత్త్రునిఁగాను, సేవకునిఁగాను బహువిధములుగా వర్ణించి యున్నాఁడు. మఱియు సోమనాథుఁడు బసవేశుని పుత్త్రుఁడ నని చెప్పికొనుటయే గాక "మునుబసవపురాణమున నెన్నఁబడిన, పెనుపారు భక్తుల పెంపుడుకొడుక" ననికూడఁ జెప్పి కొనినాఁడు. కావున బసవేశ్వరునెడ నీతఁడు చెప్పికొన్న సంబంధములఁ బట్టి యాతని కాలనిర్ణయ మొనర్చుట ప్రమాదమని వేఱ చెప్పనక్కఱ లేదు. కర్ణాటకవిచరిత్రకారులు గ్రహించిన "బసవేశ భుజిష్యాత్మభవః" అనునది సోమనాథుఁడు చెప్పికొనిన "బసవన యిలుపుట్టు బానిసకొడుకు" అనుదానికి గురురాజకవి యొనర్చిన సంస్కృతానుకరణము. సోమనాథుఁడు బసవేశ్వర పండితారాధ్యులను న్యాయముగా నెఱింగిన తత్సమకాలీనుఁడు కాఁడనియే నా యభిప్రాయము.

ప్రస్తుతింపంగ సద్భక్తి విస్ఫురణం, బ్రస్తుతి కెక్కిన బసవని చరిత
చెప్పితి భక్తులచే విన్నమాడ్కిం, దప్పకుండంగను దాశక్తిఁజేసి''

అని వ్రాసి బసవచరితమును దానుభక్తులచే విన్న విధమునఁ బురాణముగా రచియించితి ననియె యాతఁడు చెప్పికొనినాఁడు. కావున నీ పరిస్థితు లెల్లఁబర్యాలోచించి సోమనాథుఁడు బసవేశ్వరుఁడు లింగైక్యమయిన క్రీ॥ శ॥ 1168 సంవత్సరమున కించుకముందో తరువాతనో జనన మొందిమొదటి ప్రతాపరుద్రుని రాజ్యావసానకాలమున బసవపురాణ రచనముచే క్రీ॥ శ 1192 ప్రాంతము నాఁటికిఁ బ్రసిద్ధుఁడయి యుండునని దుందుభిసంవత్సరాది సంచికలోని వ్యాసమునందు వ్రాసియుంటిని. పయిని జెప్పిన కారణములచే సోమనాథుఁడు ప్రథమప్రతాపరుద్రుని కాలమున నుండె ననుట నిర్వివాదమనియు పిడుపర్తి సోమనాథుఁ డాతని తరువాత మూఁడు వందల సంవత్సరముల పయికాలమున వెలసిన వాఁడవుటచే నాతఁడు తనవినికిలిఁబట్టి పద్యబసవపురాణావతారికలో వ్రాసిన సంగతులలోఁ గొన్ని వ్యత్యాసములు చేరియుండును గావున నవి ప్రమాణములు కావనియుఁ బలువురు తలంచుచున్నారు. ఈ గ్రంథావతారికలోఁ బిడుపర్తి సోమనాథుఁడు చెప్పి కొనిన వంశానుక్రమణికనుబట్టి యాతఁడు పాలకురికి సోమనాథుని శిష్యుఁడుగా నందదాహృతుఁ డయిన పిడుపర్తి శివరాత్రి కొప్పయ్యకు నాలవతరము వాఁడని కాననగును.

పిడుపర్తి శివరాత్రి కొప్పయ్య
|
బసవయ్య
|
పెదసోమయ్య (ప్రౌఢదేవరాయల కాలమున దోకిపర్తి మః
| నగ్రహారముగాఁ దెచ్చినవా
దేవయ్య = మల్లమ్మ
|
బసవకవి (దీక్షాబోధకర్త)
|
సోమనాథుఁడు (పద్యబసవపురాణకర్త)

పిడుపర్తిసోమనాథుఁడు శ్రీనాథునకుఁ దరువాతి వాఁ
యాతని గ్రంథమునుబట్టియే వ్యక్తమగుచున్నప్పుడు, పాల
సోమనాథుఁడు క్రీ॥ శ॥ 1195 ప్రాంతము వాఁడని నిరూ
మవుచున్నప్పుడు, పిడుపర్తి సోమన చెప్పిన వంశానుక్రమ
కూడ సరిగాదనియే తలంపవలసి యుండును. శివరా
కొప్పయ్యకు నాతని పుత్త్రుఁడుగ నుదాహృతుఁడయిన బ
య్యకు నడుమ మఱికొన్ని తరములు గతించియుండవల
ఇది యిట్లుండ నామిత్రులు శ్రీ నిడదవోలు వేం
రావుగారు సోమనాథుఁడు మొదటి ప్రతాపరుద్రుని
ములో క్రీ. శ. 1192-1195 ప్రాంతములకే ప్రసిద్ధుఁ
యుండెఁడనియు, క్రీ.శ. 1190 ప్రాంతమున జనించి 12
త్సర ప్రాంతమున బసవపురాణాదికరచనములచే, ప్రసి
డయి సమకాలీనుఁడగు కన్నడకవిసోమరాజుచే స్తుతి
బడియుండుననియు, నాతని కాలము క్రీ. శ. 1190-1250

నిర్ణయించుట సమంజసమనియు, రక్తాక్షిసంవత్సరములో సార స్వత సర్వస్వము (సం॥ 1 సం॥ 11,12)లోఁ బ్రకటితమయిన "శ్రీపాల్కురికి సోమనారాధ్యులకాలము"అను వ్యాసము నందు లిఖించిరి. వీరిట్లు తలంచుటకు ముఖ్యకారణము కీ॥ శే॥ శ్రీకొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ప్రకటించిన "శివతత్త్వసారము" పీఠికలోఁ దత్కర్త మల్లికార్జునపండితారాధ్యునికాలము క్రీ. శ. 1120, 1190 అని నిర్ణయించుటయేయని తోఁచుచున్నది. మల్లి కార్జునపండితుఁడు క్రీ. శ. 1190 వఱకు జీవించియున్న ప్పుడు సోమనాథుఁడు క్రీ. శ. 1192 నాఁటికే ప్రసిద్ధుఁడయి నచో నితర గురువుల నాశ్రయించుటమాని యాతని యొద్దనే విద్యలు నేర్చి యుండఁడా, యని శ్రీ వేంకట రావుగారికిఁ గలిగిన గొప్ప సందేహము. మల్లికార్జున పండితుఁడు గోదావరీ మండల మందలి దక్షారామపురవాస్తవ్యుఁడు పాలకురికికి దక్షారామమునకు విశేష దూరమున్నది. పండితా రాధ్యుఁడు సోమనాథుఁడు సమకాలీనులయినను వారేక ప్రాంతము వారు గాక పోవుటచే వారిరువురకు గురుశిష్య సంబంధ మేర్పడుట కవకాశములు లేవు. ఇంతకు వారు సమ కాలీనులు కానే కారనిముందే చెప్పియుంటిని. శ్రీ లక్ష్మణ రావుగారు పండితారాధ్యుఁడు క్రీ. శ. 1190 వఱకు జీవించె నని తలంచుట కట్టి యాధారములును లేవు. బసవేశ్వరుని నిర్యాణ కాలము క్రీ. శ. 1168 అని వారంగీకరించిరి. అట్లైచోఁ బండితారాధ్యుఁడు బసవేశ్వరుని యనంతరము 22 సంవత్సర

ములు జీవించియుండెనని వారు తలంచుట యసంగతము. బ
వేశ్వర పండితారాధ్యులఁగూర్చి తెలియుటకు వారి యనం
మతిసమీపకాలముననే రచితములయిన సోమనాథుని కృతు
కన్నఁ బ్రబల ప్రమాణములు లేవు. పండితారాధ్యుఁడు 
నాటి చోడుని యాస్థానమున బౌద్ధులజయించి మహిమా
కములఁ గనఁబఱిచి బసవేశ్వరుని సందర్శించుటకుఁ గళ్యాణ
పట్టణమున కేఁగుచు "వనిపుర" మను గ్రామమున నుండగా
నప్పటి కెనిమిది దినములయి బసవేశ్వరుఁ డవతారము
జాలించి సంగమేశ్వరుసం దైక్యమయ్యె నను సంగతి తెలిసి
వచ్చి మిక్కిలి ప్రలాపించెననియు, అటుతరువాత నటనుం
కదలి శ్రీశైలమున కేఁగుచు "వెల్లటూరునందు" నివసించి 
శిష్యుఁడగు దోనయ్యను శ్రీశైలప్రదక్షిణము సేయ నియమిం
శివరాత్రి మహోత్సవము నాతనిచే నిర్వర్తింపఁజేసి శ్రీశై
యాత్రాఫలము నాగాంచెననియు, బసవేశ్వరుఁడు ప్రపంచము
నుండి నిర్గమించినప్పుడు తా నుండియుఁ బ్రయోజనము లేదని
తలంచి బసవేశ్వరునివలెఁ దన్నుఁగూడ నైక్య మొనర్చ
కొమ్మని శ్రీశైలమల్లికార్జునదేవునిఁ బ్రార్థించి పుత్ర
కళత్ర సహితముగ నాదేవదేవునం దైక్యమయ్యె ననియు
బండితారాధ్యచరిత్రమున వర్ణింపఁబడినది. దీనినిబట్టి బసవేశ్వ
పండితారాధ్యుల నిర్యాణకాలములకు నడుమనొక్క శివరాత్రి
గాని పెక్కు శివరాత్రులు గడచి యుండవని స్పష్టమగుచు
కావునఁ బండితారాధ్యుఁడు బసవేశ్వరుని తరువాత సత్వర
కాలములోనే క్రీ. శ. 1169-1170 సంవత్సరములలో శివైక్య

మయ్యెనని తలంపనగును. వెలనాటిచోడుని శాసనములు క్రీ. శ. 1163-1180 వఱకు నాతని సంతతివారి శాసనములు క్రీ. శ. 1185 వఱకును గానవచ్చుట చేతను, చోడుఁడు నాతని సంతతి పండితారాధ్యుని శాపమహిమచే నిర్మూల మయిరని పండితారాధ్యచరిత్రమున వర్ణింపఁబడుట వలనను, శ్రీలక్ష్మణ రావుగారు వా రందఱు నశించువఱకుఁ బండితారాధ్యుఁడు బ్రతికి యుండవలెనని తలంచి యాతని నిర్యాణకాలమును క్రీ. శ. 1190 వఱకుఁ బొడిగించినట్లు తోఁచుచున్నది. అట్లు తలంచుట యనవసరము. పండితారాధ్యుఁ డొందినది స్వచ్ఛందమరణము. అతని శాపమహిమచే వెలనాటి చోడుఁడు నాతని సంతతియుఁ దరువాత నశించినను బండితుఁడు వారికంటె ముందుగనే బసవేశ్వరుని నిర్యాణవార్త విని తానుగూడ సత్వరముగనే నిర్యాణమును బడసెనని యెంచుట కెట్టియభ్యంతరమును లేదు. కావున బసవేశ్వరపండితారాధ్యు లించుమించుగ నేకకాలముననే లింగైక్య మొంది యుందురనియు, సోమనాథుఁడు వారిరువురిలో నెవరినిగూడ స్వయముగ నెఱిఁగియుండఁ డనియుఁ దలంచుటయే సమంజసము. సోమనాథుని కృతులలోఁ బండితారాధ్యచరిత్రమే కడపటిదిగఁ గాన్పించును. ఆ గ్రంథరచననాఁటికిఁ బండితారాధ్యుని మనుమలు మనుమపండితుఁడు మున్నగు నలువురును నాతని పుత్త్రుఁడు కేదారయ్య, శిష్యుఁడు ఇవటూరి సోమనాథయ్యయు, నాతని పుత్త్రులు సూరీశ్వరుఁడు మున్నగు ముప్పురును, శైవ ప్రపంచమునకు గురుపట్టము నొంది వెలయుచున్నట్లు గ్రంథాంతమునఁ జెప్పఁబడినది. ఈ క్రింది పంక్తులు చూడుఁడు.

"అంతలోనన పండితారాధ్యునాత్మ - సంతతియును గులసతిసమేతముగ
లింగోదరము నంద లీనమై రట్లు - సంగతంబగు శివాజ్ఞాపత్రసరణి
శివగణపాత్రిర్థనఁ జిక్కిన సకల - భువనపావనుని నపూర్వతనూజుఁ
దరిత సంసారుఁ గేదారయ్యఁ బుణ్య - భరితు లోకారాధ్య పట్టంబుగ
బ్రస్తుత శంభుఁడా పండితారాధ్య - హస్తాగ్రజుండు దోనయ్యయు భక్త
వర్గంబు గొనియాడ వసుధఁ దద్గురుఁ డ-నర్గళభక్తి రాజ్యముసేయుచుండె
నంతఁ గేధారయ్య యాత్మసంతాన - సంతతియును శైవసంతాన సంత
తియు భువనారాధ్య తేజోవిభాతిఁ - గ్రియగొని యతులభాగీరథీతీర్థ
భావనలోకముల్ పరమపావనము - గావింపమఱియట్లుగాక తదీయ
కేదారదేశికు గీతచరిత్రు - గాదిలిసుత చతుష్కముఁ జెప్పనొప్పు
మనుమపండితుఁడు భీమనపండితయ్య -
యును మహాదేవయ్యయును జెన్నవిభుఁడు
ననఁగ గురుచతుష్కమాత్మ సంతాన - తనయపరంపరోత్తర పరంపరలు
పరిచితగురుపరంపరఁ దేజరిల్లు - ధరవృషభేందు పాదచతుష్కసరణి
ధర్మవపురుషార్థ చతుష్క విస్ఫురణ - సవిశేషభక్తి మోక్షచతుష్క హేలి
వాలారు శ్రీనగద్వారచతుష్క - లీలవార్ధి చతుష్క వేలా ధరిత్రి
సముదిత మహిమఁ దచ్ఛైవ సంతాన - విమలాంబునిధి మధ్య విభ్రమాస్పద
నాయకరత్నంబు నాలోక గురు స - మాయత ప్రీతి నొప్పారెడుపాలి
సోమనాథయ్య విశ్రుత వీర భక్తి - భూమాభిరామ విస్ఫురణ వెలుంగ
వారి పుత్త్రులు భక్తివర్ధనపరులు - సూరీశ్వరుండు లోకారాధ్యపదవి
హరుండు విశ్వనాథప్పయ్యగారు - కారుణ్యనిధులు సింగన మంచిగారు
ననఁగ గురుత్రితయాన్వయ తనయు - తనయ పరంపరోత్తర పరంపరలఁ
బ్రభుతరగురుపరంపరఁ దేజరిల్లుఁ - ద్రిభువనంబులఁ బర్వు త్రిపథగ భాతి
వేదత్రితయభాతి విశ్రుతాగ్నిత్ర - యోదిత కలిత మహోన్నతఖ్యాతి."

మఱియు సోమనాథుఁడు గురుప్రశంసలో "ప్రసిద్ధి
బడిన శ్రీబెలిదేవి వేమ - నారాధ్యులను పరమారాధ్య దేవు
మనుమని శిష్యుండ"నని చెప్పికొనినాఁడు. బెలిదేవి వేమనారా

ధ్యుఁడు బసవేశ్వరపండితారాధ్యులకు సమకాలీనుఁ డయి నట్లు పండితారాధ్యచరిత్రమున వర్ణితమయిన యాతని చరిత మును బట్టి కాననగును. ఆతఁడును, పోరండ్ల నూఁరసానమ్మ మున్నగు వారును మల్లికార్జునపండితుని సందర్శించుటకేఁగి యాతనికి బసవేశ్వరుని మహిమాదికముల నివేదించినట్లు తెలుపు వాక్యముల నయిదవ ప్రకరణములో నిదివఱ కుదాహ రించియున్నాను. సోమనాథునకు బసవ పురాణకథాసూత్ర ముల నెఱిఁగించిన పెద్దలలోఁ గరస్థలి సోమనాథయ్య యొకఁ డని చెప్పి యాతఁడుగూడ సోమనాథుని విద్యా గురువులలో నొకఁడయి యుండునని తలంచుటకుఁగల కారణములను సప్తమ ప్రకరణమునఁ జేర్కొని యాతని వర్ణించు సోమనాథుని ద్విపద పంక్తులఁగూడ నుదాహరించియున్నాను. ఆ కరస్థలి సోమనాథుఁడు "పండితారాధ్య కృపాసముద్గతుఁడు" అని యం దులోఁ గలదు. దీనివలన నాతని దీక్షాగురువు పండితా రాధ్యుఁడని వ్యక్తమగును. వీరశైవ పంచాచార్యులలోని చతుర్థాచార్యుని కలియుగవ్యవహారనామము పండితా రాధ్యుఁడని మన మిదివఱకే గుర్తించియుంటిమి. అందుచేఁ గరస్థలి సోమనాథుఁ డా పండితారాధ్య పీఠమునకుఁ జెందిన శిష్యుఁడనికూడఁ దలంపనగును గాని, యంత కన్న నాఁ కాల మందున్న మల్లికార్జునపండితారాధ్యునివలన స్వయముగా లింగధారణ దీక్షవడసిన యాతని దయాహస్త గర్భ సము ద్భవుఁ డనుటయే సమంజసముగానుండును. కర్నూలు మండల మందలి త్రిపురాంతక క్షేత్రవాసియగు నాతఁడు గోదావరీ

మండలాంతర్గత దక్షారామ క్షేత్ర వాస్తవ్యుఁడగు మల్లికార్జున పండితుని వలన దీక్షనొందుట యెట్లు పొసంగునని కొందఱు సందియ మొందవచ్చును. కాని మల్లికార్జునపండితుఁ డాతని జనకులకు శ్రీశైల మల్లికార్జునస్వామి వరప్రసాదమున జనించిన వాఁడనియుఁ దలిదండ్రులా దేవుని పేరే యాతనికి బెట్టిరనియుఁ, బండితారాధ్యచరిత్రమున వర్ణితమయిన విషయముల గుర్తించినచో మల్లికార్జునపండితుఁడుగూడ నాతని జీవితకాలమునఁ దఱచుగా శ్రీశైలయాత్ర నొనర్చు చుండెననియు, నాసందర్భమున శ్రీశైల పూర్వద్వారమగు త్రిపురాంతకమును గూడ నాతఁడు దర్శించు చుండెననియు మనము సులభముగఁ దలంపవచ్చును. ఈ యాత్రాసందర్భముననే మల్లికార్జునపండితుని యనుగ్రహము నొంది కరస్థలి సోమనాథయ్య యాతని వలన దీక్షనొంది యుండునని యెంచఁదగును. ఆతఁడు బసవపురాణరచనాకాలమునకు వయోవృద్ధుఁడయి యుండును. కావునఁ బయి సంగతుల నెల్లఁ బర్యాలోచింప మల్లికార్జున పండితుని శిష్యుఁడగు కరస్థలిసోమనాథయ్యకుఁ బండితారాధ్యుని మనుమలగు మనుమ పండితాదులకుఁ బండితారాధ్యుని సమకాలికుఁడగు బెలిదేవి వేమనారాధ్యుని మనుమనికి సమకాలీనుఁడయి, వేమనారాధ్యుని మనుమనియొద్ద వేదవేదాంగాది విద్యలభ్యసించిన శిష్యుఁడయిన మన సోమనాథకవి క్రీ. శ. 1160 ప్రాంతమున జన్మించి బసవేశ్వరపండితారాధ్యుల నిర్యాణకాలమునకు బాలుఁడయి, క్రీ. శ. 1192-1195 ప్రాంతముల మొదటి ప్రతాప

రుద్రునికాలమున బసవపురాణాదికములను రచియించి, తరువాతఁ బరిణత ప్రాయమున క్రీ. శ. 1230 ప్రాంతమునఁ బండితారాధ్య చరిత్రమును రచియించి యటుపిమ్మటఁ గొలఁది కాలములో క్రీ. శ. 1240 ప్రాంతమున సిద్ధినొందియుండునని తలంచుటయే సర్వవిధముల సమంజసముగా నుండునని నా యభిప్రాయము. సోమనాథుని మిత్రులు నాతని కృతులకుఁ గథాశ్రోతలు నగు గోడగి త్రిపురారి, గొబ్బూరి సంగనామాత్యుఁడు, పాల్కురికి సూరనామాత్యుఁడు నను వారికాలములు మనకుఁ దెలిసినచో సోమనాథుని కాలమును నిర్బాధకముగ నిస్సందేహముగ నిర్ణయింప వీలుండునుగాని యందు కాధారములు గానరావు. వీ రా కాలమున దృఢవీరవ్రతముచే విఖ్యాతినొందినవారయ్యుఁ జారిత్రికముగ నంతగాఁ బ్రసిద్ధి కెక్కినవారు కారు. కావున వారు సోమనాథుని కృతుల మూలముననే మన కెఱుకపడినవారయినారు. పిడుపర్తి సోమనాథుని గ్రంథావతారికనుబట్టికూడ సోమనాథుని సన్మానించిన కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుఁడనియే తెలియుచున్నదిగాని గణపతిదేవుఁడనిగాని, యాతని తరువాత రాజ్యమేలిన రుద్రమదేవి యనిగాని తెలియరాదు. కావున సోమనాథుఁడు రెండవ ప్రతాపరుద్రునకు సమకాలీనుఁడు కాఁడని యితరబలవత్ప్రమాణములచే నేర్పడుచున్నప్పు డాతఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలముననుండి యాతనిచే సమ్మానితుఁడయినట్లు తలంచుటయే సత్యసమ్మతముగా నుండును. ఈ ప్రతాపరుద్రునకు రుద్రదేవుఁడనియేగాని ప్రతాపరుద్రు

డను వ్యవహారము లేదని కొందఱు వాదించెదరు. శాస్త్ర ములలో నీతఁడు తఱచుగా రుద్రదేవుఁడని యుదాహరింపఁబ డెను బ్రతాపరుద్రుఁ డను వ్యవహారముకూడ నీతనికి లే పో లేదు. ఈతనికి విద్యాభూషణుఁ డను బిరుదముగూడఁ గలదు. నీతిసార మను గ్రంథ మొకటి యీతఁడు సంస్కృతాంధ్రము రెంటనుగూడ రచియించినాఁడు. రెండవ ప్రతాపరుద్రునికంటె పూర్వుఁడును, నాతని మాతామహి రుద్రమదేవికి సామంతుఁ డును నగు బద్దెన (భద్రభూపాలుఁడు) తన నీతిశాస్త్రముక్తా వళిలోఁ బూర్వోక్తమయిన నీతిసారమును పేర్కొనుచు నందు బ్రతాపరుద్రుఁడనియే వ్యవహరించినాఁడు.

చ. పరువడి నాంధ్రభాషఁ గల బద్దననీతియు సంస్కృతంబులోఁ
బరఁగఁ బ్రతాపరుద్ర నరపాలునిచే రచియింపఁబడ్డ యా
నరవరు నీతిసారము వినం జదువం గడు మంచిదంచుఁ జె
చ్చెరఁ గవి నీతిపద్ధతులు చేసె వినోదము బాలబోధకున్.

కొన్ని శాసనములలోఁగూడ నీతఁడు ప్రతాపరుద్ర నామముతోనే పేర్కొనఁబడినాఁడు. కాకతీయ శాసనము లిప్పటికిఁ గొంతవఱకు లబ్ధములయినను బాలకురికి సోమనాథు నకుఁ బ్రథమ ప్రతాపరుద్రునకుఁ గల సంబంధమును బ్రక టించు శాసనప్రమాణ మొకటియు నింతదనుక లభింపకుండుట శోచనీయము. కొండవీటి దండకవిలెలో మాత్రము, శక సంవ త్సరము మున్నగు వివరములు లేని యొక శాసన ముదాహ రింపఁబడినది. అందులోని భాగము చూడుఁడు.

"దదా ధరణి కోటాఖ్యం, బ్రహ్మప్రీత్యా పురం ముదా
చంద్రార్ధమకుటప్రీత్యా, చంద్రవాదిపురం దదా

శైవార్పణబుద్ధ్యా వై, దదా విఘ్నపురం భువి
సోమనారాధ్యగురవే, పిడుపర్తి పురం దదౌ.
అదౌ ప్రతాపరుద్రాభ్యో, భూపాలో ధర్మ పూర్వకం
సప్తర్షి సంఖ్యయా గ్రామాన్, దదౌ సప్త ద్విజాయ తే
ఏవం ప్రతాపరుద్రాఖ్యః, కృతవాన్ రుద్రసంఖ్యయా.

ఈ శాసనమునఁ బ్రతాపరుద్రుఁడనియే కలదు. మొదటి ప్రతాపరుద్రుని కాలమునఁగాని, రెండవ ప్రతాపరుద్రుని కాలమునఁగాని సోమనారాధ్యగురుఁడు మఱొకఁ డెవఁడును దెలియరాఁడు. కావున నీ శాసనోదాహృతుఁడయిన సోమనారాధ్యుఁడు మన పాలకురికి సోమనాథుఁడే కాఁదగును. ప్రతాపరుద్రుఁ డొసంగిన పిడుపర్తి నాతఁడు శివరాత్రి కొప్పయ్య మున్నగు శిష్యుల కొసంగియుండును. ఆ గ్రామమును బట్టియే తరువాత నీవంశమువారికిఁ "బిడుపర్తి" యను గృహనామమేర్పడి యుండెను. గుంటూరు మండలమున, తెనాలి తాలూకాలో నిప్పుడొక "పిడుపఱ్ఱు" ఉన్నది. పిడుపర్తి సోమనాథకవివంశ్యులగు శ్రీ పిడుపర్తి రామలింగయ్యగారీ గ్రామము తమ పూర్వుల కగ్రహారముగా నియ్యఁబడినదే యని నాకొకమాఱు తెలియఁబఱిచిరి.

కర్ణాటకవులలో, ఉద్భట కావ్యకర్త సోమరాజుకంటె ముందుగా సోమనాథునిఁ బేర్కొన్న కవులెవరును గానరారు. ఇక నాంధ్రకవులలో నేను గుర్తించినంతవఱకు నీతనిఁ బేర్కొన్నవారిలో మొదటివాఁడు, శివయోగసార కర్తయగు కొలని గణపతిదేవుఁడు. ఈతఁడు రెండవ ప్రతాపరుద్రునికిఁ దరువాత నొక శతాబ్దిలోపల నున్నవాఁడు. ఆతఁడు తన గ్రంథ

మున నాంధ్రకవులలోఁ గవిత్రయమును మాత్రము పేర్కొ
యా తరువాత,

కం. అసమ శివభక్తి రసమా, నసునిం బాల్కురికి సోమనాథునిఁ గవిరా
జసమున్నత యశు సద్యః, ప్రసాదియగు చక్రపాణి రంగనఁ గొలతున్.

అను పద్యములోఁ బాలకురికి సోమనాథుని నాతని
బ్రత్యర్థిగానుండి మోటువడి, యా పిమ్మట సోమనాథునకు
శిష్యుఁడయిన చక్రపాణి రంగనాథునిఁ గలిపి ప్రశంసించి
నాఁడు. మఱేకవుల నాతఁడు పేర్కొనలేదు. సోమనాథుని
బసవపురాణమును గన్నడించిన భీమకవి తా నాపరివర్తనము
శాలివాహన శకము 1291 (క్రీ. శ. 1369) సంవత్సరమున
ముగించినట్లు చెప్పినాఁడు.

"...శివకవిదేవ నాత్మజ, సుమతి భీమనుభయ కవిత్వ సమర్థను సురవరో
కోవిదరు కేళొల్కితె నలుడు, దేవనిధినయనేందు సంఖ్యె గ
కోవిశకవరుషం గళాగలు సౌమ్యవత్సర, శ్రావణ బహుళ పక్షదశమీ
శివవారదొళాది వృషభేం. ద్రావతారద బసవచరితె సమాప్తి యాయిత్తు"

మఱియు నా గ్రంథము పాల్కురికి సోమేశ్వరుని బసవ
పురాణమునుబట్టియే రచియించితినని యాశ్వాసాంతములో
నిట్లు పేర్కొనినాఁడు.

"ఇదు సకళ మాహేశ్వరామళ, పదపయోజ పరాగమదష
ట్పదియెని పాల్కురికి సోమేశ్వరనకారుణ్య
బదవి కళాప్రపూరిత హృదయ భీమకవి ప్రణీతా
భ్యుదయ బసవపురాణ కథె యొళు అష్టమాశ్వాస";

ఆంధ్రకవి సార్వభౌముఁడు శ్రీనాథుఁడు క్రీ. శ. 1380
ప్రాంతమున రచియించిన శృంగార నైషధమునుబట్టి యాత

డంతకుమున్నే సోమనాథుని పండితారాధ్య చరిత్రమును బద్య కావ్యముగా రచియించినట్లు,

కం. జగము నుతింపఁగఁ జెప్పితి,
పెగ్గడయ్యకు నా యనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగు నా యారాధ్యచరిత యాదిగఁ బెక్కుల్.

అని కృతిపతి మామిడి సింగన వాక్యముగాఁ జెప్పఁ బడిన పద్యమువలన వ్యక్తమగును. ఇందలి యారాధ్యచరిత పండితారాధ్య చరిత్రమే యనుట శ్రీనాథుని భీమఖండ పద్యమువలన విశదమగును.

గీ. నవమరుత్తు చరిత్రంబు నైషధంబు
సప్తశతి పండితారాధ్య చరితమనఁగఁ
గావ్యములు పెక్కు చెప్పియుఁ గాంతు సనక
వెండియును గావ్యమొకటి గావింపఁదలఁచి.

ఈ పండితారాధ్యచరిత్రము సోమనాథుని ద్విపద కావ్యమునకుఁ బద్యానువాదమే యని పిడుపర్తి సోమనాథుని పద్యబసవ పురాణావతారికలోని

"హరభక్తి వైదికఁబని శ్రుతులిడి చెప్పెఁ, బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత
సరవి శ్రీనాథుఁ డా చరిత పద్య ప్రబంధముచేసె ద్విపదలు తఱచు నిలిపి."

అను వాక్యములవలన విస్పష్టమగును. కావున సోమ నాథుని పండితారాధ్య చరిత్రమును, శ్రీనాథుఁడు క్రీ. శ. 1395 ప్రాంతము నాఁటికే పద్యకావ్యముగ రచియించినట్టు తెలియఁగఁదగును.

సోమనాథుఁకు రెండవ ప్రతాపరుద్రుని (క్రీ॥ శ॥ 1290-

1326) కాలముననే యున్నవాఁడయినచో నటుతరువాత నింక సమీపకాలములో నాతని బసవపురాణపండితారాధ్యచరిత్రములు పైనిజెప్పినట్లు పరివర్తింపఁబడుట పొసఁగనేరదు. మఱియు విశ్వారాధ్యుఁ డను కర్ణాటదేశ పండితుఁడు మహిమ్నము, మల్హణము, మలయరాజీయము, అనామయము, హాలాయుధము నను శివపంచస్తవములకు సంస్కృతభాషలో వ్యాఖ్యానమును రచియించినాఁడు. ఆ గ్రంథములో నాతఁడు తాను "తటాకాబ్జరాజారాధ్యాన్వయుఁడ" నని చెప్పికొ నాఁడు. "తటాకాబ్జరా"జనునది "కెరెయపద్మరసు" అనుపదము కాతఁడొనర్చిన సంస్కృతీకరణము. కెరె యనఁగాఁ గన్నడమునఁ జెఱువని యర్థము. కర్ణాటదేశమందలి బేలూరు గ్రామమునఁ "బద్మరసు" తన యద్భుత మహిమచే నొక తటాకము గల్పింపఁగా నందువలన నాతనికి "గెరెయపద్మర" సను వ్యవహార మేర్పడినది. ఈ పద్మరసు కన్నడమున వీరశైవదీక్షాబోధ మున్నగు గ్రంథముల రచియించిన కవివతంసుఁడు. పద్మణాంకకవి పద్మరాజ పురాణ మను పేరితో నీతని చరిత్రమును క్రీ. శ. 1385 ప్రాంతమున రచియించి యందీతఁడు నరసింహ బల్లాళుని యాస్థానమున దండనాథుఁడుగానుండి పరమతీయపండితులఁ బలువుర నిర్జించినట్లు వర్ణించినాఁడు. ఈ నరసింహబల్లాళుఁడు క్రీ. శ. 1150,1160 ప్రాంతమువాఁడు. బసవేశ్వరున కించుమించుగ సమకాలికుఁడు. కావునఁ బయిఁ జెప్పిన విశ్వారాధ్యుఁడు క్రీ. శ. 1300 ప్రాంతమువాఁడు కాఁదగును. ఆతఁడు తన గ్రంథములో మల్హణస్తోత్రము

39 శ్లోకముల నిచ్చి, వానికి వ్యాఖ్యానముసేసి, వ్యాఖ్యావసానమునఁ బండితారాధ్య చరిత్రములోఁ బురాతనప్రకరణమున మల్లణుని కథలో సోమనాథుఁడు.

"తనరు సద్భక్తిఁ "గాంతాకచప్రచయ"
యనుచు నుద్యుక్తుఁడై హరుమనం బలరఁ
బ్రస్తుతాలంకార బంధుర మధుర
విస్తారమతి మల్లణస్తోత్ర మనఁగ
నప్పుడు ముప్పదియాఱు శ్లోకములు
సెప్పినంతట మెచ్చి శివుఁడు మల్లణుని."

అని వ్రాసిన వాక్యములఁ బురస్కరించుకొని యీ క్రింది విధమున వ్రాసినాఁడు.

"యద్యపికాంతా కచేత్యాది షట్త్రింశ ద్వృత్తై స్తోత్రమిదం మల్లణ్ణనాథాణీతి పాల్కురికి సోమేశ్వరేణ భణితం, తథాప్యుపరితనం వృత్తత్రయం బహుపుస్తకస్థితత్వా ద్బహుపాఠ సమ్మతత్వా ద్వ్యాఖ్యాతం వస్తుతస్తు యుక్తిమద్భిః ప్రతిక్షిప్తం శ్రీమత్సోమేశ్వరవచన ప్రామాణ్యాదితి సర్వం శివం." *

కావున నీ సంగతులఁ బట్టి కూడ సోమనాథుఁడు ప్రథమ ప్రతాపరుద్రుని కాలము వాఁడనుటయే సంగతముగానుండును. ఈ కారణములనెల్ల సమాలోచింప సోమనాథుని కాలము క్రీ. శ. 1160-1240 అని నిర్ణయించుట సమంజసముగానుండును. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కూడ బసవ

* పద్మనాంకుని పద్మరాజపురాణములోని వంశానుక్రమణికను బట్టి విశ్వారాధ్యుఁడు కరెయపద్మరసు పౌత్రుఁడేయని శ్రీవీరభద్రశర్మగారు "శివపంచస్తవి"యవతారికలో నిర్ణయించినారు. అట్లయినచో నాతఁడించుమించుగ సోమనాథుని సమకాలీనుఁడనియే చెప్పఁదగును.

పురాణ పీఠికలోఁ దాము గూడ నా నిర్ణయమునే యను
మించిరి. ఈ కాలనిర్ణయ విషయమున నాకు వారికి భేదా
ప్రాయములు లేవనియే చెప్పవచ్చును.

కాని శ్రీ చిలుకూరి నారాయణరావుగారు పండిత
రాధ్యచరిత్ర పీఠికలో సోమనాథుని కాలనిర్ణయ విషయ
మంగూడఁ గొన్ని పెడదారులు త్రొక్కుట శోచనీయము. సో
నాథుఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమునఁ గాని, రెం
ప్రతాపరుద్రుని కాలమునఁగాని గాక క్రీ॥ శ॥ 1247-12
మధ్య గణపతి దేవుఁడు నాతని కొమరిత రుద్రమదేవి య
వారి కాలములో నుండి క్రీ. శ. 1267 ప్రాంతమున బసవపు
ణము రచియించియుండునని యొకమాఱును, రెండవ ప్రత
పరుద్రుని కాలములోఁ గూడ నుండి క్రీ. శ. 1300 ప్రాంతము
పండితారాధ్యచరిత్రమును రచియించియుండునని మఱొ
మాఱును వీరు వ్రాసియున్నారు. ఈ నిర్ణయము కూడ సో
నాథుని కులగోత్రములఁ గూర్చి వీరు ప్రకటించిన య
ప్రాయములవలె "అయితే" "ఏమో" లపయినే యాధార
యున్నది. తమ యభిప్రాయముల కుపబలముగ శ్రీ నా
యణరావుగారు వెలువరించిన యుపపత్తులలో ముఖ్యములగు
వాని నీ క్రిందఁ బేర్కొనుచున్నాను.

1. కర్ణాటకవి చరిత్రకారులు శ్రీ నరసింహాచార్యులుగా రుదాహరించి
కన్నడకవి సోమరాజు పద్యములోఁ వ్రాఁతప్రతులలో "సాసి
నూఱెంసంద" అనుటకుమాఱు "సాసిరద నానూఱ్సెంద" అనుపా
గానవచ్చుచున్నది. ఇందుఁగూర్చి శ్రీ ఎ. వేంకటసుబ్బయ్య M. A.
Ph. D, గారు విమర్శనము ప్రకటించి "నూఱెంసిఁద" అను పాఠ

శ్రీనరసింహాచారిగా రెచ్చట గుర్తించిరని ప్రశ్నింపఁగా వా రందుకు సమాధాన మొసంగరయిరి. "నానూత్సింద" అనుపాఠము వ్యాకరణ దుష్టమవుటచే నది సరియైన కవిపాఠముయి యుండదని నరసింహాచారి గారే దానిని "నూటెంసింద" అని మార్చియుందురు. "సాసిరద నానూఱ్సింద నాల్వత్తునాల్కనె" యనుపాఠప్రకారము సోమరాజు ఉద్భట కావ్యము రచియించిన కాలము శాలివాహన శకము 1444 (క్రీ. శ. 1522) అని యేర్పడును గనుక నాతని పద్యమునుబట్టి యాతఁ డుదాహరించిన సోముఁడు మన సోమనాథుఁ డేయైనను దాని వలన నాతఁడు క్రీ. శ. 1522 పూర్వపువాఁడని మాత్రమే నిశ్చయ మగును.

2. (a) కర్నూలుజిల్లా మార్కాపురము తాలూకా త్రిపురాంతకములోని శాసనములు రెండింటిలో కాకతీయ గణపతిదేవుని కాలములో (క్రీ. శ. 1199–1260) రాజాజ్ఞ ననుసరించి విశ్వేశ్వరాచార్యుని కొడుకయిన శాంతి శంభుఁడు దేవాలయ గర్భగృహమును రాతితో శక (1177) సంవత్సరము (క్రీ. శ. 1255)లో కట్టించినట్లున్నది. (ఎ. పి. రిపోర్టు 1905 సం॥ 169–171)

(b) ఉత్తరార్కాడుజిల్లా ఆరణి తాలూకా దేవికా పురగ్రామము లోని బృహదంబాలయములో ఈ విశ్వేశ్వరాచార్యుని గుఱించిన ఒక శాసనమున్నది. అతఁడు శ్రీ గిరీశ్వరమువా డనిన్ని, శైవభక్తాగ్రే సరుఁడనిన్ని దానిలో ఉన్నది. (ఎ. పి. రిపోర్టు 1912 సం॥ నెం 393)

(c) త్రిపురాంత కేశ్వరాలయములోనే మఱొక శాసనములో గణపతి దేవుని రాజ్యకాలములోనే శక 1174 (క్రీ. శ. 1252) సంవత్సరము పరీధావిలో గోళగిమఠాధ్యక్షుఁ డయిన ధర్మశివాచార్యుని శిష్యుఁ డయిన విశ్వేశ్వర శివదేశికుఁడు కొంతసువర్ణము సమర్పించినట్లున్నది. (ఎ. పి. రిపోర్టు 1905 సం॥ నె 223 రు)

(d) మఱొక శాసనములో పై ధర్మశివాచార్యుఁడు గోళగి మఠాధ్యక్షుఁ డయిన భీమశివాచార్యుని శిష్యుఁడనియు, గోళగిమఠము "నవలక్ష దాహళ త్రిపురి"లో నున్నదనియు, ధర్మశివాచార్యుఁడు, ఈశ్వరుని

భండారమునకుగాను ఒకమఠమును కట్టించినాఁడనిన్ని, ఉన్న ఈ శాసనము శక 1169 ప్లవంగలో (క్రీ. శ. 1247) చెక్క బడినది.

(e) అట్లే ఆ ఆలయములోనే సోమాచార్యుని శిష్యుఁడయిన సిద్ధ కొడుకు నారప శక సం॥ 1189 ప్రభవ (క్రీ. శ. 1267) లో ములకుగాను ఆవులను దానము చేసిన ట్లొకశాసనమున్నది.)

(ఎ. పి. రిపోర్టు 1905 నె 247 రు)

(f) ఆ ఆలయములోనే కాకతీయ గణపతిదేవ మహారాజు వేయిం ఒక అసంపూర్ణ శాసనములో శక సంవత్సరము 1174 (క్రీ. శ. 1252) గోళగి మఠాధ్యక్షుఁడయిన ఒక శైవగురుని వన ఉన్నది. గోళగిమఠమునకు మూడులక్షల గ్రామములమీద కార మున్నదట. (ఎ. పి. రిపోర్టు 1905 నె 195 రు)

పైని వివరించిన శాసనములలోని "విశ్వేశాచార్య" "విశ్వే చార్య" "అనే పేరుగల వారొక్కరే అనియు, కరస్థలి విశ్వనాథయ్య పేర్లే అవి అనియు, నేననుకొంటున్నాను. సోమాచార్యుఁడే కర సోమనాథయ్య అని నా అభిప్రాయము. గణపతిదేవుని శక సం॥ 11 రపు శాసనములోని గోళగి మఠాధ్యక్షుఁడయిన శైవాచార్యుడు గో పురారి అని చెప్పవచ్చునేమో! నా అభిప్రాయము సరియైతే వై సమకాలికుడయిన పాల్కురికి సోమనాథుఁడు మొదటి ప్రతాప కాలమువాడు కాని, రెండోప్రతాపరుద్రుని కాలమువాడు కాని కాకతీయ గణపతిదేవ మహారాజు కాలము వాడనియు, క్రీ. శ. 1247- సంవత్సరములకు మధ్యకాలమున ప్రసిద్ధికెక్కిన వాడనియును, దేశ క్రీ. శ. 1267 కరస్థలి సోమనాథయ్యగారి కాలము గనుకను అతడు వాడై ఉండగా అతని అనుమతి చొప్పునను, ఇతరులైన పెద్దల అను చొప్పునను బసవ పురాణమును సోమనాథుఁడు రచియించడముచేత పురాణ రచనాకాలము క్రీ. శ. 1267 అని యిప్పటికి నిర్ణయించవచ్చు అప్పటికి సోమనాథుడు చిన్నవాడై 25-30 సంవత్సరములకు మధ్యవయ వాడై ఉంటాడు............, కాబట్టి అతడు పండితారాధ్య చరిత్ర

క్రీ. శ. 1300 సం॥ర ప్రాంతమున రచియించి ఉండునని నిశ్చయించ వచ్చును అందుచేత సోమనాథుఁడు కాకతీయ గణపతి దేవుని కాలములోను, రుద్రాంబ కాలములోను, రెండవప్రతాపరుద్రుని కాలములోను, కూడా ఉన్నవాడవుతాడు. పిడుపర్తి సోమన బసవ పురాణములో చెప్పిన ప్రతాపుని కాలమున కాతఁడు వృద్ధాప్యమును సమీపిస్తూ శిష్యులతో దేశసంచారము చేస్తూఉండే వా డన్నవిషయము యథార్థ మవుతుంది."

3. "పేరెన్నబడిన శ్రీ బెలిదేవవేమ, నారాధ్యులను పరమారాధ్య దేవు మనుమని శిష్యుండ"నను సోమనాథుని వాక్యమునుబట్టి యాతని విద్యా గురువునకు దాతయైన బెలిదేవవేమ నారాధ్యుఁడున్నూ, పండితారాధ్య చరిత్రమున బసవేశ్వర పండితారాధ్యులకు సమకాలికుఁడుగా వర్ణింపఁబడిన బెలిదేవవేమనారాధ్యులును ఒకరు కానట్లు తోస్తుంది. ఒక్కరే అయితే అతనికి సోమనాథుఁడు మనుమని శిష్యుఁడు కాఁబట్టి వా రిద్దరికిని డెబ్బైయేండ్లకంటె ఎక్కువ ఎడముండదు. కాఁబట్టి సోమనాథుని గురువు, తాత, అయిన బెలిదేవ వేమనారాధ్యులు పండితారాధ్యునికి సమకాలికుడయినవాడు కాడు. అట్లే బసవపురాణ రచనా సందర్భమున ఉండిన కరస్థలి సోమనాథయ్య "పండితారాధ్య కృపా సముద్గతుఁడు" అని చెప్పినప్పుడు పండితారాధ్యుడు మల్లికార్జున పండితారాధ్యుడే అని సందేహము లేకుండా చెప్పడమునకు వీలులేదు. అట్లే "కరస్థలి" శబ్దము నాధారముగాఁ జేసుకొని సోమనాథుని కవితా గురువయిన కరస్థలి విశ్వనాథయ్య సోమనకు బసవపురాణకథ చెప్పిన వారిలో ఒకఁడయిన కరస్థలి సోమనాథయ్యకు సోదరుఁడని చెప్పడము కూడా తగదు.

4. సోమనాథుని పండితారాధ్య చరిత్ర రచనము నాటికి పండితారాధ్యుని శిష్యుఁడును బుత్త్రులును సజీవులయి యున్నారనియు, మనుమలు పేర్వోలయి యున్నారనియు, చెప్పడము సమంజసము కాదని తోస్తుంది. పండితారాధ్యచరిత్రోపసంహారవాక్యములలో కేదారయ్య పుత్రులనలుగురి "ఆత్మసంతాన తనయ పర పరోత్తర పరంపరలఁ బరిచిత గురు పరఁపరఁ దేజరిల్లు"అని చెప్పఁబడినది. అంటే వారి తరువాత అనేక

తరములు గడచినవని అర్థము వస్తుంది కాని సోముని కాలము వారున్నారని చెప్పవీలులేదు. అట్టి "శైవసంతానవిమలాంబునిధి ... విధు మానర్ఘ్యనాయకరత్న"మై ఒప్పారు ఇవటూరి సోమన్న గారి ముగ్గురుపుత్రులయిన సూరీశ్వరుడు విశ్వనాథప్పయ్యగారు, ... మంచిగారు గురుత్రితయముగా పేరుపొందినారు. ఆ "గురుత్రితయ ... న్వయ తనయతనయ పరంపరోత్తర పరంపరలు—ప్రభుతర గురుపరంపర దేజరిల్లె" అంటే సోమనాథునికిని పండితారాధ్యునికిని మధ్య ... తరముల అంతరమున్నదని సుస్పష్ట మవుతున్నది."

5. సోమనాథుడు పదునొకండు పదిరెండవ శతాబ్దులందుండిన ... పండితారాధ్యుడు మున్నగు భక్తులను, కుమార పాలఘూర్జరుడు ... చోడుడు, విక్రమచోడుడు వీరచోడుడు మొదలగు భూపాలుర ... బండితారాధ్య చరిత్రమున నాయా కథలలో పేర్కొనినాడు. శ్రీ ... పండితునిగూర్చి చెప్పుటలో "తొల్లి"యను ప్రాచీనతావ్యంజక ... శబ్దమును బ్రయోగించినాడు. అతడు చెప్పిన కథలలోగూడ ... వ్యత్యాసములున్నవి. ఇందుచేఁ గూడ సోమనాథుడు పదిరెండవ శతాబ్ది తరువాత జాలినంత దూరముగా నున్నవాడు కావలెను.

శ్రీ నారాయణరావుగారు గైకొనిన ఈ యుపపత్తుల పాటవ మే పాటిదో చిత్తగింపుడు.

(1) ఉద్భట కావ్యకర్త సోమరాజు పద్యము ... గూర్చి శ్రీ ఎ. వేంకట సుబ్బయ్యగారు ప్రకటించిన విమర్శనమునకు శ్రీ నరసింహాచారిగారు 1929 లో ప్రకటించిన కర్ణాటకవిచరిత్ర మూడవ భాగము నవ ... కలో సమాధానముల నొసంగి సోమరాజు కాలమును గూర్చి తమ పూర్వాభిప్రాయమునే సమర్థించుకొనియున్నారు. కాన నారాయణరావుగారు వ్రాసినట్లు శ్రీ నరసింహాచారిగారు ఆ విషయమై యుదాసీనులై యుండలేదు. వ్రాతప్రతులలో

పాఠమును దమకుఁ బూర్వాభిప్రాయ మొకటి లేనప్పు డకారణ ముగ మార్పవలసిన యవసరము లేదనియు "సాసిరదనూఱిం నంద" అను పాఠము దమకప్పుడు లభించిన వ్రాఁత ప్రతులలోఁ గానవచ్చుటచేతనే గ్రహించితిమిగాని "సాసిరదనా నూఱ్నంద" అను వ్యాకరణదుష్టపాఠము వ్రాఁత ప్రతులలోనుండఁగా దానిని "సాసిరదనూఱింనంద" అని తాము మార్చి యుండ లేదనియుఁ గొత్తవాదమును దెచ్చి పెట్టఁదలఁచిన శ్రీ వేంకట సుబ్బయ్యగారికే తమ వాదానుగుణముగఁ గవి పాఠమును మార్పవలసిన యవసర మేర్పడు నేమోగాని, కర్ణాటకవిచరిత్రము మొట్టమొదట వ్రాయునప్పు డట్టి కృత్యముతోడి నిమిత్తము దమకుఁ గలుగనేరదనియు, శ్రీ నరసింహాచారిగారు వ్రాసియున్నారు. వ్రాఁతప్రతులన్నిటిలో "సాసిరదనా నూఱ్నంద" అను పాఠమే యున్నచో నందువలన 300 సంవత్సరములకాలభేద మేర్పడుచున్నప్పు డాపాఠము వ్యాకరణ దుష్ట మయినంతమాత్రమున శ్రీ నరసింహాచారిగారివంటి ప్రామాణికచరిత్రకారుఁడు స్వయముగ దానిని "సాసిరద నూఱింనంద" అని మార్చివేసి సోమరాజును మూఁడు వందల సంవత్సరములు ముందుకుఁ దెచ్చుటకుఁ బ్రయత్నింప సాహసించునని సహృదయు లెవ్వరయినఁ జెప్పనేర్తురా! వ్రాఁత ప్రతులు గొన్నిటిలో నయిన "సాసిరద నూఱింనంద" అను పాఠమున్ననేగాని వారు దానిని గయికొని యుండరు. కొన్ని ప్రతులలో వ్యాకరణదుష్టమగు మఱొక పాఠమున్నచో దానినే కవిపాఠమని, నిర్దుష్టపాఠము వేఱొండు కానవచ్చు

నప్పుడు విజ్ఞులు గ్రహింపఁజాలరు. ఇంతకు సోమరాజు పేర్కొ
వీరశైవకవులు హరీశ్వరుఁడు, పద్మరసు, సోమనాథుఁ
ముప్పురుకూడ నించుమించుగ సమీపకాలమువారు. మొ
యిద్దఱు నేకకాలమువారే యనుటకుఁ బ్రబలాధారము లనేక
లున్నవి. అట్టిచో వారితోఁ గలిపి స్తుతించునప్పుడు సో
నాథుఁడు వారికంటెఁ జాలఁ దరువాతివాఁడయినచో సోమ
జాతని నచ్చటఁ బేర్కొనియే యుండఁడు. మఱియు నితర
లెవరిని నాతఁడు తన కృతిలోఁ బేర్కొని యుండ లేదు. ఆట
క్రీ॥ శ॥ 1522 ప్రాంతము వాఁడయినచో సోమనాథుని బస
పురాణమును క్రీ॥ శ॥ 1369 లోఁ గన్నడించిన సుప్రసిద్ధ
శైవకవియగు భీమకవినయినఁ దన కృతిలోఁ బ్రశంస
కుండునా? ఇది యిట్లుండ క్రీ॥ శ॥ 1559 ప్రాంతమువఱ
డాళవ కొంకణదేశములఁ బరిపాలించిన సాళ్వదేవభూపాలు
యాశ్రితుఁడయి క్రీ॥ శ॥ 1550 ప్రాంతమున "రసరత్నాకర"మ
నలంకార గ్రంథమును రచియించిన సాళ్వకవి తనగ్రంథము
శృంగారసార మను నామాంతరముగల సోమరాజు న
కావ్యమునుండి లక్ష్యముల నొసంగియున్నాఁడు. సోమరాజు
క్రీ॥శ॥ 1522 లోనే రచియింపఁబడియున్నచో నిది యొసంగియుం
నేరదు. కావున సోమరాజు కావ్యము క్రీ శ॥ 1222 ప్రాం
మున రచియింపఁబడి యుండుననుటయే సర్వవిధముల సమం
ముగాఁ గానఁగును.

సోమరాజు తన గ్రంథరచనా కాలమును బేర్కొ
టలో నొక్క సంవత్సరమునేగాక ఆశ్వయుజ శుద్ధ

బుధవారమని మాస తిథి వార వివరములఁగూడ నుదాహరించి యున్నాఁడు. (Indian Chronology) అను గ్రంథములోని గణనవిధి ప్రకారము గణించిచూడ శాలివాహనశకము 1144 (క్రీ॥ శ॥ 1222) చిత్రభాను సంవత్సరములో ఆశ్వయుజశుద్ధ ఏకాదశి ఆదివారమగుచున్నది. 1444 (క్రీ॥ శ॥ 1522) లో నయినచో నది బుధవారమగును. దీనినిబట్టి సోమరాజుకాలము క్రీ॥ శ॥ 1522 సంవత్సరమేయని కొందఱు వాదింపవచ్చును. ఎమ్. గోవిందపాయి అనువారు స్వదేశాభిమాని పత్రిక యందును, కన్నడసాహిత్యపరిషత్పత్రికయందును, నిందుఁ గూర్చి వ్యాసములుగూడ వ్రాసియున్నారు. కాని పూర్వో క్తములయిన ప్రబలాధారముల నిది బాధింపఁజాలదనియు క్రీ॥ శ॥ 1222 లోఁ గాకున్నను నంతకుమున్ను గడచిన క్రీ॥ శ॥ 1221 వృష సంవత్సరములో ఆశ్వయుజశుద్ధ ఏకాదశి బుధవార మగుచున్నదనియు శాసనములలోఁగూడఁ గొన్ని యెడల నిట్టి వ్యత్యయములు గానవచ్చుననియుఁగాని యందుచే నందు లిఖింపఁబడిన మాస తిథి వారములలో నేదియే నొక స్వల్పవ్యత్యాసమున్నచో నంతమాత్రమున శాసనకాలము నే మార్చుటకుఁ జరిత్రకారులెవరు నంగీకరింపఁ జాలరనియు శ్రీ నరసింహాచారిగారు వ్రాసియున్నారు.

ఏది యెట్లున్నను నితరమార్గము లనేకము లున్నప్పుడు కేవలము సోమరాజు పద్యమునుబట్టియే మనము సోమనాథుని కాలమును నిర్ణయింప నవసరము లేదు. బెలిదేవి వేమనారా ధ్యుని మనుమని శిష్యుఁడ నని సోమనాథుఁడు స్వయముగ

వ్రాసికొనిన వాక్యమే యతఁడు క్రీ॥ శ॥ 1160-1240 మధ్య కాలమున నుండెననుట కప్రతిహతమగు నాధారము కాఁగలదు.

2. బదరీబాదరాయణ సంబంధములఁ గల్పించుటలో శ్రీనారాయణరావుగారు చాల నాఱితేఱినవారుగఁ గాన్పింతురు. గ్రంథస్థ నామముల కెట్లయిన నేవో కొన్ని శాసనస్థ నామములతో సంబంధము ముడివెట్టి యా యా పురుషుల కైక్యము నాపాదించుటలో వీరి కుబలాటము మెండు. సోమనాథుని కాలనిర్ణయ ప్రకరణముననే బసవపురాణ కథానాయకుఁడు, బిజ్జలుని సచివుఁడు, మండఁగి మాదిరాజపుత్త్రుఁడు, కూడలి సంగమేశ్వర సేవాపరతంత్రుఁడు నగు సంగన బసవేశ్వరుని చారిత్రిక వ్యక్తిత్వమును నిరూపించుటకయి వీరందు కుపకరించు "అర్జునవాడ శాసనము"మున్నగు సరియైన శాసనములను జూడనైనఁ జూడక, చిత్రచిత్రములగు భ్రమప్రమాదములకు లోనయి బిజాపూరుజిల్లా మనగోలి (మణిఁగవల్లి) శాసనములలో రెండవ జగదేకమల్లుని క్రీ. శ. 1142 ప్రాంతమునాఁటి శాసనములో నప్పటికే పూర్వుఁడుగ నుదాహృతుఁడయిన కాశ్యపగోత్రుఁడు చండిరాజ పుత్త్రుఁడు నగు బసవరసయ్య యను నొక పూర్వవ్యక్తితోను, బళ్ళారిజిల్లా బదవాయి గ్రామ సుంకలి విఘ్నేశ్వరాలయములో క్రీ. శ. 1217 ప్రాంతమునఁ జెక్కఁబడిన మఱొక శాసనములోఁ బేర్కొనఁబడిన హొయసలరాజుల సేనానాయకుఁడు, కలియమృతదండనాథుని పుత్త్రుఁడు, రణధవళబిరుదాంచితుఁడు నగు బసవన దండనాయకుఁ డను మఱొక తరువాతి కాలపు వ్యక్తితోడను

గల్యాణ బసవేశ్వరునకు సంబంధము ముడివెట్టి వారితో నాతని కైక్యము ఘటించియున్నారు. ఇందలి యసందర్భముల నెల్ల వెలువరించుచు "బసవేశ్వరునిఁ గూర్చిన శాసన సామగ్రి" (విభూతి సం 2 సం 4) అను వ్యాసములో వారి నిర్ణయము నందలి యసత్యమును విస్పష్ట మొనర్చి యుంటిని. ఇట్లే కాకతి గణపతిదేవుని దీక్షాగురుఁడు, గోళకిమఠాధీశ్వరుఁడు, శివ దేవయ్య, యను వ్యవహార నామము గలవాఁడునగు విశ్వేశ్వర శివదేశికునకు సంబంధించిన శాసనములఁ గొన్నిటిని చేర్చి సోమనాథుని కవితాగురుఁడగు కరస్థలి విశ్వనాథునకు నాతనికి నైక్యానుసంధానమును గూర్పఁ బ్రయత్నించినారు. సుప్రసిద్ధ మగు మల్కాపుర శాసనమును బట్టి విశ్వేశ్వర శివాచార్యుని వివరములు, గోళకి మఠవృత్తాంతము విపులముగఁ దెలియఁ గలవు. ఆశాసనము పేరయిన శ్రీనారాయణరావుగా రెత్తుకొన రయిరి. ఆశాసనమునుబట్టి విశ్వేశ్వర శివాచార్యుఁడు ధర్మశివా చార్యుని తనయుఁడనియు మధ్య హిందూస్థానమున నర్మదా భాగీరథీనదీ మధ్యగతమగు దహాలమండలమందు మునుముందు స్థాపితమయిన గోళకి మఠమునకుఁ జెందినవాఁడనియుఁ గలచురి క్ష్మాపాలురకుఁ గాకతిగణపతిదేవునకు దీక్షాగురువనియు నతఁడు దశవిధశైవములలో నాల్గవదియగు శుద్ధశైవ సంప్ర దాయమునకుఁ జేరినవాఁడనియుఁ దెల్లమగును. శుద్ధశైవమత మునకొసంగఁబడిన దానప్రస్తావనకూడ నందుఁగలదు. శుద్ధ శైవసంప్రదాయమువారు పీఠస్థలింగపూజ గావింతురు. వీర శైవులకువలెఁ గరస్థలశివపూజ వారికి విహితముగాదు. కరః

స్థలి సోమనాథుఁడు విశ్వనాథుఁడు నిరువురుగూడ నిష్టలింగ ధారులగు వీరశైవులని సోమనాథుని వ్రాఁతలవలన సువ్యక్తమగును. పౌరుషేయకమగు "కరస్థలి" గృహనామముగూడ నా విషయమును విశదీకరించును. గణపతిదేవుని గురువగు విశ్వేశ్వరశివదేశికుని గృహనామము మనకుఁ దెలియరాదు. అతఁడే సోమనాథుని గురువు. కరస్థలి విశ్వనాథుఁడని తలంచుట వట్టి దుర్భ్రమయని చెప్పనవసరము లేదు. అతనికి విశ్వనాథుఁ డను వ్యవహారనామమున్నట్లు కానరాదు.

పైనిజెప్పిన 2 (ఇ) లోఁ జేర్పఁబడిన ఎపిగ్రఫీ రిపోర్టు నెం. 247/1905 రులో నుదాహృతుఁడయిన సోమాచార్యుఁడే కరస్థలి సోమనాథయ్య యనియు, దానినిబట్టి యా శాసనకాలమగు క్రీ. శ. 1267 ప్రాంతముననే బసవపురాణము రచియింపఁబడెనని నిరూపించుటయుఁ గూడ నసంగతమే. సోమాచార్యుఁడే కరస్థలి సోమనాథుఁడనుట కెట్టి యాధారమును లేదు. ఒకవేళ వాదమునకది యంగీకరించినను క్రీ. శ. 1267 అతని కాలమని యా శాసనమువలన నేర్పడఁజాలదు, ఈ శాసనమును వేయించినవాఁడు సోమాచార్యుని శిష్యుఁడో శిష్యపుత్త్రుఁడో యగు నారప. అందువలన సోమాచార్యునికాలము మఱి ముప్పది నలువది సంవత్సరముల ముందుకుఁ బోవలసియే యుండును. సోమనాథునిగ్రంథములలో నెచ్చటను గోళకీమఠ ప్రశంసగాని, విశ్వేశ్వరశివాచార్యుని నామోల్లేఖనముగాని లేదు. సోమనాథుని బసవపురాణము గణపతిదేవుని కాలముననే రచియింపఁబడియున్నచో సోమనాథుఁడు సుప్రసిద్ధుఁడగు

విశ్వేశ్వరశివ దేశికుని నే సందర్భముననయిన నా గ్రంథమునం జేర్చనియే యుండును. కావున నారాయణరావుగారి వ్రాఁత లంతమాత్రము ప్రమాణములు కావు. కరస్థలి సోమనాథ విశ్వనాథులకు గోళకి మతమునకు నెట్టి సంబంధమును లేదు. అనుభవసారకృతిపతియగు గోడగి త్రిపురారికిఁగూడ నీ మత మునకు నెట్టి సంబంధమును లేదు. గోడగి యను నీతని యింటి పేరు గోళకి శబ్దమునుబట్టి యేర్పడినదికాదు. దీనికది వికృతి కాదు. ఇందుఁగూర్చి సోమనాథుఁడే త్రిపురారి తండ్రి నార యను వర్ణించునెడ నీ క్రిందివిధముగఁ జెప్పినాఁడు.

కం. గోడగమగు సంసారము, గోడగమని తెలుపఁబూని గోపతియెదురన్
గోడగమాడెడి కతమున, గోడగి నారయ్య నాఁగఁ గొలలు ధరిత్రిన్.

3. బసవేశ్వరుని నిర్యాణకాలము క్రీ. శ. 1168 అనియు, మల్లికార్జునపండితుఁడు బసవేశ్వరుని యనంతర మావెనువెంటనే క్రీ.శ.1170 ప్రాంతమున లింగైక్యమయ్యెననియు, నేఁజేయు నిర్ణయమును శ్రీ నారాయణరావుగా రంగీకరించియున్నారు. అట్టియెడ వారిరువురకు సమకాలికుఁడుగఁ బండితారాధ్యచరి త్రమున వర్ణితుఁడయిన బెలిదేవి వేమనారాధ్యుఁడు సోమనా థుని గురువుయొక్క తాత కాఁడని, వారు వ్రాయుటలో సార స్యము లేదు. పోరండ్ల సూరసానమ్మ మున్నగు భక్తులతో బసవేశ్వరునండి పండితారాధ్యుని యొద్దకేఁగి యాతనికి బస వని మహిమాదికములఁ జెప్పినట్లుగా వర్ణితుఁడయిన బెలిదేవి వేమనారాధ్యుఁడు పండితారాధ్యచరిత్రమునఁ బురాతన ప్రకరణమునందు సర్పదష్టుఁడయి మృతినొందిన నృపకుమారుని

నిజమహిమచే బునరుజ్జీవితునిగ నొనరించిన జెలిదేవి వేమ
రాధ్యుడు నేకవ్యక్తియేయని యాగ్రంథమును
వారికి గోచరింపక పోదు. "పేరెన్నఁబడిన శ్రీ బెలిదేవి వేమ
నారాధ్యులను పరమారాధ్య దేవు। మనుమని శిష్యుండ"
సోమనాథుఁడు చెప్పిన వాక్యమే, పూర్వోక్తమయిన
ప్రదాన మహిమచే బేరెన్నికగన్న యా వేమనారాధ్యు
సోమనాథుని గురువునకుఁ దాతయని విశదీకరించును. పండి
తారాధ్య చరిత్రమున వర్ణితమయిన యీ వేమనారాధ్యుని
త్రములో నాతఁడు చతుర్వేద పారగుఁడని బసవేశ్వరున
భక్తిగలవాఁడని చెప్పఁబడినది.

"అకలంక దివ్యాగ మారసంవేత్త, ప్రకట చతుర్వేద పారంగతుండు"
బసవపాదాంభోజ భజన స్వాంతుఁ, డసమశాపానుగ్రహ సమగ్ర
నానతజన మృత్యు హరణ ప్రభావుఁ, డానతజన పునరాయుః ప్రదా
సర్పవృశ్చిక మృగ శ్వసనజలాగ్ని, దర్పిత నృపచోర దర్పాపహరుఁడు...
"శరణపదాబ్జ భాస్వర మకరంద, పరిశేష సర్వాంగు బసవాంతరంగు."

మున్నగు విశేషణముల నరయుఁడు. ఈ వేమనారా
నింట వేదవిద్య యనూచానముగ నున్నట్లున్నది. అందుచే
యాతని మనుమనికి శిష్యుఁడయి సోమనాథుఁ డాతనియొద్ద
వేదాంగముల నేర్చి పండితారాధ్యచరిత్ర కాలమునాఁటికి "
బాల్కురికి సోమనాథుండనంగ - వెలయువాఁడను
పారగుఁడ"నని చెప్పికొనఁదగినంత వేదవిద్యాపారీణుఁ
నాఁడు. నారాయణరావుగారు తామేర్పఱచుకొన్న నిర్ణ
ములకు సరిపడవలెనని యయినవానిని గాదని, కాని వాని
నని, తాఱుమాఱు చేయుటవలనఁ బ్రయోజనము లేదు.

నాథుఁడు బసవేశ్వరపండితారాధ్యులఁ గూర్చి స్వయముగా నెఱింగినవాఁడు కాఁడని యస్మదాదులు చెప్పుటయందలిభావము వారి నిర్యాణకాలమున కాతఁడు బాలుఁడవుటచే వారి చరిత్రముల నంత సాకల్యముగ స్వయముగనెఱుఁగక వినికిలివలనఁ దెలిసికొన్నవాఁడని చెప్పుటయేగాని యాతఁడు వారి యనంతరము చిరకాలమునకు జనించినవాఁడని నిరూపించుటకాదు. వేమనారాధ్యుని మనుమఁడు తాతగారి జీవితకాలముననే జన్మించియుండును. అతఁడు సోమనాథునికంటె నే యిర్వది యేండ్లో పెద్దవాఁడయి యుండును. పండితారాధ్యుని శిష్యుఁడగు కరస్థలిసోమనాథయ్యను స్వయముగా నెఱింగి పండితారాధ్యుని మిత్రుఁడగు వేమనారాధ్యుని మనుమనికి శిష్యుఁడయిన సోమనాథుని జననకాలము క్రీ. శ. 1250 ప్రాంతము దనుక దిగలాగుట సమంజసముకాదు.

(4) పండితారాధ్యచరిత్రమునందలి యుపసంహార వాక్యములనుబట్టి యా గ్రంథరచనమునాఁటికిఁ బండితారాధ్యుని యాత్మసంతానమునకు సంబంధించిన మనుమలు గతించిరనియు, వారితరువాత మఱికొన్నితరములుకూడఁ గడచెననియు, శైవ సంతానమునకుఁ జెందిన ఇవటూరి సోమనాథయ్య పుత్త్రుల విషయమునఁగూడ నట్లే జరగెననియు, శ్రీ నారాయణరావుగారు తలంచుట సరికాదు. ఉభయత్రకూడ "గురుపరంపర దేజరిల్లు" అని సోమనాథుఁడు ఆశీరర్థసూచకముగ "తేజరిల్లు"అను తద్ధర్మక్రియచే యుపయోగించినాఁడు. శ్రీ నారాయణరావుగారు, శైవ సంతానవిషయమున "తేజ

రిల్లు" అనురూపమును "తేజరిల్లె"అని భూతకాలిక క్రియా రూపకముగ మార్చి ముద్రించి, పుటయడుగున "తేజరి అను రూపమును పాఠాంతరముగ సూచించుట న్యాయ కాదు. పూర్వ ముద్రిత ప్రతులలో రెండు తావులఁగూడఁ తాత్పర్యకరూపమేయున్నది. ఇది కేవల మాశీరర్థరూపక తాత్పర్యకము. కాకున్నచో నిచ్చట సోమనాథుఁడు చెప్పిన "త య-తనయ పరంపరోత్తర పరంపరలు" గ్రంథ రచనముు టికి వాస్తవముగ గతించిన భూతకాలికపరంపరలే య యర్థముచేసెడిచో సోమనాథునికాలము నింకను గొన్ని శత బ్దులుక్రింద కీడ్వవలసియేయుండును. "త్రిభువనంబులఁ బర్వె ది త్రిపథగభాతి" అనుచోఁ గూడ "పర్వె" అను ముద్రిత పా ముతప్పు. త్రిభువనంబులఁ బర్వునది త్రిపథగ (భాగీరథి)గా పండితారాధ్యునివంశముగాదు. ఇచ్చటఁగూడఁ ద్ధర్థ రూపమే కవిసమ్మతము. ఆక్రిందిపంక్తులయందలి క్రియారూ ప్రక్రమము చూచునది. "తేజరిల్లె" "త్రిభువనంబులఁబర్వె" అని రెండును గూడఁ బూర్వోక్తమయిన యన్వయపరంపరల నన్వయింపఁదగదు. పండితారాధ్యుని పుత్త్రుఁడు కేదారయ్య శిష్యుఁడు దోనయ్య, కేదారయ్యశిష్యుఁడు ఇవటూరి సోమ నాథయ్య, యీ మూవురిమాట యెట్లున్నను బండితారాధ్య చరిత్రము రచియింపఁబడునప్పటికిఁ బండితారాధ్యుని మనుమలు మనుమపండితుఁడు మున్నగు నలువురును, ఇవటూరి సోమ నాథయ్య పుత్త్రులు సూరీశ్వరుఁడు మొదలగు ముప్పు జీవించియున్నట్లే సోమనాథుని వర్ణనమునుబట్టి సహృదయు

ము గోచరించును. ప్రభాకరశాస్త్రిగారిదృష్టికి, నాదృష్టికి గూడనట్లే గోచరించుచున్నది. శ్రీ నారాయణరావుగారికి వేఱుగాఁ గాన్పించుట శోచనీయము.

(5) ఇఁక సోమనాథుఁడు పదిరెండవ శతాబ్దిలో వెలసిన భక్తులను రాజులను దన గ్రంథములలోఁ బేర్కొనిన మాత్రమున నాతని కాలమటుతరువాతఁ జాల వెనుకకు జరుపవలెనని తలంచుట సమంజసముకాదు. తనకొకింత ముందు సమీపకాలములో వెలసిన బసవేశ్వరపండితారాధ్యులచరిత్రముల నాతఁడు తాను విన్నవిధమున రచియించినట్లే వారికి సమకాలీనులును గొంత పూర్వులు నగు నితరభక్తుల చరిత్రములఁగూడఁ దచ్చరిత్రములందు వర్ణించినాఁడు. కుమారపాలఘూర్జరుఁడు పదిరెండవ శతాబ్దిలో సౌరాష్ట్రదేశము నేలిన జైనరాజనియు, నాతనిని సోమనాథుఁడు పరమ శైవునిగా వర్ణించుట సరిగాదనియు, జనశ్రుతిలో నేర్పడిన తాఱుమాఱులఁబట్టి సోమనాథుఁడిట్టు లొనర్చియుండుననియు, నిట్టి ప్రబల వ్యత్యాసములు లోకవ్యవహారమున నేర్పడుటకుఁ జాలినంత యవధి గతించియుండవలెననియు శ్రీ నారాయణరావుగారి వాదము. అది నిజమే యయినచో నారాయణరావుగారు గయికొన్న రమారమి డెబ్బది యెనుబది సంవత్సరముల వ్యవధి యీ విషయమునఁ జాలనేచాలదు. సోమనాథుఁడు క్రీ. శ. 1160 ప్రాంతమున జనించి క్రీ. శ. 1192 ప్రాంతమున బసవపురాణమును క్రీ. శ. 1222 ప్రాంతమునఁ బండితారాధ్య చరిత్రమును రచియించెనని నేను నిర్ణయింపఁగా శ్రీ నారాయణరావుగా రీ కాల

ఘులను వరుసగ క్రీ. శ. 1247, 1267, 1300 సంవత్సరము
జరిపియున్నారు. కుమారపాలఘూర్జరునిఁ గూర్చి తమ
మున కుపకరించు శాసనములను శ్రీ నారాయణరావుగా
హరింపనేలేదు. సోమనాథుఁడు పేర్కొన్న కుమా
ఘూర్జరుఁడు వేఱొక కాలమందలి మఱొక భూవరు
యుండఁగూడదా? ఏకనామధారులగు భూపాలురు
భిన్నకాలముల నెందఱులేరు? సోమనాథుఁడు పే
విక్రమ చోడుఁడు, వీరచోడుఁడు, ఉత్తుంగచోడుఁడు ము
రాజులు నవచోళ చరిత్రలో వర్ణితులయిన వారు.
గూడ శ్రీ నారాయణరావుగారు గుర్తించిన శాసనము
నుదాహృతులయిన వారేయని చెప్పఁదగిన యాధా
లేవు. సోమనాథుఁడు వారినిగుఱించి పేర్కొనిన మహి
ముల ప్రశంస యేమియు నా శాసనములందుఁ గానరాదు
ఈ పేళ్ళుగల చోడరాజులు వేర్వేఱు కాలములఁ
రున్నారు. కావున సోమనాథుఁడు పేర్కొన్న భక్తులు వా
నెవరో సరిగా నిర్ణయింపఁజాలము. "త్రొల్లి" యను పద
శ్రీపతి పండితుని విషయమున సోమనాథుఁడు కేవలము
కాల సూచకముగనే యుపయోగించెనుగాని దాని
ప్రాచీనతా భావుకముగ నాతఁడు ప్రయోగింపలేదు.
పండితుఁడు క్రీ॥ శ॥ 1072 ప్రాంతమున జనించినట్లు
విమర్శకులు నిశ్చయించియేయున్నారు. పశ్చిమచాళుక్య
వర్తియగు నాఱవ విక్రమాదిత్యుని దండనాథుఁడు
ప్రాంతములఁ బరిపాలించిన యనంతపాలుని కాలమున

నుండి యుండుటలోఁ గాలవ్యత్యాసమేమియు లేనప్పుడు, సోమనాథుఁడు చెప్పిన యీ విషయమును మనమేల విశ్వసింప రాదు? కుమారపాలఘూర్జరుఁ డెప్పటివాఁ డయినను నాతని చరితములో శ్రీపతి పండితుఁడు మున్నగువారు పేర్కొనఁబడి నంతమాత్రమున వారందఱు నాతని పూర్వులయి యుండవలె ననియే కేవలము నిర్ణయింపరాదు. ఇట్టి విషయములలో సోమ నాథుఁడేకాదు, మఱేకవియుఁగూడఁజారిత్రికదృష్టితోఁ బౌర్వా పర్యమును బాటించి యుండ లేదు. తన గ్రంథరచనాకాలము నకు వారందఱు పూర్వులే కావున నా యీ కథలలో సందర్భ సామ్యములు పొసఁగినప్పుడు కాలవిచారముతో నిమిత్తము లేకయే యొకరి కథలో మఱొకరిపేళ్ళను సోమనాథుఁ డుదా హరించుచు వచ్చినాఁడు. కుమారపాలఘూర్జరుని కథలో గేవలము శ్రీపతి పండితునేగాక బసవేశ్వరుని సమకాలీనుఁడుగ బసవపురాణమున వర్ణింపఁబడిన మోళిగ మారయ్యనుగూడ సోమనాథుఁడు పేర్కొనినాఁడు. ఇట్టి సంగతులనుబట్టి యీ యీ భక్తుల కాలములను నిర్ణయింపఁబూనుట చాలఁ బొర పాటు. ఈ విషయములలో మన కవులకు ముందు వెనుకలఁ గూర్చిన విచారముపయి యేపాటిశ్రద్ధయు లేదనియే చెప్ప వలెను. శ్రీనాథుఁడు హరవిలాసములోఁ జిఱుతొండని కథలో "కలియుగంబునఁ గళ్యాణకటకనగరి, నాకు భక్తుండు బసువర నాథుఁడొకఁడు - కాంచినగరంబులో వణిగ్వంశవరుఁడు, నాకు భక్తుండు చిఱుతొండనంబి యొకఁడు" అని వ్రాసి చిఱు తొండని తరువాత నెన్నోశతాబ్దులకు వెలసిన బసవేశ్వరుని

చేర్కొనినాఁడు. కావున నిట్టి యుదాహరణములు శ్రీ... యణరావుగారి వాదమున కుపకరింపఁజాలవని చెప్ప... లేదు.

## ౧౧. సోమనాథుని వైదుష్యము - బిరుదము...

సోమనాథుని పాండిత్య మపారమయి మేర యిడ... అది యిట్టిదని యట్టిదని నిరూపింప మనబోంట్లకు శ... కాదు. పండితారాధ్య చరిత్రమున "నలిఁ బాల్కురికి... నాథుఁడనంగ, వెలయువాఁడను జతుర్వేద పారగుఁడ" యాతఁడు వ్రాసికొనినాఁడు. ఒక్క నిగమాగమములే గా... వేదాంగములే కాదు. సంస్కృత వాఙ్మయమునందలి ... స్మృతిపురాణేతిహాసములను, సమస్తశాస్త్రములను సం... ముగ నాకళించిన విద్యావిశారదుఁ డీతఁ డని ఘంటాపథ... జెప్పవచ్చును. ఈతఁడు రచియించిన సోమనాథభాష్య... చతుర్వేదసారము మున్నగు కృతు లిందు కాదర్శకము... నున్నవి. చతుర్వేదపారగుఁడయ్యు నితఁడు వేదజడుఁడు కా... ఈతని లౌకికప్రజ్ఞాధురీణత యతిలోకమని నుతింపఁద... "బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" అను ... మీతని విషయమున "బుద్ధితైక్ష్ణ్య జనితోన్మేషుల్ గదా శ్రో... యుల్" అని మార్పఁదగును. గీర్వాణమున నెంతటి య... పండితుఁడయ్యు నీతఁడు మాతృభాషయగు నాంధ్రమున... దదితర దేశభాషల దెసను నుదాసీనత వహించినవాఁడు గా... ఈతనికి జానుదెనుఁగుపయిఁగల పలపుఁ దెలుప నలవి...

ఆంధ్రభాషా వైశారద్యమున కాతని బసవపురాణ పండితా రాధ్య చరిత్రములు ప్రబలనిదర్శనములుగ నున్నవి. ఈ కృతు లలోఁ గానవచ్చు నన్ని యచ్చతెనుఁగు పదములు మఱేకృతు లందును నాంధ్రభాషలోఁ గానరావని పలువురు తలంచు చున్నారు. ఆంధ్రమునఁ నేగాక తక్కిన ద్రావిడకర్ణాటాది దేశ భాషలఁగూడ నీతఁడు తగిన ప్రావీణ్యమును గడించి యున్నాఁడు. అష్టభాషాకవితాప్రవీణుఁడ నని యీతఁడు తన గ్రంథములందు స్వయముగఁ జెప్పికొనకున్నను దత్ప్రా వీణ్య మీతని కృతులందుఁ గానవచ్చుటచేఁ గొందఱితర కవులాతని నట్లే భావించిరి. వృషాధిప శతకములో నీతఁడు బసవేశ్వరునిఁ దెలుఁగు బద్యములతోఁ పాటు సంస్కృతము, అఱవము, కన్నడము, మహారాష్ట్రము (ఆరెభాష) మున్నగు నితర భాషలతోఁగూడ స్తుతించియున్నాఁడు. పండితారాధ్య చరిత్రములోఁ బర్వతప్రకరణమునఁ బలుదేశములనుండి శ్రీశైలయాత్ర కరుదెంచిన పరుసలను (యాత్రిక సంఘము లను) వారివారి భాషా పదములతో వర్ణించియున్నాఁడు. వేయేల? ఆంధ్ర కర్ణాట కవులలో నిట్టి సర్వంకష ప్రతిభా పాండిత్యములు గల కవిసార్వభౌముఁడు మఱియొకఁడు గానరాఁడు. శ్రీశైల మానాఁడు సకల దేశీయులకు యాత్రా రంగమగు కూడలి స్థానముగ నుండెడిది. సోమనాథుఁడు బాల్యమునుండియు శ్రీశైలయాత్ర కేఁగుచుండుటచే నచ్చట వివిధ దేశములనుండి యరుదెంచిన భక్తజనములతోడిగోష్ఠీ సాంగత్యముల కలిమి నాతని కీ యన్యభాషాప్రవేశపాండిత్య

ములు సులభముగ నలవడియుండును. శ్రీ మా[illegible] రామకృష్ణకవిగారు నన్నెచోడుని కుమార సంభవము[illegible] వ్రాసిన యుపోద్ఘాతములో నాంధ్రకవులలో పర్య[illegible] చెప్పఁదగినవారు తిక్కన, ఎఱ్ఱాప్రగడ, నన్నెచోడు[illegible] నాచనసోముఁడు, అను నలువురు మాత్రమే యని లిఖ[illegible] నారు. కవిగారు పాల్కురికి సోమనాథుని మఱచుట ప్ర[illegible] దము. వారు పేర్కొనిన యాకవులందఱకు బహువిధము[illegible] మార్గదర్శకుఁడు నాదర్శకుఁడు నగు సోమనాథునిఁగూడఁ బే[illegible] ననఁగాని యాపట్టిక పరిపూర్ణము కానేరదని చెప్పఁదగు[illegible] చెన్నబసవ పురాణకర్తయగు అత్తలూరి పాపయామా[illegible] డీతని నీక్రింది విధముగ నుతించియున్నాఁడు.

మ. వరసర్వజ్ఞశిఖామణిః, బ్రిథిత సద్వారప్రమోదాకరుః
నిరతోద్యచ్ఛివ ధర్మసంచరు, గళానీ కాంచితావాసు, భా
స్వరలింగాన్వితదేహు, సర్వవిబుధ వ్రాతామృతాధారు, భా
సురపాదుం, గళితారిఁ, బాల్కురికివఁశ్యుం, గొల్తు సోమావ్వయుః

ఇట్టి సర్వజ్ఞత్వము, సర్వాతిశాయి పాండిత్యము, [illegible] లము గురుకులవాసశ్రమము వలననే నేర్చినచో సామా[illegible] ముగ సంపూర్ణాయుర్దాయముతోఁ గూడిన యొక్క జన్మ[illegible] చాలదనియే చెప్పవచ్చును. కావున సోమనాథునకు గురు[illegible] వలనఁ గలిగిన విద్యాసంస్కారము నామమాత్రమేయ[illegible] యెన్నఁదగును. కాళిదాసమహాకవి యుమాదేవి విద్యాభ్యా[illegible] వర్ణనా సందర్భమునఁ జెప్పిన "ప్రపేదిరేప్రాక్తనజన్మవిద్యా[illegible] అనుసూక్తి సోమనాథుని విషయమునఁ గూడ బాగుగ వ[illegible] చును. అవతార పురుషులకేగాని యనన్యసుర్లభంబగు[illegible]

యఖండవిద్యావైభవ మలవాటుపడనేరదు. కావుననే సోమనాథునొకయవతారమూర్తిగనే పూర్వులు సంభావించిరి. బసవేశ్వరుని చరిత్రమును లోకమున వెలయించుటకయి శివుని యానతిపయి భృంగియే పాలకురికి సోమనాథుని రూపమున నవతరించెనని పిడుపర్తి సోమనాథుఁడు చెప్పిన "అసదృశ తన్మహామహిమ మారవి తారకమై చెలంగ......"అనుపద్యమును మూఁడవప్రకరణమున నుదాహరించి యున్నాను. ఇంతియేగాక యీతని శక్తిసామర్థ్యములను బిడుపర్తిసోమనాథుఁడు మఱియునిట్లు వర్ణించినాఁడు.

సీ. లిపిలిఖింపకమున్న యపరిమితార్థోక్తి
శక్తి యాతనిజిహ్వ జరగుచుండు
ఛందోధి కరణాది సరణిఁజూడకమున్న
మదినుండుఁగావ్య నిర్మాణశక్తి
తర్కశాస్త్రాది విద్యలు పఠింపకమున్న
పరపక్ష నిగ్రహ ప్రౌఢి వెలయు
భాష్యసంతతులు చెప్పంగఁ జూడకమున్న
రుద్రభాష్యక్రియారూఢి వెలయు
గీ. నతని నుతియింపనాబోఁటి కలవియగునె
జైనమస్తకవిన్యస్త శాతశూల
కలితబిజ్జలతలగుండు గండబిరుద
శోభితుఁడు పాల్కురికి సోమనాభిధుండు.

పిడుపర్తి సోమనాథునికిఁ బూర్వమే పాల్కురికి సోమనాథునిఁగూర్చి వీరశైవప్రపంచమున "ఆదౌ భృంగిరిటిః పురా కృతయుగే శ్రీమత్సుకేశిప్రభుః......" ఇత్యాదిగా నొకప్రాస్తావిక శ్లోకము వ్యవహారమందున్నట్లు గానవచ్చును.

ఈశ్లోకార్థమునే బచ్చు సిద్ధకవి తన మల్లికాబసవపురాణము నిట్లు లనువదించినాఁడు.

"ఆదిభృంగీశ్వరుఁ డానందమునను - మేదినికేతెంచి మేదినియందు
నాదియందున సుకేశాహ్వయుండగుచుఁ - బాదిలశీల సంపన్నుఁడై వెలసి
కరమర్థిఁ దే త్రాయుగమునఁ జెల్లముగ - నిరత సద్భక్తపాణినిమునియగుచు
వరశబ్దశాస్త్రంబు వాసిగాఁజేసి - ధరవెలయించెను ద్వాపరమునను
గరుణతో సానంద గణనాథుఁడగుచుఁ - బరశివమంత్రంబు ప్రఖ్యాతిచేసి
స్ఫురియింపఁగలియుగంబున వేడ్కఁ దనర - వరవీర సద్భక్తి వర్ణింప నిలుచు
కొలఁదిమీఱిన పాలకురికి సోమేశు - సలలిత శ్రీపాద జలజముల్ గొలిచి"

ఇట్టి పూర్వసంస్కారసంపన్నుఁడగు సోమనాథుని వైదుష్య మీదృశంబని నిరూపింప నేరితరము? పిడుపర్తి సోమనాథుని పూర్వోక్తసీసపద్యమున నుదాహృతమయిన "జైనమస్తకవిన్యస్తశాతశూల - కలితబిజ్జలతలగుండు గండ బిరుదము" గాక సోమనాథునకు "ప్రత్యక్ష భృంగీశావ తార" "అన్యవాదకోలాహల" "తత్త్వవిద్యాకలాప" "కవితాసార" మున్నగు బిరుదులు గలవని కర్ణాటకవిచరిత్ర కారులు పేర్కొనియున్నారు.

ఉపలబ్ధములయిన సోమనాథుని గ్రంథములలో బసవ రాజీయ మను నామాంతరముగల సోమనాథభాష్యమే యాతని వేదవేదాంగాదివిశ్రుత పాండిత్యమునకుఁ బ్రతిబింబ దర్శకముగ నున్నది. ఇందుదాహరింపఁబడిన శ్రుతి స్మృత్యాది ప్రమాణములే చాలవఱకుఁ బండితారాధ్య చరిత్రమున మల్లి కార్జున పండితుఁడు విభూతి, రుద్రాక్ష, లింగధారణాది సిద్ధాంతములఁ బ్రతిపాదించు సందర్భమునఁ బేర్కొనఁ బడినవి.

చతుర్వేదములు, వేదభాష్యములు, భాష్యప్రతీకములు, అష్టోత్తర శతోపనిషత్తులు, అష్టవింశత్యాగమములు, అష్టాదశపురాణములు, ఉపపురాణములు, సంహితలు, ఇతిహాసములు, గృహ్య సూత్రములు, గౌతమ జాబాలి శాతాతపాది సమస్త స్మృతులు, ధర్మశాస్త్రములు మున్నగు వివిధశాఖోపశాఖా గ్రంథములనుండి ప్రమాణములను సోమనాథుఁడు తన గ్రంథములలో నానా యా సందర్భముల నుద్ధరించినాఁడు. వాని నెల్ల నేర్చి కూర్చి యొకపట్టికగా నొసంగిన గ్రంథవిస్తరమగును.

సంగీతశాస్త్రమునఁగూడ నితఁడపారపాండిత్యమును సంపాదించెనని "విలసత్సంగీత శాస్త్రపారగ" యను పిడుపర్తి సోమనాథుని సంబోధనమువలనఁ దెలియనగును. బసవపురాణ తృతీయాశ్వాసమున వర్ణితమయిన సకలేశ్వర మాది రాజయ్యగారి కథయుఁ బండితారాధ్య చరిత్రమునందలి పర్వతప్రకరణమున నుగ్గడింపఁబడిన సంగీతశాస్త్ర విషయములను బఠించువారికి సోమనాథునికిఁగల యీ పాండిత్యవిశేషము వ్యక్తము కాఁగలదు. ఇదియది యననేల? సోమనాథుఁడు సకల విద్యల యందు నారితేఱిన మేధాశాలియని చెప్పినఁ జాలును.

## ౧౨. సోమనాథుని శిష్యప్రశిష్యులు

సోమనాథుని శిష్యుల నిరుతెఱఁగులుగ గణింపవచ్చును. ఆతనివలన వీరశైవదీక్షఁబడసిన తత్కృపాహస్తగర్భసంభవులు, వారి సంతతి మొదటి తెగకుఁ జెందెదరు. మతవిషయములతో నాతనికిఁ బ్రత్యర్థులుగనుండి మోటువడి యాతనికి

శిష్యులయి తన్మతమును స్వీకరించినవారు రెండవ తెగకుఁ జేరెదరు. పిడుపర్తి సోమనాథుని మూలపురుషుఁడగు పిడు పర్తి శివరాత్రి కొప్పయ్య మున్నగువారు మొదటి తెగలో ముఖ్యులు. వీరు సోమనాథునివలన వీరశైవదీక్షను బడ యుటయేగాక యాతని యనుగ్రహమువలన నగ్రహారాది స్వామ్యములఁ బడసి వంశపారంపర్యముగ ననుభవించుచు వచ్చినవారు. వీరు వీరి వంశ్యులు సోమనాథునిఁ దమ కుల గురువుగ నారాధించి యాతనియెడ ననన్యసామాన్యములగు భక్తిగౌరవముల నెఱపుచుండిరి. పిడుపర్తి, దోగిపర్తి, మొద లగు గ్రామములనుగాక, ప్రతాపరుద్రునివలనను, నాతని మంత్రుల వలనను సోమనాథుఁ డగ్రహారములుగ గ్రహించి వానిని దన శిష్యులగు శివరాత్రి కొప్పయ్య మున్నగువారి కొసంగెనని పిడుపర్తి సోమనాథుని పద్య బసవపురాణావ తారికవలన మనకుఁ దెలియుచున్నది.

తరువాతఁ గొంతకాలమునకు దోగిపర్తి కంకిలిపాటు గలుగఁగాఁ గొప్పయ వంశ్యుఁడు పెదసోమయ్య దానిని మరలఁ బ్రౌఢ దేవరాయలకాలములో నగ్రహారముగఁ బడసెనని కూడ నా గ్రంథమువలనఁ గాననగును.

ఈ పిడుపర్తివారు మొదట వైదిక బ్రాహ్మణు లనియు, పిడుపర్తి, నున్న, చిలువూరు, చదువుల, వెలగపూడి మున్నగు గృహనామములుగల యఱువదియాఱు కుటుంబ ములవారు బ్రాహ్మణులు. (వైదికులు, నియోగులు, ఆరా ధ్యులు), పూర్వకాలమున సోమనాథాది సహజ వీరశైవుల

వలన వీరశైవదీక్షఁబడసి కేవలవీరశైవులలోఁ గలిసిపోయి రనియు నందువలన నాంధ్రదేశమందలి వీర మాహేశ్వర (జంగమ) కుటుంబములలోఁ బురాతనులనియు, నూతను లనియు, విభేద మొకటి యేర్పడి కొంతకాలమువఱకుఁ బాటింపఁబడుచుండెడిదనియుఁ దెలియుచున్నది. వైవాహిక సంబంధములలోను, శిష్య సంతతినుండి పడయు గౌరవ మర్యాదలలోను, నిరుశాఖలవారు గొన్ని హెచ్చుతగ్గులు గణించు చుండిరి. పైనిజెప్పిన యఱువదియాఱిండ్లవారు వారివంశ్యులు నూతనులనియు, ననాదినుండియు సహజవీరశైవశాఖకుఁ జెందిన వారు పురాతనులనియు, వ్యవహరింపఁబడుచుండిరి. రానురాను సంఘము క్షీణించినకొలఁది వివాహ సంబంధములలోఁ గలిగిన యిబ్బందులవలన నీ విభేదము క్రమక్రమముగఁ దగ్గిపోయి నేటికిఁబూర్తిగ విస్మృతప్రాయమయినది. ఆంధ్రదేశమున వీరశైవ మతవ్యాప్తికి బాలకురికిసోమనాథుని తరువాత నాతని మార్గము ననుసరించి పాటుపడిన యాంధ్ర వీరశైవు లలోఁ బిడుపర్తివారు పేరెన్నికగన్నవారు. వీరశైవాచార సంపత్తియందేగాక కవితాపాండిత్యాదిప్రదర్శనమునఁగూడ వీరు సోమనాథునకుఁ దగినశిష్యులై వీరశైవగ్రంథరచనము నకుఁ దన్మూలమునఁ దన్మతప్రచారమునకు నెంతయుఁ బరిశ్ర మించిరి. వీరిలోఁ బిడుపర్తి సోమనార్యుని తనయుఁడు నిమ్మ నార్యుఁడు, నాతని పినతండ్రియగు దేవనార్యుని కుమారుఁడు బసవకవి, ఈ బసవకవి జ్యేష్ఠపుత్త్రుఁడు సోమనాథుఁడు, బసవ కవి ద్వితీయపుత్త్రుఁడగు పాలనార్యుని తనయుఁడు బసవప్పకవి

కవితాపాండిత్యాదులచే విఖ్యాతిగాంచినవారు. నిమ్మనార్యుఁడు రచియించిన ప్రధానగ్రంథములు లభ్యముకాకున్నను నాతఁడు రచియించిన నిజలింగ చిక్కయ్యచరిత్రి, ఒడయనంబిచరిత్రము మున్నగు యక్షగానములు కొన్ని లభించుచున్నవి. పద్యబసవపురాణావతారికలో నీతఁడిట్లు వర్ణింపఁబడినాఁడు.

సీ. శ్రీమన్మహాలింగ సేవాసముద్భూత
పరమసుఖామృత వరపయోధి
కలితచతుష్షష్టి కాలశివార్చనా
మహనీయనిష్ఠా సమన్వితుండు
భవపాకవర్జన ప్రథితసువ్రతనిత్య
పావనచిత్పూర్తి భవ్యమూర్తి
శుద్ధాత్మ పిడుపర్తి సోమయ దేశిక
సత్పుత్త్రుఁడష్టభాషా విదుండు
గీ. భవుల కెన్నఁడు కవితచెప్పని ఘనుండు
కాంక్షలుడిగిన సమలోష్ట కాంచనుండు
శాంతిదాంతి మయస్వాంత సంయుతుండు
జగతిఁ బెంపారు నిమ్మయాచార్యవరుఁడు.

దేవయ కుమారుఁడు బసవకవి కెరెయ పద్మరసు కన్నడమున రచియించిన "వీరశైవదీక్షాబోధ" యను కృతిని తెలుగుసద్ద్విపదకావ్యముగ రచియించినాఁడు. అదిముద్రితమయి ప్రచారమున నున్నది. ఇదిగాక పిల్లనయనారుకథ, బ్రహ్మోత్తర ఖండము మున్నగు శివకృతులను గూడ నీతఁడు ద్విపద కావ్యములుగ రచియించెనని పద్య బసవపురాణావతారికవలనఁ దెలియుచున్నది. "గురునాథుఁడగు పాలకురికి సోమేశుండు చెప్పిన కృతులెల్ల నిష్పాడమిని బ్రకటింపవచ్చిన ప్రత్యక్షబసవేశు"

డని భక్తజనము లీతని వినుతించుచుండిరి. ఇతని యానతి ననుసరించియే యితని పుత్త్రుఁడు సోమనాథుఁడు పాలకురికి సోమనాథుని ద్విపద బసవపురాణమును బద్యకావ్యముగ ననువదించి సోమనాథునికే దాని నంకిత మొనర్చినాఁడు. మఱియు నీతఁడీ బసవపురాణమునే గాక, కన్నడమునఁ జామరసను కవి రచియించిన ప్రభులింగలీలను దెలుఁగున ద్విపదకావ్యమున రచియించినాఁడు. ఈ ప్రభులింగలీలనే యితని తమ్ముని కుమారుఁడుబసవప్పకవి పద్యకావ్యముగ రచియించినాఁడు.వీరందఱుఁ గూడఁ గులదేశికుఁడగు పాలకురికి సోమనాథునెడ నిస్తులమగు భక్తిప్రపత్తులను దమ కృతులందుఁ బ్రకటించిరి. అందలి గద్యలుకూడ నీ విషయమును విశదీకరించును.

దీక్షాబోధగద్య:—"ఇది పాలకురికిసోమేశ్వరారాధ్య, సదమల శిష్యశిష్యప్రశిష్యుండు......................త్రివిధ ప్రసాద పరిమిత సుజ్ఞాన, భవపూర్తి పిడుపర్తి బసవనాహ్వయుఁడు, రచియింప శైవపురాణ తంత్రములఁ, బ్రచురమై భక్త సభాయోగ్యమైన, ఘనవీరశైవ దీక్షాబోధ యందు........................"

పద్య బసవపురాణగద్య:—"ఇది శ్రీమత్పాలకురికి సోమేశ్వర ప్రసాదలబ్ధప్రబంధనిబంధనశక్తియుక్త.శ్రీపిడుపర్తి బసవనార్య సత్పుత్త్ర, కులపవిత్ర సోమనామధేయ శివకవి ప్రణీతంబైన బసవపురాణం బను మహాప్రబంధంబునందు........................"

ద్విపద ప్రభులింగలీలగద్య:—ఇది-పాలకురికి సోమేశ్వర ప్రసాద, విదితాష్ట భాషాకవిత్వ ప్రవీణ, ధామిత్ర పిడుపర్తి బసవేశపుత్త్ర, సోమయదేవాఖ్య సుకవీంద్రముఖ్య, భణితమై విలసిల్లు ప్రభులింగలీల, ననుపమంబుగఁ బంచమాశ్వాసమయ్యె"

పద్య ప్రభులింగలీలగద్య:—"ఇది శ్రీమత్పాలకురికి సోమేశ్వర వరప్రసాదలబ్ధ కవితాచాతుర్య ధుర్య,పిడుపర్తి పాలయాచార్య సత్పుత్త్ర, కులపవిత్ర, బసవప్పనామధేయ ప్రణీతంబైన ప్రభులింగలీల యను శివజ్ఞాన మహాప్రబంధంబునందు................."

అన్యవాదకోలాహలశతకకర్త కూడ నీ పిడుపర్తి వంశ్యుఁడే కాఁదగునని ముందే చెప్పియుంటిని. ఆతఁడు తన శతకమును సోమనాథునకే కృతి యొసంగి యా శతకము "పాల్కురికయ్య ప్రబంధంబులన్నింటిఁ బెట్టిన యొడికంపుఁ బెట్టె" యని వచియించినాఁడు.

ఇఁక రెండవ తెగకుఁ జెందిన సోమనాథుని శిష్యులలోఁ జక్రపాణి రంగనాథుఁడు ప్రముఖుఁడు. ఇతఁడు కవిరాజ బిరుదాంచితుఁడు. వైష్ణవుఁడు; సామాన్య వైష్ణవుండు మాత్రమే కాక ప్రబలముగ శివద్వేషము కలవాఁడు. మతవివాదములలో నితఁడు సోమనాథునితోఁ బ్రతిఘటించి యోడిపోయి పరాభవ దుఃఖమున శ్రీశైలమార్గమునఁ దరలిపోవుచు శివద్వేషము మదియందు రగుల్కొనుటచే శ్రీశైలశిఖరమును గాని మల్లికార్జున స్వామినిగాని గనుఁగొనక యేఁగుచుండెను. అందుచే నాతనికి దృష్టినిరోధము ప్రాప్తించెను. దానిపయి నాతఁ డహోబల క్షేత్రమునకేఁగి నరసింహస్వామిని బ్రార్థింప నాతఁడు ప్రత్యక్షమయి శివాధిక్యము నెఱింగించి మల్లికార్జునస్వామిని సేవింపు మని యుద్బోధించెను. అంత నాతఁడు శ్రీశైలమునకే తెంచి మల్లికార్జునదేవు నారాధింప నొక కన్నువచ్చెను. ఆ దేవదేవుని యుద్బోధనమున నాతఁడు పాలకురికికిం జని సోమనాథుని శరణువేఁడఁగా రెండవకన్నుగూడ వచ్చెను. అందుపై

సోమనాథుఁ డతనికిఁ దనపుత్త్రుఁడగు చతుర్ముఖ బసవేశర్వుని వలన వీరశైవదీక్ష నిప్పించి యాతని శిష్యునిగా గ్రహించెను. అనంతర మీతఁడు వీరభద్ర విజయము, శరభలీల, శ్రీగిరి నాథ విక్రమము మున్నగు గ్రంథములను రచియించి సోమనాథు నకు సమర్పించెనని పాల్కురికి సోమేశ్వరపురాణము, గురు రాజచరిత్ర యను కన్నడ కృతులవలనఁ దెలియుచున్నది. శ్రీరంగకవియను పేరితో నీతఁడు రచియించిన "నయనరగడ" యను నామాంతరముగల "శివభక్తి దీపిక" యను గ్రంథము ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునఁ గలదని యాదలి యంశ ములు కూడఁ బయికథకు స్ఫోరకములుగ నున్నవని శ్రీప్రభా కరశాస్త్రిగారు, బసవపురాణపీఠికలో లిఖించియున్నారు. ఏకామ్రనాథుఁడు దన ప్రతాప చరిత్రలో రామాయణకావ్య కర్తలగు భాస్కరుఁడు, మొల్ల, శాకల్యమల్లికార్జునభట్టునను వారిఁ బ్రశంసించు సందర్భములో రంగనాథునిఁగూడఁ జెప్పి యాతఁడు పాల్కురికి సోమనాథునికి శిష్యుఁడయిన ట్లిమను నుగ్గడించినాఁడు.

ఈ చక్రపాణి రంగనాథుఁడు కాక సోమనాథుని శిష్యు లలో మఱియొక రంగనాథుఁ డుండినట్లు కానరాదు. ఈ గురు శిష్యు లిరువురను గలిపి నుతించుచు శివయోగసారకర్త కొలనిగణపతి దేవుఁడు రచియించిన పద్యము నిదివఱకే యుదా హరించియుంటిని. భద్రకవి లింగకవికూడఁ దనసానంద చరిత్ర మను ద్విపదకృతిలో సోమనాథ రంగనాథుల నిరువురను గూడ నిట్లు పేర్కొనినాఁడు.

“సకల వేదపురాణ శాస్త్రేతిహాస-నిక రార్థములఁ బ్రమాణించి సద్భక్తి శ్రీమతి నుద్ధరించిన పాలకురికి-సోమనారాధ్యులసొంపుతోఁగూర్చి రంగద్విశాలాంతరంగ మధ్యమున-రంగనాథునిఁ గవిరాజన్యుఁడలర”

ఇత్యాది కారణములవలన గోనబుద్ధారెడ్డి రచియించినట్లు గ్రంథమును బట్టి కానవచ్చినను రంగనాథ రామాయణమను వ్యవహారముతోఁ జిరకాలమునుండి యాంధ్రదేశమునఁ బ్రచారమందున్న ద్విపద రామాయణమునకు నిక్కంపు రచయిత యయి పూర్వకవిస్తుతుల కెక్కిన రంగనాథుఁ డీ చక్రపాణి రంగనాథుఁడేయై యుండునేమో యని నేఁదలంచుచున్నాను. పూర్వకవు లెవరును గోనబుద్ధారెడ్డిని రామాయణకర్తగాఁ బేర్కొని యుండలేదు. పరిశోధకులు సత్యనిర్ణయమునకయి యిందుఁగూర్చి సమ్యక్పరిశోధనము సలుపఁదగును. సోమనాథుని వలన వీరశైవము స్వీకరింపకముందే రంగనాథుఁడు రామాయణము రచియించియుండవచ్చును. గౌరనకవి శ్రీగిరిక్షేత్రాధికారియగు శాంతభిక్షావృత్తి యతీశ్వరు నానతిపయి తాను రచియించిన నవనాథ చరిత్రమను ద్విపద కావ్యమును శ్రీగిరియనుకవి రచియించిన పద్యకావ్యమునుబట్టి కూర్చితినని చెప్పికొనినాఁడు. మఱియు శ్రీగిరియను కవి రచియించిన శ్రీరంగమాహాత్మ్యములోని వని యాంధ్రసాహిత్య పరిషత్తునందలి యుదాహరణగ్రంథములోఁ గొన్ని పద్యము లుదాహృతములైనవి. మఱియు నీ సంధానగ్రంథమునను, పైడిపాటి జగన్నాథకవి ప్రబంధరత్నాకరమునను రంగనాథుని పేరఁ గొన్ని శివస్తుతిపద్యములు పేర్కొనఁబడినవి. ఇందువలన

రంగనాథుఁడే శ్రీగిరినాథ విక్రమము, నయనరగడ మున్నగు కృతులు రచియించిన యనంతరము మఱికొంతకాలమునకు శ్రీగిరి యను నామాంతరము కూడఁ గయికొనెనేమో యని యూహింపఁదగియున్నది. ఇదికూడ బాగుగ బరిశోధింప వగును.

పెరుగుకురికిశాస్త్రి, నేతికురికిశాస్త్రి యను పేళ్లు దాల్చి యిరువురు విప్రు లోరుగంటిలో సోమనాథునితోఁ బ్రతిఘటించి రనియు వీరిరువురు పాలకురికినుండి యుదయించి యందు విలీన మయి యడంగెడివారేయని కేలిసేయుచు సోమనాథుఁడు వారి నోడించెనని కర్ణాటకవి చరిత్రి చెప్పుచున్నది. మఱియు సోమనాథుఁడు తమతో వివాదము సలుపుటకయి యోరుగంటికే తెంచునపుడు ధూర్త విప్రులాతని కెదురుగా శైవచిహ్నములతోఁ బంపిన దుండగీంద్రుడు సోమనాథుని భావనా బలముచే సిక్కుంపు వీరశైవులుగ మాఱిపోయి యాతనికి శిష్యులయి వఱలిరని పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణావతారిక ప్రకటించుచున్నది. ఈ సందర్భముననే ప్రతాపచరిత్రము ననుసరించి తుమ్మలపల్లి నాగభూషణకవి తన బసవవిజయమను గ్రంథములో సోమనాథుని మహిమాదికముల నుద్ఘటించుచు బ్రాహ్మణులు వివాదమున కుపక్రమించి నపుడు సోమనాథుఁడు భవులగువారితో సంభాషింప నొల్లక యోరుగంటి యందలి రజకు నొకనిఁ బిలిపించి వానికి శివదీక్ష నొసంగి యాదీక్షామహిమముచే సర్వజ్ఞత్వాది శక్తులఁ బ్రసాదించి వానిచే బ్రాహ్మణుల నెల్ల నఖర్వగర్వపరిహారముగ నోడింప

జేసెననియు, సోమనాథుని యీ యద్భుత శక్తిమహత్వము లకుఁ బ్రతాపుడు నిర్విణ్ణుఁడయి బ్రాహ్మణులనెల్ల సోమనాథు నకు శరణాగతులఁ గావింపఁ గరుణించి సోమనాథుఁడు ప్రతాప రుద్రుని మంత్రియుఁ దన శిష్యుఁడునగు శివదేవయ్యచే నా బ్రాహ్మణులనెల్ల శివదీక్షితులఁ గావించెననియు వర్ణించి యున్నాఁడు. ఇట్టి శిష్యు లా కాలమున సోమనాథున కనేకులు ఘటిల్లి యుందురు.

పైని బేర్కొనిన యిరుతెలుఁగుల శిష్యప్రశిష్యులు గాక సోమనాథుని గ్రంథములఁ జదివి యాతని మార్గము ననుసరించి కృతుల రచియించి యాతని యెడ గురుభావము వహించిన కవివరులను గూడ మనము సోమనాథుని శిష్య ప్రశిష్యకోటిలో గణింపవచ్చును. శ్రీనాథుఁడు, గౌరన, పోతన, పోశెట్టి లింగన, బచ్చు సిద్ధకవి మున్నగువా రీ గణ ములోఁ జేరెదరు. "సోమనాథు నారాధించిన యాంధ్రకర్ణాట కవులు" అను ప్రకరణమున వారిఁగూర్చి వివరించెదను.

## ౧౩. సోమనాథుని కాలమున నాంధ్రదేశమందలి మతవ్యవస్థ

అద్వైత మతాచార్యుఁడగు శంకరుఁడు జైన బౌద్ధ చార్వాకాది నాస్తికమతముల నిర్మూలించి శైవ వైష్ణవా ద్యాస్తికషణ్మతముల నుద్ధరించినను, జైన బౌద్ధ మతములు మరల రేకెత్తి కొన్ని శతాబ్దులవఱకు నాంధ్ర కర్ణాటక దేశ ములందు విశేష ప్రచారము గలిగియే యుండెను. క్రీస్తుశకము తొమ్మిది పది శతాబ్దులనాఁటికి బౌద్ధమత ప్రచార మీ దేశము

లందుఁ జాల భాగ మడఁగిపోయినను, జైనమతము మాత్రము
తగిన యాలంబనము కలిగియుండెననియే యెన్నఁదగియున్నది.
కావున జైనమత విజృంభణము నరికట్టుట కాకాలమున వీర
శైవమతము మిక్కిలి కృషిసలిపి సఫలతఁగాంచెను. బసవపురా
ణమున వర్ణింపఁబడిన పురాతన వీరశైవుల చరిత్రములఁ దిలకిం
చినచో బసవేశ్వరుఁ డవతరించిన పదిరెండవ శతాబ్దినాఁటికే
వీరశైవమతీయులొనర్చిన పరిశ్రమమువలన జైనమతప్రాబల్య
మాంధ్ర కర్ణాటదేశములయం దించుమించుగ క్షీణించెనని
చెప్పవచ్చును. పండితారాధ్యచరిత్రమందలి వాదప్రకరణ
మును బట్టి మల్లికార్జున పండితారాధ్యుఁడు వెలనాఁటి చోడుని
యాస్థానమున నాతని గురువగు బౌద్ధపదాచార్యునితో వాద
మొనర్చి యాతని నోడించినట్లు గానవచ్చుటచే నాంధ్రదేశ
మునఁ గొండవీటి ప్రాంతమున నప్పటికి బౌద్ధమత వ్యాప్తి
యుండెనేమో యని స్థూలదృష్టికి గోచరించును గాని, యా
బౌద్ధమతము గూడ నప్పటికి నామమాత్రావశేషముగనే
యచ్చటచ్చటఁ గొలఁది కొలఁదిగ నిలిచియున్నట్లు తలంపవలసి
యున్నది. బసవేశ్వరుని యేలిక యగు బిజ్జలుఁడు జైనమతా
వలంబి యనుట కాతని శాసనముల వలనగాని, సోమనాథుని
బసవపురాణమును బట్టిగాని, యవకాశములు లభింపఁజాలవు.
అట్లే వెలనాటి చోడుఁడు నాతని మంత్రులు వెలయించిన
శాసనములఁ గాంచిన నాతఁడు కేవలము బౌదమతాభినివేశము
కలవాఁడనుట కాధారములు పొడగట్టనేరవు. బసవేశ్వర పండి
తారాధ్యు లవతరించు నాఁటి కాంధ్రకర్ణాటదేశములు రెంటి

యందును గూడ జైనబౌద్ధమతముల కంటె శంకరరామాను
జాచార్య ప్రచారితములగు నద్వైత విశిష్టాద్వైత మతముల
చాలవఱకు నాలంబనము కలిగి యుండినట్లు కాననగును.
బసవపురాణమును బండితారాధ్య చరిత్రమును బాగుగఁ బరి
శీలించినచో నద్వైత మతానుయాయులగు స్మార్తబ్రాహ్మణుల
తోనే బసవేశ్వర పండితారాధ్యులకు, వారి మతీయులకుఁగూడ
బ్రతిఘటనము కలుగుచుండినట్లు కాననగును. వీరశైవ పంచా
చార్యులలోఁ బ్రథమాచార్యుఁడగు రేణుకుఁడు శుద్ధాంధ్రదేశ
మునఁ గొలనుపాకయందలి సోమేశ్వరలింగగర్భమునుండి
యుద్భవించి, తొలుదొలుత నాంధ్రదేశము మతముల నెల్ల
గొలిపి, యాంధ్రదేశమున వీరశైవమతప్రచార మొనరించి
నను, నాతఁడు తన సింహాసనమును గొలనుపాకనుండి మల
యాచలప్రాంతమందలి రంభా (కదళీ) పురము (బాళె
హొన్నూరు) నకుఁ దన జీవితకాలముననే తరలించి యుండు
టచే రానురాను వీరశైవము బసవేశ్వరుని కాలమునాఁటికే గా
టాంధ్రదేశములందు క్షీణదశను బ్రాపించియుండెను. లకులీశ
పాశుపతము, కాలముఖము మున్నగు శైవమతశాఖలు కొంత
కొంతవఱకుఁ బ్రచారమందుండి రాజాశ్రయము నొందినను
నవిగూడ నద్వైతమతప్రాబల్యమునఁ దగిన వ్యాప్తి నొంద
కుండెను. జీవేశ్వరులకు నభేదము నుద్బోధించు శంకరా
చార్యుని యద్వైతమతసిద్ధాంత మాచరణమున విల
ణముగ వరిల్లుచు జాతి మత వర్ణ విభేదముల కాశ్రయమై
జనసామాన్యముయొక్క దైనందినజీవనమున సంబ్ర

గలిగింపఁ జాలకుండెను. అగ్రివర్ణములవారు భక్తితత్త్వ విదూరులయి గుణకర్మములఁ బట్టిగాక కేవలము కులజన్మములఁ బట్టి ప్రజలయందు న్యూనాధిక్యభావములఁ బెంపొందించు చుండిరి. అందుచే బ్రాహ్మణ ప్రాబల్యముఁ దక్కిన వర్ణముల వారోర్వఁజాలకుండిరి. భక్తి తత్త్వమును బ్రబోధించుచు రామానుజాచార్యుని విశిష్టాద్వైత మీ బ్రాహ్మణ ప్రాబల్యము నడంచి ప్రజలలో సామరస్యము గలిగించుటకుఁ గొంత వఱకుఁ బ్రయత్నించెను గాని తగినంత చరితార్థతను బడయఁ జాలదయ్యెను. నిగమాంతములని చెప్పఁబడు నుపనిషత్తులందుఁ బ్రతిపాదితములయి సర్వ సమ్మతములగు నున్నతాశయముల కాదర్శమయి, శివాగమములలో నుత్తరభాగములందు నెల కొల్పఁబడి, "సర్వేషామపి శైవానాం వీరశైవం మహో త్తమం" అను సూక్తికిఁ దావలమయిన వీరశైవమత ముద్ధ రింపఁబడి తన్మతధర్మము లాచరణ పూర్వకముగ విస్తరింపఁ బడినఁగాని ప్రజాహృదయమునఁ బ్రబలిన యసంతుష్టి చల్లాఱు నవకాశములు గానరాకుండెను. అట్టి మహోద్యమనిర్వహ ణమునకే బసవేశ్వరుఁడు కర్ణాటదేశమున నవతరించి సకల శాస్త్రసాధకమగు జంగమ లింగభక్తిని వ్యాపింపఁజేసి, తన యద్భుత మహిమముచే ననతికాలముననే వీరశైవమత ముసు దేశము నల్లడలను వ్యాపింపఁజేసెను. అప్పుడు దేశ మందు స్వల్పప్రచారమందుండిన పాశుపతము కాలముఖము మున్నగు నితరశైవమతాంతర్భాగములుగూడఁ జాలవఱకు వీరశైవమున విలీనమయి పోయెను. బసవేశ్వరుఁడు కర్ణాట

దేశీయుఁడు కావున నాతని యుద్బోధనము లాతని మాతృ భాషయగు కన్నడమునందే వ్యాప్తమగుటంజేసి యాతనిచే నుద్ధరింపఁబడిన వీరశైవమతము కర్ణాటదేశమునందువలె నాంధ్రదేశమున వ్యాపించు నవకాశమంతగా లభింపదయ్యెను. మల్లికార్జునపండితారాధ్యుని పరిశ్రమమువలనఁ గొంత మాత్రమే యది యాంధ్రదేశమున నెలకొనసాగెను. మల్లికార్జున పండితుఁడు మతపాండిత్యము విశేషముగాఁ గలిగి యుద్దండపండితుఁడయ్యు బసవేశ్వరునివలె దేశభాషా వశ్యముగాని, గేయ కవితా వైశారద్యముగాని యంతగా కలిగి యున్నట్లు కానరాదు. అందుచేఁ గేవలము జనసామాన్య మును గైవస మొనర్చికొని వారిలో వీరశైవమతమును విస్త రింపఁజేయుటయం దాతఁ డెక్కుడుగఁ గృతకృత్యుఁడు కాలేఁ డయ్యెను. ఆంధ్రదేశమున బసవేశ్వరుఁ డవతరింపని లోపము నివారించుటకుఁగాను సంగీతసాహిత్యములు, సంస్కృతాంధ్ర భాషలు పరిపూర్ణముగ వశంవదములుగా వ్యవహరింపఁగల మహావ్యక్తి యొకటి యాకాలమునఁ దెలుఁగునాట వెలయవలసి యుండెను. అదియే తత్ఫలసిద్ధికయి పాలకురికి సోమనాథరూప మున మూర్తీభవించి యీశ్వరాదేశమున నావిర్భవించెను. బసవేశ్వరుని చరితమును సిద్ధాంతములను నుద్బోధనములు వలయురీతిని నాంధ్రులలో వ్యాపింపఁజేసి, యాంధ్రదేశమున గూడ వీరశైవ మతమును విస్తరింపఁజేయుటయే యామహా పురుషుని జీవితప్రయోజనమై యుండెను. అందుకొఱకై 'వాఙ్మయమును బ్రబల సాధనముగ నాతఁడు గయికొనెను ...

గతి ప్రిప థమముననే వచియరచ్చియుంటెని.

## ౧౪. సోముని కాలమునాఁటి యాంధ్రవాఙ్మయస్థితి

"దేశభాషలందుఁ దెలుఁగులెస్స"యని పేరుమోసి తీరు తీయములుగలిగి వాసికెక్కిన మన తెలుంగు బాస తొలితెఱంగు నెఱుంగఁగోరువారికిఁ దగినన్ని పరికరము లిప్పటికిని లభింప కున్నవి. కాలనిర్ణయ విషయమున నింకను సునిశ్చితము కాని నన్నెచోడునికుమారసంభవము మాట మఱచినచో గ్రంథ రూపమున మన కుపలభ్యమయిన యాంధ్ర వాఙ్మయమునకు నన్నయ భట్టారక విరచితమయిన యాంధ్రమహా భారతమే మూలకందమని యందఱు నంగీకరింప వలసి వచ్చుచున్నది. నన్నయభట్టునకుఁ బూర్వము తెలుంగునఁ బద్యరచనము వృత్తరూపమున వెలసినను వెలయకున్నను మాత్రాగణ బద్ధము లగు గద్యములును, గొబ్బిపదములు, తుమ్మెదపదములు, ప్రభాత పదములు, ఆనందపదములు, వాలేశు పదములు మొదలగు గేయ కృతులును, అక్కరలు, ద్విపదలు, సీసములు మున్నగు జాతీయ రచనములును నన్నయకుఁ బూర్వము చిరకాలము నుండియే కొంతవఱకు నెలకొని యుండినట్లు మనకుఁ దొరకిన దీర్ఘాసి శాసనము (A. D. 1065) గుణగవిజయాదిత్యుని సాతలూరి శాసనము (A. D. 850_900) పాండురంగని యద్దంకి శాసనము (A. D. 848) యుద్ధమల్లుని బెజవాడ శాసనము (A D. 898) మున్నగు ప్రాచీనశాసన సామగ్రియుఁ బాలకురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమందలి వర్ణనలు నాతని గ్రంథ పరికర మును సాక్ష్య మొసంగుచున్నవి.

"ఆరూఢ గద్యప ద్యాదిప్రబంధ, పూరిత సంస్కృత భూయిష్ఠరచన మానుగా సర్వసామాన్యంబుగామి, జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు"
(పండితారాధ్యచరితము)

"ఉరుతరగద్యప ద్యోక్తులకంటె, సరసమై పరఁగిన జాను తెనుఁగు, చర్చింపగా సర్వసామాన్యమగుటఁ, గూర్చెద ద్విపదలు కోర్కెదైవార
(బసవపురాణము)

అను సోమనాథుని వాక్యముల వలన జనుల వ్యవహార వ్యాపారము లందును ద్విపదలు మొదలగు జాతీయకృతు లందును జాను తెనుంగు వాడుకలో నున్నను భావగభీరతా పరిసన్నములగు పద్యప్రబంధ రచనములును పద్యరచనముకన్న ముందుగా వెలసినట్లు తలంపఁదగు మాత్రాగణ బద్ధములగు గద్యరచనములును జాల కాలము నుండి సంస్కృతపద భూయిష్ఠములుగఁ గూర్పఁబడు చుండినట్లు తలంప నవకాశము కలుగు చున్నది. సోమనాథుఁడు రచియించిన పంచప్రకార గద్య, నమస్కార గద్య, అక్షరాంకగద్య మున్నగు గద్యకృతు లీవిషయ మును వెల్లడింపఁ గలవు. కావుననే నన్నయభట్టారకునియాంధ్ర మహా భారతమందలి పద్యరచనము నందు ముఖ్యముగ వృత్త రచనము మూఁడుపాళ్ళు సంస్కృత పదములతో జరగుటకుఁ గారణ మయినది. ఈ క్రింది వృత్తములు చూడుఁడు.

శా. పాతాళైకనికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతోమార్గవినిర్గతోగ్రదహనార్చుల్ పన్నగవ్రాతముల్
భీతిల్లెన్ భుజగాధినాథు మనమున్ భేదిల్లెఁ గల్పాంత సం
జాతప్రోద్ధత బాడబానలశిఖా శంకాధికాతంకమై,

మ. మదమాతంగతురంగ కాంచనలస న్మాణిక్యగాణిక్యసం
పదలోలింగొనివచ్చి యిచ్చి ముద మొప్పంగాంచి సేవించి ర
య్యుదయాస్తాచలసేతుశీతనగమ ధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణ ప్రతాపోదయున్.

ఉ. దారుణమై వృకోదరు గదాకులిశాహతి నన్యవాహినీ
వారణ సంచయం బభినవక్షత శోణితధారలొప్ప సం
చారితధాతునిర్ఝర విశాల శిలోచ్చయ సంచయాభమై
వీరరణంబునం బడియె విక్షతహస్తిప వృక్షపంక్తితోన్.

ఉ. శారదరాత్రు లుజ్జ్వలలసత్తరతారక హారపంక్తులన్
జారుతరంబులయ్యె వికసన్నవకైరవగంధ బంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణక
ర్పూరపరాగ పాండురుచి పూరములం బరిపూరితంబులై.

ఇట్లే నన్నయ వృత్తరచనము చాలవఱకు సంస్కృత పద భూయిష్ఠముగ జరగినది. అట్లయ్యును నన్నయ్యకూడఁ బ్రసన్నత జాతీయత వలయు నలంతియలంతి పద్దియముల రచియించు నెడ జాను తెనుంగుపయి మక్కువను గనుబఱుపక పోలేదు.

సీ. ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు, బేలనీకుఁజెప్ప నేలవలసెఁ
దెలుతవానికిట్టి తెలుసంటిపలుక్కులు, సన్నె వృద్ధజనము లున్నచోట.

క. అఱపొఱడు పఱుచచేతులు, నొఱవ శరీరమ్ము గలిగి యొరులకుఁ జూడం
గొఱగాకుండియు మన్మథుఁ, నొఱపులఁబడియెడునితండుయువతిప్రియుఁడై

క. ఒక్కొక కన్నును జెవియును
జెక్కును జను బొడ్డు మూఁపు చెలువగు చేయుం
బ్రక్కయుఁ బిఱుదును గాలును
నక్కజముగ మనుజశకల మపుడుదయించెన్.

ఇట్లు క్వాచిత్కముగ నన్నయకూడఁ జిన్నపద్యములఁ గూర్చుటలో జాను తెనుఁగునే వాడియున్నాఁడు. ఇఁక నన్నయకు

సోమనాథునకు నడుమ వెలసిన కావ్యములను బరీక్షింతమన్నచో నవి వ్రేళ్ళపయి లెక్కింపఁ దగినంత తక్కువగ నున్నవనుట నిక్కువమునకు దూరము కానేరదు. దొరకిన యాకాలపు గొందికబ్బములలోఁ బావులూరి మల్లన గణితము శాస్త్ర గ్రంథము. కందపద్యాత్మకమగు మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వ సారము శతక వాఙ్మయమునఁ జేర్పఁదగినది. వీని యందుఁ గూడ సంస్కృత ప్రాబల్యమే కానవగును. ఇఁక నన్నె చోడుఁడు సోమనాథుని వలెనే

చ. సరళముగాఁగ భావములు జాను తెనుంగున నింపుఁబెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తులార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్.

అని తనకుమారసంభవమున జాను తెనుంగుపయి వలపును బ్రకటించి యున్నాఁడు. ఇతని గ్రంథము సోమనాథు నికిఁ బూర్వము రచియింపఁ బడినను దరువాతఁ గూర్పఁబడినను నదికూడఁ బండితజనైకవేద్యమగు ప్రౌఢ ప్రబంధమయి యున్నది. ఎడనెడ నందు జాను తెనుంగు సంతన బెడంగుగొని యున్నను, మొత్తము మీఁద దానియందుఁ గూడ గీర్వాణా తిశయమే కానవగును. ఇట్లు సంస్కృతపదబాహుళ్యముతో నాంధ్రవాఙ్మయమునఁ బదిరెండవ శతాబ్దికిఁ బూర్వము కావ్య ప్రబంధ రచనము సాగియుండుటచే నది జనసామాన్య వశీకరణ మునకుఁగాని తన్మూలమున మతప్రచారమునకుఁ గాని యనువు గాకుండెను. ఇట్టి పరిస్థితిలో మన సోమనాథుఁ డాంధ్రదేశమున

నవతరించెను. భారతీయుల మతవాఙ్మయమంతయుఁ జాలవఱకుఁ బ్రాచీన కాలము నుండియు సంస్కృత భాషయందే గ్రథిత మయి యున్నది. గౌతమబుద్ధుఁ డవతరించిన తరువాత మాత్రమీ పరిస్థితి కొంత సంస్కారమునంది ప్రాకృత భాషకుఁగూడ మతవాఙ్మయ విషయమునఁ దగిన యాలంబనము గలిగెను. బౌద్ధమత గ్రంథములు చాలవఱకుఁ బ్రాకృతమునందే వెలసి యుండుట సుప్రసిద్ధము. తన్మత ప్రచారమున కయి శ్రద్ధవహించిన యశోకుఁడు మున్నగు చక్రవర్తులు కూడఁ దమ శాసనములను బ్రాకృత భాషయందే వెలయించి కృతకృత్యులయిరి. ఆంధ్రవాఙ్మయ వికాసమును దదవలంబనమున వీరశైవమత ప్రచారమును బ్రయోజనములుగాఁ గలిగిన సోమనాథుఁడు గూడ గౌతమబుద్ధుని మార్గము ననుసరించి, మాతృభాష యగు తెలుఁగు నూఁతగాఁగొని యందు మూలముననే మత ప్రచారమునకుఁ బూనుకొనుటకు సంకల్పించెను. ప్రధాన గ్రంథములగు బసవపురాణ పండితారాధ్యచరితముల నీతఁడు తెలుఁగున జాతీయచ్ఛందమగు ద్విపదలోఁగూర్చి చరితార్థుఁ డయ్యెను. మత గ్రంథములను సంస్కృతమునుండి తెలుఁగు లోనికిఁ దెచ్చు నాచారమున కీతఁడు వైలక్షణ్యము ఘటించెను. ఆంధ్రమున వెలసిన యా ద్విపద కావ్యములనే తరువాతి కవులు సంస్కృతమునను గన్నడమునను బరివర్తన మొనర్చు కొనిరి. కావున సోమనాథుని విలక్షణ విధానమువలన నాంధ్ర భాష కనన్య సామాన్యములగు గౌరవప్రాభవములు ప్రాప్తించెను. ఇఁక సోమనాథుఁడు నన్నయాదుల మార్గమునకు వన్నియ

వెట్టి రచనావిషయమున నెట్టిసంస్కారముల నెలకొలిపెనో, తెలుంగుబాస జీవనము నిక్కంపుఁ దెలుఁగుఁ బలుకుఁ బలుకుల లోనే కలదను మర్మమును గ్రహించి తేనియ తేటలగు జాను తెనుఁగుఁ బలుకులను జాలువార్చి ముందవతరింపనున్న తిక్క నాది మహాకవులకు జాతీయ కవితా నిర్మాణమునకయి మార్గ మునుదీర్చి యాంధ్రభాషాసతి కెట్టి రామణీయకమును గూర్చెనో తత్కృతి విమర్శన సందర్భమున పిలోకింతము.

## ౧౫. సోమనాథుని కృతులు, వాని పౌర్వాపర్యము

పిడుపర్తి సోమనాథకవి పద్యబసవపురాణావతారికలో మన సోమనాథుఁడు రచియించిన కృతులఁ బేర్కొనుచు వ్రాసిన సీసపద్యమును రెండవ ప్రకరణములో నుదాహరించి యుంటిని. ఈ పద్యము నాధారముగాఁ గొనియు శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ కవులచరిత్ర నూత్నముద్రణములోఁ గర్ణాట కవి చరిత్రకారుల వాక్యముల ననుసరించి కాఁబోలు "ఈ కవి గ్రంథములలో బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, అను భవసారము, తెలుఁగు; అన్యవాద కోలాహలము, బసవన పంచ గద్య, సోమనాథ భాష్యము (సంస్కృతము), తక్కినవి కన్న డము" అని లిఖించిరి. ఇవి సోమనాథుని కృతుల బాగుగాఁ బరికింపక వ్రాసిన వ్రాఁతలని చెప్పుట కెట్టి సంశయమును లేదు. కర్ణాటకవి చరిత్రకారులు, నాంధ్రకవి చరిత్రకారులును గూడ సోమనాథుని గ్రంథముల సరిగా నవలోకింపక వానిని గూర్చి వివరింపఁబూనుట శోచనీయము. పిడుపర్తి సోమనాథుని

పద్యములో అన్యవాదకోలాహలమను కృతిపేరు గానరా కున్నను నది సంస్కృతమనియు, సోమనాథకృతమనియు శ్రీ వీరేశలింగము పంతులుగారెట్లువ్రాసిరో తెలియదు. ఇట్టి పేరుగల సోమనాథకృతి కానరాదు. సోమనాథుని శిష్య ప్రశిష్యుఁ డొకఁ డాతని కంకితముగాఁ దెలుఁగున అన్యవాద కోలాహల మను సీసశతకము రచియించెననియు, నా కృతికర్త పిడుపర్తి కవుల వంశ్యుఁడయి యుండుననియు నిదివఱకే చెప్పి యుంటిని. అదియే ముద్రితమయి ప్రచారములో నున్నది.

పిడుపర్తి సోమనాథుఁడు పేర్కొనిన సోమనాథుని కృతులలో బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, అను భవసారము, చతుర్వేదసారము, బసవరగడ, చెన్నమల్లు సీసములు, వృషాధిప శతకము నాంధ్రభాషాకృతులు, బసవో దాహరణ యుగ్మములో నొకటి తెలుఁగు, రెండవది సంస్కృ తము. సోమనాథభాష్యము, రుద్రభాష్యము, బసవాష్టకము, బసపపంచకము కేవలము సంస్కృతభాషారచితములు. పంచ ప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య యనునవి యాంధ్రగీర్వాణ కర్ణాటచ్ఛందస్సంప్రదాయముల ననుసరించి మాత్రాగణబద్ధములుగఁ గూర్పఁబడిన గేయకృతులని నా యభిప్రాయము. అక్షరాంకపద్యము లించుమించుగ సంస్కృత శ్లోకములుగనే పరిగణింపఁదగినవి. బసవాఖ్యరగడ, గంగోత్పత్తిరగడ, సద్గురురగడ నాకు లభ్యము కానందున వాని యథార్థస్వరూప మెఱుంగరాకున్నది. గంగోత్పత్తిరగడ సంస్కృతభాషా రచితమని కర్ణాటకవి చరిత్రకారులు వ్రాసి

యున్నారు. మఱియు వారే సోమనాథుని సద్గురురగడ, చెన్న బసవస్తోత్రరగడ లోనివని యీ క్రిందిపంక్తుల నుదాహరించి యున్నారు.

"భవతిమిరహరదీపికావర్తి సద్గురవె
శ్రీషడక్షరజమనుజాలముఖ సద్గురవె"
"బసవగురువచోమృతగళత వృజినపంక! చెన్నబసవ
బసవపాదకమలకర్ణికా నివాస! చెన్నబసవ"

ఈ రగడల స్వరూప మిట్టిదేయైనచో నివికూడ నించు మించుగా సంస్కృత కృతులుగానే గణింపఁదగును. సద్గురు రగడ పదునాఱవ ప్రకరణమునఁ జెప్పఁబడు లలితరగడ లక్షణమునకును, చెన్నబసవరగడ యుత్సవరగడ లక్షణమునకును సరిపోవునని చెప్పనగును.

ఇఁక నివిగాక మఱికొన్ని గ్రంథములఁగూడ సోమనాథుఁడు రచియించి యుండునని పిడుపర్తి సోమనాథుని పద్యమందలి "ఆదియగు కృతుల్" అను పదముచే గ్రహింపఁ దగును. ఇప్పుడు లభ్యములగుచున్న బసవాష్టోత్తర శతనామ గద్యము, వృషభాష్టకము, త్రివిధలింగాష్టకము, అనునవి యిందు కుదాహరణములు. మఱియు సోమనాథస్తవము అను చిన్నద్విపదకృతియు, 'మల్లమదేవీపురాణము'ను నాలు గాశ్వాసముల ద్విపదకావ్యముగూడ సోమనాథుని కృతులుగా దెలియవచ్చుచున్నవి. ఈ రెండవ గ్రంథము తాళపత్రప్రతి యొకటి నందికొట్కూరులో సుబ్బయ్య యను నొక లింగా యతునియింటఁ దాము స్వయముగాఁ జూచితిమని శ్రీ పెండ్యాల

వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు సారస్వత సర్వస్వములోఁ బ్రకటితమయిన "నా కర్నూలు మండల సంచారము" అను వ్యాసమున వ్రాసియున్నారు. సోమనాథ స్తవము పాలకురికి సోమేశ్వరస్వామిపయిఁ జెప్పఁబడినది. దానిలోఁ గర్త పేరు కానరాదు. కాని యది పాలకురికి సోమనాథ కృతమేయని పారంపర్యముగఁ బలువురు చిరకాలమునుండి తలంచుచున్నారు. భక్తులనేకులు దీనిని గంతస్థముగఁ బఠింతురు. ప్రభాకరశాస్త్రి గారు తగు కారణములను జూపకయే యిది సోమనాథ కృతము కాదని బసవపురాణ పీఠికలో లిఖించియున్నారు. శ్రీ చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్యచరిత్రపీఠికలోఁ దాము గూడ నట్టి యభిప్రాయమునే ప్రకటించి, "సూక్ష్మముగా ఆలోచిస్తే ఆ గ్రంథముధోరణి పాల్కురికి సోమనాథుని నుడి కారమునకు దగ్గరగా కూడ రాదు. అయినా, యితరాధారముల వల్ల దీని కర్తృత్వమును నిర్ధారణచేసేనవలకున్ను ఏమి చెప్ప డానికిన్ని వీలులేదు" అని వ్రాసి వారి యనేక నిర్ణయములతో పాటు దీనినిగూడ సంశయగ్రస్తముగనే విడిచివైచిరి. ఈ గ్రంథ మును సోమనాథుఁడే అనుభవసారమును రచియించిన కొలఁది కాలమునకు బసవేశ్వరునిఁ గూర్చియు నాతని సమకాలికులగు కొందఱు భక్తులఁ గూర్చియుఁ దనకుఁ దెలియవచ్చిన రీతిని దన గ్రామమందలి సోమేశ్వరస్వామి కంకితముగా భక్తుల యుప యోగమునకయి సులభశైలిలో రచియించి యుండునని నా యభిప్రాయము. ఈ లఘుద్విపదకృతిలోఁగూడఁ బ్రాస యతి స్వాచిత్ర్యముగఁ బాటింపఁబడినది. ప్రాచీనభాష

ప్రయోగములుకూడ స్వల్పముగ నిందుఁగలవు. సోమనాథ కర్తృత్వవిషయమునఁగల సాధకబాధకములను ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (సం 21 సం 3) లోఁ బ్రకటితమగు "సోమనాథ స్తవము" అను వ్యాసమున వివరించియున్నాను. ఈ క్రింది పంక్తులవలన గ్రంథస్వరూపము కొంత వ్యక్తము కాఁగలదు.

## సో మ నా థ స్త వ ము

శ్రీగురులింగ! సంచిత దయాపాంగ!-యోగీంద్ర హృదయేశ! యురగేశభూష!
సామగానప్రియ! సకలలోకేశ! - సోమశేఖర! శర్వ! శూలి! త్రినేత్ర!

..............................................................................

నాయక కిన్నర బ్రహ్మయ్యపిలఁవ - హోయని పలికిన యొడయ రక్షించు
చెన్నయ్య భుక్తావశేషంబు గొన్న - పన్నగ కుండలాభరణ రక్షించు
సుజ్జగదాధార మూర్తి రక్షించు - ..........................................

..............................................................................

జంగమలింగ ప్రసాదసేవనము - నంగంబుగాఁగఁ దానంగీకరించి
తను మనోధనములు తనవనుబుద్ధి - మనమున నెడలించి మక్కువతోడ
నిరతంబు నీభక్త వరులకు మివులఁ - బరిచర్యలొనరించు భక్తినాకొసఁగు
తిట్టినవారిని దీవించువారి - నెట్టన నొకటియ న్నేర్పునాకొసఁగు
అజ్ఞానమనియెడి యంధకారమున - మగ్నుఁడనై నిన్ను మఱచి యుండితిని
అనుదినం బీ స్తవం బర్థిఁ బఠింపఁ - బనిపూని చదివిన భక్తితోవినిన
శరయంగ వ్రాసిన యభవభక్తులకు - దొరకును ముక్తియు దురితముల్ లోఁగు
బరమలింగైక్య సంప్రాప్తి చేకూరుఁ - బరిహృతంబగుజన్మ బాధలన్నియును
బరగంగ షట్థలల భావంబుసెందు - గురుభక్తిచెన్నొందు గోప్యంబుగాను
బరమప్రబంధము పాల్కురికి నిలయుఁడు-గరుణతోఁ బ్రోచును గలకాల మెల్ల!

శ్రీ ముదిగొండశంకరారాధ్యులువారు ప్రకటించిన మోక్షోపాయమను చిన్న గ్రంథమున ముద్రింపఁబడిన "భక్త స్తవము" అను చిన్న ద్విపదకృతికూడ సోమనాథరచితము కాఁదగునని యందలి శైలినిబట్టి నే నూహించుచున్నాను.

ఉపలబ్ధములయిన సోమనాథునికృతులలో అనుభవ సారమే యాతని ప్రాథమికకృతిగఁ గానవచ్చును. అందుకుఁ గల కారణములను నింతకుమున్నే మొదవ ప్రకరణమున వివ రించియుంటిని. ఈ గ్రంథరచనమునాఁటికి సోమనాథునకు బసవేశ్వరునిఁగూర్చి వివరము లంతగాఁ దెలియుటగాని, యాతని యందు భక్తికుదురుటగాని కలిగినట్లు కానరాదు. అందుచేతనే యాంధ్రదేశీయుఁడు శివతత్త్వసారకృతికర్తయునగు మల్లి కార్జున పండితారాధ్యుని నీ గ్రంథమున మూఁడు పద్యములలో స్తుతించియు నాతఁడు బసవేశ్వరుని నామోచ్చారణ మయినఁ జేసియుండలేదు. ఈ కృతియందే తన సమాజకులగోత్రముల నాతఁడు పేర్కొనినాఁడు. ఈ గ్రంథమందలి శైలియు లాలిత్యము గూడ దీని ప్రాథమికత్వమునకు నిదర్శనములు కాఁగలవు. సోమనాథుఁ డీ కృతిని రమారమి యిరువది యైదేండ్ల ప్రాయమునఁ గ్రీ. శ. 1180-1185 ప్రాంతమున రచి యించియుండును. అప్పటి కాతఁడు సంస్కృతాంధ్రములను వేద పురాణములను గొంతవఱ కభ్యసించి యాంధ్రవీరశైవుఁడగు మల్లికార్జున పండితుని శివతత్త్వసారాదికృతుల మాత్రము చదివి యాతనియెడ భక్తి గలిగియుండును. అనుభవసారము రమారమి రెండువందల యేఁబది పద్యములుగల యొకలఘుకృతి.

ఇది ముద్రితమయినను బరిశుద్ధముగఁ బరిష్కృతము కాక పోవుటచేఁ దగిన ప్రచారమున లేదు. ఇందుఁ గథారూపకమగు నితివృత్తమేదియును లేదు. గురుమహిమ, భక్తి స్వరూపము, భక్తుల లక్షణము, భక్తమహిమ, భావక్రియార్చనావిధి, ఇష్ట లింగార్చనావిధి, షట్స్థల స్వరూపము మున్నగు విషయముల గూర్చి గ్రంథముఖమునను భక్తజనములవలనను గని విని యనుభవములను సోమనాథుఁ డిందు వర్ణించును.

క. అనుభవసారంబనఁగా, మనసిజహరు శుద్ధభక్తి మార్గము వేదో
క్తనిరూఢిఁ బురాణరహ, స్యనియుక్తిని విన్నవింతు నదియెట్లనినన్

క. వారక వేదపురాణ, ప్రారంభార్థముల నెల్లఁ ద్రవ్వక "హంస
క్షీరమివాంభసి" యనుగతి, సారమెగొని తెలుపు వాఁడ సద్గురుకరుణన్

క. చెప్పుదు సద్భక్తావళి, యెప్పుడు గొని యాడుచుండ నిలసత్కావ్యం
బొప్పుశివానుభవంబున, లెప్పంబై వెలయు లింగ లీలల నొలయన్

అను పద్యములు కావ్యస్వరూపమును బ్రకటింపఁగలవు.

నన్నయకుఁ దిక్కనకు నడిమికాలమున నాంధ్రకవిత్వ శైలీ నిర్మాణమున జరగిన క్రమపరిణామమును గుర్తించువారి కీకృతి మిపుల నుపకరింపఁ గలదు. ఈ గ్రంథ రచనానంతరము కొలఁది కాలమునకుఁ బూర్వోక్తమయిన సోమనాథస్తవ భక్త స్తవములను భక్తపఠనార్థము సులభశైలిలో సోమనాథుడు లఘుద్విపద కృతులుగ రచియించినట్లు కాననగును. అటుపిమ్మ వాత్మగ్రమక్రమముగ బసవేశ్వరునిమీఁది భక్తి ముదిరిన కొలఁది నీతఁడు సంస్కృతపదభూయిష్ఠములగు పంచప్రకారగద్య నమస్కారగద్య, అక్షరాంకగద్య, బసవాష్టోత్తర శతనామగద్య మున్నగుగద్యకృతులలోను బసవోదాహరణము, బసవాష్టకము

వృషభాష్టకము, బసవపంచకము, బసవరగడ, మొదలగు గేయ కృతులలోను అక్షరాంక పద్యములవంటి ప్రౌఢ పద్యరచనము లందును బసవస్తోత్రముల నొనర్చి యవి జనసామాన్యమునకు సుబోధకములయి తన మత ప్రచారమున కంతగా నుపకరింప నందున దేశీయచ్ఛందమగు ద్విపదలోఁ దన ప్రధాన గ్రంథ ములను వ్రాయ నెంచినట్లు కాననగును.

"ఉరుతర గద్యపద్యోక్తులకంటె, సరసమై పరఁగిన జాను తెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ, గూర్చెద ద్విపదలు కోర్కి—దైవార"
(బసవపురాణము)

"అనూఢగద్య పద్యాది ప్రబంధ, పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి, జాను తెనుగు విశేషము ప్రసన్నతకు"
(పండితారాధ్యచరిత్రము)

అను వాక్యముల వలన సోమనాథుని యాశయము వెల్లడి కాఁగలదు. కావున సోమనాథ స్తవ రచనమునకు బసవపురాణ రచనమునకు మధ్యకాలమున బసవస్తోత్రరూపకములు పూర్వోక్తములునగు గద్యపద్యలఘుకృతులు రచియింపఁబడినట్లు తలంపఁ దగును. వీనిలోఁ గొన్ని బసవపురాణ రచనానంతరము కూడఁ గూర్పఁబడి యుండవచ్చును. ఈలఘుకృతుల వివరణము వేఱొక ప్రకరణమునఁ గావింపఁ బడును. అటు తరువాతఁ క్రీ. శ. 1192-1195 ప్రాంతమున సోమనాథుఁడు బసవపురాణ మును ద్విపదకావ్యముగ రచియించి యుండును. ఆంధ్ర భాషలో మన కుపలబ్ధములయిన ద్విపదకావ్యములలో నిదియే ప్రాథమిక ముగఁ గాననగును. ఇందేడాశ్వాసములు గలవు. ఆశ్వాసాంత గద్యములఁ గూడ.

"ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య, పదపద్మ సౌరభ భ్రమరాయమాణ జంగమలింగప్రసాదోపభోగ, సంగతసుఖసుధా శరధి నిమగ్న సుకృతాత్మ పాలకురికి సోమనాథ, సుకవిప్రణీతమై శోభిల్లితనరి చరలింగఘనకర స్థలివిశ్వనాథ వరకృపాంచిత కవిత్వస్ఫూర్తిఁ బేర్చి చను బసవపురాణ మను కథయందు, ననుపమంబుగ...ఆశ్వాసమయ్యె"

అని సోమనాథుఁడు ద్విపదయందే కూర్చియున్నాఁడు. బసవేశ్వరుని చరితము నిందు సోమనాథుఁడు ప్రత్యేకముగఁ గాక పూసలలోని దారమువలె నాతనికిఁ బూర్వులు సమకాలికులునగు పలువురు భక్తుల చరితములలో నంతర్లీన మగునట్లు రచియించినాఁడు. అందుచేతనే పిడుపర్తి సోమనాథుఁడు "అసదృశతన్మహామహిమ మారవితారకమై చెలంగ శ్రీ బసవపురాణమున్ సకలభక్తకథామణిసూత్రభాతిగా। వెసరచియింపు మీవు" అనిశివుఁడు భృంగీశ్వరు నాజ్ఞాపింపఁగా నాతఁడే పాలకురికిసోమనాథరూపమున నవతరించినట్లు వ్రాసినాఁడు. ఇందు వర్ణింపఁ బడిన బసవేశ్వరుని కథాసంగ్రహమిది.

"పార్వతీపరమేశ్వరులు కైలాసమునఁ బేరోలగంబున్న సమయమున నారదుఁడేతెంచి, భూలోకమున శివభక్తి క్షీణించిన దని విన్నవించి తదుద్ధరణంబునకయి యవతరింపు మని యీశ్వరునిఁ బ్రార్థించును. నందికేశ్వరుఁ దనకు నభేదంబు గావున నాతనిఁ బుత్తెంచెదనని శివుఁ డానతిచ్చును. నందికేశ్వరుని పూర్వజన్మాదికమును బార్వతికిఁ దెలియఁజేసి వీరభక్తిప్రచారణమునకయి యిలాతలమున కేఁగుమని పరమేశ్వరుఁడు నందీశ్వరున కానతిచ్చును. అంత నాతఁడు హింగుళేశ్వర భాగవాటి యను నగ్రహారంబున బుత్త్రిసంతానార్థమై నందికేశ్వరవ్రతము నాచరించు మండంగి మాదిరాజు మాదమాంబ యను శివభక్తిపరులగు బ్రాహ్మణదంపతులకుఁ దనయుఁడై యుదయించును. అప్పుడు కప్పడి సంగమేశ్వర క్షేత్రమున సంగమేశ్వర లింగ నామమున వెలసియున్న శివుఁడు జంగరూపమున నరుదెంచి యాపుత్త్రు

పఱఁ శివదీక్ష నొనర్చి యాతనికి బసవనామంబిడు మనియు లింగార్పితములు కాని పదార్థము లేమియు నాతని కొసంగరాదనియు బాసచేసి యదృశ్యుఁ డగును. ఆసంగయమీశ్వరుని యానతిని బరిపాలించుచుఁ దల్లిదండ్రులు బసవని కెనిమిదవయేట వంశాచారము చొప్పున నుపనయన మొనరింపఁ బ్రయత్నింతురు. జనన కాలముననే శివదీక్ష నొంది కర్మాతీతుఁడయిన తన కుపనయన మొనర్చి కర్మపాశబద్ధునిగ నొనరించుట యనుచితమనియు శుద్ధవీరభక్తికి శాస్త్ర్యమునకుఁ జాల దూరమనియు బసవేశ్వరుఁడు తండ్రితో వాదించి యుపనయనము నిరాకరించి నిజసహోదరియగు నాగమాంబయుఁ దానును తలిదండ్రుల విడనాడి వీరశైవులలోఁ గలియును. అప్పుడు కల్యాణ పట్టణమునఁ బశ్చిమచాళుక్యరాజ్యమును బరిపాలించుచున్న బిజ్జలుని బండారియు బసవని మేనమామయు నగు బలదేవదండనాయకుఁడు మేనల్లుని యఖండ శివభక్తి కానందభరితుఁడయి తనయ యగు గంగాంబిక నాతనికిఁ బరిణయ మొనరించును. అనంతరము బసవేశ్వరుఁడు భార్యాసోదరీసమేతముగ గురుసందర్శనార్థము కప్పడిసంగమేశ్వరమున కేఁగ సంగమదేవుఁ డాతనికిఁ బ్రత్యక్షమయి వరము లొసఁగి వీరశైవమతాచారముల నాతని కుద్బోధించును. అంతఁ గొంత కాలమునకు బలదేవదండనాయకుఁడు పరమపదమున కేఁగుటం జేసి యాతని దండనాయకపదవిని స్వీకరించి రాజ్యసంరక్షణ మొనర్పుమని బిజ్జలుఁడు, కొందఱు పౌరులు బసవేశ్వరునిఁ బ్రార్థింతురు. శివమతప్రచారమున కీయుద్యోగము కొంత యనుకూలించునని భక్తజనము ఉపదేశింప వారికోరికపయి బసవేశ్వరుఁడు బిజ్జలునియొద్ద మంత్రిత్వ మంగీకరించి యాతని రాజ్యవిస్తారమునకు వీరశైవమతప్రచారమునకుఁ గూడఁ బరిశ్రమించుచుండును. నిజగురుండగు సంగమేశ్వరుఁ డొనర్చిన బోధనముల బాగుగఁ బరిపాలించుచు నిరంతరము జంగమసమారాధన మొనరించుచు బసవేశ్వరుఁడు విశేషమహిమములఁ బ్రకటించుచు ననతికాలముననే వీరశైవమును దేశమున విస్తరింపఁ జేయును. భక్తిపరవశుఁడయి బసవేశ్వరుఁడు వర్ణాశ్రమధర్మములఁ బాడొనర్చి శివభక్తు లనునెపమున మడివాలు మాచయ్య, శివనాగుమయ్య మున్నగు హీనకులులఁ బూజించుచు, జంగమము లడిగిన దెల్ల నొసంగుచు వారికయి బిజ్జలుని బండారము నందలి విత్తమును విచ్చలవిడిగ వెచ్చించుచున్నాఁడని బ్రాహ్మణులు బిజ్జలునకుఁ

బలుమాఱులు నివేదించుచు బసవేశ్వరుని పయి నేరములు చెప్పుచుండెను.
భక్తులలో జాతిభేదమును పాటింపరాదనియు నంత్యజుఁడయినను భక్తిసం
పన్నుఁడయినచో భక్తిరహితులగు బ్రాహ్మణులకన్న సర్వవిధముల శ్రేష్ఠుఁ
డనియు బహుదృష్టప్రత్యయములతో నిరూపించి బసవఁడు బ్రాహ్మణు
ధిక్కరించుచుండును. మఱియు శివప్రసాదమున భక్తుల సొత్తునే భక్తుల కిచ్చు
చుటగాని జంగములకయి ప్రభుభాండాగారమునుండి ధనమును గొల్లపెట్టు
లేదని బిజ్జలునకుఁ జెప్పి, నిజమహిమముచే లెక్కలఁ బట్టి యుండవల
ధనముకన్న నెక్కుడు ధనమును బండారమునఁ జూపించుచుండును. బసవేశ్వ
రుఁడు నాతని యనుచరులు ప్రకటించు మహిమములకు నివ్వెఱపడి బిజ్జ
డేమియుఁ జేయఁజాలక మిన్నకుండును. శివభక్తుల మహిమాదికములఁ బలు
మాఱు ప్రత్యక్షముగఁ బరీక్షించు చుండినవాఁడయ్యుఁ గొంతకాలము
బిజ్జలుఁడు కాలమాసన్నమగుటం జేసి దైవ దుర్విపాకమున బసవేశ్వరు
యనుచరులలో అల్లయ్య మధువయ్య యను నిరువురి కన్నుల నకారణము
దీయించును. ఈ శివాపరాధమునకు రోసి బసవేశ్వరుఁడు బిజ్జలుని శిక్షిం
కల్యాణపట్టణమున నింక నుండరాదని భక్తగణ సహితముగ సంగమేశ్వర
క్షేత్రమున కేఁగును. అంతకు ముందొక సమయమున జగదేవుఁడను దండ
నాయకుఁడు తనయింట జరగు శుభకార్యమునకు బసవేశ్వరాదుల నాహ్వా
నించియు వారు రాకపూర్వమే బ్రాహ్మణ సమారాధన మాచరించి
శివాపరాధ మొనరించి పరమవిచారముతోఁ బ్రార్థింపఁగా బసవేశ్వరు
లాతని యపచారమును సైరించి ముందీకల్యాణ పట్టణమున శివద్రోహ
వాటిల్లుననియు నప్పుడు తమయాజ్ఞను బాలించి ప్రతీకార మొనర్చు భా
రము వహింపఁ దగుననియు నాతనికి ముదల యొసంగ జగదేవుఁడు నట్లే
యని ప్రతిన యొనరించియుండుటచే బిజ్జలుఁ డాచరించిన యకార్యము
గినిసి బసవేశ్వరుఁడు భక్తులతోఁ గూడఁ గల్యాణపురినుండి వెడలిపోవునప్పుడు
జగదేవున కాతని పూర్వప్రతిజ్ఞను జ్ఞాపక మొనరించును. జగదేవుఁడు
మల్లయ్య బ్రహ్మయ్య యను నిరువురు బల్లిదులు తోడురా బిజ్జలుని యింటి
పురమునఁ బ్రవేశించి యాతని సంహరించి ప్రతిజ్ఞాపరిపాలన మాచరిం
చును. బసవేశ్వరుఁడు సంగమేశ్వరసాం నైక్యమయి యవతారమును జాలిం
చును. బసవేశ్వరుని శాపముచేఁ గళ్యాణపట్టణము పాడఱును. బిజ్జలు

లనయులు రాజ్యకాంక్షపై నన్యోన్యము పోరాడి యనతికాలము ననే నిర్మూల మగుదురు"

బసవేశ్వరుఁడనుదినము లక్షతొంబది యాఱువేల జంగములకు గణార్చన మొనర్చెడి వాఁడని పారంపర్యముగ వీరశైవప్రపంచమున వినవచ్చుచున్నది. ఆతని కాలమునఁ గల్యాణపట్టణమున నాతనితో పాటసంఖ్యాకులగు మహాభక్తులు నివసించుచుండెడివారు. వారిలోఁ బ్రముఖులయిన మడివాలు మాచయ్య, ముగ్ధ సంగయ్య, సకలేశ్వర మాది రాజయ్య, కిన్నర బ్రహ్మయ్య, కలకేత బ్రహ్మయ్య, కన్నద బ్రహ్మయ్య, మోళిగ మారయ్య, ముసిడి చౌడయ్య, సురియ చౌడయ్య, తెలుఁగు జొమ్మయ్య, ఏకాంత రామయ్య, శివ నాగుమయ్య, బసవేశ్వరుని మేనల్లుఁడు చెన్నబసవన్న, సమకాలీనులు అల్లమ ప్రభువు, సిద్ధ రామయ్య, మున్నగు వారి చరితములను, బసవేశ్వరునికిఁ బూర్వము వెలసిన యఱువత్తుమూవురు లోను గాఁగల యనేకపురాతనశివభక్తుల చరితములను సందర్భానుసారముగ సంఘటించి, యందనుస్యూతముగ మణిసూత్రభాతిగా గ్రథనకౌశలముచే బసవేశ్వరునిచరితమును బొందుపఱిచి సోమనాథుఁడు బసవ పురాణమునకుఁ గావ్యగౌరవమును గల్పించినాఁడు.

ఈ బసవపురాణ రచనానంతరము కొలఁది కాలమునకు సోమనాథుఁడు మల్లమదేవీ పురాణమను ద్విపద కావ్యమును రచియించియుండును. ఈమె శ్రీశైల ప్రాంతమందుండిన యొక మహాభక్తురాలయి యుండును.

ఆ పురాణమందలి వివరములు గ్రంథ మలభ్యమగుటచే దెలియరాకున్నవి. కాని, యిందుఁ గూర్చిన యీ క్రింది యైతిహ్యమును దమ తండ్రి సుందరము పంతులుగారి వలన విని యున్నట్లు నామిత్రులు శ్రీ నిడదవోలు వేంకటరావు గారు చెప్పియున్నారు.

"మల్లమదేవి యను భక్తురాలు నిత్యము శివపూజ నొనరించుచు నేతితో దీపమును వెలిఁగించి శివునకుఁ బ్రీతి యొనరించుచుండెను. కాని, యామె యత్తింటి వారి కీమె శివపూజాదికము, దీపార్చన మున్నగునవి గిట్టక, యామెకు దీపమునకుఁ గావలసిన నేయి మొదలగువాని నొసఁగక బాధించుచుండిరి. అయినను మల్లమదేవి తన వ్రత మెట్లైనను జెల్లించుకొను భక్తి తత్పరత గలిగి యుండెను. పాలకుండలు, మజ్జిగకుండలు కడుగుట యామె చేయు పని గావున నాకుండ గోకుడు నగతెయు జాగ్రత్తగఁ దీసి, దాని యందుండి వచ్చిన వెన్నజిడ్డుతోఁ బసులకొట్టములో నొక మూల నేరికిని గానరాకుండ దీపార్చనము చేయుచుఁ, బ్రచ్ఛన్నముగ శివునారాధించు చుండెను. ఆ దీపము వెట్టినచోట నితరులకు గానరాకుండ నడ్డువెచుటచే నాదీపమున్న గోడయందుఁ గాటుక యేర్పడియుండెను. భవిదర్శన స్పర్శన సంభాషణాదుల నొల్లని యఘోరవ్రతముగల సోమనాథున కొకమాటెట్లో వ్రత భంగము గలిగెను. ఒకప్పు డేకారణము చేతనో యాభవి దర్శనము కలిగి, వెంటనే నేత్రనిరోధము ఘటిల్లెను. ఎన్ని మందు లుపయోగించినను లాభము లేకపోయెను.

అప్పుడొకనాఁడు శివుఁడు సోమనాథునకుఁ గలలోఁ బ్రత్యక్షమై మల్లమదేవియను భక్తురాలు నపార్చనము చేయుట వలనఁ గలిగిన కాటుకను ధరించితివేని నీకుఁ దిరిగి యెప్పటి దృష్టి లభించునని చెప్పి యంతర్హితుఁ డయ్యెను. సోమనాథుఁడును మల్లమదేవికొఱకుఁ బయలుదేఱి, వారియింటికి వచ్చి మల్లమదేవిని గూర్చి ప్రశ్నింప, సోమనాథునివంటి మహనీయుఁ డామెకొఱకు వచ్చుట కందఱు నాశ్చర్యచకితులై యామెను జూప సోమనాథుఁడు తన వృత్తాంతము నివేదించి కాటుకఁ గోరెను. మల్లమదేవి యాకాటుకను దానే స్వయముగ సోమునికండ్లకుఁ బెట్టఁగా నెప్పటి యట్ల యాతనికిఁ గన్నులు వచ్చెను. సోమన యామెభక్తిని గొనియాడి, యామె చరితమును ద్విపదకావ్యముగ రచియించెను. ఈ గ్రంథము సోమనాథుఁడు రచియించినట్లు పరంపరాయతమగు సంప్రదాయ ప్రమాణము గలదు.”

ఈ కథ యెంతవఱకు నిజమో చెప్పఁజాలము. సోమనాథుఁడు సాక్షాచ్ఛివస్వరూపుఁడే యనఁదగు మహాభక్తుఁడయినను మల్లమదేవికిఁ దనయందుఁ గల నిగూఢ భక్తిని లోకమునకుఁ బ్రకటించుటకయి శివుఁడే యిట్టి సంవిధానములను గల్పించియుండునని తలంచుటలో నెట్టి యసంగతియు నుండఁజాలదు.

అటు తరువాత వృషాధిపశతకరచనము క్రీ॥ శ॥ 1200 ప్రాంతమున జరగియుండును. బసవఁడు ప్రీతిఁగైకొనియెడు భక్తిమెయిన్ రచియింప నాఁడు మున్ । బసవపురాణ మంచు

నను బ్రస్తుతి సేయుదు రల్లుగాననీ । యసమ దయాధురీణతకు నంకిలి పాటుఘటిల్లకుండనన్ । వసిగొని ప్రోవుమయ్య బసవా బసవా ! బసవా ! వృషాధిపా !" అను పద్యమీశతకము బసవపురాణానంతరమే రచియింపఁబడుట వ్యక్తమొనఁరించును. ఇందు "బసవా ! బసవా ! బసవా ! వృషాధిపా !" యను మకుటముతో 108 ఉత్పల చంపకమాలికా వృత్తములలో ననేకములగు పోకడలతోఁ దనభక్తి రసావేశమును బ్రకటించి చివరను మకుట రహితముగ.

"అకుటిలలీల జంగమసమగ్రదయాకలిత ప్రసాది పా
లకురికి సోమనాథుఁడతి లౌల్యమునన్ బసవన్నదండనా
యకునకు నొప్పనీశతక మర్పణచేసె ధరన్ బఠించువా
రికి వినువారికిన్ గలుగు శ్రీయును నాయువు భుక్తి ముక్తియున్"

అనుపద్యము గ్రంథకర్తృత్వ సూచకముగను ఫలశ్రుతి ప్రదర్శకముగను సోమనాథుఁడు రచియించినాఁడు. యమకము, అనుప్రాసము, ముక్తపదగ్రస్తము మున్నగు శబ్దచిత్రములను బహుముఖములుగఁ బ్రదర్శించి సోమనాథుఁ డష్టభాషా ప్రావీణ్యసూచకముగ సంస్కృతము, ద్రావిడము, కన్నడము, మహారాష్ట్రము, శుద్ధాంధ్రము (జాను తెనుఁగు) అనుభాషలందుఁ బ్రత్యేకముగఁ గొన్ని పద్యములను, వివిధ భాషాపద మిశ్రితములగు మణిప్రవాళపద్యములను గూడ రచియించి యఖండమగు భక్తి పారవశ్యము నీ గ్రంథమున వెల్లడించి నాఁడు. మచ్చున కి క్రింది పద్యములఁ జిత్తగించునది.

ఉ॥ శ్రీగురు లింగమూర్తి! సవిశేషమహోజ్జ్వలకీర్తి! స్వర్క్రియో
ద్యోగకళాప్రపూర్తి! యవధూతపునర్భవజూర్తి! పాలితా

భ్యాగతసంశ్రితార్తకవి పండితగాయకచక్రవర్తి! దే
వా! గతినీవెమాకు బసవా! బసవా! బసవా! వృషాధిపా!

ఉ॥ నాదకళావినోద! యభినందితవేద! హృతాపవాద! సం
పాదితభక్తివాద! బుధవందితపాద! చిరప్రమోద! యా
స్వాదితసుప్రసాద! యవిషాద! శిలాదసుతావిభేద! దే
వా! దయఁజూడుమయ్య! బసవా! బసవా! బసవా! వృషాధిపా!

ఆంధ్రభాషయందు రానురాను విస్తృతి చెందిన భక్తి రస పూరితమయిన శతకవాఙ్మయమున కీ శతకరాజమే మార్గ దర్శకమని చెప్పఁదగును. ఈ శతకరచనము తరువాతఁ గొంత కాలమునకు "బసవలింగ" యనుమకుటముతో చతుర్వేద సారమను నామాంతరము గల సీసశతకమును సోమనాథుఁడు రచియించినాఁడు. ఇందు రమారమి400 సీసపద్యములు గలవని తెలియుచున్నది. అందులో 300 పద్యములు మాత్రమిప్పుడు ముద్రితమయియున్నవి. అనుభవసారమువలెనే యీ గ్రంథము కూడ సమ్యక్పరిశోధన పూర్వకముగ సమగ్రముగ ముద్రింపఁ దగియున్నది. ప్రస్తుత ముద్రిత ప్రతి పెక్కు లేఖకముద్రణ దోషములతో నిండియున్నది. ఇందు బసవశబ్దవిచారము, బసవ నామోచ్చారణ మహిమ, శివాధిక్యము, విభూతి రుద్రాక్ష లింగధారణ మాహాత్మ్యము, ప్రకృతి పురుషనామములు, విష్ణుభక్తులు శివభక్తులగుటకుఁ గారణము, అశుచినిరసనము, చరలింగస్తుతి, శీలలక్షణము, శివానుభవ సూత్రవివరము మున్నగు విషయముల నేకములు బహుశ్రుతిస్మృత్యాది ప్రమా ణములతో నిరూపింపఁబడినవి.

సీ. ఈకృతిరచియించి యీలోకమందుఁ బ్ర
తిష్ఠింతు నీశ్వరాధిక్యమహిమ
నీకృతిఁ బాలించి యీలోకమందు సం
పాదింతు జంగమ పాత్రమహిమ
నీకృతియొనరించి యీలోకమందు ని
ష్ఠింతుఁ బ్రసాదసం సేవమహిమ
నీకృతిఁగావించి యీలోకమునఁ బ్రతి
పాదింతుఁ బటుతర భక్తిమహిమ

కీ. నాదివృషభాంశజుఁడు బసవాధినాథుఁ
డిట్టి కృతినాథు కృపచేత నిప్పుడాంధ్ర
భాషఁబ్రకటింతుఁ బద్య ప్రబంధముగను
వసుధ సత్కవి సమ్మతి బసవలింగ!

సీ. శ్రీరుద్రజాబాల శ్వేతాశ్వతరబృహ
దారణ్యతైత్తిరీ యములయందు
బ్రహ్మబిందుసు పంచ బ్రహ్మాత్మగర్భకా
త్యాయనీ శుక్ల కాలాగ్ని రుద్ర
కాపాల బాష్కల గాలవపైఁనేయ
శాండిల్య ప్రశ్న సుశంఖహంస
పవమాన కైవల్య బ్రాహ్మణాది శివసం
కల్పనారాయణ కాణ్వముఖ్య
శాఖలం దుపని షచ్చయమందథర్వణ
ఋగ్యజుస్సామము లెంచిమించి

గీ. శ్రుతి పురాణాగమములందు శుద్ధవీర
శైవమునకును దగినట్టి సరణులెల్లఁ
జేర్చి మీకృపవలనను జెడనిభక్తి
పదముచేత రచించెద బసవలింగ!

సీ. వైదికులిది శుద్ధవైదికంబని యెన్న
శాస్త్రజ్ఞులిది ధర్మశాస్త్రమనఁగఁ
దార్కికులిది మహాతర్కంబనంగఁ బౌ
రాణికులిదియె పురాణమనఁగ
నాగమవిదులు దివ్యాగమం బిదియనఁ
దంత్రజ్ఞులిదివీర తంత్రమనఁగ
భక్తవారంబిది భక్తిమార్గంబన
ముక్త్యర్థులిది మహాముక్తిదమనఁ

ఆ. గవులు భువిని నిదియె కావ్యంబనంగ స
జ్జనుల కెల్ల మిగుల సంతసముగ
నిర్వికల్పరతిఁ జతుర్వేద సారమ్ము
పద్యముల్ రచింతు బసవలింగ!

ఇత్యాది పద్యము లీకృతి ప్రయోజనమును దన్నిర్మాణ సరణిని బ్రకటింపఁగలవు. సోమనాథుని వేదవేదాంగపార గత్వమున కిది ప్రబలాదర్శముగనుండును. "వరవీరభక్తి సవై దికంబుగను, విరచించితివి చతుర్వేదసారమున"అని పండితా రాధ్యచరితావతారికలో నుదాహృతమగుటచే నీకృతి పండితారాధ్యచరిత్రమునకు ముందే రచియింపఁబడెనని తెల్ల మగును. చెన్నమల్లు సీసములు సోమనాథుఁడు నిర్యాణ కాల మునఁ జెప్పినవని కొందఱు వచింతురుగాని యట్టి యూహా కాధారము వానియందేమియుఁ గానరాదు. చతుర్వేద సార రచనమునకుఁ గొంత ముందో వెనుకనో యవి రచియింపఁబడి యుండునని నా యభిప్రాయము. ఇందు వీరశైవమత విహి తములగు భక్త, మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణై క్యములను షట్థ్సలముల విజ్ఞాన స్వరూపము వరుసగఁ బదు

మూఁడు, అయిదు, మూఁడు, నాలుగు, అయిదు, రెండు మొత్తము ముప్పదిరెండు పద్యములలో వర్ణింపఁబడినది. ప్రతి పద్యముచివరను "చెన్నమల్లు"అను మకుటము కూర్పఁబడినది. ఇది సోమనాథునికి మొదటి యిష్టదైవమగు శ్రీశైలమల్లికార్జునుని సంబోధనమయి యుండును. పండితారాధ్యచరిత్రావతారికలోని "తెల్లంబుగా నస్మదీయేశు చెన్న। మల్లికార్జునదేవు మహితరూపంబు। తానయాబసవనదండ నాయకుని। జానొంద మత్కృతిస్వామి గావించి" "మసలక మాచెన్నమల్లికార్జునుని! బసవనామంబిడి భక్తిపెక్కువను। బసవలింగంబని పరిణుతించువాఁడ" అను వాక్యములఁబట్టి సోమనాథునికి మొదట శ్రీశైలమందలి చెన్నమల్లికార్జున స్వామి యిష్టదైవముగానుండియుండుననియు, రాను రాను బసవేశ్వరునిమీఁది భక్తి పారవశ్యము సోమనాథునకుఁ బరిణతమై సర్వశైవ ప్రపంచము బసవమయముగాఁ గానవచ్చినప్పుడు బసవేశ్వరుఁడా చెన్నమల్లికార్జునుని మహితస్వరూపమేయని భావించి యాస్వామిని గూడ బసవలింగంబని పరిణుతించెడివాఁడని తోఁపఁగలదు. ఈ క్రింది పద్యములవలనఁ దత్కృతి స్వరూపము కొంత తెలియఁగలదు.

## భ క్త స్థ ల ము

సీ. శ్రీగురులింగ సంచిత కృపోన్నతిఁ జేసి
కంటి జంగమ పాద కమలసేవ
జంగమలింగ ప్రసన్నత్వమునఁ జేసి
కంటిఁ బ్రసాద సుఖంబు నొందఁ

దత్ప్రసాద ప్రబోధ స్థైర్యమునఁ జేసి
కంటి సర్వాంగ ప్రకాశభక్తి
భక్తి సౌభాగ్యానుభవ పూర్తిమైఁ జేసి
కంటి జీవన్ముక్తి కడమ లేక

ఆ. ఇంక నేమికోఁటఁదేల నాకాశింపఁ
బాడియాడి దైన్యపడి భజించి
మెచ్చి పొగడిరేని మీఁదనొందెడి ఫలం
బెన్నసున్న దెట్లు చెన్నమల్లు !

## మాహేశ్వరస్థలము

సీ. కరమర్థి నీకు శృంగారంబుగాఁ బూజ
సేయుదుఁగాని యాశింప ఫలము
వేడుకతోడుత విభవార్థముగ నుతుల్
సేయుదుఁగాని యాశింప మెప్పు
తగిలి నీకు సుఖార్థముగఁ బదార్థార్పణ
సేయుదుఁగాని యాశింప రుచుల
లాలితంబుగ నీకు లీలార్థముగ భక్తి
సేయుదుఁగాని యాశింప ముక్తి

గీ. నీవు పూజాఫలార్థివే నిష్ఫలార్థి
నీవు కీర్తి ప్రియుండవే నిష్క్రియుండ
సకల సుఖభోగి వీవె ప్రసాదముక్తి
సన్నిహితుఁడను నీబంటఁ జెన్నమల్లు !

## ప్రసాదిస్థలము

సీ. కాయంబు నింద్రియోత్కరమును నర్పించి
సంధిల్లు కాయప్రసాదియేని
ప్రాణంబు సత్క్రియా పదమును నర్పించి
సాధించు ప్రాణ ప్రసాది యేని

సౌఖ్యంబు నర్పించి
శబ్దించు వచన ప్రసాది యేని
గమనంబు గమన సంగతియును నర్పించి
చన నేర్చు గమన ప్రసాదియేని
గీ. తలఁపులను శేష్టలను నర్పితంబు సేసి
సంచరించు వ్యాపారప్రసాదియేని
అట్టి సర్వసంపూర్ణ మహా ప్రసాద
సన్నిహితులను జేర్పుమీ చెన్నమల్లు!

## ప్రా ణ లిం గి స్థ ల ము

సీ. కాయంబు నందునిన్ ఛాయకుండినలీలఁ
బ్రాణంబు నందునఁ బాయఁ డేని
వెలయ జాగ్రదవస్థఁ దలఁచిన యమ్మాడ్కి—
నలరు స్వప్నావస్థఁ దలఁచె నేని
వెలుపలి దృష్టుల వీక్షించు విధమున
భావంబు నందునఁ బదిలుఁ డేని
బాహ్యార్పణంబునఁ బరవశుఁ డైనట్టి
మానసార్పిత సావధానియేని
ఆ. నతనిఁ జెప్ప నొప్పు ననిశంబు నతని సాం
గత్య మొప్పు నతనిఁ గన్న నొప్పు
నట్లు గాన నీ మహా భక్తియుక్తులఁ
జేర్చి ప్రోవు నన్నుఁ జెన్నమల్లు!

## శ ర ణ స్థ ల ము

సీ. చేసినను పచారి సేయమి సోమరి
ఫలము గోరక చేయ భక్తవరుఁడు
పొగడినఁ బ్రాధుండు పొగడమి మూఢుండు
నిరపేక్ష పొగడఁ గవీశ్వరుండు
వలెనన్న సంసారి వలదన్న నిర్మోహి

వల దనర్పితమన్న వరప్రసాది
తలఁచిన సువిధాని తలఁపమి నద్వైతి
తన్ను మర్వఁదలఁపఁద త్త్వవిదుఁడు
ఆ. అట్లుగానఁ దజ్ఞులగు మహాభక్తుల
సరస లింగ కవుల సత్ప్రసాద
రతులఁ బరమతత్త్వయుతుల మహాత్ములఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు!

ఐ క్య స్థ ల ము

సీ. ధర"నవశ్య మను భోక్తవ్యం కృతం కర్మ"
యను కర్మ యోగంబు నపహసించి
యేదియు లేక„జ్ఞానాదేవ మోక్షమన్"
జ్ఞానయోగంబు హాస్యంబు చేసి
వదలక"యాత్మ నామిదమగ్రజే"త్తను
ధ్యాన యోగంబును నాశ్రయించి
తగ"సచ భూజ్యోయథావ్యాహ" మ్మనుభక్తి
యోగంబు ముక్తికిఁ జేగగాఁగ
గీ. తివిరి పొదలు పరమ శివయోగ సుఖ సుధా
శరధి మఱచి తన్ను జగము మఱచి
లింగ గతిఁ జరించు లింగ లింగైక్యులఁ
జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు!
క. చెనమల్లేశ్వరు పేరిట
సునిశితముగఁ బాలకురికి సోమేశుఁడు దా
ఘనభక్తిశైలయఁ జెప్పెను
చెనమలు సీసంబులనఁగఁ జెలఁగ ధరిత్రిన్
క. ఈ సీసము లేవేళను
భాసురముగఁ బఠనసేయు భక్తులకిలలో
వాసిగభుక్తియు ముక్తియు
నా సర్వేశ్వరుఁ డొసంగు ననవరతంబున్

'రుద్రభాష్యము'ను సోమనాథుఁడు చతుర్వేదసార రచనానంతరము రచియించియుండును. అది యిపుడలభ్యము. పేరినిబట్టి యది యజుర్వేదమందలి శతరుద్రీయమను రుద్రాధ్యాయమునకు (నమకచమకములకు) భాష్యమయి యుండునని తలంపనగును. అటుతరువాత మఱికొంత కాలమునకు సోమనాథ భాష్యరచనము జరగియుండును. ఇందు (1) వృషభేంద్ర మాహాత్మ్యము (2) విభూతి మాహాత్మ్యము (3) రుద్రాక్షమాహాత్మ్యము (4) శివలింగధారణ మాహాత్మ్యము (5) లింగార్చన విధి (6) లింగార్చన మాహాత్మ్యము (7) పాదోదకమాహాత్మ్యము (8) ప్రసాదస్థలమాహాత్మ్యము (9) వీరశైవ మాహాత్మ్యము (10) వీరమాహేశ్వర మాహాత్మ్యము (11) ఇతర దేవతా పరిత్యాగమాహాత్మ్యము (12) నమస్కారాధిపతిత్వము (13) దక్షాధ్వరనిరసనము (14) సూర్యావలోకన నిషేధము (15) నారాయణోపాసకత్వము (16) ఊర్ధ్వ శంఖపుండ్ర నిరసనము (17) సర్వదేవతాజనకత్వము (18) ఏకాత్మవాదనిరసనము (19) ద్విమూర్తి వాద నిరసనము (20) అష్టమూర్తి వాద నిరసనము (21) కర్మ వాద నిరసనము (22) భగవచ్ఛబ్ద నిర్వచనము (23) భర్గ శబ్ద నిర్వచనము (24) రుద్రశబ్ద నిర్వచనము (25) మహాదేవ శబ్ద నిర్వచనము అనెడి యిరువది యైదు ప్రకరణములు గలవు. ప్రతి ప్రకరణము చివరను "ఇతి శ్రీ వీరమాహేశ్వరాచార సారోద్ధారే శ్రీ సోమనాథభాష్యే అని చెప్పియుండుటచే సోమనాథుఁడు దీనిని వీరమాహేశ్వరా

చారసారోద్ధరణము నిమిత్తము రచియించి యుండునని విస్పష్టము కాఁగలదు. ఆయా ప్రకరణనామములఁ బట్టియే గ్రంథ స్వరూపము కొంత బోధపడఁ గలదు. ఇందనేక శ్రుతి స్మృతి పురాణేతిహాసాగమాది ప్రమాణములచే సోమనాథుఁ డాయా విషయముల నుద్ధరించి తన ప్రాగల్భ్యమును బ్రకటించును. పండితారాధ్య చరిత్రమున నుదాహృతముల యిన ప్రమాణములు చాల వఱకీ భాష్యమునుండి యుద్ధృతము లయినవే. అందుచే నిది పండితారాధ్యచరిత్రమున కంటె ముందే రచియింపఁ బడెనని తెల్లమగును. ఈ గ్రంథమునకు బసవ రాజీయమను నామాంతరము గూడఁ గలదని తెలియు చున్నది. "బసవరాజీయాది బహు కృతుల్ మీరు నిర్మించిన సామర్థ్య మేనుతించి" అని యన్యవాదకోలాహల శతకకర్త సోమనాథుని స్తుతించినాఁడు. ఈగ్రంథ మందలి విషయస్వరూప మిట్లుండ శ్రీ ప్రభాకర శాస్త్రిగా రిందు గాయత్రీ మంత్రము శివపరమని నిరూపింపఁ బడినదనియు మఱియు నిందు వైదికాచార గర్హణము గానరాదు సరిగదా దాని ప్రాధాన్యముగూడఁ బ్రతిపాదితమయినదనియు వ్రాసి యందు మూలమున సోమనాథుఁడు బ్రాహ్మణకులజుఁడేయని నిరూపింపనెంచుట శోచనీయము. ఆవిషయము నైదవ ప్రకరణమునఁ గొంతవిమర్శించియే యుంటిని. వీరశైవము తాంత్రికముగాక వైదికమతమని నిరూపించుటయే సోమనాథుని యాశయము. ఆతని కృతులన్నియు నించుమించుగఁ దదాశయ నిర్వాహము కొఱకే విరచింపఁబడినవి. "వరవీరభక్తిసవైదికంబు

గను! విరచించితివి చతుర్వేదసారమున" అను పండితారాధ్య
చరిత్రావతారికలోని యాతని వాక్యమును "హరభక్తివైది
కంబని ప్రస్తుతులిడిచెప్పెఁ బ్రతిభ సోమేశుఁడారాధ్యచరిత" అను
పిడుపర్తి సోమనాథుని వచనము గూడ దీనినే నిరూపించును.
సోమనాథ భాష్యము గూడ నీ సంకల్పసిద్ధికే కూర్పఁబడినదని
యందలి విషయములఁ బట్టి విస్పష్టమగును. ఇఁక సోమనాథుని
కృతులలోఁ బండితారాధ్యచరిత్రమే కడపటిదిగఁ గాన్పిం
చును. చరమవయస్సులో క్రీ. శ. 1230 ప్రాంతమున
నాతఁడు దానిని రచియించియుండును. ఇందాంధ్రదేశమున వీర
శైవమత వ్యాప్తికై పాటువడిన మల్లికార్జున పండితా
రాధ్యుని జీవితచరిత్రము సాభిప్రాయనామధేయములగు
దీక్షా, పురాతన, వాద, మహిమ, పర్వత ప్రకరణములను
పంచ ప్రకరణములలో వర్ణింపఁబడినది. బసవపురాణము
వలె నిదికూడ జాతీయచ్ఛందమగు ద్విపదలోనే కూర్పఁబడి
నను సోమనాథుఁడు పాండిత్యము పండు వాఱిన నిండుప్రాయ
మునదీనిని రచియించుటచే నిందలి రచనమనేక విధముల బసవ
పురాణ రచనముకన్నఁ బ్రౌఢతరముగానుండును. ఇందలి
కథాసంగ్రహమిది.

"ఆంధ్రదేశమున దక్షారామక్షేత్రమున శ్రీ భీమేశ్వర మహా
లింగము నర్చించు వానసవంశ వర్ధనుఁడు వీరభక్తి తత్పరుఁడును నను భీమన
పండితుఁడను బ్రాహ్మణోత్తముఁడు గలఁడు. ఆతఁడు పుత్రసంతానార్థియై
శ్రీశైలమున కేఁగి మల్లికార్జున దేవునిఁ గూర్చి తపశ్చరణ మాచరించును.
అప్పుడు కైలాసమున శివుఁడు తన ప్రమథ గణములలో నొక ప్రమథ
మూర్తిని బిలిచి వీరశైవమతోద్ధరణార్థమయి యిలాతలమున నవతరించు

బసవేశ్వరునితోఁ పాటు పాటువడి మతప్రచార మొనర్చుట కయి యుద్భ
వింపుమని యాదేశించి సర్వజ్ఞత్వాది శక్తి యుక్తుల నాతనికిఁ బ్రసాదించి
శ్రీశైలమునఁ దనయోత్పత్తికయి తపము సేయు భీమన పండితుని సతి
గౌరాంబ గర్భమున నుదయింపుమని యాజ్ఞాపించును. మహాదేవు నానతిపయి
తమ కుదయించిన యానందనునకు జనకులు శ్రీశైల మల్లికార్జునదేవుని నామ
మునుబెట్టి మల్లికార్జున పండితుఁడని నామకరణ మొనర్తురు. తరువాత వారు
తమ దక్షారామమునకేఁగి భీమేశ్వరసేవానురక్తులయి చరింతురు. మల్లికార్జున
పండితుఁడు అవాంతర దేశికుని శిష్యసత్తముఁడగు కోటిపల్లి యారాధ్యదేవుని
వలన వీరశైవ దీక్షవడసి వీరవ్రతాచారధౌరేయుఁడయి వర్తిల్లుచుండ బ్రాహ్మ
ణులకెట్టి వీరశైవాచారసరణులు సరిపడునే యనిస్మార్తబ్రాహ్మణులు కొంద
ఱాతనితోఁ వివదింతురు. బహుశ్రుతి స్మృత్యాగమాది ప్రమాణములతోఁ
పండితుఁడు విభూతి, రుద్రాక్ష, పాదోదక, లింగార్చన, లింగధారణ,
ప్రసాద స్వీకార మహిమములఁ బ్రతిపాదించి వారి నోడించి యాసందర్భ
మున వారికి ఘంటాకర్ణుఁడు, భీతుఁడు, దుర్వాసుఁడు, సుకేశి, మున్నగు పురా
తన శివభక్తుల చరితముల వినిపించును. అంత నొకనాఁడాతఁ డిష్టలింగార్చన
తత్పరుఁడయి తన్మయావస్థయందుండ సూర సానమ్మ, బెలిదేవి వేమనారా
ధ్యుఁడు మొదలగు జంగమములేతెంచి యాతని లింగార్చనారతికి
సంతుష్టాంతరంగులయి యాతని పూజల నంగీకరించి బసవేశ్వరుని
భక్తిమహత్త్వముల నాతనికి నివేదింతురు. అనంతర మొక
సమయమున శివార్చనకయి పండితుఁడు పుష్పములు కోసికొని
వచ్చుచుండును. అప్పుడు వెల్లగొండ మహాదేవయ్యయను భక్తుఁడు వేగు
జామున లేచి శివపూజకై పూలఁగొని తేరనెంచి చీఁకటిలోఁ బ్రమాద
వశమున శివపూజోపకరణములకుఁ దనపాదములు తగులగా నాయపరాధ
మునకు దురంత సంతాపమునఁ బొగిలి తత్ప్రాయశ్చిత్తమునకయి పాదము
లను గడికండలుగ ఖండించుకొని నేలపయి పడియుండును. మల్లికార్జున
పండితుఁ డది చూచి యా భక్తవరుని వీరభక్తి వ్రతమున కబ్బురపడి యాతని
సాహసాదికముల నచ్చటి శివభక్త గణముల యెదుట సన్నుతించి శివార్చనా
మందిరము నందలి దీపతైలమును దెచ్చి తుత్తునియలై పడిన యాతని పాద
ఖండములను సంధించి వానికా తైలమును బూసినంతనే మహాదేవయ్య

పాదము లెప్పటి యట్ల మొలిచి చూపఱ కాశ్చర్యమును గలిగించును. అప్పుడచ్చటి భక్తులు పండితుని మహిమమును బహుభంగులఁ బ్రశంసించి యేతాదృశమహిమాన్వితులయి వినుతిగన్న కళియంబ నయనారు, పిళ్ళె నయనారు, వాగీశనయనారు, దసరయ్య, గురుభక్తయ్యమున్నగు పురాతన భక్తుల చరితములను, సమకాలికులగు బెలిదేవి వేమయ్య, చేటల వేమయ్య యను వారి మహత్త్వములను నాతనికి వినిపింతురు, పిమ్మట గొంత కాలమునకు మతప్రచారమునకయి దేశాటన మొనర్చుచుఁ బండితారాధ్యుఁడు గుంటూరు మండలమున ధనదపురమను నామాంతరము గల సనదవోలు (చందవోలు) చేరి భక్తి మహిమతో వర్తింపుచుండ నచ్చటిరాజగు వెలనాటి చోడుని బౌద్ధ గురుఁడది సహింపఁ జాలక భూవరునకుఁ బురిగొల్పి యన్య సమయస్థులఁ గూడఁ గొందఱఁ జేరఁ దీసి మల్లికార్జున పండితునితో వివాదించుటకయి యొక సభ నేర్పరించును. భక్తుల వలన నీవార్త విని బండితారాధ్యుఁ డాసభ కేతెంచి తన యసాధారణ పాండితీ శౌండీర్యమున వేదవాదము, కర్మవాదము, కాలవాదము, వేదాంతవాదము, సాంఖ్యవాదము, యోగవాదము, చార్వాకవాదము, పాంచరాత్ర వాదము, బౌద్ధవాదము, జైనవాదము మున్నగు నితరమత వాదములనెల్ల నిరసన మొనరించి శివపారమ్యమును వీరశైవ మహత్త్వమును బ్రతిష్ఠించును. ఇట్లు పండితుఁడితర మతవాదములనెల్ల విపాటన మొనర్ప నాతని బ్రతిభాతిశయమునకు వెఱచి యన్యసమయస్థులెల్ల సభవిడిచి పారిపోవుదురు. ఇదిచూచి యోర్వఁజాలక బౌద్ధపదాచార్యుఁడు "పరుగెత్త నేల బలాదూ"రనునట్లు "శేషం కోపేన పూరయేత్తను" సరణిఁ బండితారాధ్యుని నిందించుచు సభనుండి తానుగూడ వెడలిపోయి క్రోధవివశాత్ముఁడయి నిజానుచరులచే రహస్యముగఁ బండితారాధ్యుని శివపూజామందిరమునందలి దీపస్తంభమును దొంగిలింపఁజేయును. ఈ వార్త విని రేమయ్య, దేవయ్యయను శివభక్తులు పండితునకుఁ దెలియకుండఁగనే శివద్రోహమునకుఁ బ్రతీకార మొనర్చు వారయి సముద్ర తీరమందలి బౌద్ధాలయమునకేఁగి యచ్చటకేతెంచినప్పుడు బౌద్ధపదాచార్యునిఁ జిత్రవధగావించి యది యసంఖ్యాత మాహేశ్వరుల పనుపున జరగినపనియని లేఖ నొకటి యాతని ఱొమ్మున హత్తింప నీవృత్తాంతము బౌద్ధశిష్యులవలన విని వెలనాటి చోడుఁడు మహా

గ్రముగ మండిపడి పండితారాధ్యుని బిలిపించి యందుఁ గూర్చి ప్రశ్నించును. హత్యావిషయము వాస్తవముగఁ దానెఱుఁగకున్నను బౌద్ధపదాచార్యుని వక్షస్స్థలమున హంతకులుంచిన శివాజ్ఞాపత్రమును గాంచినంతనే పండితారాధ్యుఁడా నేరమునంతను దనపై నిడికొని యది శివద్రోహమునకయి గలిగిన ప్రతిఫలమని రాజున కెఱింగించి యందుకయి యాతఁడు విధించు దండనము నంగీకరింతునని తెలియఁ జేయును. బ్రాహ్మణుఁడగుట మరణ దండన మనుచితమని భూపాలుఁ డాతని కక్షి దండనమును విధించును మీయపరాధముల మీరు గుర్తింపక నేనే యపరాధినని నిర్ణయించి దండనము విధించునప్పు డొక యక్షిదండనమే యననేల? మీ యిష్టము వచ్చిన దండనముల విధింపుడు. ఆదండనముల నేనే విధించుకొని ఖండితావయవముల నెల్ల శివానుగ్రహమున మరలఁ బడయ నేర్తునని పండితుఁడు ప్రతిన యొనర్చి చందవోలు నందలి యురులింగోద్భవదేవుని గద్య పద్యాదికముల సన్నుతించును. బహు ప్రజా సమక్షమునఁ బండితారాధ్యుఁడు రాజసేవకుల కరము లందలి గోరుగొండ్లను గైకొని వానిపై మంత్రోక్తభసితంబుఁజల్లి శివపాదోదకంబులఁ గడిగి వానితోఁ దననేత్రములఁ బెకలించి పళ్ళెరమున నుంచినంతనే శివప్రసాదమున మరల నాతని కెప్పటియట్ల నేత్రము లుదయించును. ఈ యద్భుత కృత్యమునకు రాజు ప్రజలు నివ్వెఱపడఁ బండితుఁడు మఱియొకసారి మరలనట్లే తన నయనములనుత్పాటన మొనరింప నప్పుడు గూడనవి పూర్వము వలెనే యావిర్భవించును. ఈ పరాభవానలముచే వెలనాటి చోడుఁడు మఱింత మండిపడుచుఁ బండితుని నేత్రములఁ దనసేవకులచే స్వయముగ మరలఁ బెకలి పించి యాతని కనుగోలఁకుల నిండ జీడిపాలు వోయించును. పండితారాధ్యుని మహిమమును గనులారఁ గాంచియు మదాంధీభూతచేతస్కుఁడయి రాజొనర్చిన యా యకార్యమునకుఁ బ్రజలెల్ల నేమగునో యాతనికి దేశమునకు నెట్టిపాటు వాటిల్లునోయని బెగ్గడిల్లుదురు. అప్పుడు పండితారాధ్యుఁడు తానురులింగోద్భవదేవుని ప్రసాదమున నినుమాఱువడసిన నేత్రముల నాల్గింటిని మరల నామహాదేవునకే యర్పించి వెలనాటి చోడుఁడు నాతని వంశము నిర్మూలమగు దనుకఁ దనకు నేత్రప్రదానము వలదని యానయిడి వారివంశక్షయ మగునట్లు శపించి చందవోలు విడనాడును. ఉరులింగోద్భవ స్వామియుఁ బండితుఁడర్పించిన నేత్రములలో

మూఁడింటిని దనముక్కన్నులలో నిడికొని మిగిలిన నయనమును బాదమున
ధరించును. అనంతరము పండితారాధ్యుని శాపమహిమచేఁ జందవోలులో
ననేకోత్పాతము లుప్పతిల్లి వెలనాటి చోడుఁడు నాతని సంతతియు నశింతురు.
పరసమయస్థులగు బౌద్ధాదులతో వాద మొనర్చి వారినిందలకోర్చి దుర్మార్గుఁడగు
వెలనాటి చోడునితో భాషించి శివదీక్షితులు కాని యాతని సేవకుల స్పృశించి
వారిచే నేత్రపీడన మొందిన తన యపరాధములనెల్లఁ బాయఁదట్టుటకయి
పండితుఁడంత సహస్రగణమాలికాస్తవ మాచరించి, రుద్రగణ, యోగా
చార్యగణ, దశగణ, త్రయోదశగణ, షోడశగణాదిక సంకీర్తనము లాచ
రించుచు నమరారామక్షేత్రమున కరుదెంచి యమరేశ్వరుని సందర్శించి
యా దేవదేవునకు నమరేశ్వరాష్టకాది కృతుల సమర్పించి యాతని ప్రసాద
మున నూర్ధ్వనేత్రయుగ్మమును స్వీకరించును. అనంతరము పండితారా
ధ్యుఁడు భక్తగణార్చన మొనర్చి శివానందభరితుఁడయి యున్న యవసరమున
నంతకుమున్న కర్ణాట భాషార్థియై యాతఁడు బసవేశ్వరుని కడకుఁ బుత్తెం
చిన జంగమము లేతెంచి బసవేశ్వరుఁడొసంగిన విభూతి నాతనికి సమర్పిం
తురు. ఆ విభూతి ధారణ మహిమచేఁ బండితారాధ్యున కప్రియత్నముగ
గర్ణాటభాష కైవసమయ్యెను. అంతనాతఁడు కర్ణాటగీతసంగతులఁ బర
మేశుని బసవేశుని సన్నుతించి బసవసందర్శనార్థమయి కల్యాణకటకమునకుఁ
బ్రయాణింప నుద్యుక్తుఁడగును. మధ్యేమార్గమున శివభక్తు లొసంగుపూజల
నంగీకరించుచు నాతఁడు నిడుగుడుముల యను గ్రామమును జేరి నిజాగ్ర
శిష్యుఁడగు దోనమయ్య కగ్రజుఁడయిన వీరచాకిదేవయ్యచేఁ బూజితుండయి
యటనుండి పానుగంటికిఁ బ్రయాణమగును. ఆ పురమును బరిపాలించు
నుదయచోళుని యొద్ద పండితారాధ్యుని శిష్యుఁడు గోవిందపెగ్గడ భాండా
గారాధ్యక్షుఁడు. అతఁడు గురువర్యుని రాకకు రాకాచంద్రోదయమున
కలరు చకోరమువలె నలరారి పట్టణంబంతయు నలంకరించి యాతని కెదు
రేఁగి మహావైభవముతో నాతనిఁ గొనితెచ్చి యభ్యర్చించును. ఉదయాధీ
శుని సేవకులలో ధవళేశునామయ్యయను శివభక్తుఁడు గలఁడు. అతఁడు పండితా
రాధ్యుని పూజనమున నియుక్తుఁడయి యుండుటఁ గాంచి తోడి సేవకు
లాతనిపయి రాజునకుఁ గొండెములు పలుక మదాంధుఁడగు రాజు నామయ్యను
బిలిపించి మందలించి తన తమ్మునిడి తన యెదుట దానిని భుజింపుమని

నిర్బంధించును. పొట్టకూటికయి యితరుల కొలువునఁజేరి నంతమాత్రమున శివభక్తునకు శివప్రసాదేతరము భుజింపరాదని నామయ్య రాజునకు విన్నవించును. దానిపయి యుదయావనీశుఁ డుగ్రనలునివలెఁ గనలుచు బసవేశ్వరుఁడు బిజ్జలుని సేవింపఁడే యాతనికంటె నీ వెక్కుడే నాతమ్ముఁడిననొల్లవేని నా కొలువున కర్పించిన నీ తనువును నాకు సమర్పింపుమని యాగ్రహింప, నామయ్య బసవేశ్వరాదుల మహిమలఁ గొన్నిటి నాతని కెఱింగించి యాతని యానతి వడువునఁ దన తనువు నాతని కర్పించువాఁడయి యాతని కరమున నున్న సురియను లాగికొని దానిచేఁ దన కంఠమును ఖండించికొని రాజును శపించుచు శివాశివాయని ప్రాణములఁ బాసి కైలాసమున కేఁగును. ఈ వృత్తాంతము నాలకించి పండితారాధ్యుఁ డుదయచోళుఁడు పుత్త్రమిత్త్రకళత్ర సహితమ్ముగ నిర్మూలమగుఁ గాకయని శాపోదకములు విడిచి పానుగంటిని విడనాడి వనిపురమను గ్రామమునకుఁ జనుదెంచును. పండితుని శాపమహిమచే వెలనాటి చోడునివలె నుదయావనీశుఁడు గూడ సంతానసహితముగ నిర్మూలమగును. వనిపురమున శంకరయ్య మొదలగు భక్తులొనరించు సేవలఁగొని కొన్ని దినములుండి యటనుండి కల్యాణపట్టణమునకు బయలుదేఱు చుండఁ గొందఱు భక్తులరుదెంచి కల్యాణకటకమున గజిబిజి కలైననియు బిజ్జలుఁడాచరించిన శివద్రోహ కారణమున జగదేవ, మల్ల, బ్రహ్మయ లను బల్లిదులాతని భంజించిరనియుఁ గల్యాణకటకము పాడుగా శపియించి బసవేశ్వరుఁడు శివభక్తపరివారసహితముగఁ గప్పుడి సంగమేశ్వరమునకుం జని యంతకు మున్నె నిమిదిదినములయి సంగమేశ్వర లింగగర్భమునం దైక్యమయ్యెననియుఁ బండితారాధ్యునకు విన్నవింతురు. ఈ వార్త నాలకించి పండితుఁడు ఱాతిగుండెలకుఁ గూడ జాలిగలుగునట్టు బిట్టుగఁ బ్రలాపించును. అంత నాతఁడు కల్యాణపుర ప్రయాణమును గట్టిపెట్టి శ్రీశైలప్రయాణోన్ముఖుఁడయి వెల్లటూరను గ్రామమును జేరి శ్రీపర్వత మహత్త్వము నెఱిఁగిన వాఁడగుట నా పర్వత శిఖరముల పయిఁ దనపాదములతో నడయాడుటకు వెనుకాడి తన పక్షమున శ్రీశైలయాత్రను సాగించి యాత్రాఫలము దనకుఁ దక్కింపుమని నిజశిష్యుఁడగు దోనయ్య నందుకయి నియోగించి యాతనికి శ్రీపర్వత వృత్తాంతము నెల్ల వినిపించును. ఆతఁడును గురువరుని ముదల నవుదల నిడికొని, యాత్రికసంఘములతో శ్రీశైలమున

కేఁగును. అంతమార్గమున శ్రీశైల మల్లికార్జునస్వామి వృద్ధతాపసవేషమున దోనయ్యా కగపడిన మల్లికార్జునపండితుఁడు తనకు మచ్చికగల నెచ్చెలియని చెప్పి యాతని కుశలమడిగి యొక దీపవృక్షశిఖరాగ్రమునుండి యాతనికి శ్రీశైలపరిసరములను వాని మహిమాదికములను దెలియఁజేయును. ఆశ్చర్య సంభ్రమములతో వాని నన్నిటిఁ దిలకించి పండితారాధ్యుని యనుగ్రహమున గదా తన కిట్టి భాగ్యమలవడెనని యానందమున నుప్పొంగుచు శ్రీశైలప్రదక్షిణమాచరించి వెల్లటూరికి మగిడివచ్చి జరిగిన వృత్తాంతమంతయు దోనయ్యా గురువర్యునకు నివేదించును. పండితు డా సంగతులనెల్ల విని యావృద్ధతాపసుఁడు మల్లికార్జునదేవుఁడే యని గ్రహించి దోనయ్యవంటి శిష్యసత్తముని మూలమునఁగదా యా స్వామి యనుగ్రహము తనకు లభించెనని సంతోషముం జెంది దోనయ్యా సుకృత భాగధేయములఁ గొనియాడును. అనంతరము పండితారాధ్యుడు బసవేశ్వరుఁ డవతారమును జాలించిన తరువాతఁ దానీధారుణియం దుండియుఁ బ్రయోజనము లేదు కావున సంగమేశ్వర లింగగర్భమున నాతనింబోలె, నిజగర్భమునఁ దన్నుఁగూడఁ బుత్త్రికళత్రసహితమ్ముగ నైక్యమ్మొనర్చి కొమ్మని శ్రీశైలమల్లికార్జునునిఁ బ్రార్థించును. పండితారాధ్యుని సంప్రార్థనము నంగీకరించి యా మహాదేవుఁ డట్లు గావించును.

శివాజ్ఞాప్రసరణి శివగణప్రార్థనచే మల్లికార్జునలింగగర్భము నందుఁ జేరక పండితారాధ్యుని పుత్త్రిలలో మతప్రచారమునకయి నిలిచి యున్న కేదారయ్యను బండితుని ప్రియశిష్యుఁడు దోనయ్యా లోకారాధ్య పట్టమున కభిషిక్తునిఁ గావించి యాతని సేవించుచుండును. కేదారయ్యా పుత్త్రిలు మనుమ పండితుఁడు, భీమనపండితుఁడు, మహాదేవయ్యా, చెన్న విభుఁడు నను నల్వురును నాతని శిష్యుఁడయిన యివటూరి సోమనాథయ్యా తత్తనయులు నూరీశ్వరుఁడు, విశ్వనాథప్పయ్యా, సింగణ మంచెన్న యను మూవురునుగూడ మతప్రచారమునకయి కృషి సలుపుచుందురు.

ఇఁకఁ గన్నడమున "హరహరా శ్రీ చెన్న సోమేశ్వరా" అను మకుటముగల నీతి పద్యశతక మొకటి పాల్కురికి సోమనాథుని రచితమేయను ప్రవాదముగలదు. కాని యిందు

వ్యాకరణ విరుద్ధ ప్రయోగము లెక్కువగ నుండుటచే నిది పాల్కురికి సోమనాథునివంటి మహాపండితుఁడు రచియించినదని నమ్మరాదనియు శతకకర్త యిష్టదైవమయిన చెన్న సోమేశ్వర లింగము పులిగెరె యను గ్రామమున నుండెననుట కాధార ములు శతకావతారికలోఁ గానవచ్చుటచే దీనికర్త మఱియొక సోమనయయి యుండుననియుఁ గర్ణాటకవి చరిత్రకారులు నిర్ణయించి యున్నారు. భైరవేశ్వరకావ్యకథాసూత్రి రత్నాకరమను గ్రంథమున జ్యోతిర్మయ శాంభవీ జ్ఞానదీక్షా బోధయందలి పరమరహస్యార్థమును సంగయ్యయను శరణునకు సంగ్రహరూపమున సోమనాథుఁ డుపదేశించెనని చెప్పఁ బడినదనియు, ఆవచనములు లభింప లేదనియుఁ గూడఁ గర్ణాట కవి చరిత్రమునఁ జెప్పఁబడినది, మఱియు నీతఁడు వీరమాహే శ్వరాచారవిహితములగు చతుష్షష్టి శీలములఁ గూర్చి శీల సంపాదన మను వచన గ్రంథమును గన్నడమున రచియించె ననియు నందెడ నెడ సంస్కృత శ్లోకములుగూడఁ గలవనియు వ్రాసి కర్ణాటకవి చరిత్రకారు లా గ్రంథమునుండి యీ క్రింది పంక్తుల నుదాహరించిరి.

"అన్యదైవ భజనెయం బిడువుదు. జాతి సూతక, జనన సూతక, రజస్సూతక, ప్రేతసూతక గళం కళెవుదు."

## ౧౬ సోమనాథుని లఘుకృతులు

సోమనాథుని లఘుకృతులను గద్యలు రగడలు, ఉదా హరణములు. పంచకములు; అష్టకములు నని యైదు తరగతు లుగ విభజింపఁదగును. గద్యశబ్దమును నేడు మనము వచన

శబ్దపర్యాయముగ వాడుచున్నాము. మనమే కాదు-అనంతుఁడు అప్పకవిమున్నగు లాక్షణికులుకూడనిట్లే నిర్వచించియున్నారు. కవిత గద్య పద్యములను ద్వివిధభేదములచే నొప్పునని చెప్పుచు అనంతుఁడు తన ఛందోదర్పణమున

ఆ. పరగుఁగవిత గద్య పద్యంబులనఁబాద
కల్పనంబువలదు గద్యమనకుఁ
బాదనియతినొప్పుఁ బద్యంబులవియు వృ
త్తములు జాతులనఁగ నమరుఁగృష్ణ.

క. కనుఁగొనఁబాదరహితమై
పనుపడిహరిగద్దవోలెఁ బహుముఖరచనం
బున మెఱయుగద్యమదిదాఁ
దెనుఁగుఁగృతుల వచనమనఁగ దీపించుఁగడుఁన్.

అనివాని లక్షణములఁ బేర్కొని "స్వస్తిశ్రీ సమస్త భువన రక్షాదక్ష, శ్రీ పుండరీకాక్ష, భుజగపతి సింహాసనారూఢ, సురనికరమకుటఘటిత సురుచిరమణిగణప్రభావిభాసిత పాదపీఠ, అనవరతప్రసన్నవదన, కౌండిన్యవరద, శ్రీయనంతపద్మనాభ! నమస్తే నమస్తే నమః" ఇత్యాదిగా గద్యకు లక్ష్యము నొసంగినాఁడు. అప్పకవియాతనినే యనుసరించి

మ. ధరసాహిత్యము గద్యపద్యములనం దారెండు భేదంబులై
పరఁగు న్గద్యమునందుఁ బాదనియతుల్ భావింపఁగా లేవు వా
క్స్ఫురణంబై విలసిల్లఁగా నుడువ నొప్పుం గావ్యుఁ డెంతేనియున్
మరు తండ్రీ! మఱి దీనికే వచన నా మంబయ్యె నాంధ్రంబునన్.

అని గద్యమును వచన పర్యాయముగనే నిర్వచించి యందుకు లక్ష్య మొసంగుటలో అనంతునే యనువదించి

నాడు. వీరికన్నఁ బూర్వలాక్షణికులగు భీమకవి, విన్నకోట పెద్దన యనువారు గద్యను వచనమని స్పష్టముగఁ జెప్పక పోయినను.

క. హృద్యానవద్య కావ్యము, గద్యము పద్యమని చెప్పఁగా ద్వివిధమగున్
గద్యం బపాదపదని క,రద్యోతిత నవరసార్థ రచనలఁ జెల్లున్.

క. నాలుగు పాదంబులచే
నాలుగు ప్రాసవళ్ళు గూడినం బద్యము ప
ద్యాలియు నిరు తెఱఁగై చను
నోలిని వృత్తములు జాతు లొనరం గృతులన్.

(భీమన – కవి జనాశ్రయము)

మ. కమనీయంబగు గద్యపద్య మయమై కావ్యంబు గద్యంబునా
సమయం బాద నియంత్రణానియమ విన్యస్త ప్రశస్తార్థమై
రమణీయాంఘ్రి చతుష్టయ స్ఫుటవళి ప్రాసాభిరామంబు ప
ద్యము తత్పద్యము వృత్తజాతులన రెండై పర్వుఁ గావ్యంబునన్.

క. వృత్తంబనఁ జతురంఘ్రి సు,వృత్తంబై వళులవ్రాల వెలయును మాత్రా
యత్త గణంబులచేతఁ బ్ర,వృత్తాకృతిఁ బరఁగుజాతి వితతులు కృతులన్.

(పెద్దన కావ్యాలంకార చూడామణి)

అని గద్య పద్య లక్షణముల నుదాహరించి పాదనియతి లేనిది గద్య మనియుఁ జతుష్పాద నియతిగలది పద్యమనియు నది వృత్తములు జాతులని యిరు తెఱఁగులఁ బరఁగుననియు నిర్వచించిరి. అనంతుడు, అప్పకవి కూడ, పద్య లక్షణము చెప్పుటలో వీరి మార్గమునే యనుసరించిరి. మన మెఱింగిన యాంధ్రచ్ఛందోలక్షణకారులెల్ల గద్యపద్య లక్షణముల నిట్లే వివరించినారు. సోమనాథుని కంటెఁ బూర్వుఁడగు వామనుఁడు తన కావ్యాలంకార సూత్రములలో

కావ్యం గద్యం పద్యంచ గద్యం వృత్తగంధి చూర్ణముత్కలికా ప్రాయంచ, పద్యభాగవద్వృత్తగంధి అనావిద్ధ లలితపదం చూర్ణమ్ విపరీత ముత్కలికా ప్రాయమ్"

అను లక్షణములఁ జెప్పి గద్యము వృత్తగంధి, చూర్ణము, ఉత్కలికాప్రాయములని ముత్తెఱఁగులనియు గణ బద్ధములగు పద్య పాదములలోని కొంతభాగమునకు సరిపడు రచన గలది వృత్తగంధి యనియు, సమాస బంధము లేకలలిత పదములతో గూర్చిన వచన రచన చూర్ణమనియు నిందుకు వ్యతిరేకముగా దీర్ఘసమాస బంధముతో శబ్దాలంకార సంయుతముగఁ గూర్చ 'బడి చదువరుల కుత్కంఠ కలిగించునది యుత్కళికా ప్రాయ మనియు వివరించి యందు కుదాహరణములఁ దన నూత్న వృత్తియం దొసంగి యున్నాఁడు. కాని సోమనాథుని గద్య కృతు లీ లక్షణము లన్నిటికిఁ గూడ విలక్షణముగా నున్నవి అనంతుఁడు, అప్పకవి లక్ష్యములుగా నొసంగిన గద్యల వంటివే గాక ద్విపాద నియతిగలిగియుఁ గలుగకయు మాత్రా గణ బద్ధములగు రచనములను గూడ సోమనాథుఁడు గద్యలు గా గణించి రచియించి యున్నాడు.

గీర్వాణ భాషలో బాణుఁడు కాళిదాసు కూడ కొన్ని గద్యములు శివస్తోత్రపరములుగా రచియించి నట్లు సోమ నాథుని పండితారాధ్య చరిత్రమును బట్టి తెలియ నగును.

"బాణుండు వెండియు భక్తికిస్రియాఘు, రీణుఁడప్పుడు దనరెండు నేతులును గడికండలుగఁ దన కట్టల్కఁ దునిమి,పుడమి జనమ్ము లద్భుత మందిచూడ హరుఁబూన్చి బాణగద్యా వసానమునఁ, జిరభక్తి "శివకరశివకర" యనుచుఁ బడసెఁ జేతులు రెండువడయుటయెంత,గడిఁదిదానను చుఁ జక్కఁనఁ గాళిదాసి

కన్నులు రెండు నాక్షణమ కెలంకి,పన్నగధరు పదాబ్జముల కర్పించి
ధరఁగాలిదాసి గద్యంబునాఁ జెప్పె, వరభక్తి యుక్తి నీశ్వరుని గుఱించి"

మల్లికార్జున పండితుఁడు గూడఁ గొన్ని గద్యాలు రచియించినట్లు.

"ఉద్యత్ప్రసక్తి లింగోద్భవదేవు, గద్యంబు నానొక్క గద్యంబుచెప్పి"
"పాంచభౌతికపంచపంచేంద్రియ ప్ర,పంచదూరు నుతించుఁబంచగద్యలను"

అని సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమున వ్రాసిన వాక్యములను బట్టి తెల్లమగును. కాని యవి మనకు లభ్యము కాలేదు. అయినను పండితారాధ్యుఁడే రచియించిన శ్రీముఖ దర్శన గద్య ప్రాచ్య లిఖిత పుస్తకశాలలోఁ గలదని శ్రీ ప్రభాకర శాస్త్రిగారు బసవపురాణపీఠికలో వ్రాసి దాని యాద్యంతముల నీక్రింది విధమున నొసంగియున్నారు.

ఆది.

శ్లో॥ త్రైలోక్యస్య భవానేవ నిగ్రహాను గ్రహక్షమః
శ్రీవిశ్వేశ్వర! మాంపాహి! మహేశ్వర! నిరీశ్వర !

జయజయ రుద్ర! వీరభద్ర! వీరభద్ర! విరించి పంచమశిరః ఖండన! యజ్ఞ పురుషశిరఃఖండన!

అంతము.

మల్హాణప్రియ! భల్లాణప్రియ! కుమ్మరగుండయ్య ప్రియ! అఖిల భువన భక్తజనప్రియ! దేవా! సురపతి ప్రముఖ నిఖిలప్రార్థితప్రధన! పరమేశ్వర! దేవా! నమస్తే నమస్తే నమః.

శ్లో॥ శ్రీమాన్ మహేశ్వర శ్లిష్టో । మల్లికార్జున పండితః
శ్రీముఖదర్శన గద్యం । హృద్య మేత ద్గ్రథితవాన్.

ఇందలి యాద్యంత సంస్కృతశ్లోకములుగాక తక్కిన వాక్యములా గద్యయందలి యాద్యంత భాగములుగా నెఱుఁగఁదగును. వానినిబట్టి చూచిన నవియించుమించుగ, అనంతుఁడు అప్పకవి చెప్పిన గద్య లక్షణమునకే సరిపోవుచున్నవి. వైష్ణవ కవులుగూడ విష్ణుస్తుతిపూర్వకములగు కొన్నిగద్యలు సంస్కృతమున రచియించియున్నారు. ఆనంద ముద్రణాలయము వారు ప్రకటించిన స్తోత్రార్ణవములో శ్రీరామానుజాచార్యుని శరణాగతిగద్య, శ్రీరంగ గద్య, వైకుంఠ గద్య, శ్రీ వేదాంతదేశికులవారిరఘువీరగద్య ప్రకటింపఁబడినవి. వానిని బరిశీలించి చూడ నవిగూడఁ బాదనియతి గాని మాత్రాగణసంగతి గాని యంతగా లేక పూర్వోక్తమయిన యనంతుని గద్య లక్షణమునకే సరిపడు చుండును. సంస్కృతమున బాణుఁడు కాళిదాసుఁడు రచియించిన గద్యలు కూడ నిట్లేయుండును. వానియాద్యంతములను జిత్తగింపుడు.

### బాణగద్య

ఆది—

ఓం జయ జయ, మహాదేవ! మహాకాల! మహాకాలాస్పద! మహాకాలగళ! నాకౌకఃప్రత్యనీకనాశకర ! నారాయణప్రియ ! నారదోపగేయమాన శుభచరిత!

అంతము—సమస్తలోకైకనాథ! శివా శివ.........నమస్తే నమస్తే నమః అపగత పాపాయ నమః కపిల జటామండలేందు ఖండాయ నమః, ద్వీప చర్మపటాయ నమః త్రిపురమఖఘ్నాయ దైవతాయనమః

### కాళిదాసగద్య

ఆది—దేవ! పార్వతీచరణ నూపురారవఘనసమయ ఘననినాదమ్మత్త మదమయూర! దేవ! పార్వతీ జానుదండ సహజ నిర్మిత కనకకందుక క్రీడ

ఖోద ! దేవ ! పార్వత్యూరు రంభావిడ.,....త్తుంగసీమావష్టంభ! దేవ! పార్వతీ గంభీరనాభి శృంగారరసకూప జలపరివాహవాహ!

అంతము—దేవ! అగ్నితరియ! దేవ! త్రిగుణాతీత! దేవత్రియంబక! దేవ...... నమస్తేనమస్తేనమః.

సోమనాథుని గద్యలు మాతరిమిందుకు విలక్షణముగనే కన్పించుచున్నవి. వానిలో మన కుపలబ్ధములయిన పంచ పరికారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య, అష్టోత్తరశతనామగద్యలను వానిని బట్టి వానిలక్షణ స్వరూపాదుల నించుక పరిశీలింతము. మల్లికార్జున పండితుని శీరిముఖ దర్శన గద్యము నందువలెనే సోమనాథుఁడు గూడఁ దన గద్యకృతుల యాద్యంతములందు సంస్కృత శ్లోకములఁ గూర్చి యున్నాఁడు. తెలుఁగు కృతులందుఁ గూడఁ గృత్యారంభమును సంస్కృతశ్లోకముతో నొసర్చు నాచారము పూర్వముండినట్లు కానగును. నన్నయ భట్టు భారతమును దిక్కన నిర్వచనోత్తర రామాయణమును నట్లే పారిరంభించి యున్నారు.

## పంచ పరికార గద్య

(దీనిని ఆంధరి పతిరిక ప్రజోత్పత్తి సంవత్సరాది సంచికలోఁ బూర్తిగఁ బరికటించి యున్నాను.)

దీని నామమును బట్టియే యిందయిదు తరగతుల గద్యయుండు నని తెలియ వచ్చును. తొలుదొలుత సోమనాథుఁడు బసవ స్తోతరి పూర్వకముగ

శ్లో. స్వస్తిశ్రీ పరిమథాన్వ యోత్తమ శిలాద శ్రీమునీంద్రాత్మజః
శ్రీకంఠ పరితిబింబ మూర్తి రనఘ శ్రీనంది నాథో విభుః

తస్యాం శోద్భవ! దండనాథ! బసవ శ్రీనామధేయ ప్రభో!
త్వత్కారుణ్య తరంగితం మయి సదా నిక్షిప్యతాం వీక్షణం

అను సంస్కృత శ్లోకమును రచియించి జయజయ నినాదములో "జయజయ బసవ, శ్రీమన్మహా వృషభేంద్రావతార! సముచిత వీర మాహేశ్వరాచారసార! ప్రమథ గణాలంకార! జగత్త్రియాధార! దేవ! బసవా!

నిరాకులనిరర్గళ నిరతిశయనిజభక్తి తాత్పర్య శరణగణచరణారవింద మకరందధారాభిషేక సంగతమంగళాలంకారవిరచితోత్తమాంగ! అనవరత సుఖానుషంగ! జ్ఞానవైరాగ్యైశ్వర్య విభ్రాజితగుణోత్తుంగ! సకలలోక ప్రసారిత కీర్తికాంతాభుజంగ! దేవ! బసవా!

అనర్గళ జ్ఞానదుర్గాంతర్గతమార్గభ్రష్టనికృష్ట నానాయోనిపరిపీడిత జన్మజరామరణ వైదిక వైష్ణవ జైనబౌద్ధ చార్వాక మాయావాదదుష్ట మృగనివహ విశసననోదిదవివిధలుబ్ధకాయమానవిక్రమోద్దండ! శివసమయపరిపాలనప్రచండ! అణిమాద్యష్ట గుణమణి గణకరండ-ఖండిత కందర్ప కోదండ దేవ! బసవా!"

ఇత్యాదిగా నెనిమిది గద్యములతో గద్య ప్రథమ ప్రకారమును రచియించినాడు. ఈ మొదటితరగతిగద్యలలో మాత్రాగణనియమమంతగాఁ గానరాదు. ఇవి చాలవఱకు అనంతుఁడు అప్పకవి లక్ష్యముగా నొసంగిన గద్య విధమునకే సరిపోవుచు నందుకు భిన్నముగ ప్రాసవిశేషము మాత్రము కలిగి శోభిల్లుచున్నవి. కాని వీని వెంబడి రచియించిన రెండు మూడు నాలుగైదు విధముల గద్యములు మాత్రాగణ బద్ధములు పయిని జూపిన ప్రథమ విధగద్యములకు విలక్షణముగా నున్నవి చూడుఁడు.

## రెండవ విధము

అపిచశ్రీమహిమోన్నతవిభవా! భవపాశోత్కరశాతలవిత్రా!
విత్రాసితబిజ్జలధరణీశా! ధరణీశ ప్రకరార్చితచరణా!

చరణద్యుతిజిత కోమల పద్మా! పద్మభవప్రముఖామరవినుతా!
నలిగాంధర్వ స్ఫురితాపాంగా! అంగానంగవికారవిరహితా!
హితశివయోగానంద సుఖాశ్రిమ! ఆశ్రమధర్మాధర్మవివర్జిత!
జితమద విహ్వలమానుషజన్మా! జన్మజరామరణాది విదూరా!
దూరనిరాకృతభవసంసర్గా! సర్గస్థితిలయపాలనచరితా!
చరితార్థాఖిలజంగమభక్తా! భక్తజనాంతః కరణనియుక్తా! దేవ!బసవా!

ఇందు 16 చరణములున్నవి. ప్రతి చరణము నాలుగేసి మాత్రలుగల నాలుగు గణములతోఁ గూర్పఁబడి గద్యమునం దంతట ముక్త పదగ్రస్త మను శబ్దాలంకారము పాటింపఁబడినది.

## మూఁడవ విధము

జయజయ నిరవధినిర్మల గాత్రా–జయజయ దురితలతాచయదాత్రా
జయ యకేవలభక్తి కళత్రా–జయజయ భావాతీత చరిత్రా
...............................................................
జయజయ [illegible]చారాచార్యా–జయజయ చారుపురాతనచర్యా
...............................................................
జయజయ శరణ గణాలంకారా–జయజయపరమవ్యోమ విహారా
...............................................................
జయజయ భక్తపదాంబుజభృంగా–జయజయ మంగళ మహిమోత్తుంగా
.......................దేవ!బసవా,

ఇందు మొత్తము 31 చరణములున్నవి. ఇందుఁగూడఁ బ్రతిచరణము నాలుగేసి మాత్రలుగల నాలుగు గణములతోనే ఘటితమైనవి గాని యిందు ముక్తపదగ్రస్తమునకు [illegible]గ నంత్యానుప్రాసము పాటింపఁబడినది.

## నాల్గవవిధము

జయదురిత పరిహరణ–జయసుకృత పరిచరణ–జయనిక్రృత రవికిరణ–
జయసుకవినుతి కరణ జయపికముఖలలిత–జయ
వినయనయ మిళిత.........................దేవ! బసవా!

ఇందుఁ బ్రతి చరణమునకు నయిదేసి మాత్రలుగల గణములు రెండు కూర్పఁబడి సర్వలఘునియమముతో సంస్కృ ప్రాసము స్వీకృతమయి యొక్కొక్క యనుప్రాసమునకు మూఁడేసి చొప్పున మొత్తము 12 చరణములు రచియింపఁ బడినవి.

## అ యి ద వ వి ధ ము

జయశివరంజన – జయభవభంజన – జయకరుణాకర – జయపు ణ్యకర – జయ బుతభాషణ – జయశ్రితపోషణ – జయగుణరాజిత – జయ గణపూజిత – జయజయ శ్రీ బసవదండనాథ! నమస్తే నమస్తే నమస్తే నమః.

ఇందు నాల్గు మాత్రలుగల గణములు రెంటిఁ గూర్చిన 8 చరణములు రచియింపఁబడి రెండు చరణము కొక్కొక్క యంత్యప్రాసము కూర్పఁబడినది. ప్రతి చరణ మందును బ్రథమ గణమున సర్వ లఘునియమము పాటింపఁ బడినది.

"బసవస్యకృపామూర్తే । స్సోమనాథప్రసాదినః
అనవద్యమిదం గద్యం అతిచోద్యం జగద్ధితమ్"

అను శ్లోకము గద్యాంతమున రచియింపఁబడినది.

## న మ స్కా ర గ ద్య

(దీనిని ఆంగీరససంవత్సరాది సంచికలోఁ బ్రకటించి యున్నాను.)

ఇదికూడ బసవస్తుతి పూర్వకమగు నీక్రింది శ్లోకముతోఁ బ్రారంభ మయినది.

"శ్రీ కంఠోద్భవ వేదచోదితలసద్వీరవ్రత ప్రక్రియాఽ చారాఽదేశక దేశికాయ భువన స్తుత్యాయ నిత్యాయ స

ద్భాండాగార ధురంధరాయ సుమహారుదారియ భద్రారియ తే
సాక్షా చ్ఛ్రీవృషభాధిపాంశ బసవాధీశాయ తస్మై నమః"

తరువాత నాలుగేసి మాత్రలుగల నాల్గింటితోఁగూడిన పాదములు 118 కూర్పఁబడినవి. ప్రతిపాదము సంస్కృత చతుర్థీ విభక్తి ప్రత్యయముతోఁ గూడిన నమోవాకముతో నంతమగును. అందుచేతనే దీనికి నమస్కారగద్యయని పేరిడినట్లు కాన నగును. పంచప్రకార గద్యమునందువలెఁ గాక యీ గద్యమునం దాంధ్రభాషలో ద్విపదలు, రగడలు నందు వలె ద్విపాదప్రాస నియతికూడఁ బాటింపఁబడినది. మచ్చున కీక్రింది పాదములు చూడుడు.

ఆపిచ శ్రీప్రమథేంద్రాయ నమో। వ్యపగత హృద్గతతంద్రాయనమః
సాధిత చాళుక్యేంద్రాయనమో! మేధాజిత వాణీంద్రాయ నమః
శిశిత ప్రతిభాసాంద్రాయనమో! విశదయశోజిత చంద్రాయ నమః
సుకృతమహోత్కట రుందారియనమో! నికృతశ్రీ మధుపేంద్రాయనమః
సురచిర శమదమ షండాయ నమో! హరగణ దిగ్వేదండాయనమః
సుగుణానంద కరండాయ నమో! జగదవనకళాశౌండాయనమః
ఖండిత పితృపతి దండాయనమో! దండిత దురితోద్దండాయనమః
శమితమదాసమ కాండాయనమో! విమలయశోజ్జ్వలభాండాయనమః

..................................................................

కృత్త దురిత వనసర్గాయనమో! దత్తవిలసదపవర్గాయనమః
పరిపాలిత సన్మార్గాయనమో! విరహిత రిపుషడ్వర్గాయనమః
శరణోత్కర సంసర్గాయనమో! నిరసిత నిఖిల స్వర్గాయనమః
సాక్షాత్కలియుగ భర్గాయనమో! భక్షిత విషసంవర్గాయనమః

చివరను "మంగళ ప్రసంగ సంగన బసవ లింగాయ తే నమస్తే నమస్తే నమః "మఘవత్ ప్రణుత పదాబ్జాతాయ పూతాయ! విఘసత్రితయసుఖోద్ధరణాయ శరణాయ!

కుసుమశరరిపుభక్తవృషభాయ వృషభాయ బసవాయతే నమస్తే నమస్తేనమః" అని మరల జనవనమస్కారము గావింపఁబడి

శ్లో, సరసనమస్కృతి గద్యం। వరపదమణి ఖచితవాక్సువర్ణాభమ్
అష్టోత్తర శతకుసుమమ్! రచితం పాల్కురికి సోమనాథేన.

అను నార్యాశ్లోకము కూర్పఁబడినది. సోమనాథునకుఁ బ్రియతమమగు నంత్యప్రాస మీ గద్యపాదములందుఁగూడఁ బాటింపఁబడినది. ఎనిమిది పాదముల కొక్క యనుప్రాసమును బాటింపవలెనను నియమమునుగూడ నాతఁడిందుఁ గైకొనినట్లు కానఁగును. ఒక్కొక్కపాదము నొక్క కుసుమముగా గణించి సోమనాథుఁడీగద్య పాదములకు బసవాష్టోత్తరశతకుసుమములను నామాంతరమును గూడ నుద్దేశించినట్లు తోఁచుచున్నది. కాని నేఁ బ్రకటించిన ప్రతిలో 118(59 × 2) పాదములున్నవి.

## అ క్ష రాం క గ ద్య ము

(దీనిని శ్రీముఖ, భావ సంవత్సరాది సంచికలలో అక్షరాంకమాలిక, అక్షరాంకపద్యములు నను రెండుభాగములుగఁ బ్రకటించి యున్నాను).

అకారము మొదలు, క్షకారము వఱకు వర్ణసమామ్నాయమునఁ గల యేఁబది యక్షరములతోను వరుసగ నీగద్య పాద ప్రథమాక్షరములు గూర్పఁబడుటచేత దీనికీ పేరొసంగఁబడినట్లు కాన్పించును. సోమనాథుఁడు దీనిని అక్షరమాలిక అక్షరాంక పద్యములు నను రెండు భాగములుగ నేర్పఱిచి మొత్తమంతటికి అక్షరాంకగద్యయను వ్యవహారమును గల్పించి

నట్లు శానవగును. సంస్కృత భాషలో "అద్భుతవిగ్రహా! అమరాధీశ్వర! అగణిత గుణగణ! అమృతశివా! సాంబసదాశివ సాంబసదాశివ! సాంబసదాశివ! సాంబశివా! ............ ఇందుకళాధర! ఇంద్రాదిప్రియ! సుందరరూప! సురేశశివా... ఇత్యాదిగానున్న పరమేశ్వర మాతృకా వర్ణమాలా స్తోత్రముల వంటి ప్రాచీన స్తోత్రము లిట్టి రచనమునకు మార్గదర్శకములయియుండును. అక్షరమాలిక మొదట సోమనాథుఁడు

శ్లో. జయ జయ బసవాఖ్య. స్స్వానుభూత్యైక సౌఖ్యః
ప్రమథగణ పవిత్రః ప్రస్ఫుర ద్భక్తిగోత్రః
ప్రణమిత బుధవర్య స్సాఘ్నయ దైశ్వర్యధుర్యః
ప్రథిత వృషభరూపః ప్రాజ్యమాన ప్రతాపః

అనుమాలినీవృత్తము నిలిపి యాపిమ్మట మాలిక నిట్లు ప్రకటించినాఁడు.

ఆపిచ శివ శృంగారఓం — ఆదిపద విస్తారఓం
ఇహపరసుఖాధారఓం — ఈషణత్రయ దూర ఓం
ఉద్ధురగుణోపేత ఓం — ఊర్ధ్వరేతోజాత ఓం
ఋషభనామ ఖ్యాత ఓం — ౠజమాయాతీత ఓం

..........................................................................

కలిమలాపహ శౌర్య ఓం — ఖలనిరసనాచార్య ఓం
గరళమర్దన వర్య ఓం — ఘనశివార్చనధుర్య ఓం

..........................................................................

శరదలీలాసక్త ఓం — శమిత విషయోద్రిక్తఓం
షడ్వర్గ నిర్ముక్త ఓం — సహజజంగమ భక్తఓం
శరవిముఖ చారిత్రఓం — అక్షరస్తుతి పాత్రఓం

ఇందుఁ బ్రతిపాద మయిదేసి మాత్రలుగల రెండుగణములతోఁ గూర్పఁబడి యంతమునఁ బ్రణవాంకితముగ రచియిం

పఁబడినది. నాలుగు పాదముల కొకటి చొప్పున నిందుఁ గూర్చ సంత్యప్రాసమును సోమనాథుఁడు పాటించినాఁడు. చివరను శివకర శ్రీ బసవదండనాథ ఓం నమస్తే నమస్తేనమః "అని చెప్పి" అకారాదిక్ష కారాంత మకరో దత్తు మాలి కాం। ప్రసాద సోమనాథాఖ్యో బసవస్యకృపానిధేః, అనుశ్లోకమును రచియించి నాఁడు.

అక్షరాంకపద్యముల మొదట బసవస్తుతియొక కన్నడ కందపద్యము తోడను దరువాత నొక యుత్పలమాలికా వృత్తము తోడను నారంభింపఁబడినది.

క. శ్రీయుతనమశ్శివాయే, త్యాయతపంచాక్షరీప్రణవ సంభూత
స్వాయత్తభావ! అక్షర, కాయస్థనె నింపాగ శ్వే నా ౯ బసవేశా!

ఉ. శ్రీతుహినాద్రి జాధిప! అ కారఉ కారమ కారబిందునా
దాతిశయాత్మకప్రణవపూర్వసమాకలితోన్నమశ్శివా
యేతి భవన్ముఖోద్భవషడక్షరసంభవ తద్విలీన వి
ఖ్యాతపరాస్వరాద్యఖిలవర్ణనుతం బసవేశ పాహి మాం.

అపిమ్మట, అక్షరమాలిక యందు వలె స్వరాక్షరము లలోఁ బ్రత్యక్షరములో నొక్కొక్క పద్యమును రచియింపక సోమనాథుఁడిందు వాని యన్నిటితో నొక్క పద్యమును మాత్రమే కూర్చినాడు.

చ. అమితయశస్క ఆద్యయన ఇదుర్చి ఈశ్వర ఉగ్ర ఊర్జిత
క్రమ ఋషభాంక ౠజవార ఌస్థిత ౡస్మిత ఏకరుద్ర ఐం
ద్రమహితరూప ఓమితి పదద్యుతి ఔర్వలలాట అంబికా
సమరసభావ అఃకలిత వర్ణనుతం బసవేశపాహిమాం.

అచ్చటనుండి వ్యంజనాక్షరములతో, కకారము మొదలు క్షకారము వఱకు నక్షరమున కొకపద్యము చొప్పున 35 పద్య

ములు రచియించినాఁడు. ఈ క్రిందనుదహరించిన పద్యముల వలన వాని స్వరూపాదులు తెలియఁ గలవు.

చ. కరుణిసు కర్తృక ప్రణుత కల్మషదూరగ కద్రువాత్మజా
భరణ కనత్కళానిధి కళంకకపర్ద కపాలమాలికో
త్కరధర కల్పితాంబుజ భవాండ కరండకదంబ కర్మసం
హరవిషకర్మ కర్మఠ క కారనుతం బసవేశపాహిమాం

చ. ఖరకర కోటితేజ ఖగరాడ్ధ్వజవంద్య ఖలాతిదూర ఖ
స్ఫురద సమాంబకాంక ఖముఖాఖిల తత్త్వశిరోంత ఖప్రవా
హరుచిర జూటకూట ఖమనుచ్ఛిఖితోయ ధరాత్మసోమభా
స్కరజనయిత్రి విగ్రహ ఖ కారనుతం బసవేశపాహిమాం.

చ. చతురకళావిధిజ్ఞ చతురాగమవేద్య చతుర్ముఖాచ్యుతా
ర్చిత చరితార్థసేవిత చతుర్దశలోకభృ దంతరంగ చ
ర్చిత సతతోపలాలలన చరాచరలింగనిజాంగ చక్షురు
ద్గత రవిచంద్రవహ్నినల, చకారనుతం బసవేశ! పాహిమాం.

చ. క్షరదురితక్రమా, క్షయజనిస్థితి కారణ కారణా, క్షతా
ధ్వరగణనాయకా, క్షయభవక్షయరోగ భిషక్ క్షమా, క్షపా
కరశకలాంక జూటా, క్షపితప్రతిపక్షసురాసురా, క్షమాం
కురిత కటాక్ష వీక్షణ, క్ష కారనుతం బసవేశపాహిమాం.

అంతమందీ క్రిందిపద్యములున్నవి.

క. ఇతి భావన్నక్షరసం, స్తుతిసంకలితాక్షరాంకితస్తోత్రఉమా
పతినిమగర్పిసి దెం స,త్కృతియింపాల్కురికి సోమకృతి బసవేశా!
"లక్షణ పద్యయుతిప్రాసవిలక్షణ పూర్వస్వరాద్యక్షర కాది
క్షాంతాక్షరమాలాద్యక్షరరక్షి-సెన్నొవం బసవేశా!
"శివమస్తుభక్తివిభవో ద్భవో స్త్వక్షరాంక పఠన శ్రవణ
స్తవనా సక్తరిగెమహో, త్సవో స్త్వక్షరాంకశ్రవణ
స్తవనాద్వాక్సిద్ధిరస్తు శివబసవేశా!"
"అక్షరాంకగద్య సంపూర్ణమ్."

బసవపురాణ పీఠికలో అక్షరాంక మాలిక యాద్యంత ముల నొసఁగుచు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు "అక్షరాంకశ్లోకములునుగలవు" అనివ్రాసియున్నారు. వారుద్దేశించిన యాశ్లోకములీయక్షరాంకపద్యములే కాఁదగును. ఇవిగాక వేఱు శ్లోకము లున్నట్లు కానరాదు. సంస్కృతపదభూయిష్ఠము లయినను వీనిని గీర్వాణభాషాశ్లోకములుగా గణింపరాదని నా యభిప్రాయము. సంస్కృతములో వృత్తరచనములో దేశభాషలలో వలెఁ బ్రాసనియమము లేదు. యతిస్థానమున్నను దెలుఁగునందు వలె దానికిఁబ్రత్యేక వర్ణనియమము లేదు. కన్నడమున నాంధ్రము నందలి యతినియమము లేదు గాని ప్రాసనియమము మాత్రము గలదు. సోమనాథుని యక్షరాంకపద్యములలో నాంధ్రభాషా పద్యములలోఁ బాటించు యతినియమము లేక ప్రాసనియమము మాత్రమే పాటింపఁబడినది. పద్యములు గొన్నిటిలో "*కరుణిసు" "తవణిసు" మున్నగు కన్నడక్రియ లుపయోగింపఁబడినవి. పైని జూపినట్టు లాద్యంతములందుఁ గేవలము కన్నడ పద్యములు కూర్పఁబడినవి. పిడుపర్తి సోమనాథకవి పద్య బసవపురాణావతారికలో సోమనాథుని కృతుల నుగ్గడించిన పద్యములో "అక్షరాంకగద్యపద్యముల్" అని పేర్కొనినాఁడు. ఇత్యాదికారణములచే నీయక్షరాంకపద్యములను సంస్కృతశ్లోకములుగఁగాక సంస్కృతపద భూయిష్ఠము లగు కన్నడపద్యములుగాగణింపఁదగునని నాయభిప్రాయము. పద్యములు బసవస్తుతిపరము లయినను నందుఁబ్రయుక్తము

* కరుణించు

లయినసంబోధనము లన్నియుఁ జాలవఱకు శివమహిమానుప్రకటన పరములయియున్నవి. ఇందుకుఁగారణము వివరింప నవసరము లేదు. బసవేశ్వరుఁడు నందికేశ్వరావతారమని బసవపురాణము వలన వ్యక్తమగును. నందీశ్వరుఁడు ద్వితీయశంభుఁడని శైవాగమపురాణప్రసిద్ధము. కావున సోమనాథుని దృష్టిలో శివునకు బసవనికి భేదమొకింతయు లేదు. పద్యమకుటము (... కారనతంబసవేశపాహిమాం) నందవినుతం అనుపదము వ్రాఁత ప్రతులలోఁ గొన్నిచోట్ల "నుతాం" అనియు మఱి కొన్ని తావుల "నుతా" అనియు లిఖింపఁబడినది. "నుతాం" అనునది కవి పాఠమయియుండదు. అది యాకారాంత స్త్రీలింగద్వితీయైక వచనమగుటచే నిచ్చట సందర్భముగానేరదు. "నుతా" అనునది కవిపాఠమయినచో దానిని దక్కిన నంబోధనములతో పాటు బసవేశయను సంబోధనమునకు విశేషణముగా గ్రహింపవగును. కానియిచ్చట "నుతం" అను నదియే కవిపాఠమయియుండు ననియు దానిని "మాం" (నన్ను) అను సర్వనామముతో సోమనాథుని పరముగా నన్వయింపఁ దగుననియు నేదలంతును. నుతుఁడనఁగా 'నుతింపఁబడినవాఁడు' అనియే గాని 'నుతించువాఁడు' అనునర్థము పొసగనేరదు. కాని సోమనాథునకిట్టి కర్మార్థకవిశేషణములను కర్త్రర్థకములుగఁగూడ నుపయోగించుట చాలఁబరిపాటి.

"వందితామరాసుర"(నమస్కరించు దేవదానవులుగలవాఁడా!" "నర్మవిజితేంద్రసుతా" "నమస్కృతభావ పరంపరావసానమహితదేశ" "ధరితధరా ధరాధిప" "యమోదరశిక్షితశూల")

(యముని యుదరమును శిక్షించుశూలము గలవాఁడా!) మున్నగు ప్రయోగము లీ యక్షరాంక పద్యములందే గలవు.

* "పురహరార్చితునకు మున్నెత్తు కేలు । ధరనెత్తఁగూడునే తాఁటిమాలలకు" ఇట్టివి బసవ పురాణ పండితారాధ్య చరిత్రములలోఁ బెక్కులు కాననగును."

## అష్టోత్తర శతనామ గద్యము

(ఇది యింతవఱకుఁ బ్రకటితము కాలేదు)

దీని యాద్యంతరములను శ్రీ ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణ పీఠికలోనిట్లు చూపియున్నారు.

ఆది—

శ్రీమద్గురు బసవేశ నమస్తే! సామయభవనిర్నామ నమస్తే.

అంతము—

ఆద్యనమస్తే వేద్యనమస్తే! తత్త్వనమస్తే! చిత్త్వనమస్తే!
భావనమస్తే భావినమస్తే! సద్గురు బసవస్వామి నమస్తే.

వీనిని బట్టి యీ గద్యపాదములు కూడ నమస్కార గద్యమువలెను, పంచప్రకార గద్యమునందలి రెండు, మూఁడు, అయిదు విధముల గద్యములవలెను నాలుగేసి మాత్రలు గల గణములు నాల్గింటితోఁ గూర్పఁబడినట్లు కాననగును. గద్య నామమునుబట్టి చూడ దీనియందుఁ గూడ 108 పాదము లుండునని తెలియనగును.

సోమనాథుఁడు తఱచు గద్యపద్య ప్రబంధములని లేన కృతులలోఁ జేర్కొనినట్లు కన్నడమునఁ బ్రాచీనలక్షణగ్రంథ మగు కవిరాజమార్గమును రచియించిన నృపతుంగుఁడు కూడ నా

* శివభక్తునకు అనునర్థమున

గ్రంథమందుఁ బూర్వకవి ప్రణీతములగు గద్యపద్య కృతులను బ్రశంసించినాఁడు.

క. మిగెకన్నడ కబ్బంగళొ, ళగణితగుణ గద్యపద్య సమ్మిశ్రితమం
నిగది సువర్గద్యకథా, ప్రగీతి యంతచ్చిరంత నాచార్యర్కళ్.

క. విమలోదయ నాగార్జున, సమేతజయ బంధువర్విని తాదికగళ్
క్రమదొళ్ నెగళ్దగద్యా, శ్రమపద గురుతాప్రతీయయంకై కొండర్.

కాని యాతఁడు పేర్కొనిన యాగద్యకృతుల స్వరూప స్వభావాదులను గూడ నిప్పుడు సరిగా నిర్ణయింప రాకున్నది. కర్ణాటభాషలో ఛందోంబుధియను ఛందోలక్షణ గ్రంథమును రచియించిన నాగవర్మ గద్యలక్షణమును వివరించుటలో నాంధ్ర లాక్షణికుల మార్గముకన్న విలక్షణ విధానమునేదియు నవలంబింపలేదు. ఆతఁడుగూడ గద్య మన వచనమనియే నిర్వచించినాఁడు. కాని రఘటా (రగడ)లక్షణమును జెప్పుటలో నాతఁడు,

క. గణనియమ విపర్యా సదొ, ళెణెవడె దొళ్పెసెదు మాత్రె సమనాగె గుణా
గ్రణియమ తదించె తాళద, గణనెగొడంబట్టు దదు పెరఘటా బంధం.

అని సమానమాత్రలుగల కొన్ని నియమిత గణములను దాళానుగుణముగఁ గూర్చుటయే రగడలకు ముఖ్యమని వ్రాసినాఁడు. ఈ పద్యమునకు కిట్టెలు దొరగారి వివరణమును జూడుఁడు.

"The Raghata is neither built on the system of the syllable feet nor on that of a mere number of moras but on an equal number of moras (matras) included within certain feet (ganas) and harmonies with beating time in music (తాళ.)"

కన్నడములో ముఖ్యమయిన రఘటాభేదములు మూఁడు గలవని నాగవర్మ చెప్పినాఁడు.

క. మందానిల లలితోత్సవ, వెందేరగళెగళ నామమక్కుం క్రమదిం
ధ్రొందకె పదునా ఱిర్ప, త్తొందక్కిర్పత్తు నాల్కు మాత్రెగళబళే.

క. ఇప్పత్తు మాత్రె లలితెగె, బప్పుదు పదునాఱు మాత్రెమందానిలకం
తప్పదువుత్సాహక్కెలో, యొప్పుదిప్పత్తు నాల్కు మాత్రెగళబళే!

మందానిలము, లలితము, ఉత్సవము నని సాధారణముగా రగడలు మూఁడు విధములు. వీనికి వరుసగా పదునాఱు, ఇరువది, ఇరువదినాల్గు మాత్రిలుండును. మందానిలములో పాదమునకు నాలుగేసి మాత్రిలుగల గణములు నాలుగు, లలితములో నల్లే యయిదేసి మాత్రలుగల గణములు నాలుగు, ఉత్సవములో మూఁడేసి మాత్రిలుగల గణము లెనిమిది యుండునని ఈ పద్యముల భావము. కన్నడములో యతి నియమము లేదు గావున సోమనాథుని గద్యములలోఁ బంచప్రకార గద్యయందలి ద్వితీయ తృతీయ పంచగద్యలును, నమస్కారగద్యము, అష్టోత్తర శతనామగద్యమును లక్షణవిషయమునఁ గన్నడమందలి మందానిల రగడను, పంచప్రకార గద్యలోని చతుర్థగద్యయు, అక్షరాంక (మాలికా) గద్యమును లలితరగడను బోలునని చెప్పవచ్చును. మొత్తము మీఁద సోమనాథుని గద్యకృతులు ప్రాచీన కర్ణాటాంధ్ర గీర్వాణ చ్ఛందస్సంప్రదాయముల ననుసరించిన యొక విలక్షణాంధ్ర కృతులుగా మనము నిర్ణయింపనగునని నా మతము.

## బ స వ ర గ డ

(దీనిని యువసంవత్సరాది సంచికలోఁ బ్రకటించి యున్నాను.)

సోమనాథుని రగడలలో నిది మాత్రమే యింతదనుక నాకు లభించినది. పిడుపర్తి సోమనాథుని పద్యములో నుదాహృతమయిన బసవాఢ్యరగడ, సద్గురురగడ, గంగోత్పత్తి రగడ యింకను లభింప లేదు. రగడ రచనము కన్నడమునందు వలెఁ దెలుఁగులో నంత విరివిగా సాగినట్లు గానరాదు. నన్నయ భారతములోఁ దరువోజలు, అక్కరలు కానవచ్చునుగాని రగడలు కన్పట్టవు. తిక్కన భారతములోఁగూడ నవి కానరావు. పిల్లలమఱ్ఱి పినవీరన శృంగార శాకుంతలము, అల్లసాని పెద్దన మనుచరిత్రము, నాఁటినుండి యివి కానవచ్చును. అంతకుఁ బూర్వపు కృతులలో నివి మృగ్యములనియే చెప్పఁదగును. ప్రబంధ కవులు వీనిని బ్రాయికముగఁ బుష్పాపచయాదిక వర్ణనములలో నుపయోగించుచు వచ్చిరి. ఆంధ్రవాఙ్మయమున మన కుపలబ్ధములయిన రగడలలో సోమనాథుని బసవ రగడయే ప్రాథమికముగ గణింపఁదగును. కన్నడమున ముఖ్యముగా మూఁడు రకముల రగడ లున్నవనియు నవి మాత్రాగణబద్ధములనియుఁ బైని జెప్పియుంటిని. కాని తెలుఁగులోని రగడలు బలు తెఱఁగులుగా నున్నవి. అందు మన లాక్షణికులు ముఖ్యముగఁ దొమ్మిదింటిని నిర్వచించిరి. మన ఛందోలక్షణ కర్తలు వీనిలోఁ గొన్నిటికి మాత్రాగణములను మఱికొన్నిటి కా యా మాత్రలకు సరిపడు నింద్రసూర్యగణములను నేర్ప

చేసి యున్నారు. రగడలు ద్విపదలవలె ద్విపాద నియమము గలవి. కాని ద్విపదలవలె నొక్క యాదిప్రాస నియమమేగాక వీని, కంత్యప్రాస నియమముగూడ విశేషముగ నున్నది.

క. ఆద్యంతప్రాసంబులు, హృద్యంబుగ రెంట రెంట నిడిపాదము లు
ద్యద్యతులఁ గూర్పఁదగునన, వద్యంబుగ రగడలందు వారిజనాభా

అని యనంతుఁడు ఛందోదర్పణమున వివరించినాఁడు. అప్పకవిగూడ నట్లే యనువదించినాఁడు. కాని సోమనాథుని బసవరగడ యీ లక్షణమునకుఁ గొంత వైలక్షణ్యము గలిగి యున్నది. మొత్తము 108 పాదములున్న యీ రగడలో నీద్విపాదైకాంత్యప్రాస నియమము నాతఁడు మొదటి 78 పాదములవఱకు మాత్రమే యనుసరించినట్లు కానగును. తరువాతి పాదములలో ద్విపద పంక్తులలోవలెనే యచ్చటచ్చటఁ బ్రాసయతినిగూడ నంగీకరించుచు 14 పాదములవఱకు, ఏపాదమున కాపాదమునందే పాదమున కొక్కొక్క ప్రాసము చొప్పున నీ యంత్యప్రాస నియమమును బాటించినట్లును, అటుతరువాత మఱి 8 పాదములలో నిట్టి నియమమునే మఱికొంత విలక్షణముగఁ బచరించినట్లును గోచరించును. కన్నడమునందలి యుత్సవరగడ చివర నొకమాత్ర తగ్గించినచోఁ దెనుఁగు నందలి యుత్సాహవృత్తముతో సరిపోవును. అందుచేతనే కాఁబోలు వానికి నామసామ్యముకూడఁ బొసఁగియున్నది. బసవరగడను మొదట సోమనాథుఁడు బసవస్తుతి పూర్వకముగ,

శ్రీవరాజదేవరాజ సిద్ధ సాధ్యయక్షర
క్షోవిహంగరాట్పతంగ సోమధూమకరమరు

శ్రీనితేశవిధృతపాశ సేవితోద్యదంఘ్రిరా
శివ! నిమ్మనాంపొగళ్వె శ్రీవృషాధినాయకా!

అనెడి యుత్సాహవృత్తమును రచియించినాఁడు. అటు తరువాతఁ గూర్చిన రగడపంక్తులు పాదపాదమున కెనిమిది సూర్యగణములు నయిదవగణము మొదట యతియును గలిగి తెలుగునందలి తురగవల్గనరగడ లక్షణమునకు సరిపోవుచున్నవి. మాత్రాగణ నియమమునే గణించినచో నిది కన్నడ మందలి యుత్సవరగడను బోలియుండును. ఈ క్రింద నుదాహృతము లయిన పాదములఁ బరికించినచోఁ బైనిజెప్పిన లక్షణ విశేషములు వ్యక్తమగును.

"శ్రీవృషాధినాయకప్రసిద్ధ భావ! శరణుబసవ
తావకాంఘ్రిసేవకాఘదావదావ! శరణుబసవ
వందితద్వితీయశంభునామధేయ! శరణుబసవ
వందితత్రిలోకవిబుధవరనికాయ! శరణుబసవ
అచలశైవధర్మ నిర్ణయావతార! శరణుబసవ
ప్రచురయుగమితాంఘ్రి పద్మపథవిహార! శరణుబసవ!

..................................

సురవినుతశిలాదలబ్ధ సుకృతరూప! శరణుబసవ
హరగణాభిజాత చిన్మయప్రదీప! శరణుబసవ

..................................

అంధకాసురోన్మదాపహారరుద్ర! శరణుబసవ
బంధురేందుసింధుజూట భారరుద్ర! శరణుబసవ

..................................

పరమ వీరభక్తి పట్టబద్ధరుద్ర! శరణుబసవ
చిరమనోరథప్రద ప్రసిద్ధరుద్ర! శరణుబసవ

..................................

స్మరవిపక్ష! హారసదృక్ష! చిరదయాక్ష! శరణుబసవ
పరమపుణ్య! సురవరేణ్య! భక్తగణ్య! శరణుబసవ
అహితహీన! మహితయాన! విహితదాన! శరణుబసవ
రహితకాల! మహితశీల! సుహితలీల! శరణుబసవ
బాఢశౌర్య! గాఢధైర్య! రూఢవీర్య! శరణుబసవ
వ్యూఢకీర్తి! రూఢమూర్తి! ప్రౌఢవర్తి! శరణుబసవ
వ్యక్తవేద! యుక్తనాద! శక్తిమోద! శరణుబసవ
శక్తిజైత్రి! యుక్తిపాత్రి! భక్తిగోత్ర! శరణుబసవ
ధర్మరూప! శరణుబసవ! దమితపాప! శరణుబసవ
నిర్మలాంగ! శరణుబసవ! నికృతభంగ! శరణుబసవ
సత్యశుద్ధ! శరణుబసవ! సత్ప్రబుద్ధ! శరణు బసవ
నిత్యభోగ్య! శరణుబసవ! నిఖిలమృగ్య! శరణుబసవ
అసమగాన! శరణుబసవ! ఆద్యమాన! శరణుబసవ
రసికముకుర! శరణుబసవ! రాగసుకర! శరణుబసవ"

రగడచివరను "శరణ స్తవ కల్పకుజాం - కురపద శాఖా భిజాత నవకుసుమాష్టో - త్తరశతనామంగళబస - వరసంగ్రో సిదపాల్కురికి సోమాంకం "అను కందపద్యమును సోమనాథుఁడు కూర్చినాఁడు. ఈరగడయందు శరణుబసవయను మకుట ముండుటచేఁ గర్ణాటకవి చరిత్రకారులు సోమనాథునిచరిత్ర మును లిఖించుటలో దీనిని "శరణు బసవరగళె"యను పేరితో గన్నడ కృతిగాగ్రహించి చివరనున్న పద్యమునుబట్టి భ్రమించి శాఁబోలు "ఇదరల్లి 108 కందగళివె. ప్రతికందవూ శరణు బసవవిందు ముగియుత్తదె. ఈ గ్రంథద అంత్యదల్లి యీకంద విదె"అని కర్ణాటకవిచరిత్ర ప్రథమ ముద్రణములో వ్రాసి పూర్వోక్తమయిన "శరణ స్తవ కల్పకుజాంకుర" అనుపద్యము నుదాహరించినారు. చివరనున్న కందపద్యమునుబట్టి వీరు కృతి

"శరణుబసవరగళె" యను పేరిడియు నందు 108 కందము లున్నవని వ్రాయుట యసంగతమని చెప్పనక్కఱలేదు. పునర్ముద్రణమునందు 108 వాక్యగళివెయని మార్చిరి. కాని వీరు దీనిని గర్ణాటభాషాకృతిగ గ్రహించుటకూడఁ బ్రమాదమే. ఆభాషాలక్షణమునకు విలక్షణముగా నీరగడలోఁ బ్రతిపాదము నను యతిపాటింపఁబడుటచే నిది తెలుఁగు రగడయేగాని కన్నడ రగడ కానేరదని చెప్పనవసరము లేదు. పైనిజెప్పిన కందమును బట్టి సోమనాథుఁడు దీనికి బసవాష్టోత్తర శతనామములను నామాంతరముగూడఁ గల్పించినట్లు కానవగును. ఆతఁడు బసవ పురాణ కథాశ్రితయగు గొబ్బూరి సంగనామాత్యుని సంబోధించుటలో "బసవనామావళి పాఠకాసక్త – బసవనామావళి పఠనానురక్త" అని వ్రాసియున్నాఁడు. ఆబసవ నామావళి యీబసవ రగడయే కాఁదగును! నమస్కారగద్య చివరను గూర్చిన యార్యాశ్లోకములోఁ దత్కృతికిఁ గూడ "అష్టోత్తర శతకుసుమం "అను విశేషణముండుటచేతను మఱియు నాతఁడు ప్రత్యేకముగ "అష్టోత్తరశతనామ గద్యము" అను ప్రత్యేక గద్యముకూడ వేఱొండు రచియించియుండుటచేతను నారెండు కృతులుగూడ బసవనామావళిగణముక్రిందనే సోమనాథుఁడు గణించియుండునేమోయని కూడ మనము తలంపవచ్చును.

## బసవోదాహరణములు

వీనిని సోమనాథుఁడు తెలుఁగునను సంస్కృతమునను గూడ రచియించి యున్నాఁడు. అందుఁ దెలుఁగుకృతి ప్రభవ సంవత్సర మాఘమాసము భారతిలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు

ప్రకటించియున్నారు. సంస్కృతోదాహరణము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం. 32 సం 3-4 లో సేను నామిత్రులు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు పరిష్కరించి ప్రకటించి యున్నాము. ఆంధ్రభాషలో నుపలబ్ధములయినయుదాహరణ వాఙ్మయములోఁ గూడ సోమనాథుని బసవోదాహరణమే ప్రాథమికముగఁ గాన్పించుచున్నది. ప్రథమా ద్వితీయా తృతీయా చతుర్థీ పంచమీ షష్ఠీ సప్తమీ సంబోధన ప్రథమా విభక్తులతో నెనిమిది పద్యములను. కళికలను ఉత్కళికలను రచియించి చివరను సార్వవిభక్తికముగ మఱియొక పద్యమును గూర్చిన పరమేశ్వర స్తోత్రరూపమగు భక్తి ప్రబంధమునకు నుదాహరణమని పేరు.

సీ. భాసిల్లు సప్తవిభక్తులందును మఱి
సంబోధనంబున సరవిగాఁగఁ
బ్రభునామయుతముగఁ బద్యమొక్కటియును
దగఁజెప్పి రగడ భేదంబులందుఁ
గళికలు ప్రత్యేకదళము లెన్మిదిచేసి
తత్పరార్థముల నుత్కళి కలనఁగ
నేకసమాసమై యేడుదళంబులు
తుదవిభక్త్యర్థంబుతోఁ బఁ బలుక

గీ. దానికెనగాఁకఁ జిక్కిన దళమమర్చి
ఫణితులొడఁ గూర్చి సార్వవిభక్తికముగఁ
గట్టకడపటి పద్యమొక్కటి రచింప
నదియుదాహరణంబగు నబ్జనాభ!

అనియనంతుఁడీ ప్రబంధభేదలక్షణము నుదాహరించినాఁడు. అప్పకవికూడ నీలక్షణమునే యనువదించి యుదాహరణవిశేషముల నిట్లు విశేషముగ వివరించినాఁడు

సీ. సంబుద్ధి మొదలించి సప్తవిభక్తులు
పలికినభక్తి సద్దళియనంగ
సంబుద్ధితోఁ గూడ సప్తవిభక్తులు
పలుక నొప్పారు బద్దళియనంగ
సంబుద్ధితోడ విషమ విభక్తులతోడఁ
బలికిన కృతియు విద్దళియనంగఁ
గళిక లుత్కళికలు గమకింపఁ బలికిన
కావ్యంబు నుత్ఫుల్లకంబుననఁగ

గీ. నవనిఁజాటు ప్రబంధంబు లందుమిగుల
నాటుకొని యొప్పుచుండు నీ నాల్గు తెగలఁ
గానఁబడు నుదాహరణముల్ గానలోల!
కామెపల్లీశ! వల్లవీ కామ! కృష్ణ!

అనంతుఁడు అప్పకవి చెప్పినదానినిబట్టి కళికలు, ఉత్కళికలు రగడభేదములని తెలియనగును. కానిరగడలకువలె వీరు వానికి నియమితములగు నిందసూర్యగణముల విధించి లక్షణము చెప్పియుండలేదు. అవి కన్నడమునందు మందానిల లలితోత్సవరగడలవలెను బూర్వోక్తమయిన సోమనాథుని గద్యరీతులవలెను గేవలము మాత్రాగణబద్ధములుగఁ గాననగును. భరతుఁడు నాట్యశాస్త్రమున వాని లక్షణము నిట్లు నిర్వచించినాఁడు.

గుర్వాది రథలఘ్వాది ర్వ్యగ్రః సర్వలఘుస్స్మృతః
చతుర్మాత్రా గణా జ్ఞేయాః పూర్వచ్ఛందోపి కల్పనాః
తతోర్ధకలికాః పాతాః కుర్యా ల్లఘ్వ క్షరేషుచ
గుర్వక్షరే తాలగీత పాతాస్తు కవికా స్మృతాః

వామనుఁడు తన కావ్యాలంకార సూత్రములందు

గద్యం వృత్తగంధి చూర్ణ ముత్కలికాప్రాయంచ
పద్యభాగ వద్వృత్తగంధి అనావిద్ధలలిత పదం చూర్ణమ్
విపరీత ముత్కలికా ప్రాయమ్.

అని వ్రాసిన లక్షణము నిదివఱకు నుదాహరించియుంటిని. కాని యాతఁడు చెప్పిన యుత్కలికాలక్షణమునకును ఉదాహరణ కావ్యమునందలి యుత్కలికకు సంబంధమున్నట్లు కానరాదు. ఏదియెట్లున్నను గద్యలు, కళికోత్కలికలు, చూర్ణికలు, రగడలు, గేయవాఙ్మయమునకుఁ జెందినవని తలంచుటకెట్టి యభ్యంతరమును లేదు. కావున అనంతుఁడు మున్నగువారు చెప్పిన లక్షణమునుబట్టి యుదాహరణములు పదపద్య కవితల కలయిక గలిగి సాహితీప్రియులను సంగీతప్రియులను సమానముగ రంజించు మనోహరకృతులని మనము తలంపనగును. గద్యలు రగడలు వలె నివి గూడఁ బ్రాచీనాంధ్ర వాఙ్మయరంగమునఁ బ్రధానాంగములుగ విలసిల్లుచుండెడివి. నన్నయ భారతమువంటి చంపూకావ్యములు వెలువడి ప్రచార మొందినప్పటినుండి యుదాహరణ రచనము మనభాషలో విరళమయిపోయెను. ఆంధ్రవాఙ్మయ పరిణామమును బరిశీలించు వారికి సోమనాథుని యితరలఘుకృతులవలె నాతని యుదాహరణములుగూడ చాల నుపకరించును.

నామిత్రులు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు 1937 సంవత్సరములోఁ బ్రకటించిన రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము పీఠికలో నుదాహరణ వాఙ్మయము వలయువారది పూర్వోత్తరముల బాగుగ వివరించినారు.

చూడనగును. ఈదిగువ నుదాహరించిన భాగములఁబట్టి సోమనాథుని యుదాహరణ యుగ్మస్వరూపమును బాఠకులు కొంత గుర్తింపవచ్చును. సోమనాథుని గ్రంథముగాక సంస్కృతమున రచియింపఁబడిన యుదాహరణము మఱొక్కటి మనకింతవఱకు లభ్యముకాలేదు. విద్యానాథుని ప్రతాపరుద్రీయమున

"యేనకేనాపితాలేన గద్యపద్యసమన్వితమ్"
జయేత్యుపక్రమం మాలిన్యాదిప్రాస విచిత్రితమ్
తదుదాహరణం నామవిభక్త్యష్టాంగసంయుతమ్.

అనియుదాహరణ లక్షణము చెప్పఁబడినది. కానియట్టి లక్షణలక్షితమగు సంస్కృతోదాహరణ కృతి యొక్కటియు నిప్పుడుగానరాకున్నది. సోమనాథుని సంస్కృతబసవోదాహరణ మిందుకుఁ గొంతవఱకు సరిపడినను మొత్తముపయి నది పలువిధముల నాతని యాంధ్రకృతినే యనుసరించుచున్నది. సోమనాథుని యీ యుదాహరణకృతులు తరువాత వెలసిన రావిపాటి త్రిపురాంతకుఁడు మున్నగు నుత్తమకవులకు మార్గదర్శకములయి త్రిపురాంతకోదాహరణము (రావిపాటిత్రిపురాంతకుఁడు క్రీ॥ శ॥ 1380) వేంకటేశ్వరోదాహరణము (తాళ్ళపాక పెద తిరుమలయ్య క్రీ॥శ॥ 1530) విశ్వేశ్వరోదాహరణము (ఏనుఁగు లక్ష్మణకవి క్రీ॥ శ॥ 1780) మొదలయిన కృతుల యవతారమునకుఁ గారణములయినవి.

## తెలుఁగు బసవోదాహరణము

ప్రథమావిభక్తి—

క. శ్రీగురులింగతత్పరుఁ డశేషజగన్నిధి శుద్ధతత్త్వ సంయోగసుఖప్రపూర్తి వృషభోత్తమమూర్తి యుదాత్తకీర్తి ది

వ్యాగమమార్గవర్తి బసవయ్య కృపాంబుధి మాకు భక్తి సం
భోగములం బ్రసాద సుఖభోగములం గరుణించుఁ గావుతన్.

కళిక. శాండియుఁ ద్రిభువన వినుతి సమేతుఁడు
మండిత సద్గుణ మహిమోపేతుఁడు
సురుచిర శివసమ సుఖసంధానుఁడు
పరమ పరాపర భరితజ్ఞానుఁడు
విదితానందాన్విత మనస్కుఁడు
సదమల విపుల విశాలయశస్కుఁడు
శ్రీవిలసితపద చిరతర భద్రుఁడు
గావున సాక్షాత్కలియుగ రుద్రుఁడు.

ఉత్కళిక. భువనోపకార భవమోదవీర
భక్తి సంయోగ ముక్తి సంభోగ
సౌఖ్యాబ్ధిలోన ముఖ్యుఁడై తాన
శెలయు శుభకరుఁడు నిల విశ్వగురుఁడు.

సప్తమీ విభక్తి.

చ. అసమగుణాఢ్యునందు శరణాగతవత్సలునందు జంగమ
వ్యసనమహిష్ఠునందు భవవారణ కారణునందు భక్తమా
నస పరిపూర్ణునందు గణనాథునియందు దయాపయోధిమా
బసవనియందు మాబసవ పాత్రునియందు వసింపు చిత్తమా!

కళిక. శెండియు శివ వీర్యునందు
చండమదన శౌర్యునందు
దురితభయవిదూరునందు
సరసభక్త సారునందు
సుకర శరణ సూత్రునందు
సకలవిషయ జైత్రునందు
భువనసర్వ బుద్ధునందు
శివగణ ప్రసిద్ధునందు

ఉత్కళిక. శరణజనుల వరువుఁ బసుల
మనముదనువు ధనము తగవు
సమసి సంగ తముగ లింగ
నిజమునందు విజయునందు

సార్వవిభక్తికము.

ఉ. నీవుదయాపయోనిధివి నిన్ను నుతించినఁగల్గు భక్తి నీ
చే వరవీరశైవరతి చేకుఱు నీకయి యిత్తుఁ గబ్బముల్
నీవలనం గృతార్థత జనించును నీకు నమస్కరింతు నీ
భావమునందునుండి ననుఁ బాపకుమీ బసవయ్య! వేఁడెదన్.

తెలుఁగు విభక్తి ప్రత్యయములలోఁ బ్రథమావిభక్తి యందు "డుమువులు" ద్వితీయయందు "ని" తృతీయయందు "చే, చేత" చతుర్థియందు "కై" పంచమియందు "వలన" షష్ఠియందు "కు" సప్తమియందు 'అందు' అను ప్రత్యయములనే యీ యుదాహరణగ్రంథకర్తలు తఱుచుగాఁ గైకొనియుండిరి. ఉత్కళికలకే యర్థకళికలని నామాంతరము. కళికలోని సగము భాగము మాత్రమే యుత్కళికయందు గ్రహింపఁబడును. రెంటియందునుగూడ నెనిమిదేసి పాదములు గూర్పఁబడును. ఇవి సర్వవిధముల రగడలవలెనే మాత్రాగణబద్ధములయి యుండును. ఉత్కళికయందు మాత్రమే పాదమున కాపాదమునకు విభక్తి ప్రత్యయమును గూర్పక యాఱుదళముల వఱకు నేకసమాసముగఁ గూర్చి యేడెనిమిది దళముల చివర మాత్రమే విభక్తి ప్రత్యయము గూర్పఁబడును.

## సంస్కృత బసవోదాహరణము

ప్రథమా విభక్తి.

మాలిని. జయతు బసవరాజః ప్రాణలింగాత్మపూజః
శరణ దివిజభూజః స్మేరసంవిత్సరోజః
గణపరిషదధీనః ఖ్యాతదానావధానః
సరసమహితగానః స్వానుభూత్యైకమానః.

కళిక. అపిచ పురాతన నూతన శివగణ పాదోదక పరిలసదభిషేకః
ఘృషితవిపల్లవ పల్లవజంగమ లింగసమర్చననిచిత వివేకః
సతత వికస్వరభాస్వరనిజముఖ మండల ఖండిత రజనీనాథః
కృతయుగకీర్తన సరసన నిశ్చల నిపుణ పవిత్ర చరిత్రసనాథః
ప్రకటిత దర్పకదర్పక రేణుప్రమథన నిశిత కరాంకుశహేలః
శుకముఖమానస మానసకమలాకర విహరణచణ రాజమరాళః
స్వానుభవాంచిత కూడలి సంగమ సంగమదేవధ్యానాభిజ్ఞః
సూనృత భాషణ భూషణ వాణీ సింహాసన గంభీర రసజ్ఞః.

ఉత్కళిక. కావుళనారాట ధ్వనిసార। శ్రీవిశ్రుత పేశలశారీర
వ్యతికర నానాగతి నిస్సీమ। శ్రుతి సంధాయి చమత్కృతిభూమ
శ్రుతిముఖర స్వర సరసస మేత। స్మృతినికురంబ రసాయనగీత
ప్రముదిత హృద్వర్తన శితికంఠః।శమదమలాలన గుణితోత్కంఠః

తృతీయావిభక్తి.

శా. అస్థానే శివనాగసంయమి కరద్వంద్వాంగుళి శ్రేణికా
లీలాలాలన మన్థనా దజనయద్యః క్షీరధారావళిం
తేనాత్యద్భుత కర్మకర్మఠమహా మాహాత్మ్య వర్ధిష్ణునా
భాండాగారధురంధరేణ బసవామాత్యేన కః స్పర్ధతే.

కళిక. అపిచ నిగమ సారభూత వీరశైవ దీక్షితేన
తపన శతసహస్ర సదృశ దేహదీప్తి లక్షితేన
ఖండిత ప్రసూన విశిఖచాప దండల స్తకేన
మండితామ భావశరణ చరణ కలితమస్తకేన

విదళిత పరిచండ వివిధ విషమ విషయగర్జితేన
హృదయ విచరదీషణపరిగాఢ శౌల్య వర్జితేన
నీలగళవిశిష్ట భక్తభవన పుష్యదిందిరేణ
ఫాలనయన విమల హృదయ కమల మధ్యమందిరేణ

ఉత్కళిక. యావనాళ రాశినిహిత। భూవినుత కటాక్ష మహిత
శక్తివైభవాభిజాత। మౌక్తిక పరిదానసీత
సాంగభక్త వృషభనిత్య। రంగవల్లి నియమ కృత్య
దృష్ట సాద్భుతకరిమేణ। దుష్టదళన విక్రమేణ

సార్వవిభక్తికము.

శా. య స్సంగీతనిధి ర్వ్యమాహ రభవం యేనార్చితం నూన్యతమ్
యస్మై స్వస్తి యత స్తదీయ ముదభూ ద్యద్వీర శైవవ్రతమ్
యస్యాపాంగసహోదరీచ కరుణా యస్మి న్మహత్త్వాదికమ్
సర్వం త్రీణి జగంతి పాహి! బసవామాత్యేశ చూడామణే!

అంతము.

శ్రీబసవరాజ గుణమణి ఖచితం జయతా త్సువర్ణ మేతత్
సోమ సుకవినా రచితం హృదయాభరణం సతా ముదాహరణమ్

బసవపంచకము

పంచకమనఁగా నయిదు పద్యముల సమూహము; దానినే పంచరత్నములని కూడ వ్యవహరింతురు; ఇది మాలినీ వృత్తములతోఁ గూర్పఁబడినది. మొదటి పద్యము.

ప్రియతమ శివభక్తా। బిందునాదానురక్తా!
అయమయ శివయుక్తా। హారహీర పరిభాక్తా!
నియమిత సకలాంగా। నీలకంఠ పరిసంగా!
జయతు బసవలింగా। సారభక్తిక్రియాంగా.

అంతమున. "శ్రీమతే వృషభేంద్రాయ। సోమనాథేన ధీమతా
పంచరత్న మిదంస్తోత్రం। జ్ఞాన వైరాగ్య భక్తిదమ్"
అను సంస్కృతశ్లోకము కూర్పఁబడినది.

## బసవాష్టకము లు

అష్టకమనఁగా నెనిమిది పద్యములతోఁగాని శ్లోకము లతోఁగాని కూర్పఁబడిన స్తోత్రము. సోమనాథుఁడు వృషభాష్టక మను పేరితో వసంతతిలక వృత్తములతో సంస్కృత స్తోత్ర మొకటియు బసవాష్టకమను పేరితో మాలినీ వృత్తములతోఁ దెలుఁగున మఱొకటియు రచియించియున్నాఁడు; వానియాద్యం తము లిట్లున్నవి.

పక్షీంద్ర వాహన తపోబలసాధనీయ
సర్వేశ్వరోల్లసిత వాహనలాల్యమాన!
కాపాలిరూపసముపేత పునీతదృష్టే!
శ్రీవజ్రశృంగ వృషభాధిపతే! నమస్తే.

పాల్కురికి సోమరచితం వృషభాష్టకం యః
స్తోత్రం శృణోతి పఠతీహ వినిశ్చితార్థమ్
సోఽథాశు యాతి వృషభాధిపతేః ప్రసాదా
ల్లబ్ధ్వా విశుద్ధపద భక్తిఫలా దభీష్టమ్

మాలిని. జయజయ బసవేశా సత్యసద్భక్తివాసా
జయజయ శివగోత్రా సత్ప్రసాదైక పాత్రా
జయజయ భవదూరా శాశ్వతైకాంగ వీరా
జయజయ బసవాఖ్యా సంవిదాశ్చర్యసౌఖ్యా

బసవాష్టకమిదం పుణ్యం సర్వపాపప్రణాశకమ్
యః పఠే చ్ఛృణుయా ద్వాపి శివలోకే మహీయతే

## త్రివిధలింగాష్టకము

వీరశైవమునకుఁ బ్రధానాంగములగు నిష్టప్రాణభావ లింగములను త్రివిధలింగములఁగూర్చి సోమనాథుఁడు దీని కేవలసంస్కృతకృతిగ, అనుష్టుప్ శ్లోకములతో రచియించినాఁడు.

శ్రీలింగములయం దొక్కొక్క దానికెనిమిది శ్లోకములు చెప్పఁబడినవి. మచ్చున కీ క్రింది శ్లోకములు చూడుఁడు.

శ్రీలింగరూపసంకాశం । శంకరం దేవపూజితమ్
నాదోజ్జ్వలకళాధారం । స్వేష్టలింగ మహం భజే
పంచాకాశం మహాకాశం । పంచాచారప్రకాశితమ్
పంచాక్షరమయాకారం । స్వేష్టలింగ మహం భజే
శివాధారం శివాధారం జ్ఞానాధారం పరాత్పరం
సర్వవ్యాపకమంత్రార్థం ప్రాణలింగ మహం భజే
చైతన్యం శాంతరూపంచ మంత్రార్థం మంత్ర రాజితం
చిన్నాదం చిత్కళాబిందుం ప్రాణలింగ మహం భజే
భావాతీతం శుభానందం మండలత్రయ మధ్యగం
లింగత్రయ త్రిలక్ష్యాంతం భావలింగ మహం భజే
ఆత్మజ్యోతి రహంకారం త్రివేణీసంగమోజ్జ్వలం
త్రికూటస్థానసంకాశం భావలింగ మహం భజే
చివరను:— "పండిత సోమనాథేన । కృతం లింగాష్టకత్రయం
యః పఠేత్ సతతం విద్వాన్ । భుక్తిముక్తిఫలప్రదం.

అనుశ్లోకముతో ఫలశ్రుతి చెప్పఁబడినది.

## ౧౭. సోమనాథుని నవీనగుణాదికములు-కళాప్రతిభలు

సోమనాథుని కాలమునాఁటి యాంధ్రవాఙ్మయస్థితిని బసవపురాణ పీఠికరణమునఁ గొంత పరామర్శించి యుంటిమి. అప్పటి కాంధ్రవాఙ్మయ మించుమించుగ సంస్కృత పురాణాంధ్రీకరణమునందే ప్రయుక్తమయి యదియైనను బరిణతస్థితి నందకుండెను. నన్నయభట్టారకుఁ డుద్యమించిన మహాభారతాంధ్రీకరణమైనను బరిపూర్ణతనందక మూఁడు పర్వములతో

మాత్రమే నిలిచియుండెను. నన్నయ యాంధ్రీకరణము సంస్కృతపద భూయిష్ఠమై దీర్ఘ సమాస సమన్వితమైయున్న విధానమును బదునాల్గవ ప్రకరణమున మనము గుర్తించియుంటిమి. అతని తరువాత వెలసిన కొలఁది కవులకుఁగూడ నదియే మార్గదర్శకముగ నుండెను. అట్టిస్థితిలో సోమనాథుఁ డుదయించెను. అతఁడు సహజముగ స్వతంత్ర ప్రతిభాశాలి. అతని యవతారమే యొక్క ప్రత్యేక ప్రయోజనావసరమునకు నియుక్తమయి యుండెను. అందుచే నన్నయాదులు ప్రారంభించిన యాంధ్రీకరణోద్యమమునయి నాతఁడు దృష్టివఱుపక కేవలము స్వతంత్ర కావ్యరచనమునకే యుద్యమించెను. ఆంధ్ర కావ్యములలోఁ గూడఁ గృత్యాదిని సంస్కృత శ్లోకము రచియించు ప్రాచీనాచారమును నయితము పరిహరించి ప్రాథమిక కృతియగు అనుభవసారము నాతఁడు కేవలము తెలుఁగుపద్యముతోడనే ప్రారంభించెను. తెలుంగు కవిత జీవము విన్నాణము తీరుతీయములుగల తెలుఁగుఁ బలుకుబడులలోనే కలదను రహస్యము నీతఁడు గుర్తించి తననాఁటి కాచరణములోనున్న యాంధ్రకావ్యరచనావిధానమును సంస్కరింపవలెననెడి తలంపు మొదటినుండియుఁ గలిగియుండెను. ఆరూఢగద్య పద్యాది ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠరచన సర్వసామాన్యంబు గాదనియు, ఉరుతరగద్యపద్యోక్తులకంటె జాను తెనుగు సరసతరమనియు నాతఁడు రాను రాను గ్రహించి బసవపురాణ పండితారాధ్య చరిత్రరచనాకాలము నాఁటికి జాను తెనుంగు నెడను, జాతీయతపయిని నెక్కువగ మక్కువను నెక్కొలి

యుండెను. ప్రారంభదశలో రచియించినయనుభవసారమును వ్రాయునప్పటి కీతనికి జానుతెనుంగుమీఁది వలపంతగా నెల కొనినట్లు కానరాకున్నను, నాంధ్రరచనమునం దీతఁడు పద్య రచనావిధానమున నన్నయత్రోవను గొంత సంస్కరించినట్లు గోచరించును. అనుభవసార పద్యములలోఁ గొంతవఱకు సంస్కృతపదబాహుళ్య మున్నను నన్నయ పద్యములలోని సమాసపాటవ మందుఁ గానరాదు. జానుతెనుంగు పయిఁగల మక్కువనుగూడ నాతఁడందుఁ గొంతవఱ కగపఱచెను. సమత్వమున వెలయు సంస్కృతపదములతోను దేటతెనుఁగు నుడులతోను వెలయుచు నీతని పద్యరచనము మత్తేభ గమనమువలె మనోహరముగ సాఁగుచుండును. ఈ క్రింది పద్యములఁ దిలకించినచో నీతని యీ నవీనగుణవిశేషము వ్యక్తము కాఁగలదు.

చ. నికమిది భక్తియు క్తియన నేరక నోరికి వచ్చినట్లు తా
నొకటికి వేయుఁబన్నుచును నొడ్డరి యడ్డరి మాటలాడుచుం
బకపక నవ్వుచుం గెలవి భావము తూలఁగఁ బల్కునట్టి య
వ్వికలుని గోష్ఠినిన్ సొగసి విందురె సజ్జనమార్గ మందురే.

చ. హరుఁడను కల్పవృక్ష, మమృతాంశు ధరుండను కామధేను, వీ
శ్వరుఁడను పెన్నిధాన, మహివల్లభ కుండలుఁడన్ సుధాబ్ధి, శం
కరుఁడను మేరువుండఁ దమ కన్నులఁ గానక వాంఛితార్థముల్
సురపతిఁ గొల్చినన్ దమకుఁ జొప్పడునే శివభక్తశేఖరా!

శా. వ్రాలున్ వ్రాలు శివార్చనాపరవశ వ్యాప్తిన్ బ్రమోదంబునన్
గా లున్ గ్రాలు నహర్నిశంబు శివలింగధ్యాన సంపన్నుఁడై
సోలున్ సోలు నపారసార వివిధ స్తోత్రప్రలాపంబులన్
దేలున్ దేలు మహానుభావ సుఖవార్ధిం భక్తుఁ డుద్యద్గుణా!

చ. హరుమది నిల్పినిల్పి యనయంబును బూజలు సల్పిసల్పి శం
కరు మును జూచిచూచి తమకంబు దలిర్పఁగ నేచినేచి యీ
శ్వరు నుతిఁ జేసిచేసి స్వవశస్థితిఁ జేష్టలఁ బాసిపాసి త
త్పరవశభావమంది చను భక్తుఁడు లింగము నొందు సన్మతిన్.

ఇట్లు వృత్తరచనమందే కాక సీసకందపద్యముల రచనమునందుఁగూడ నీతఁడు కొన్ని సంస్కారముల నెలకొలిపినాఁడు. సీసపద్యరచనమున నన్నయ పాటించిన యతి నియమముల నీతఁడు తన చతుర్వేద సారమునఁ బాటించెనని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు బసవపురాణ పీఠికలో వ్రాసినారు. కాని యనుభవసారమును జతుర్వేదసారమును జెన్నమల్లుసీసములను సవిమర్శముగఁ బరికింప శాస్త్రిగారి వ్రాఁత నాకు సత్యసమ్మతముగఁగాన్పింపలేదు. నన్నయయతినియమములనీతఁడు కొంతవఱకు సడలించెననియే నాయభిప్రాయము. నన్నెచోడ తిక్కనాదు లీతని మార్గమునే యనుగమించిరి. సీసపద్యరచనమున నీతఁడొనర్చిన ముఖ్యసంస్కారములు, ఏపాదమున కాపాదమునకుఁ బదములు తెగిపోయి ముందుపాద మందలి పదములతోఁ గలియకుండ రచియించుటయు, నా యాపాదములందుఁగూడఁ జాలవఱకుఁ బూర్వోత్తరార్థములు విడివడునట్లు రచియించుటయుఁ బాటింపఁదగినవి. సీసపద్యరచనమం దిట్టి సంస్కారము శ్రీనాథునితోఁ బ్రారంభమయినదని కొందఱి తలంపు కాని యది సరికాదు. శ్రీనాథుఁడు నాతని కొకింత ముందు వెలసిన జక్కన నాచన సోమనాథులు సీసపద్యరచనమునఁ జూపిన సంస్కారములకు మన సోమనాథుని సీసములే మార్గదర్శకములు జీవనౌషధములునని యాతని యనుభవసార

చతుర్వేదసారములను జెన్నమల్లు సీసములను సావధానముగఁ జదివినచో నంగీకరింపక తప్పదు. ఇందుకు దృష్టాంతముగా నీ క్రిందిపద్యములఁ దిలకింపఁదగును.

అ ను భ వ సా ర ము

సీ. అఖిలవేదాతీత మగుమూల మంత్రాక్ష
రములకు నతనివాక్యములు తేట
అయ్యక్షరాత్మకుండగు లింగమూర్తి కా
తని మనోభావంబు జనితభూమి
అలింగమూర్తికి నాశ్రయంబైన శ
రణుని కాతని కరాగ్రంబుతల్లి
అమ్మహాశరణున కాభరణంబైన
భక్తి కాతనిపదాబ్జములె యూఁత
ఆ. అట్టిభక్తికాదియైన జీవన్ముక్తి
కతని ఘనదయామృతావలోక
నమ్మె పరమపదవి యమ్మహాత్తరకీర్తి
నొప్పు గురువుమహిమ చెప్పఁదరమె.
సీ. అచ్యుతబ్రహ్మ మరాగోచరుండయ్యు
వరశుద్ధభక్తైక వత్సలుండు
అన్నాదబిందుక ళాతీతుఁడయ్యు నా
శ్రితశిష్యవర్గ సంతతకుటుంబి
స్థిరసత్పరవ్యోమ సింహాసనుఁడయ్యు
సాధకాత్మాంభోజ షట్పదుండు
పరమాణుతరమహ త్తరమూర్తియయ్యు స
ల్లింగజంగమప్రాణ లియ్యమూర్తి
గీ. యనఁగ వినఁగనాది కాదియై సన్మతి
నెగడఁబొగడ మహిమఁ దగిలి మిగిలి
యున్నయసదృశప్రసన్నైకసద్గురు
మూర్తిఁ గొలవకెట్లు ముక్తిదొరకు.

## చ తు ర్వే ద సా ర ము

సీ. మహితశివాచార మార్గానువర్తులై
నడుచువారును దప్పినడుచువారు
జంగమారాధనల్ సల్పుచుండెడువారు
నోలి దుర్భవవార్ధిఁ గూలువారు
సిద్ధప్రసాదసం సిద్ధిఁబొందెడువారు
నర్పితానర్హులై యణఁగువారు
భక్తిసంపదఁదేలి ప్రఖ్యాతులగువారు
పాయని నిందలఁ బడెడువారు
ఆ. అయ్య! నిన్నుఁగొల్చి నయ్యలు కొలువని
కొయ్యలేగదయ్య! జియ్య! దేవ!
వినుతనిర్మలాంగ! విరహితవ్యాసంగ!
పటుదయాంతరంగ! బసవలింగ.

సీ. శివశివా! కర్ణుండు కవచమిచ్చియుఁజెడె
వస్త్రమిచ్చినదాసి వరము వడసె
అక్కట! ఖచరేంద్రుఁ డంగమిచ్చియుఁజెడె
వేలిచ్చిమంచయ్య విజయుఁడయ్యె
కటకటా! శిబితన కండలిచ్చియుఁజెడె
మృగమాంసమర్పించి మెఱసె నెఱిత
చెల్లబో! బలిభువి యెల్లనిచ్చియుఁజెడెఁ
జోళుఁడొకూఁకూరిచ్చి సుగతిఁబొందె
ఆ. సల్లలింగవిముఖమగు దానధర్మప
రోపకార విశ్రుతోద్ధతములు
నిష్ఫలంబుగాఁగ నెట్టన శరణుల
భక్తియుక్తికెనరు బసవలింగ!

## చెన్నమల్లు సీసములు

సీ. సన్మనోభావంబు సంధిల్లుటరిదియే
తగిలిప్రసాదమై తలఁపులదర
భక్తిసుభాషల భాసిల్లు టరిదియే
కలయఁబ్రసాదమై పలుకులదర
విమలభక్తిక్రియాంగము చెల్లుటరిదియే
వలలు ప్రసాదమై వ్యాప్తిదనరఁ
జిరతరాంతశ్శుద్ధి దొరకొను టరిదియే
గూఢప్రసాదమై కోర్కులదర
ఆ. ఇంద్రియముల గెల్చు టెట్లరిదియెసమ
స్తాంగములు ప్రసాదమై చెలంగ
నట్లుగాన నీమహా ప్రసాదానూన
సిద్ధికేవలంబె చెన్నమల్లు.

సీ. ఏదెసఁజూచిన నా దెసలింగంబు
దృక్కులవెంబడిఁ దేజరిల్లు
నెక్కడఁజూచిన నక్కడలింగంబు
మునుఁగుచు నిలుచుచు మూర్తిగొను
నెచ్చోటఁజూచిన నచ్చోటలింగంబు
మనమునఁజిట్టాడుచును బెనంగు
నెమ్మెయిఁబొందిన నమ్మెయిలింగంబు
దనువునందునఁదొట్రుకొనుచుఁదనరుఁ
గీ. దివిరిపలుకుల లింగంబు తీఁగసాఁగఁ
దొడరిపలుకుల లింగంబు ముడివడంగ
నతిశయిల్లెడు పరమలిం గానుభవులఁ
జేర్చి రక్షింపవే నన్నుఁ జెన్నమల్లు.

సీసపద్య రచనమునందువలెఁ గంధపద్య రచనమునం దును సోమనాథుఁడు చక్కని సంస్కారమును గూర్చినాఁడు

కవిచౌడప్ప కందరచనమున మును దిక్కనసోమయాజిని ఘనుఁ డందురనియు, నటు తరువాతఁ దానే ఘనుఁడననియుఁ దన కందములు రసవన్మాకందములనియుఁ బ్రిగల్భముగఁ జెప్పి కొనినాఁడు కాని తిక్కనకు ముందే మన సోమనాథుఁడట్టి సంస్కారము నీవిషయమున నొనర్చెనో యనుభవసారమం దలి యీక్రింది పద్యములవలనఁ దెలియనగును.

క. కొలఁచుటరయ భక్తి భక్తికిఁ,దలఁక మిరయ వ్రతంబు వ్రతము దవులుటరయ ని
శ్చలకృప శివు నిశ్చలకృప. కలుగుటయది ముక్తిపథము కరుణాభరణా.

క. కలనాఁడె ధనము ప్రియము, గలనాఁడె జవంబు బలము గలనాఁడె వి
శ్చలమతియుగలియుఁ దనకుం,గలనాఁడె భజింపవలయుఁగరుణానిలయున్

క. గురుసన్నిధి గర్వించుట, గురుసన్నిధిఁ దన్నుఁదాన గొనియాడుటయున్
గురుసన్నిధి శంకింపమి, గురుపాతకమండ్రు బుధులు గురుభక్తినిధీ!

క. అడుగమి నిచ్చుట యుత్తమ, మడిగినయెడ నీఁగియున్న నది మధ్యమమ
ట్లడిగిన మెయ్యెలపులఁ దా, నిడుటయె యధమంబుభక్తియెడఁద్రిపురారీ

మఱియు ద్విప్రాస త్రిప్రాసకందములఁగూడఁ గొన్నిటి రచియించి సోమనాథుఁ డనుభవసారమునఁ జిత్రకవిత్వపుఁ దెరువులఁగూడఁ గొన్నిటిఁ ద్రొక్కినాఁడు

క. కన్నిడునే పరసతులకుఁ, దన్నిడునే భక్తుఁ డన్య దైవంబులకున్
వెన్నిడునే భవములకును, మున్నిడునే మనము విషయములకు మహాత్మా!

క. కొనునే నిషిద్ధపాకము, వినునే శివదూషణంబు వేఱొకలోకం
జనునే సద్భక్తుఁడనే, ననునే గర్వించి భక్తి యందు మహాత్మా!

తెలుఁగు నుడికారమునకుఁ దీయందనమునకు నెలవు లగు బద్దెన సుమతిశతకపద్యములకు మఱియు నతని నీతిసార

మండలి కందములకు సోమనాథుని కందములే మూలకందము లయి యుండునని నాయభిప్రాయము.

ఇట్టి ప్రతిభాసంస్కారములతోఁ జక్కని పద్యరచనము సాగించి చదువరుల హృదయములఁ గరంచు నేర్పుగలవాఁ డయ్యు సోమనాథుఁడిట్టి పద్యరచనము వెనుకటి ప్రకరణమున వర్ణితములయిన గద్యకృతులవంటి గద్యకలనము జనసామాన్యమునకు విశేషముగ నుపకరింపఁ జాలవనుమర్మమును గుర్తించి, జాతీయరచనముల కెల్ల జీవాతువనఁదగిన ద్విపదయే యందు కనువయినదని నెమ్మదినినమ్మి తన యుద్యమవ్యాప్తికి జనానురంజనమునకు దానినే ముఖ్యావలంబముగ గ్రహించి తన ప్రధానకృతులనిఁక ద్విపదలోనే రచియింపనుత్సహించెను. అనాదినుండియు నాంధ్రుల యభిరుచి కుచితమయి వారి నిత్య వ్యవహార జీవనములలోఁ బలువిధముల సమ్మిళితమయి యవినాభావ సంబంధము గలిగిన యీ జాతీయచ్ఛందముపయి యదే మికర్మమునసోగాని రాను రాను గొందఱకు నిరసన మేర్పడియెను. "పాతయొకరోఁత క్రొత్తయొకవింత" యనుట నేఁటి మాట మాత్రమే కాదుగదా! "ద్విపద కావ్యంబు ముదిలంజ, దిడ్డిగంత"యను నంతటి హేళనమును వేణుగోపాల శతక కర్త వంటి సామాన్య శతకకవులుగూడ నొనరించునట్టి దుర్గతిసయితము తుదకు ద్విపదకుఁ బ్రాపించినది. సోమనాథుని కాలము నాఁటికిఁ గూడ ద్విపదయందిట్టి యీసడింపు కొంత కొంత యేర్పడియున్నట్లే గోచరించును. అట్టి దురభిప్రాయమును ఖండించు తలంపుతోడనే బసవపురాణావతారికలో నడినడిఁగ.

"ఉరుతర గద్యప ద్యోక్తులకంటె । సరసమై పరఁగిన జాను తెనుంగు
చర్చింపఁగా సర్వ సామాన్యమగుటఁ। గూర్చెద ద్విపదలు గోర్కి-దైవారఁ
దెలుఁగు మాటలనంగ వలదు వేదముల। కొలఁదియ కాఁజూడుఁడిలనెట్లులనినఁ
బాటిఁతూమునకును బాటియానేని । పాటింప సోలయుఁ బాటియకాదె
యల్పాక్షరముల నల్పార్థరచన । కల్పించుటయె కాదె కవి వివేకంబు"

అని వ్రాసి బసవపురాణమును ద్విపద కావ్యముగనే రచియించి నిర్వహించెను. కాని ఈపాటి సమాధానము సామాన్యులకుఁ దృప్తి కొలుపలేదు. ఇఁక నీర్ష్యాళువులగు పరమతస్థుల మాట చెప్పనవసరమే లేదు. శివభక్తు లోరుగంటిలో స్వయంభూదేవుని మంటపమున సోముని బసవపురాణమును జదువుచుండఁగాఁ బ్రతాపరుద్రుఁడు విని యది యేమియని ప్రశ్నింపఁ బాల్కు-రికి సోమపతితుఁడు నూతనముగఁ బ్రాసి వల్లు పెట్టి పెనిచిన యప్రమాణద్విపద బసవపురాణ మని ధూర్తవిప్రులు నిందావాక్యములతోఁ గేలి యొనర్చి ప్రతాపరుద్రునకు నివేదించి రనియు, రాజది విని పురాణమును బాగుగ వినకయే మగిడి పోయెననియు, సోమనాథుఁ డీవార్త శిష్య ముఖమున విని యేక శిలాపురమున కేతెంచి రాజసభలో బ్రాహ్మణుల నోడించి మహిమాదికములఁ బ్రకటించె ననియుఁ, బ్రతాపచరిత్రము పిడువర్తి సోమనాథుని పద్యబసవ పురాణము, తుమ్మలపల్లి నాగభూషణకవి బసవవిజయము మున్నగు కృతు లుగ్గడించు గాథల నిదివఱకే పేర్కొ-ని యుంటిని. సోమనాథుఁ డిట్టి ధూర్తజనాభి ప్రాయములఁ బాటించు పిఱికి పందకాఁడు. తాను నిజము న్యాయము నని నమ్మినదాని నాచరించి నిర్వహించుటలో నాతనికి జంకుగొంకులు లేవు. దానికి

గోడు ప్రతివాదుల కజేయమై దుర్ధర్షమైన పాండితీసంపద యఖండమై యండదై యాతని కుండనే యున్నది. ఇందు చేతనే ద్విపద రచనముపయి జనసామాన్యమునకుఁ గలిగిన నిరసనమును బరిహరించుటకయి యాతఁడు పండితారాధ్య చరిత్రావతారికలో నీవిషయమును మఱింత విపులముగ విమర్శించి ద్విపద రచనము సమర్థించుచు నీక్రింది రీతిగ దీర్ఘో పన్యాస మిచ్చినాఁడు

"తత్కథావిషయ వైదగ్ధ్యమెట్లనిన । సత్కృతియన నూత్న సంగతి దనరఁ దొమ్మిది రసములు దులకాడ వాని । యిమ్మడి వర్ణన లెసఁగఁ దద్విగుణ మనలంకారంబు లసలార వాని । ద్విగుణార్థ భావముల్ దీటుకొనంగఁ దేటతెనుంగున ద్విపదరచింతుఁ । బాటిగాఁ దత్కథా ప్రౌఢి యెట్లనిన జాతులు మాత్రానుసంధానుగణ వినీతులుగాన "అ నియతగణై" ర నియును "ప్రాసోవా" యనియు "యతిర్వా" య నియుఁ జెప్పుఛందో వినిహితోక్తి గాన ప్రాసమైనను యతి పైవడియైన । దేసిగా నిలిపి యాదిప్రాసనియతి దప్పకుండఁగ ద్విపదలు రచియింతు । నొప్పదు ద్విపద కావ్యోక్తి నావలదు బాధగద్యపద్యాది ప్రబంధ । పూరిత సంస్కృత భూయిష్ఠ రచన మానుగా సర్వసామాన్యంబుగామి । జానుఁ దెనుఁగు విశేషము ప్రసన్నతకు నట్టునుగాక కావ్యము ప్రౌఢిపేర్మి । నెట్టన రచియింప నేర్చినఁ జాలు — ఉపమింప గద్య పద్యోదాత్తకృతులు । ద్విపదలు సమమ భావింప నెట్లనిన పరిశీత సరణి ప్రసన్నత చెన్ను । వరిణత గణపద పద్ధతి శబ్ద శుద్ధి ప్రయోగప్రసిద్ధి గళా స । మృద్ధి నానుడివడి మితి యతి యర్థ పుష్టి నైజము రసపుష్టి వినూత్న । సృష్టి విశేష్య విశేషణశ్లేష పెంపు గుమారత పెంపు మాధుర్య । మింపు మృదుత్వంబు గుంపొజ సదువు యమకంబు గమకంబు యతి గతి గారకము పూరకము క్రియ గాంతి విశ్రాంతి రంగు బెడంగు మెఱుంగు సమాస । సంగతి యక్షరశయ్య సంఘటన నిపుణత రసికత నెటి సమాసార్థ । ముపమాన మవధాన ముత్ప్రేక్షలక్ష్య

లక్షణవ్యక్తి యలంకారయుక్తి । దక్షత సుమతి విచక్షత యనిన
జాతుల రచనాప్రణీతులఁ గావ్య । నీతుల రీతుల నేతు లుట్టంగ
వరకవుల్ గొనియాడ వర్ణనకెక్క । ధరఁజెప్ప కృతియ యుద్యత్కృతిగాక
జల్లిపూరక మపశబ్ద మక్రమము । పొల్లు వ్యుత్క్రియ జడ్డు పొందసంఘటన
కాకు వ్యర్థం బసంగతి విరసంబు । వైకల్యమత్యుక్తి వైరిపదంబు
తలవిరు పసమగ్రత శిథిలబంధ । ములుద బంధంబు గ్రామ్యోక్తి గంటకము
డాంభఛందోవిరుద్ధం బాదియగు న । లాభప్రలాపోక్తి లాఘవంబనక
వసిగూర్చు కృతులు నా వడ్లను బెరుగు
బిసుకు చందము బిలిబిలి కృతుల్ గృతులె
అటుగాన యభివినుతానందితోక్తి । పటుగద్యపద్య ప్రబంధ సామ్యముగ
కావ్యకళాప్రౌఢిఁ గల్పింతు ద్విపద । కావ్యంబు భావ్యంబు గాఁగ నట్లయ్యు
నవికల వేదవేదాంతేతిహాస । వివిధాగమ పురాణ విహితసూక్తముల
నిదమిత్థమను చోట నివియె ప్రామాణ్య । పదములుగాఁగ ద్విపదలు సంధింతు
సొట్టైన రత్నంబు చుట్టును బసిఁడి । గట్టిన భావన నెట్టణఁ దెనుఁగు
సంధిపూర్వాపర సంఘటనముల । బంధురచ్ఛందో నిబద్ధముల్ గాఁగ
వేదసూక్తములకు వెరవైనమాట । లాదటఁగల్పింతు నవి జల్లియనక
వలనెఱింగియు వేదవాక్యంబు ద్విపద । కొలఁదినేఁ బలుకుటకును మది మెచ్చి
కేలిముద్రిక రత్న కీలనసేయు । చో లేశమైన వచ్చునె రత్నమెంత
సొట్టైన రత్నంబు చుట్టును బసిఁడి । గట్టుట యతివివేకంబిట్లయయ్యు
దేసిగా వచియింతు ద్విపదకు వళ్ళుఁ । బ్రాసంబులును బొందుపడఁగఁ దావలయు
ననుచుఁ దదీయ సూక్తాక్షరపంక్తిఁ । జెనకక యింతొప్పఁ జెప్పనే యనుచు
సన్నుతిఁ జేయుచు సత్కవులలరఁ । దిన్నని సూక్తుల ద్విపద రచింతు
నదియును గావైహికాముష్మిక ద్వి । పద హేతువవుట ద్విపద నాఁగఁ బరఁగు
ద్విపదాంబురుహముల ధృతి బసవేశు । ద్విపదాంబురుహము లతిప్రీతిఁ బూన్తు

దీనినిబట్టి సోమనాథుని సహజసత్త్వము, స్వాతంత్ర్యతాభిరక్తి వ్యక్తము కాఁగలవు. "క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే" అని మహాకవి భారవి నుడివినట్లు కవి

మనోరథసిద్ధిని గూర్పఁజాలినది స్వతంత్రప్రతిభగాని యాతఁడు గ్రహించు సాధనోపకరణము మాత్రముకాదు. ఈ భావమునే "అల్పాక్షరముల ననల్పార్థరచనఁ గావించుటయ కాదె కవి వివేకంబు" అని సోమనాథుఁడు ప్రతిపాదించినాఁడు. అతఁడు చెప్పినట్టి కావ్యదోషములఁ బరిహరించి కావ్యగుణములతోఁ బ్రకాశించెనేని యది ద్విపదయైనంత మాత్రమున గద్యపద్య కావ్యములువోలెఁ జదువరుల లోఁగొనఁజాలదా? కావున దోషములఁ దూలించి గుణముల గ్రహించి, నవరసములు, అష్టాదశవర్ణనములు, ముప్పదియా అలంకారములు, డెబ్బది రెండు భావములు, దులకాడఁ దేటతెనుంగున ద్విపదలు రచియించెదనని సోమనాథుఁడు ప్రతినయొనర్చి తన ప్రధాన కృతులను ద్విపదాచ్ఛందమునందే గూర్చి చరితార్థుఁడయి నాఁడు. లఘుబుద్ధిగలవారి దృష్టిలో నిరసనమునకుఁ దావల మయిన ద్విపద యలఘుమతియగు నాతని చేతిలో నైహికా ముష్మికరూపక ద్విపద హేతువయి విరాజిల్లినది. ఇట్టి యీ ద్విపద రచనమునందు సోమనాథుఁడు ప్రకటించిన నవీన గుణాదికము లసంఖ్యాకములు, అనిర్వచనీయములు. శ్రుతి స్మృతి ప్రమాణముల లెక్కకుమిక్కిలిగఁ గుప్పించుటయం దేమి, గహనములగు నుపనిషద్రహస్యములఁ దేటతెల్లముగఁ జొప్పించుటయందేమి, పలురూపములగు పరమత సిద్ధాంత ములఁ బ్రదర్శించి ఖండించుటయందేమి, ఏకధాటిగ హేరాళ ముగ ధారాళముగ ఝురీవేగముతో సంస్కృత సమాస ఘటిత పదజాలములఁ బ్రవహింపఁ జేయుటయందేమి, లలితములయి,

యలంతి యలంతి తునియలుగ విడివడి తేనియ తేటలయి, వెలువడు జానుఁదెనుంగు నుడుల జాలువార్చి చదువరుల మదులఁ గరంచుటయందేమి, యిది యది యననేల? దేనియందును గూడ నడ్డొంకింతయు లేక సర్వవిధముల నాతనికి వశంవదయయి ద్విపదయే బహురూపకములగు వివిధ సంధానములం దొక్క రీతిగ నుపకరింప నేర్చెను. వేయేల! ఆంధ్రభాషాసతి యాతని చేతి యందలి కీలుబొమ్మయై తన ద్విపదములతో నీతని ద్విపద కృతులయందు బహుముఖములుగ సరసతరముగ నృత్య మొనర్చి కృతకృత్య యయ్యెననుట సత్యదూరము కానేరదు.

సోమనాథుఁడు మహాభక్తుఁడు. అతని భక్తి రసావేశ మపరిమిత మయినది. అందుచే నది యాతని కవితయందుఁ గూడఁ బ్రతిబింబితమయి దానికెన లేని రామణీయకమును గలిగించినది. చెప్పఁదలఁచిన విషయమును వ్యంగ్యమర్యాదతోఁ బరిమిత పదజాలముతోఁ బ్రతిపాదించు శక్తి సోమనాథుని యందు లేదు. ఇతని కవితాధార యావేశావేగములతోఁ గూడినదవుటచే నీతని వర్ణనము లపరిమితములయి, పెక్కు పట్టుల నతిదీర్ఘముగనుండును. ఆయా పట్టులఁ జదువునపుడు చదువరులకుఁగూడ రసావేశము సహజముగఁ గలుగుచుండును. అందుచేనవి వారికి విసువును గలిగింపఁ జాలవు. ఎట్టి పట్టుల సంస్కృత పదబాహుళ్యము ప్రయోగార్హమో, యే యే తావుల జానుతెనుఁగు జాలు గురిపింపఁదగునో యా రహస్యము సోమనాథునకుఁ దెలిసినంతగా నితరులకుఁ దెలియదని చెప్పవచ్చును. ఒక్కచో హిమవద్భూధర గుహాగ్రములనుండి

దుముకివచ్చు గంగాప్రపూరములఁ బోలు గీర్వాణభాషా సమాస పూరములఁ బాఠకుల ముంచి యెత్తుచు, మరలనొక్క త్రుటిలో వారిని జాను తెనుఁగు తేనియ తేటలలో నాతఁడోల లాడించును. కాళిదాసమహాకవి హిమాలయ వర్ణనములో నచ్చటి సానువుల సంచరించు సిద్ధుల కించుమించుగ నేకకాల మునందే యతిదూరములో నొక్కచో హానజములును మఱొక్కచోఁ దీక్ష్ణాతపము ననుభూతములగునని మనోహరముగ వర్ణించినాఁడు. సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రములఁ జదువునపుడు పలుతడవలఁ బాఠకులకిట్టి యనుభవమే గలుగుచుండును. వైద్యము, సంగీతము, రసవాదము, చౌర్యము, ద్యూతము మున్నగు ప్రత్యేక శాస్త్ర విషయములు గాని సందర్భములు గాని ప్రసక్తించినపుడు వానికి సంబంధించిన పారిభాషిక పదజాలముల నామూలచూడముగఁ బ్రదర్శించినఁగాని సోమనాథునకుఁ దృప్తికలుగదు. అట్టి పట్టుల నాతని సర్వంకషప్రతిభ, సర్వజ్ఞతాశక్తి ద్యోతకమయి పాఠకుల నాశ్చర్యచకితులఁ గావించును. ఇట్టితావు లాయా విషయముల గుఱించిన ప్రత్యేక నిఘంటువులుగా వాఙ్మయ సేవకుల కుపకరింపఁ జాలును.

ప్రతిపాదింప నెంచిన విషయము పాఠకుల మదుల యందు లెస్సగా హత్తించుటకు, వారి కందుమూలముగ రసావేశము గలుగుటకు సమానార్థకములగు పర్యాయ పదములను మార్చి మార్చి పుంఖానుపుంఖములుగఁ బ్రయోగించుట సోమనాథుని నవీనగుణము లందలి మఱియొక విశేషము.

దీనిని భాషాసౌభాగ్య ద్యోతకమగు నుత్తమ గుణముగాఁ బలు
వురు సంభావించిరి. నాచన సోమనాథుఁడు, శ్రీనాథుఁడు
మున్నగు కవివతంసులు సోమనాథుఁడు నెలకొల్పిన యీనవీన
గుణముఁ దమకృతులలో ననుకరించి యారాధించిరి. కాని
లోకము భిన్నరుచి గలది. "పుర్రెకొకబుద్ధి జిహ్వకొకరుచి"
యను ప్రాఁబలుకు ప్రసిద్ధముగదా! పలువురు ప్రశంసించిన
సోముని యీకావ్యగుణమును, కళాసౌందర్యమును "దిక్కు,
దశ, తల, తోఁక లేని పవాడముల పునరుక్తి" యని మిత్రి
లోక రవగణించిరి. *ఆలంకారికులు పునరుక్తి నొక దోషముగఁ
బేర్కొనినను నింపుసొంపును గూర్చునపుడు దానిని గూడనొక
గుణముగానే పెద్దలు పరిగణించి యుత్తమ కవుల కృతులందలి
యిట్టిపునరుక్తులను "అత్యాదరాత్ పునరుక్తిః" ఇత్యాదిగా
సమర్థించిరేగాని వానినీసడింపలేదు. సోమనాథుని కృతులందలి
యిట్టి పట్టుల నొండు రెండీ క్రింద నుదాహరించుచున్నాను. పాఠ
కులు వానినిఁ దిలకించి విచక్షణతో నందలి గుణదోషవిశేష
ముల నిర్ణయింతురుగాక ! ఉగ్గుఁబాలతోఁ గ్రోలిన మాతృ
భాషను మఱచిన మనకు సోమనాథుఁ డతివేలముగ వాడిన
జాను తెనుగు నుడులు క్రమముగా వాడుకలో నశించి నేఁడు
వాని నిజస్వరూపమును ప్రత్యేకార్థము నెఱుంగ రాకుండు
టచేఁ గొందఱదృష్టికవి పునరుక్తులుగఁ గాన్పించుటలో
నాశ్చర్యము లేదు.

---

* భారతి. స్వభాను సంవత్సర వైశాఖ సంచికలోని శ్రీరాళ్ళపల్లి
అనంతకృష్ణశర్మగారి "రంగనాథ రామాయణము" అను వ్యాసముచూడుఁడు.

వ్రేట్లను గట్టి ముచ్చట్లును జొట్టె । వ్రేట్లతోడనఁ దమవీఁపు తోళ్ళగయ
పలికుల్కి వీఁగి వీఁపులు విర్చికొనుచుఁ । గెలఁకు లారయుచుఁ జేతులఁ నొగ్గికొనుచు
మలికుల్కి పడుచు దబ్బఱ మానుఁడనుచు । జాఱవేఁకు లందుచు విభ్రాంతులగుచు
కోయని జడియుచు నుపతపించుచును
వాయెత్తి రోఁదుచ్చు వసదు లెక్కుచును
సందుండి యుఱుకుచు సైద వెట్టుచును । సందులకేఁగుచుఁ గ్రిందు సొచ్చుచును
కెఱువులమునుఁగుచుఁ జెట్లఁ బ్రాఁకుచును
ఱచుచు నొండొరు మఱువు సొచ్చుచును
వ్రేట్లకు నులుకుచు విహ్వాలు లగుచుఁ । ద్రిట్లంటి చూచుచుఁ దమకర్మమనుచు
ఏసువెన్కఁ డాఁగుచుఁ జిక్కితి మనుచుఁ
గనుకని చనుచు నెక్కడసొత్తు మనుచు
వచ్చెఁ జావనుచు దైవ మెఱుంగుననుచు । నొచ్చితి మనుచును వెచ్చనూర్చుచును
దలలు గుండులతోడఁ దాకించు కొనుచు । నిలఁబడి పొరలుచు నెట్లొకోయనుచు
దొరిగెడిమేని నెత్తురు లంటియంటి । పొరిఁబొరిఁ జూచుచుఁ బొక్కితిమనుచుఁ
కొరఁజోటు లేదంచు సొమ్మసిల్లుచును । హరకృత్యమో కాకయనుచునిబ్భంగి
సంతాపమున వ్రేట్లజైనులు పొరల........................
శ్రీచంద్రమునివోయి చెఱువుపాలయ్యె । నాచార్యమునివోయి యగడితఁబడియె
వీరచంద్రమునివోయి వసదెక్కియుటికె । నరహాతమునివోయి యడవులఁ గలసె
క్షపణేంద్రముని ప్రాణముపతాపమందె । విపులేంద్రముని వీఁపువిక్కనవిటిగె
రాజేంద్రముని బిట్టు ప్రాణముల్ విడిచె । నీజినకులగురుఁ డింతలోఁ బొలిసె
వింతయుఁ గూడ నొక్కింతయై మడసెఁ । గంతుసంహరుచెయ్దిగానోపు ననుచు

(బసవపురాణము ఆ 6 వైజకవ్వకథ)

"లింగగుణాతీతుఁడై లింగమూర్తి । భృంగీశ్వరుఁడు సూచుసంగతిఁ జూచు
నందికేశ్వరుఁ డవినాభావలీలఁ । గందర్పహరుఁ జూచు క్రమమునఁ జూచుఁ
దగిలించుఁ దాటించు దండడిగొల్పు । నిగిడించు నిష్ఠించు నెమ్మించు నాఁచు
సంధించు సారించుఁ జనఁ జొన్పుమన్పు । బంధించు బోధించుఁ బైకొల్పుసల్పు
వెక్కల్పుఁ బెనకొల్పు నెలకొల్పు నిల్పుఁ
చక్కల్పు బురికొల్పు సమకొల్పుఁ గల్పుఁ

జిక్కించు నాటించుఁ జెందించుఁ జేర్చ
సొక్కించు సోలించు నెక్కించుఁ గూర్చుఁ
బోరయించుఁ బొలియించుఁ బొందుఁ గావించు
దొరయించుఁ గీలించు మరగించునించు
నంతకమున్న నిట్లంత కాంతకు నిరంతరా క్రాంతమై యలరు తద్దృష్టి
చిరమూలమంత్రంబు శిష్యకర్ణమునఁ బరఁగఁ జిక్కిన మాడ్కి భవునందచిక్కి

(పండితారాధ్య చరిత్ర దీక్షా ప్రకరణము
పండితయ్య లింగ నిరీక్షణము)

'చెచ్చెఱ నేతెంచి చేగంట మ్రొయ । నచ్చోట మహిసాక్షి యాగుగ్గులంబుఁ
గానక సోమేశు నానతి యిదియ । నేనగుగ్గులము కాకీపూటకింక
ననుచు వీక్షించుచో నాథూపవహ్ని । గనరుచుఁ బొనరుచుఁ గణకణయనుచు
మెఱయుచు వఱలుచు మించుచు దృష్టి
మిఱుమిట్లు గొలుపుచు మీఁదికుబ్బుచును
నీరువారుచు నెండినిట్టవొడుచుచును । దూరదాకుచుఁ బ్రభ దుఱగలించుచును
ధళధళ వెలుఁగుచుఁ దనరుచు నాష్ట్ర । మలరుచు నిప్పులు మలమల యనుచుఁ
బొగలుచుఁ బొంగుచు భుగభుగయనుచు
నిగుడుచుఁ జిఱుమంట లెగయుచుఁ బేర్చి
ప్రీతిలేని ఫాలాక్షు ఫాలనేత్రాగ్ని । ప్రతిబింబభావనఁ బ్రజ్వలింపంగ
నదరక యది చూచి బెదరక డెంద । ముదరక చిత్తంబు చెదరక మనసు
గలఁగక యాత్మలో నలగక బుద్ధి । దొలగక కొంటెకిఁదలగక చలము
డింపక ఱెప్పలు వంపక యురము । తెంపక శివకాంక్ష దెంపక పదము
దొరక గుణములు గూరక యాసఁ । జేరక తపములఁ బారక మెచ్చి
పలుకక యితరుల కలుకక తెగువ । కులుకక ధైర్యంబు నొలఁకక వెనుక
చూడక తలఁపు లల్లాడక జడత । గూడక హరున కమ్మోడక క్షణమ

(పండితారాధ్య చరిత్రము పురాతన ప్రకరణము, ఓహిళుని కథ)

ఇట్లే శబ్దముల మెఱుఁగెక్కించు భావములను, భావములకు వన్నెగూర్చు శబ్దములను సమ్మేళనమొనర్చి యారెంటిని

ధారాప్రవాహముగా జాలువార్చి యనన్యసామాన్యమగు ప్రతిభను నప్రతిమంబగు ప్రజ్ఞను బ్రదర్శించి సోమనాథుఁడు పలువిధంబులగు నవీన గుణములతోఁ దన ద్విపద కావ్యముల రచియించి, యందనిర్వచనీయంబగుకళాసౌందర్యమును బెంపొందించినాఁడు. కావ్యవ్యాకరణతీర్థ బిరుదాంకితులు శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ఆంధ్రపత్రిక పదియవ సంవత్సరాది సంచికలో "ద్విపదకవిత్వము" అను వ్యాసమున సోమనాథుని బసవపురాణ పండితారాధ్యచరితముల నుద్దేశించి లిఖించిన యీక్రింది వాక్యములు తిలకింపఁదగినవి.

"ఈ రెండు గ్రంథములు నెక్కడఁ జూచిన నక్కడ నవరసములు పొంగి పొరలిపోవునట్టి రసోదంచితములుగ ద్విపదలలోఁ గూర్పఁబడినవి. హిమవద్భూధర గుహాగ్రములనుండి యనర్గళముగా దుమికి వచ్చెడు గంగా ప్రవాహముంబోలె నీమహామహుని కవిత్వము పాఠకుల మనంబుల నానంద పూరమున నోలలాడించుచుండును. భక్తశిరోమణియగు పోతన భక్తి పారవశ్యపుఁ గవిత్వమునకును, కవిసార్వభౌముఁడగు శ్రీనాథమహాకవి నుడికారముల గడుసుఁదనంపుఁ జొన్నెలకును, కర్ణాటరాజ్యరమానాథుఁడు నాంధ్రభోజుఁడు నాంధ్రకవియు నగు కృష్ణదేవరాయమహారాజుల యాముక్తమాల్యద మున్నగు కృతులలోని యద్భుతవర్ణనాపటిష్ఠములగు సందర్భములకును, దీనికి దానికనియేల, ఇంతదనుక మన యాంధ్ర సారస్వతమునఁగల హృద్యములగు రసవద్వర్ణనోదంచితములగు కావ్యపు మెఱుంగులన్నిటికిని, ఈ రెండు ద్విపద కావ్యములే మార్గదర్శకములయి రాజిల్లినవనుటలో నేమియు సందియము లేదు".

శ్రీ ఆదినారాయణశాస్త్రి గారి వాక్యములందలి యాథార్థ్యమును దృష్టాంత పూర్వకముగఁ బ్రదర్శింప వలెనన్నచో నందుకయి యొక ప్రత్యేక గ్రంథమే వ్రాయవలసి

యుండును. సోముని గ్రంథములను సవిమర్శముగఁ జదివి యా పిమ్మట నన్నెచోడుని కుమారసంభవము, రంగనాథుని రామాయణము, తిక్కన భారతము, నాచన సోమనాథుని యుత్తర హరివంశము, శ్రీనాథుని కావ్యములు, పోతన భాగవతము, శ్రీకృష్ణదేవరాయల యాముక్తమాల్యద, తంజావూరి రఘునాథభూపాలుని రామాయణము మున్నగు నుత్తమ కావ్యములను జదివినచోఁ బాఠకుల కాయా మహాకవులకు సోమనాథుని కృతులెట్టులెంతవఱకు జీవనౌషధములయి మార్గదర్శకము లయినది తెల్లమయి సోమనాథుఁ డాంధ్రవాఙ్మయమునకుఁ గూర్చిన వికాసవిలాసములు సువ్యక్తమయి యాంధ్ర కవితాసింహాసనమున నాతని కీయఁదగు నుత్తమస్థానమవగతము కాఁగలదు.

అల్పాక్షరముల ననల్పార్థరచన గావించు సోమనాథుని ప్రతిభకు దృష్టాంతముగ నీ క్రింది పంక్తులు చూడఁదగును.

> ,,వడిఁ బాఱుజలమున కొడలెల్లఁ గాళ్ళు
> వడిఁగాలు చిచ్చున కొడలెల్ల నోళ్ళు
> వడి వీచు గాడ్పున కొడలెల్లఁ దలలు
> వడిఁ జేయు బసవ! నీ కొడలెల్ల భక్తి. (బసవపురాణము ఆ. 2)

“వఱద వోవు నెలుఁగు గొఱపడంబనుచు। నెఱుఁగక యీఁత కాఁడేగి పట్టుడును
వడిఁబాఱు నెలుఁగంత వానిన పట్టఁ। గడనున్న వాఁడోరి విడువిడు మనుడు
విడిచిననది దన్ను విడువదన్నట్టి। వడువున విడిచిన విడుచునే మాయ
పొంగిచిచ్చుఱు కంగఁ బోవుచుఁ జీర।కొంగోసరించు పెన్వెంగలి యట్లు
చెల్లఁ బొమ్మని సన్న్యసింపఁబోవుచును। నిల్లప్పగించు నయ్యింబందియట్ల
పదపడి నూతిలోఁ బడఁబోయి తాప। వెదకుచు మెట్టెడి వీఱిఁడి యట్ల
జ్ఞానాత్ముఁడై సర్వసంగముల్ విడిచి। తానాశ్రయము గోరుతపసిచందమున

నిముసలోవ్వయె రోఁకలి గొనిరండు। తలఁజుట్టి కొనియెదఁ దానన్నయట్లు
పానశేల చెఱకుపంచెమందొక్క । యీనె సిక్కనినోడుచే కాచె తలఁప
గోసి సంసారంబుఁ బాసి మొక్కంత । యాసించెనేనియు నది వెల్తిగాదె"
(బసవపురాణము ఆ 3. సకళేశ్వరమాదిరాజయ్య కథ)

వేలిముద్రికరత్న కీలనసేయుచో రేశమయిన వచ్చునె రత్నమెంత
పాటైన రత్నంబు చుట్టును బసిఁడి । గట్టుట యతివివేకంబదియట్లు
(పండితారాధ్యచరిత్ర దీక్షాప్రకరణము.)

వేయేల కవిమల్లు విషయేంద్రియములు । మాయనిలోసేవ సేయని తపము
ఎఱుఁగని యెఱుక తన్మఱవని మఱపు । ఎఱుఁగని మెలకువ తఱుఁగనినెనరు
కలపిపాయని కూర్మి కలలేని నిద్ర । గెలిచిన తుర్యంబు క్రియసెడ్డ నడుపు
తెప్పని తెప్పచే దిప్పని తనివి । నప్పని కూర్మి యానని పంట ప్రోది
పెంపని పెంపు లాలింపని వినికి । తెంపని తెంపు నేమింపని వలపు
పాయని సంతాన మిడరాని తమక । మెడవోనినెయ్యంబు గడివోని తలఁపు
(పం. చ. దీ. ప్ర.)

అంతె బుధుఁడు లోకారాధ్యయశుఁడు । నైనపండిత మల్లికార్జున ప్రభువు
వలపటిదెసనుమావర భక్తరాజి । నలిగొన సింహాసనస్థులఁజేసి
హరుని భక్తులయాజ్ఞ శిరమునఁదాల్చి । గరిడికెక్కిన యంకకాఁడునుబోలె
సెడ విడివడ్డ మత్తేభంబువోలె । వడిమృగంబులఁగన్న వ్యాధుండు వోలె"
(పం. చ. వాదప్రకరణము)

## ౧౪ సోమనాథుని శైలి ; కవితావిశేషములు.

సోమనాథుని వాక్ప్రవాహమును హిమవద్భూధర గుహాగ్రములనుండి దుమికివచ్చు గంగాప్రపూరముతో సరిపోల్చుచుఁ గొందఱు పండితు లొనర్చిన ప్రశంస నిదివఱకే పేర్కొని యుంటిని. వేగమునందేమి, పావనత్వమునందేమి, ఘటి యితర గుణములయందేమి, వీనికిఁ గూర్చిన సామ్యము

సర్వవిధముల సహృదయసమ్మత మయి యున్నది. ఇందొకటి పరమేశ్వర జటామకుట విహారిణి. మఱియొకటి భక్తప్రవర మనోహారిణి. సోమనాథుని గ్రంథములఁ జదువునప్పుడు కొన్ని యెడల నాభీలావేగముతో హిమవత్పర్వత సానువుల నుండి ప్రవహించు భాగీరథియు, మఱికొన్ని తావులఁ గాశీపురపరిసరముల సరళగతిని జరగు జాహ్నవియుఁ దలఁపునకు వచ్చుచుండును. సహజగంభీరతయు సుప్రసన్నతయు రెండునుగూడ నీకవివరుని శైలికింగల నైజగుణములు. సోమనాథుని రచనలు ద్రాక్షాకదలీపాకములఁ బరిణతములయి, వామన మతానుసారముగ వైదర్భీ పాంచాలీ రీతుల కాదర్శము లయి వెలయుచుండును.

సోమనాథునికవితయందలి ముఖ్యగుణము లనన్యసామాన్యములగు సౌందర్యమాధుర్యములు. అతఁడు తన గ్రంథములను భక్తిరసపరవశుఁడయి రచియించుటయు, భావమునే ప్రధానము చేసికొని శ్లేష యమకాద్యలంకారములకయి తడవులాడకుండుటయు, జాతీయతనే యెక్కువగ గణించి దేశీయచ్ఛందమగు ద్విపదలోఁ దన ప్రధాన కృతుల వెలయించి యందుఁ దీరులీయములుగల తెలుఁగుపలుకుబళ్ళను మేలుగ జాలువార్చుటయు నిందుకుఁ బ్రధాన కారణములు. సరసమయిన

* రీతి రాత్మా కావ్యస్య; విశిష్టా పదరచనారీతిః విశేషో గుణాత్మా; సమగ్ర గుణోపేతా వైదర్భీ మాధుర్య సౌకుమార్యోపపన్నా పాంచాలీ.
(వామనుని కావ్యాలంకార సూత్రములు)

జాను తెనుఁగుపయి నాతఁ డెక్కువగ వలపుగొనినను, సహజ గంభీరతా ప్రసన్నములగు సంస్కృతపదములపయిఁ గూడ వ్యామోహము వీడలేదు. జాతీయత వలసిన పట్టులయం దతఁడు నూటికిఁ దొంబదిపాళ్ళు జాను తెనుఁగును బ్రయోగించును. గాంభీర్య ప్రకటన మవసరమయిన మతవివాదములు మున్నగు తావుల సంస్కృతపద బాహుళ్యమును బ్రదర్శించును. మఱికొన్ని పట్టులఁ దెలుఁగు పదములను సంస్కృత పదములను సమానముగఁ బరఁగించును. అతఁడు రసైక పరతంత్రుఁడు. రస విజృంభణమునకయి యెచ్చటనెట్టిపదజాలమును బ్రదర్శింపవలెనో యాతఁడెఱింగినట్లుమన మెఱుంగఁజాలము. శబ్దాలంకారములలో ననుప్రాసములపయి సోమనాథునికి మక్కువ యెక్కువ. ఈ యనుప్రాసములయినను భావావేశములో వానియంతట వవి సహజముగ దొరలివచ్చినట్లే గోచరమగును గాని వాని నాతఁడు ప్రయత్నపూర్వకముగఁ బ్రవేశపెట్టినట్లు కానరావు. ఇతని తరువాత వెలసిన హుళక్కి భాస్కరుఁడు, అయ్యలార్యుఁడు, బమ్మెరపోతన మొదలగు తెలంగాణ కవుల యనుప్రాస ప్రియత్వమున కీతఁడే మార్గదర్శకుఁడు కానోపును. మనుల నిత్యవ్యవహారమున సుప్రచార మొందు తేటతెనుఁగునే యాతఁడు జానుతెనుఁగని వ్యవహరించినట్లు కానవచ్చును. సోమనాథుని వృషాధిప శతకమందలి యీ క్రింది పద్యమును బట్టి యట్టి జాను తెనుఁగు స్వరూపమును మనము గ్రహింపఁదగును.

చ. "బలుపొడ తోలు సీరయును బాపసరుల్ గిలుపారు కన్ను వె
న్నెలతల చేదుకుత్తుకయు నిండిన వేలుపుటేరు వల్లు పూ
సలుగల తేని లెంకవని జాను తెనుంగున సన్నుతించెదన్
వలపు దలిర్ప నిన్ను బసవా! బసవా! బసవా! వృషాధిపా!

పాత్రముల ముగ్ధత్వమును బ్రదర్శించుటలో నీతఁడెంతయుఁ బ్రతిజ్ఞావంతుఁడు. ఇట్టిపట్టుల నీతఁడు సరసతరముగ ముద్దు మురిపెముల గురియు జాను తెనుఁగు పదముల జాలువార్చి వారి ముద్దతనమును గన్నులఁ గట్టినట్లు చిత్రించి పాఠకుల విముగ్ధులఁ గావించును. బసవపురాణమునఁ దృతీయాశ్వాసమందలి రుద్రపశుపతి, బెజ్జమహాదేవి, గొడగూచి, ముగ్ధ సంగయ్య, కన్నప్ప మున్నగు ముగ్ధభక్తుల చరితములఁ బరికించిన నీయంశము తేటపడును. మచ్చునకీ క్రింది పంక్తులఁ దిలకించునది. బెజ్జమహాదేవి శివునకుఁ దల్లిదండ్రులు లేరను వార్తవినితానె తల్లినై యుపచరించెదనని తలపోసి తన యిష్టలింగమూర్తికిఁ బరిచర్యలు సలుపు ఘట్టము.

"మఱియును విను బెజ్జ మహదేవియనఁగ । గఱకంఠ శ్రీపాదకమలాంతరంగ
యొల్ల నిరోగంబులెల్ల బాంధవులు । నెల్లవారలుగల్గి యిట్లు భర్గునకుఁ
దల్లిలేకుండుట దా విచిత్రంబు । దల్లిలేకదియెట్లు దానుదయించె?
దల్లిసచ్చెనొకాక త్రైలోక్యపతికిఁ జెల్లఁబో! యట్లేమి సేయంగ వచ్చు?
దల్లిసచ్చినఁగాదె తాను దస్సితిని । ఎల్లవారికి దుఃఖమిట్టిద కాదె
తల్లిగల్గిననేల తపసిగానిచ్చుఁ । దల్లిగల్గిననేల తలజడల్గట్టు?
తల్లియున్న విషంబు ద్రావనేలిచ్చుఁ । దల్లియుండినఁదోళ్ళు తాల్పనేలిచ్చు!
తల్లిపాముల నేల ధరియింపనిచ్చుఁ । దల్లిబూడిదయేలఁ దాఁ బూయనిచ్చు
తల్లిపుచ్చునె భువిఁ దనయునిఁ దిరియఁ । దల్లిపుచ్చునె సుతు వల్లకాటికిని
తల్లిలేకుండిన తనయుండుగాన । వెల్లదుఁడై యిన్నిపాట్లకు వచ్చె

నచ్చి పలుమాఱు చెన్నయుఁ బెట్టి । పన్నుగా నిన్నియుఁ బాలును బోసి
డుఁ గొనఁగాఁ గడుపరసి పాలిచ్చి । సాఁకించి పెనుపదే జనని గల్గినను
గానితవాఁడయ్యెఁ దల్లిలేకయును । దానెంత పెరుఁగునో తల్లిగల్గినను
బిడ్డండ్ల నోములఁ బేరంటములను । బండువుదినములఁ బాటిజాతరలఁ
గన్న పోఁడిమి సేయు తల్లిలేకున్న । వగవరే మఱియెట్టి మగబిడ్డలైన
పరకుపేక్షించి యుండంగఁ దగునె? । అరంగఁ దల్లినై హరుని నేనైన
బెనెదఁగాక! యిట్లుఱ లేక పెనుచు । తరుణియ కాదెట్లు తల్లి దాననుచు
నయంబు బెజ్జమహాదేవి దాన । జననియై పరమేశుఁ దనయుఁ గావించి
కౌఁగిళ్లపైనిడి లింగమూర్తికిని । నంగనగావించు నభ్యంజనంబు
పక్కొత్తుఁజెక్కొత్తు ముక్కున్నఁబులుము
నొక్కొత్తుఁగడు పొత్తునట వీపునివురుఁ
వెసఁగంగవలెనని తరుణి వీడ్వడఁగ । జరణముల్కరములుఁ జాగంగఁదిగుచు
పసులు నలుచు నర్మిలిగట్టిపెట్టి । జలములు వీపునఁ జఱచు నంతంత
నెచి బెగడకుండ వెన్ను వేయుచును । నొగి మస్తకమున నీరొత్తు దోయిటను
వదనంబు సొచ్చునో యుదకంబులనుచు । నదుముఁబొట్టనునోరి కడ్డంబువట్టు
కెన్నగాఁ బసుపార్చి సేయుమజ్జనముఁ । గన్నులుఁ జెవులును గాడంగ నూఁదు
నంగిటిముల్లొత్తు నందంద వ్రేలఁ । దొంగిళ్లఁగార్నీరు దోనెత్తిమిడుచుఁ
బడిచే నీర దూపాడిచి బొట్టిడును । మడఁది యంగుష్ఠంబు మన్నింత మెదిచి
కవనంటిన యట్టి పిడకవిభూతి । యడరఁ బుత్త్రిని నొసలారంగఁ బూయు
నెత్తుఁ గుర్రింగేడునని యెత్తంగ వెఱచి । యత్తన్వి యొమ్మన నక్కున నదుము
కాటుక యిడు నంత కన్నగు ననుచుఁ గాటుకయిడుమాఁడు కన్నులఁగలయఁ
జన్నిచ్చుఁ బత్తులఁ జననీదు మీఁద । నన్నాలి గొందిన చెన్నయుఁ బెట్టుఁ
చెక్కిలి గీటిడుఁ జెలఁగి యొద్వంగ । నొక్క వేలిడిపోయు నొక కొన్ని పాలు
నిగ్గులు వోసియు నవిద సంప్రీతి । నగ్గించు నొగియించు నటబుజ్జగించు
ముద్దాడు నగియించు ముద్దులువేఁడు । నద్దిగొనువారెవ్వరయ్యరో యనుచుఁ
జన్నగా నుదరంబుఁ బాన్పుగాఁజేసి । కున్న జోసఱచుచు సన్నుతిఁబాడుఁ
గొడుకని యిబ్భంగిఁ గొనియాడుచుండఁ । బడఁతి నిశ్చల ముగ్ధభావమ్మునకుమ
హేశుడును మెచ్చి దాఁ జేకొనియుండె
నవిదగావించు బాల్యోపచారములు

గొడగూచి యను బాలిక జనకులు సత్యమును దమ యూరి లింగమూర్తికిఁ గుంచెడు పాలారగింపఁబెట్టు వ్రతమును నెఱపుచుండిరి. ఒకనాఁడు వారు పొరుగూరి కేఁగుచుఁ దమ వ్రతమును నెఱపు విధిని గొమరితకు వప్పగింతురు. ఆమె యా పాలను దేవాలయమునకుఁ గొనిపోయి లింగమూర్తి యెదుటఁ బెట్టును. వానిని స్వామి స్వయముగాఁ ద్రావునని తన ముద్దతనముచేఁ దలపోసి యాతఁ డటు గావింపకుండుటఁ గాంచి యామె బిట్టు వాపోవునట్టి విధము.

"మంచి గంగులపాలు మరగంగఁగాచి । కుంచెఁడు గోరతోఁ గొలిచి చేపట్టి
కోరయుఁ బొత్తిసకొంగునఁ గప్పి । భోరునఁ జని శివాగారంబుఁ జొచ్చి
కోరముందఱఁబెట్టి ధారుణి మ్రొక్కి । యారగింపవె దేవ! యని విన్నవించి
పిలుసని యొక్కింత మఱువున నిలిచి । మఱివచ్చి చూచుడు గఱిగంటిగామి
జాల దల్లడమంది భయమును బొంది । పాలేల యారగింపవు లింగమూర్తి
కాచుట సాలదో కమ్మవల్వమినో పాఁచియో విఱిగెనో పడుచ నేననియొ
పొ్రద్ద్రక్కెనో యొండెఁ బాగయు వల్చెడినొ ।
బుద్ధిపుట్టదొ నెయ్యి వోయకుండితినొ
కడు వేఁడియో నీరు గలిసినవనియొ ? ।
ఎడవాద్యములు లేక యేనె తెచ్చిననొ?
చాలవో యివియాలపాలు గావసియొ? । పాలపైఁజిత్తమేఁ జలపిలిననియొ
యారకేమిటికిఁ బాలొల్లవు ద్రావఁ । గారణం బేమేని గలదేని చెపుమ
నిక్కంపుటాఁకలి నీకులేదేని । గుర్రక్కఁడైననుగొని చిక్కించునాకుఁ
గుడుపున కియ్యెడ గుడగుడలేల । కుడు కేఁడు దెత్తునా గుజ్జునోగిరము
మూలపన్నారుల యాలోవిలోనఁ । బోలెలున్న వివంపు పోయి తెచ్చెదను
ఉట్టిపై బానలో నున్నది నెయ్యి । యిట్టున్నఁ దెచ్చెద నిష్టమే చెపుమ
కుండెఁడున్నది వోయి కొనివత్తుఁ బుల్ల కంచంబువలెనేనిఁ గ్రక్కునఁ జెపుమ
అచ్చనయొల్లి మాయయగారి నగర । జెచ్చెరఁ బిల్వవచ్చెద నారగింపు

మాశివసోదరి మతమునఁ గలదు । పాసెంబుఁదెచ్చెదఁ బాలు మున్ద్రావు
పాపోసండువు నూడఁబోదండు । పోఁడిగా నీపాలు పురహర ! కొనుము.
పరిభవుని జాత్రివేళ నిన్నండి । యేరొప్పఁబనిచెద నీపాలుఁద్రావు
మెడమదు గేమిటికీ పాలలోని । కడుకులు దెచ్చెద నట్టైనఁ జెపుమ
యిత్తటి శిశువుండ నెట్టులంటేని । పొత్తున నైనను నెత్తి త్రావుదము
పిన్న పన్నారులు సిన్ని బొమ్మలును । నిన్నిగూడడుకులు నెన్నేని పండ్లు
నాకల్లి మావారు నలిఁ దెత్తురపుడు । నీకు నిచ్చెదఁ గాని నీయాన త్రావు
పాలను జల్లారెఁ బలుకవు దోడ । నేలయా లింగ! నన్నేఁచెద వనుచుఁ
శాప యీశ్వరునకుఁ బలుమాఱు మ్రొక్కఁ
గోపించు భంగించుఁ గుప్పించు నఱచుఁ
గటకట వాపావుఁ గరములు నిఱుచుఁ । దటతట నేలతోఁ దాకించుఁ గాళ్లు
ధరణిఁబడి బయల్దన్నుచు నేడ్చుఁ । గోరదిక్కనుజూచు మారారిఁజూచు
బుజ్జగించును వెడ్లు బుడ్లును బెట్టు । నిర్జీవి క్రియఁబడు నివ్వెఱఁగందు
నెప్పటియట్లేడ్చు నెలుఁగెత్తి పిలుచు । దొప్పనబడుఁ గోరఁదొలఁగంగ నూకు
నెఱచి ముందఱఁబెట్టు మఱిపలుమాఱు । నెఱఁగుఁ బాదంబుల కెట్లుద్రావమిని
నిట్టైనఁగాని పాలేఁ ద్రావనవు । మట్టవు మార్కొనవట్టె యున్నవియు
నీవారగింపమి మావారు విన్నఁ । జావనద్తురు నన్ను సంశయంబేల
లేనటు నెప్పుడుఁ జావుదప్పదు మగిడి । చన నిచ్చుటనె చత్తు సరివోదుననుచుఁ
దనతల శివునితోఁ దాకించుకొనఁగ । జనునంతలోనన చక్కనఁబట్టి
యా రుద్రుఁ డలిదయా హసితాస్యుఁడగుచు
గోతతోఁ బాలెత్తుకొని యారగింప
నన్నింతయేఁచితి పిన్నగాఁజేసి । మిన్నకపోదు మాయన్నకుఁ జెప్పి
మఱికదాయున్నది మాటలింకేల? । కఱకంఠ! యింతయు మఱవకుమనుచుఁ
గుడుక దెమ్మని పుచ్చుకొనుచు నబ్బాల । వడిగొని యింటికివచ్చి నిత్యమ్ము
నిట్లకొంపోయి తానిచ్చుచునుండ । నట్ల శివుండు పాలారగింపంగ

కవిత యొక చిత్రకళయని యెఱింగి యచ్చునగుద్దినట్లు పాత్రముల రూపవర్ణన మొనర్చి పాఠకుల మనఃఫలకముల

16

వర్తించుటలో నీకవివరుఁడు ప్రకటించు నైపుణ్య మనన్య సామాన్యము. సోమనాథుని యీకవితా విశేషము తిక్కన, నాచన సోమనాథుఁడు, శ్రీనాథుఁడు మున్నగు తరువాతి కవులకు మార్గదర్శక మయినది. శివుఁడు గొల్ల వేసముననుఁ, జండాల రూపముననుఁ భక్తుల దర్శించు నీక్రింది పట్టులఁ దిలకింపుడు.

"ఇటనుండు మీవని యటరేఁగి తాను। గుటిల వేషంబున గొల్లకైతాఁ
బలుపు వ్రేళ్లును మొద్దుపాదముల్ గుజ్జుఁ-చిఱుతొడలును దొప్పచెవులును బరదు
ప్రక్కలు బీరనరములును జిదక।
ముక్కును ముడిబొమల్ మొగి దోనికడుపుఁ
బొక్కిళ్ళు వోయిన చెక్కిళ్ళు వలుఁదఁ
బొక్కి ఱొమ్మును బెద్ద నిక్కిన మెడయుఁ
బల్లమీసములు నెర్పఱు కాయకన్నుఁ। బిల్లిగడ్డంబును నల్లని మేనుఁ
జాఁకువట్టినపండ్లు బిద్దచేతులును। వీఁక కాళ్ళును నడ్డివీపును దనర
ములు గత్తియుచ్చుఁ గోకలుఁ జూఁడుఁ గొడుపు
మొలత్రిత్రివిడి దొడ్డ మొలకచ్చుగట్టి
గాలిదప్పల పెండ్రుకల్ దూలియాడ। నీలవెట్టుచు నుతి మెట్టుఁజూచుచును
గుక్కలఁ బిలుచుచు టిక్కపెట్టుచును
వెక్కన నొరగాల నిలుచుచుఁ జనుచు
గొడ్డలి బరిగమ్మి గూటికుండయును। దుడ్డుఁగోలయుఁబట్టి తోడఁదోడఁగొన్ని
మేఁకపిల్లలఁ దన చాఁకిట నిఱికి। వీఁక దబ్బలువాట్ల విసరి వ్రేయుచును
గొన్ని మేఁకల రొప్పికొనివచ్చి తుమ్మ
నున్నకాయలు రాల్చియును నంతఁ బోక"

(బసవపురాణము ఆ. 3 – సకలేశ్వరమాదిరాజయ్యగారికథ)

"వద్దు మొగంబును వలుఁద చేతులును। బిద్దచిఱుతొడలు బరదు ప్రక్కలును
కాయగాచిన యఱచేయి పెండోళ్ళు। కోయఁదాకిన యసిగోఁత డాచేయి
మట్టి పాదంబులు మలినంపు మేను। మిట్టనుదురు మిక్కి మెడయును బ్రాకు
వట్టిన యరవిరిపండ్లుఁ జొక్కంపుఁ। బొట్టయు పెడగొంకు వోయిన వీపు

కొడికన్నులం ముడిబొమలు వ్రేల్జడలు
కొడ్డముక్కును గుజ్జుఁ దొడలును బరటి
వ్రేళ్ళను గమలిన గోళ్ళులోశంక । కాళ్ళను గందిన కటములు నమరఁ
బలుపారు బూది నొసలినిండ మెత్తి । కలయఁజేతులఁ బెండెకట్లుగాఁబూసి
వలిదొడ్డ రుద్రాక్షములు దొడ్డపటిక । ములు సాలమాని పూసలపేర్లుదాల్చి
క్షబు వెండ్రుకల బెడగొప్పులోపలను । గఱకంత గద్దెనగరు గానుపింప
వలువుగా శివసూత్రమలవడఁగట్టి । మొలనరవణి దూటి తల నరసుట్టి
యూరెయుఁ గత్తియు నట్టలమోపు । వారెనల్ మ్రోకులు వలచేత నొక్క
సెంబలికోలయుఁ జెన్నొందఁ శివుఁడు । వంబిన యంత్యజ భావంబుఁదాల్చి
యచ్చుగాఁ జనుదెంచి యగ్రహారంబు
సొచ్చి యల్లంత భూసురులు రాఁజూచి
చెంగుచ సెంబలి సెంబళి యనుచు । వంగుచుఁ దొలఁగుచు వాడవాడలను
ఘోరన మ్రోకులుగోరె! వారెనలు । గోరెయనుచు వింతకూఁత బెట్టుచును
సమ్మచుఁ జనుచు నంతంత నిల్చుచును । గ్రమ్మర వచ్చిన క్రింతవచ్చుచును
గలయంగ నింటింటఁ బిలిపించికొనుచు
వెలయెంత యనిన వెగ్గలమ చెప్పుచును
గలయంగ నింటింటఁ బిలిపించి కొనుచు
వెలయెంత యనిన వెగ్గళము చెప్పుచును
వెడజట్ట నూపుచు విప్రులయిండ్ల । కెడనెడఁ బలుమాఱు నేఁగుచుఁ జనుచు
గరకంఠు భక్తులఁ గన్నంతదవుల । సరణార్థి సరణార్థి సరణార్థి యనుచుఁ
గరమర్థి వారిచేఁ గాల్గట్టుగొనుచుఁ । బొరిపొరి ప్రాఁతచెప్పులు మదుచుచును
వెనువెంట మునుపొంచికొనివచ్చు విప్రు
లను నెఱింగియు నెఱుంగని యట్లగూడ
నప్పాట నూరెల్ల ముప్పెట్లువెట్టి । చొప్పెరుపడియుండ నూరసానమ్మ
యింటికి నేతేర నింతియుఁగాంచి । పంటింప కదురుగాఁ బఱతెంచి మ్రొక్క

(పండితారాధ్యచరిత్రము - దీక్షాప్రకరణము)

స్వాభావికములగు ప్రకృతివర్ణన లీ కవిప్రవరునకు మంచినీళ్ళప్రాయములు. ఇట్టిపట్టుల నీతఁ డితరాలంకారముల

కంటె స్వభావోక్తినే సంభావించును. కోడికూఁతను వర్ణించుటకై అల్లసాని పెద్దన, రామరాజ భూషణుఁడు, పింగళి సూరన యుత్ప్రేక్షాద్యలంకారముల నాదరించి రచియించిన యీ క్రింది పద్యము లాంధ్రవాఙ్మయమున సుప్రసిద్ధములు.

మ. సకలాశాగతి నర్మకోపవిరతి శ్రాంతకిర్యారంభణా
త్మక వర్గత్రయికిన్ మదుచ్చరిత శబ్దజ్ఞానమే మూల మిం
తకుఁబోలన్ వినుఁడంచుఁ దెల్పుగతిఁ జెంతంగొండపైఁ బల్లలన్
గృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁజ్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్,

(మ ను చ రి త్ర ము)

మ. ఒకనాఁ డింద్రనియంతవేలుపు మదీయోక్తిన్ విడంబించి తా
నొక కాలంబెటిఁగింపలేక మునిశాపోద్వృత్తి పాలయ్యె మా
మక శబ్దంబిది యల్పమే త్రిముని సంభావ్యత్రికాలీవిబో
ధకమన్ రీతిఁ ద్రిభంగిగా మొరసెఁ జెంతం దామ్రచూడౌఘముల్.

(వ సు చ రి త్ర ము)

మ. సమయాభిజ్ఞతఁ గుక్కుటంబు "వివిధం ఛందస్త్రి యామాంతరం
తిమయామో భగవాన్ ఋషిః కుసుమధన్వీదేవతా మానినీ
రమణాయాం వినియోగ" యంచు నదియారంభించెఁ గాఁబోలు నా
నమరెం దధ్వని మాటిసుల్ దమకుఁదామై నాథులంబైకొనన్.

(ప్ర భా వ తీ ప్ర ద్యు మ్న ము)

బుద్ధికెంతయో శ్రమ నావహింపఁజేసి యీ కవివతంసులు రచియించిన పయిపద్యములకంటెఁ దొలిసంజవేళఁ గుక్కుటములు మేల్కొని కొక్కురో కుఱ్ఱని కూయునపుడు మును ముందు వాని యవయవములందుఁ గలుగు వివిధావస్థలను గాత్రవిక్షేపములను జద్మువరుల కన్నులఁ గట్టునట్టు వట్టిబిలిబిలి పలుకులతో సోమనాథుఁడు వెలయించిన స్వాభావిక వర్ణన మెంత మనోహరముగ నున్నదో యరయుఁడు.

"త్రొలికోఁడి కనువిచ్చి నిలిచి మైవెంచి । జలజల రెక్కలు సడలించినీల్గి గ్రక్కునఁ గాలార్చి కంఠంబువిచ్చి । ముక్కునఁనీఁకెలు చక్కొల్పికడుపు నైక్కించి మెడసాచి నిక్కిమిన్నూచి । కొక్కొరోకుర్రని కూయకమున్న

చంద్రోదయ సూర్యాస్తమయాది వర్ణనలో సోమనాథుఁడు.

తక్కిన కవులవలెఁగాక వానిని గేవలము కథాసందర్భములకనుగుణముగ నేళవించు విన్నాణ మెన్నఁదగినది.

"బసవని భక్తి ప్రభాపటలంబు । దెసల వసుంధర దివిదీటు కొనఁగ
దినకరుఁడాత్మీయ తేజంబు దఱుఁగు । దును మదిలజ్జించి చని యపరాబ్ధిఁ
బడియెనో యన్నట్లు భానుండుగ్రుంకెఁ
కెడిమిత్రుఁడరుగ రాజీవముల్ మొగిచె
భేరులుశంఖముల్ భోరనఁజెలఁగె ॥ మారసంహారు నాగారాంతరముల
నలరుచుఁ బంచమహాశబ్దరావ ॥ ములుమోసె భక్తసమూహాలయముల
ఘనధూపధూమసంజనిత మేఘములు ॥ సెనసికప్పినమాడ్కిఁ జీకటుల్ వర్వె
వరముక్తసతి బసవనికి నారతులు ॥ పరువడినెత్తు దీపంబులోయనఁగ
నక్షత్రచయ మంతరిక్షంబునిండి ॥ యక్షీణవరకాంతి యసలార వెలిఁగె"
"మలసంహారుఁడు జటామకుటంబుమీఁద
నిలిపియు నాకందు నెఱిఁబుచ్చలేఁడు
భక్తులపాదసంస్పర్శనంబునను ॥ వ్యక్తిగా నిర్మలత్వంబుఁబొందెదను
అనియాత్మఁదలపోసి యరుదెంచుమాడ్కి
వనజారి ప్రాఙ్ముఖంబున నుదయించె
బసవని సితకీర్తి పర్వెనాశివుని । భసితాంగరాగ ప్రభలు పర్వెనాఁగ
నారుద్రు నట్టహాసాంశులు దనరె ॥ నారజితాచల చారుదీధితులు
విలసిల్లెనా నభోవీథి నెల్లెడల ॥ నెలకొనియచ్చ వెన్నెల వెల్లివిరియ"
(బసవపురాణము ఆ 3)

సర్వజ్ఞతాశక్తి సోమనాథుని కృతులలోఁ బలుతావుల బహుముఖములఁ బ్రస్ఫుటముగఁ గానవచ్చుచుండును. కాని

యపరిచితములు, నాత్మానుభవదూరములు నగు చౌర్యము, ద్యూతము, విటత్వము, రసవాదము, వైద్యము మున్నగు నసాధారణవిషయములు వర్ణించునపుడు గూడ సోమనాథుఁడు ప్రకటించు ప్రతిభఁ బొడగన్న పాఠకు లాశ్చర్య చకితులు గాక మానరు. మచ్చునకీ క్రింది పట్టులఁ జూచునది.

"నిరవద్యహృద్య వినిర్మలభక్తి ॥ పరతంత్రుఁడన లసచ్చరితఁ బెంపారి
కత్తియుఁ బలపంబుఁ గావిచీరయును ॥ గత్తెర యిసుము నక్షతలునుముడ్ల
బంతియు నీలికప్పడమును ద్రిండు ॥ మంత కాటుకయును మతిచండవేది
సెలగోల యొంటంటఁ జెప్పులుబీఁక ॥ యొలుకుల బూడిదయును వాటఁతాలఁ
గుక్కలవాకట్టుఁ గొంకినారసము ॥ గ్రక్కునఁ గంకటి రజ్జువు నమర
నూచీముఖంబైనఁ జోఁపంగరాని ॥ యేచిన చీకటి నిండ్లపంచలకు
జిడిముడి పలుకులఁ జేరియుల్వరసి ॥ గడియ కన్నంబును గపకన్నంబు
గోడకన్నంబును గుటినేలకన్న ॥ మోడకత్రవ్వి యిల్లొయ్యన చొచ్చి
పరికించుచో భక్త భవనంబులైన ॥ సరసర దీపంబు సంధించివారి
పాదాబ్జములమీఁదఁ బడి మేలుకొలిసి; పాదోదకంబు ప్రసాదంబుఁ గొనుచు
శరణనియెడి సత్య శరణులయిండ్ల । వరవుఁడ బ్రహ్మఁ డన్వాఁడ నేననుచు"

(బసవపురాణము ఆ 5 కన్నదబ్రహ్మయ్యకథ)

ఆనందలీలమై నట్లొక్కనాఁడు । దానును సతియు నెత్తంబాడుతటిని
గాంత! ప్రసార లేకాదశేంద్రియము । లంతఛ్ఛతుష్టయం బందొక్కమాఁడు
నారయమోహంబునను నలోకాను । సారులు నెత్తంపు సారులుగాఁగ
జనుపరిపూర్ణ ప్రసాదావధానిఁ దనపదియేను నత్తరళాయతాక్షి
పదియేను నేర్పను బలకపైఁ బెట్టి । పదినిహపరములన్ వాడలయందు
బాపపుణ్యములను పాచికల్ వైవఁ బ్రాపించు ఫలమెన్నఁ బడదాయముగను
భక్తియుఁ నీరైదుఁ బాఱెఁ బొమ్మనుచు । వ్యక్తినానీరైదు వచ్చిననాఁడు
పరము నిహంబనఁ బరఁగు నీదుగను । హరభక్తిప్రబలు నాఁనాఁడు నిద్దుగను
త్రివిధలింగములకుఁ ద్రివిధార్పణంబు । లవునంచు నిత్తిగయను దాయమాడ
వలవదచ్చొకమాటలు నీకుననుచు । నలఘుఁడు దచ్చొకమను దాయమాడు

బంచేంద్రియములకు భవప్రసాదంబుఁ । బంచిపెట్టినమాడ్కిఁ బంచియవెట్టు
దోసకార్లకుఁ జౌకముగఁ బెట్టినట్లు । గాసిలనాఁడుఁ జౌకదుగంబువడిన
ననయంబు నీళరణ్యము వీరభద్ర । యనుచు వీరుఁడు భద్రిమగు దాయమాడు-
నొడలుసత్తా శివయోగుల కనుచుఁ । దడయక యాడు సత్తాయని పడిన
నాకు నాతీవంచనయె గెలుపనుచు । నాకాంక్షఁ దీవంచయును దాయమాడు
ననిత మెచ్చువు వంచవైచిన ననుచు । ననఘుఁడు సౌవంచియను దాయమాఁడు-
నీనెత్తమిట్లాడ నితరులతరమె । పూనియాళ్వారుకృప లేనివారలకు
ననుచు నంతంత భక్తావళి వొగడ । నంచితభక్తి సమగ్రత దనర
వాదిభక్తివిరుద్ధమైన జూదపువి । నోదంబు భక్తివినోదమై పరఁగ
వేడుకనిట్లాడియాడి యాచంద్ర । చూడు భక్తుఁడుదన సుదతివీక్షించి

(పండితారాధ్య చరిత్రము · పురాతన ప్రకరణము
కుమారపాల ఘూర్జరునికథ)

కటకటా! రోఁగోనఁగా నొల్లనంటి । వఁటలేన్నుఁ బోలంగవిటు లున్నవారి
నాయీఁగి పాలకున్నను నొల్లనంటి । వో యేల తలనిల్వవోయనేపసిఁడి
భవనవియొల్లవో – పరమభక్తుండ । వివేకి యనియదే నటువొందిచూడు
రూపులేదనియెదే – రూపించిచూడు । ప్రాపులేదనియెదే – భక్తులబంట
దొరయుఁగాడనియెదే దొరకుబిడ్డండఁ । బురులులేదనియెదే పురుషార్థపరుఁడ
ధూర్తుండు వీఁడని దోఁచెనే యిట్టి । వార్తయేలేదు నావలన నిక్కంబు
లెక్కసెక్కవయని తన్నొల్లవేం । యొక్క ప్రాయముసూడు మొగిసేసనాకు
జనుండుగాఁడని మదినొల్లవేని । మదిరాక్షి చూడు నామాటలయంద
మొకనికివలచి తన్నొల్లవేనియును । సుకుమారి తనుగూడి చూడొక్కమాఱు
నానందగుణములు జాతులిచ్చులును । యోనిదండంబుల న్యూనాధికములు
సమరతిగాక విషమరతిరైన । సమరతిఁగూర్చు నాసన భేదములును
కరణముల్ రతులును గాలవేళలును । జరఁగు మనోగతి భావంబులెఱిఁగి
కాలయావన ప్రౌఢలోలయనంగఁ । దాలలసలవయో ధర్మంబులెఱిఁగి
నెఱయఁ బాదాంగుష్ఠ మణికాలుగుత్తి । నీఱుతొడ గుహ్యంబునభినాభిరోమస్త్ర-
చనుమూఁపు మెడసెక్కు సరిసధరంబు । గనుఱెప్ప ఫాలంబు గచభరంబాదుఁ
గటిక్రింద వ్రేలిడియటక్రిందుఁ జెనుప । నిటద్రిప్పిచేయఁ జేసిరియంగఁబట్టి

మూఁటరేఖలు నూప ముదమున రెంట। నాఁటను గబళింప సలివేణిఁబట్టి
కళలు దాశుక్లపక్షంబున కెక్క । వలపటడిగి మున్ను వామభాగమునఁ
బొడుచు మన్మథరసాంభోనిధిముంచి । మడఁతులఁ దముదార మఱువంగఁజేత
ఇదియెంత పెద్దనాకిందీవరాక్షి । ముదమున నాకు సమ్ముఖమిచ్చిచూడు
మాలింగనాద్యుచితాలాపములను । లోలతనీవల్పు గీలెడలంగ
నున్మీలితాక్షివై యొండేమియుచట । మన్మథరసవార్ధి మునులుగొనంగ
వెండి నిన్నెఱుఁగక యుండంగఁజేయ । కుండితినేని నీకోడినవాఁడ
(పండితారాధ్య చరిత్రము - పురాతన ప్రకరణము - (గురుభక్తాండారికథ)
శుద్ధాత్మ వేమయ్య చూచునా కాంక్ష । నుద్ధతినొకరససిద్ధుఁడే తెంచి
చేయు కాయకమును శివభక్తతతికిఁ। బాయకట్టులు సమర్పణ సేయుటయును
గనియతి విస్మయా క్రాంతాత్ముఁడగుచుఁ । దనరససిద్ధియత్తఱి కంచుమున్న
రసము శోధించిచారణలుగావించి । యసమౌషధంబుల రసతైలములను
దొఅలబాషాణధృతులను మర్దించి । నెఱయమూర్ఛకుఁదెచ్చి మఱిచంపికల్క
ముగసాంగముగఁ బిండములను భావించి । తగువజ్రమూష మందపుఁగాకదీర్చి
యలరుపక్షచ్ఛేద నౌషధావళులఁ । బలుమఱునందు లేపనముగావించి
వరమంత్రమూలికా వ్రాతసారమునఁ
గరమొప్పఁ దదగ్నిసకల్కంబు నొదివి
క్రమమెుంద భాగసంఖ్యనుమిత్రపంచ॥ కము దాని కధరోత్తరముగసంధించి
పొందుగా నందించి మందతీవ్రగ్ను
లొందుపాక మెఱింగియూఁదించి పుచ్చి
సాంగశీతలమైన యాఘుటికకును ॥ భంగిగానట్లు దీపనము పుట్టించి
భువి జంత్రములఁ బుటంబుల నౌషధములఁ
దవులు పాషాణ సత్త్వంబు హేమంబు
గరమొప్ప వజ్రసంఘము గ్రాసమిచ్చి । పరితృప్తిఁ బొందించి పండినయట్టి
చిరమూలికాబద్ధ వరరసఘుటిక । విరచింపఁగ సహస్రవేదిదానసుచు
వినతుఁడై సిద్ధుండు వేమయ్యపాద । వనజాతములపొంత వడినిడి యరుగ
(పండితారాధ్య చరిత్రము-పురాతన ప్రకరణము, చేటల వేమయ్యకథ)

జాతీయతయే తనకవిత కాలంబముగ గ్రహించిన

వాడవుట సోమనాథుని కృతులలో సందర్భోచితములుగ జాతీయములగు చక్కని లోకోక్తులు లెక్కకు మిక్కిలిగ నెక్కొని యున్నవి. ఇవి యాతని కావ్యసౌందర్యమునకు మఱింత వన్నె గూర్చుచుండును. మచ్చునకుఁ గొన్ని యుదాహరించెదను.

"చెల్లెఁ బొమ్మని సన్న్యసింపఁ బోవుచును। నిల్లప్పగించుఁ దానిబ్బంది యట్ల
దపడి నూతిలోఁబడఁ బోయి తాప। వెదకుచు మెట్టెడి వీటఁడియట్లు
కలమగలోవ్వరైయె 'కోఁకలి గొనిరండు।తలఁజుట్టు కొనియెదఁ దానన్నయట్లు'
కసుగాయఁ ద్రెంచినఁ గాయగుఁగాక।పసనిపండగునయ్య భ్రాంతిఁబొఁదినను"

(బసవపురాణము ఆ 3 పుటలు 97-98)

"ఇంటికి నెడతాఁకి చెడిన శేవని భంగిన్" (అనుభవసారము)

(ఉపలబ్ధమయిన యాంధ్ర వాఙ్మయమున నీ సామెత తొలుదొలుత సోమనాథుని పైకృతియందే పొడగట్టుచున్నది.)

"గ్రామోనాస్తి కుతస్సీమా" (అనుభవసారము)

"కాలుగల్గినఁ గదా కడగించుకొనుట।దలఁప నెచ్చటనైనఁ దా నూరులేక
పొలిమేర గల్గునే భువి?"

(పండితారాధ్య చరిత్రము - వాదప్రకరణము)

"నెఱిసెంకురించు మ్రానికి నీరుమాని। నెఱివట్టి కొఱటికి నీరెత్తినట్లు
ప్రాకిన నాగులఁ బట్టి చంపుచును। బ్రతిమ నాగులకును బాలొయ్యనట్లు
వడిగొని భుజియించు వదనముండంగ। గడిసేసి పెడతలఁ గుడుపుచందమున
తొసర ముందర శిరంబుండ మోఁకాలి।కిని నేసవెట్టంగఁ గ్రియగొనినట్లు"

(పండితారాధ్య చరిత్రము-దీక్షా ప్రకరణము)

"అట్టెల! యెద్దీనెననుటయు గొందిఁ। గట్టుదమనువారు గల"రెట్లు సెపుమ

(బసవపురాణము ఆ. 5 పు. 145)

ఎట్టైన నిటువంటి వెద్దీనెననినఁ। గొందిగట్టు మనిన చందముల్ గలవె

(పండితారాధ్య చరిత్రము మహిమ ప్రకరణము)

కన్న మోహంబున కంటె నగ్గలము। ఎన్నఁ బెంచిన మోహ మెందు నటంచు॥
(బసవపురాణము ఆ 3 పు 70)

అంగిటిముల్లు, తంగెటిజున్ను, తొంగిళ్ళపైనిడి, కనుగవ ధూళిఁజల్లు, ఓరంతపొద్దు, నోములగీముల వేములఁగలిపి, పురులువోనాడు, పూసగుచ్చినయట్లు, లోకులకాకలు, వచ్చివందలాడు, మున్నగు జాతీయము లసంఖ్యాకములుగ నెడనెడ నెందుకొని యుండుట వేఱ చెప్పనక్కఱ లేదు.

కవితకందచందములు, తళుకు బెళుకులు తుఱంగలించుటకయి జంట పదములను నామ్రేడితములను బలు తెలుంగులఁ బ్రయోగించుట సోమనాథుని మఱియొక రచనా విశేషము. ఈ క్రింది యుదాహరణముల నారయుఁడు.

శా. "వ్రాలుఁన్ వ్రాలు శివార్చనా పరవశ వ్యాప్తిఁ బ్రమోదంబునన్
గ్రాలుఁన్ గ్రాలు నహర్నిశంబు శివలింగ ధ్యానసంపన్నుఁడై"

చ. వారమిది నిల్పినిల్పి యనయంబును బూజలు సల్పిపల్పి శం
కరు మును జూచిచూచి............

(ఈ యనుభవసార పద్యములఁ బదునేడవ ప్రకరణమునఁ జూడఁదగును)

"మంగళ హర్షోదితాంగ విక్రియల। సంగతి నాత్మ నుప్పొంగి యుప్పొంగి
భయభక్తియుక్తిఁ దద్భక్తాంఘ్రి చయము
పయిఁజక్కఁ జాగిలఁబడి మ్రొక్కి మ్రొక్కి
పటుతర సద్భక్త పాదాబ్జరేణు। పటలపర్యంకంబుపైఁ బొర్లిపొర్లి
హరభక్త నికర దయామృతవృష్టి। పరిగొని కురియ దొప్పఁగఁ దోఁగిదోఁగి॥
(బసవపురాణము ఆ 2 పు 33)

"ఎఱుఁగ మోక్షముల పేరెఱుఁగ వాంఛితము
లెఱుఁగ వేఁడెడు మార్గ మెఱుఁగ నేమియును
ఎఱుఁగుదు నెఱుఁగుదు నెఱుఁగుదు మఱియు
మఱియును మఱియు మమ్మాటికి నిన్న" (బ॥ పు॥ ఆ 3 పు 88)

అంజలి గుంజలి యల్లార్చి పేర్చి । భంజింపుచును వీరభద్రుండు దివిరి
(బ॥ పు॥ ఆ 4 పు 104)

అనియొండు వేసర నాసరఁగన్న ॥ జనని గదాయని చనవునఁబలికి
(బ॥ పు॥ ఆ 3 పు 69)

ఒక్కకొలఁదుగోటని యొకవ్రమానుమటని
యొక్కబడియబటని యొకకట్టెగిట్టె
మందునకైనను మాఱికను పేరు ॥ నెందునలేకుండ నేఁగుడునంత

..........................

తిసుచు మఱికొన్ని దినములు నడవ
బొరిఁబల్లుఁ గుట్టెడు పూరెయుంబుడుక
పడ సటని నలినటని సరి గస్వ్యగటని ॥ జడకియుఁగానక మదివిచారించి
(బ॥ పు॥ ఆ 3 పు 75)

"ఆలింగమూర్తి నెయ్యంబు దియ్యంబు । మూలంబుదాలంబు ముద్దునుందుద్దు
భ్రాంతియుఁ గాంతియు రంగుబెడంగు।క్రాంతి విశ్రాంతి లక్షణము సద్గుణము
ఖ్యాతియు రీతియు బదమును ముదము । బ్రీతియు రీతియుఁ బెంపునుసొంపు
నేపును నోపును నెలమియుఁ గలిమి । ప్రాపును దీపును రూపురేఖయును
మురువును వెరవును మొగియును బిగియుఁ
బురులును నెరులుఁబ్రస్ఫూర్తిఁ దన్మూర్తి
పెన్నును నన్నును జెలువును నలువు । నున్నతి సన్నుతి యొప్పును మెప్పు
అలియును లలియును లాగును బాగుఁ।బొలుపును బలుపుఁబ్రస్ఫూర్తివిస్ఫూర్తి
శీలమై పండిత ప్రభుదృష్టియందఁ । కరువునఁ బోసినగతిఁ బిక్కటిల్ల
(పం॥ చ॥ దీక్షా ప్రకరణము)

అనుప్రాసములలో నంత్యానుప్రాసముపయి సోమనాథునకు మక్కువ మెక్కువ యనియు, నవియైనను బ్రయత్న పూర్వకముగఁగాక యలవోకగాఁ గవితావేశములో వాని యంతట నవి దొరలిదొరలి వెలువడినట్లు కానవయి, యాతని

కవితకు వన్నెగూర్చుచుండుననియు వెనుకనే చెప్పియుంటిని. అందుకయి యొండు రెండు దృష్టాంతములఁ దిలకింపుఁడు.

“ధర నెన్నఁదగు పర్వతంబులలోన । సిరిగిరియును నొక్కగిరియనఁ జనునె
లింగమూర్తులపోవు లీలలతావు । మంగళత్వముసెల్ల మహిమలకెల్ల
పరమార్థముల కాది ప్రమథుల వేది । సురతరువులగుంపు సురభులసొంపు
సింతామణుల పెల్లు సిరిపుట్టినిల్లు । సంతసంబులతీపు సత్యంబురూపు
స్పర్శవేదులరాశి ప్రత్యక్ష కాశి । దర్శనంబులముక్తి ధన్యతశక్తి

(పం॥ చ॥ పర్వత ప్రకరణము)

కప్పడిసంగ! సంగత దయాపాంగ ॥ విగతాభిషంగ నిహితభుజంగ
యగసుతార్ధాంగ భక్తాత్మాబ్జ భృంగి
పరిహృతానంగ శుంభద్గుణోత్తుంగ ॥ సురుచిర గంగాప్రసూనోత్తమాంగ
విమలకీర్తిసురంగ వేదాంతశృంగ ॥ ప్రమథాంతరంగ యభంగ యొలింగ
చూపవే బసవన్న సుకృతావతారుఁ ॥ జూపవే బసవన్న సుజనమందారుఁ
జూపవే బసవన్న సుగుణవిస్తారుఁ ॥ జూపవేబసవన్న సురుచిరాకారుఁ
జూపవేబసవన్న శ్రుతిమతాచారుఁ ॥ జూపవేబసవయ్య సుపథప్రచారుఁ
జూపవే బసవయ్య సూనృతాధారుఁ ॥ జూపవే బసవయ్యఁ బాపాపహారు

(పం। చ। మహిమ ప్రకరణము)

ఆశ్వాసాంతము లందలి కథా శ్రోతృ సంబోధనములలోఁగూడ నీయనుప్రాసావేశ మతివేలముగఁ గానవచ్చును.

ఇట్లు సోమనాథుని కవితావిశేషములు బహుముఖములుగ బలురూపములతో ననంతములయి యలరారు చుండును. వానినెల్ల విస్తరించుట దుస్తరము. కావ్యపఠనమునఁ జదువరులు వానిని స్వానుభవ పూర్వకముగఁ గ్రోలి యాసం దించుటయే పరమ కర్తవ్యము.

## ౧౫. సోమనాథుని ఛందో వ్యాకరణ విశేషములు.
## అసామాన్య ప్రయోగములు

సోమనాథుని కాలము నాటికిఁ బ్రచార మందున్న యాంధ్రచ్ఛందో వ్యాకరణ గ్రంథము లింతవఱకు సరిగా మనకు నిరూపితములు కాలేదు. ఇప్పటి కుపలబ్ధములయిన యాంధ్రచ్ఛందో గ్రంథములలో వేములవాడ భీమకవి కృత మని తలంపఁబడు "కవిజనాశ్రయమే" మొదటిదిగఁ గాన్పిం చును. కాని దీని కర్తృత్వ కాలనిర్ణయములు గూడ సంశయ గ్రస్తములుగనే యున్నవి. క్రీ.శ. 1400 ప్రాంతమున రచియింపఁ బడిన విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణియే కవిజనా శ్రయముకన్న మున్ను వెలసినదని కొందఱు తలంతురు. ఇఁక వ్యాకరణ విషయమున నన్నభయభట్టారకకృతమని యెన్నఁ బడు నాంధ్రశబ్ద చింతామణి విషయము గూడ నింకనువివాద గ్రస్తముగనే యున్నది. ఇది నన్నయ రచియించినది కాదని క్రీ.శ. 1600 ప్రాంతమున నున్న మెలకూచి బాలసరస్వతియే దీనిని నన్నయపేర వెలయించెనని పలువురు పండితుల యభి ప్రాయము యున్నది. ఈ వివాదము లన్నిటితో మన కిచ్చట సంబంధగఁ బ్రసక్తి లేదు. వానిని బరిష్కరింప వలసినయావశ్య కతయు లేదు. "చెప్పుట వేఱు చేయుట వేఱు" అనుసూక్తి యించుమించుగ నన్నివిషయములఁ గూడ వర్తించునదే. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయ కృతమేయని తలంచినను దానినిబట్టి సాధింపరాని ప్రయోగము లెన్నియో యాతని భారతమునఁ గాననగును. అట్లే కవిజనాశ్రయము భీమకవి

రచితమేయని యంగీకరించినను నందుఁ జెప్పినలక్షణములకు సరిపడని ఛందః ప్రయోగములు భీమనపేర వినవచ్చు చాటు పద్యములలోను నాతనివని లక్షణగ్రంథములలో నుదాహరింపఁ బడిన పద్యము లందును గాననగును. లక్షణ గ్రంథములు కొన్ని తమ కాలమునకు వెలువడి ప్రచార మందున్నను బలువురుకవుల ఛందోవ్యాకరణప్రయోగములు కేవలమా లక్షణ గ్రంథములనే గాక వారి దేశ సంప్రదాయమును శిష్టజన వ్యవహారమును గూడ ననుసరించు చుండును. ఇది యొక సనాతన ధర్మమేగాని నూతనము గాదు. "ప్రయోగ శరణం వ్యాకరణ" మ్మనునది ప్రాఁబలుకే గాని క్రొత్తమాట గాదు. మహాకవుల ప్రయోగముల ననుసరించియే వ్యాకర్తలు తమ యనుశాసనముల వెలువరింతురు.

సోమనాథుని మనము లాక్షణిక కవిగనే గ్రహింపఁ దగును. ఇతనిపూర్వజన్మ వృత్తాంతముల వివరించు శ్లోకమును నైతిహ్యములను నుదాహరించి ద్వాపరయుగమున వెలసిన పాణినిముని యీతని యవతారమేయను సంగతి నింతకు ముందుఁ బదిరెండవ ప్రకరణమునఁ జెప్పఁబడియే యున్నది. సోమనాథుఁడు లక్షణ సేతూల్లంఘున మొనర్చినవాఁడు కాఁడనియే నాయభిప్రాయము. బసవపురాణ పీఠికలో ఛందస్స్వతంత్ర్యము ప్రాసవిశేషములు యతి విశేషములు మున్నగు శీర్షికలక్రింద శ్రీ ప్రభాకరశాస్త్రిగారు సోమనాథుఁడు ఛందో విషయములలోఁ బూర్వుల మార్గమును మీఁటి స్వాతంత్ర్య మును బ్రకటించెనని కొంత గ్రంథమును బెంచి వ్రాసిరి.

అందలి యసామంజస్యమును సమదర్శిని పత్రికలో 30-7-32, 1-8-32, 6-8-32 తేదులందుఁ బ్రకటితమయిన "పాలకురికి సోమనాథకవి కావ్యవిశేషములు" అను వ్యాసమున నిరూపించి యుంటిని

ద్విపదలలోఁ బ్రాసయతి గూర్చుట సోమనాథుఁడు ప్రకటించిన ఛందస్స్వాతంత్ర్యములలో ముఖ్యమయినదని కొందఱి యభిప్రాయము. ద్విపదలోఁ బ్రాసయతి గూర్ప రాదను లాక్షణిక శాసనము సోమనాథునకుఁ బూర్వము వెలసినది మన కొక్కటియుఁ గానరాదు. ఉపలబ్ధములయిన ద్విపద కావ్యములలో మన యాంధ్రభాషయందు సోమనాథుని కృతులే ప్రాథమికములు. రంగనాథ రామాయణాదు లన్నియు వాని తరువాత వెలసినవే. నన్నయ భారతములో ద్విపదలు లేకున్నను రెండు ద్విపదలు కలిసి యేకపాదముగా నేర్పడు తరువోజలు మాత్రము క్వాచిత్కముగ నున్నవి. వానిలోఁ బ్రాసయతి ప్రయోగములు కానరానంత మాత్రమున ద్విపద లలోఁ బ్రాసయతి చెల్లదను నియమము నన్నయ కాలము నాటి కుండెనని మనము నొక్కి వక్కాణింపఁ జాలము.

"జాతులు మాత్రానుసంధానగణ వి। నీతులుగాన "యనియతగణై"ర
నియును "బ్రాసోవా" యనియు "యతిర్వా"య
నియుఁ జెప్ప ఛందోవినిహితోక్తిగాన
ప్రాసమైనను యతి పైవడియైన। దేసిగా నిలిపి యాదిప్రాసనియతి
తప్పకుండఁగ ద్విపదలు రచియింతు."

అని పండితారాధ్య చరిత్రావతారికలో సోమనాథుఁడు వృత్తములవలె నియతగణబద్ధములుగాక మాత్రాగణ బద్ధము

లగు జాతులలో వర్గయతియుఁ బ్రాసయతియుఁగూడఁ గూర్ప వచ్చుననుట కాధారముగా "అనియతగణైః" "యతిర్వా" "ప్రాసోవా" అను ప్రాచీన ఛందస్సూత్రముల నుదాహరించియే యున్నాఁడు. ద్విపద జాతులలోఁ జేరినది. సంగీతము నందును, ఇంద్రసూర్యగణములతో నేర్పడు సీసగీతాదికము లగు నుపజాతులందును జెల్లెడి ప్రాసయతి కేవలము గేయముగాఁ బాడుకొనుట కనువగు ద్విపదలోఁ జెల్లనేరదనుట సమంజసముకాదు. అట్టి శాసనము ప్రాచీన లాక్షణిక సమ్మతమనుట కెట్టి యాధారమును లేదు. జనులనోళ్ళలోఁబడి తరతరములనుండి యజరామరమై యనుశ్రుతముగ వచ్చుచున్న యలేఖ్య గేయవాఙ్మయమెంతయో మన భాషలో నున్నది. ఆ గేయము లించుమించుగ ద్విపదకు వికృతు లేయని చెప్పఁదగును. ప్రాచీనలాక్షణికులు వీనిని మధురకవిత లని వ్యవహరించియున్నారు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారుకూడ వీని నట్టి మధురనామముతోనే సంభావించుచున్నారు. రాను రాను నశించిపోకుండఁ జాలవఱకు వానిని సేకరించుటకయి పలువు రిప్పు డుత్సహించుచున్నారు. వివిధ ప్రాంతములవా రిందుకుఁ బూని కృషిసల్పినచో నిట్టి వాఙ్మయము బండ్లకెక్కఁ గలదు. వీని కాలనిర్ణయ మొనర్చుట యేరికిని దరముగాదు. నన్నయకుఁ బూర్వమునుండి వెలసిన గేయములుకూడ వీనిలో నెన్నియో చేరియుండును. ద్విపదలలోఁ బ్రాసయతిని గ్వాచిత్కముగ నైన వాడుట ప్రాచీనార్యసమ్మతమగునా కాదా యని నిరూపించుట కిట్టి ప్రాంతపాటలు మన కుపకరింపఁ గలవు.

వానిలోఁ గొన్నిటియందుఁ బ్రాసయతి ప్రయోగములు నాకుఁగానవచ్చినవి. మచ్చునకుఁ క్రింది వానిని దిలకింపుఁడు.

(కళాపత్రికలో సం 3 సం॥ 1లో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రకటించిన "బాలభాష" యను వ్యాసమున నుదాహృతములయిన పాటల నుండి యుద్ధృతములు)

బువ్వతిందువుగాని కృష్ణమ్మా నీకు ఆవ్వాల్లొ పనియేమి కృష్ణమ్మా
అక్కడ ఉన్నది అమ్మ నేను, మ్రొక్కివత్తును కామాక్షమ్మ

## (రా మా య ణ ము ను గూ ర్చి న పా ట)

జగతిపై రామయ్య జన్మించినాఁడు సత్యమ్ము లోకాన స్థాపించినాఁడు
తల్లిదండ్రుల మాట చెల్లించినాఁడు ఇల్లాలితో పాటు హింసపడ్డాఁడు
సీతామహాదేవి సృష్టిలోపలను మాతల్లి వెలసింది మహనీయురాలు
శ్రీరామ జయరామ సీతాభిరామ కారుణ్య గుణధామ కల్యాణనామ"

(నేదునూరి గంగాధరముగారు సేకరించి "రెడ్డిరాణి" పత్రికలోఁ బ్రకటించిన "పల్లెపదాలు" నుండి యుద్ధృతములు)

1. "అత్తింటి కోడలు ఉత్తమురాలు-
   చేట జొన్నలు పోసి చే నిద్రపోను"
2. "ముసలోఁడు మాతాత పనినిమ్మపండు
   ముసలదాన్ని పెళ్ళాడి మూల కూర్చుండు
   పడుచుదాన్ని పెళ్ళాడి బయట కూర్చుండు"
3. "ఆదివారము నాఁడు ఆ గడియనాఁడు
   ఆఁబోతు జన్మించు ఆవు గర్భాన
   ముందర కాలి తెలుపు మూపురాన నలుపు
   ముందుగా బసవన్న మంద గదిలేఁడు"
4. "చక్కనాన్న గారి ముక్కుపై చెమట
   చేరుచెగి ముత్యాలు చెదరినట్లుండు"

5. "కలికి కన్నులవాఁడు కాముఁడప్పన్న
కలవారి పట్టికి కావలున్నాఁడు
మంచి గందము దెచ్చి పొంచులున్నాఁడు
6. విత్తనాల గంప నెత్తిపై పెట్టుకొని
వీధిలో అబ్బాయి అప్ప యిల్లడుగు
నాలుగిండ్ల నడుమ చిత్తారు సైక
(7) నవ్వులనాలక్ష్మి నాతమ్ముఁడనెను
ఉప్పుడు బియ్యము పప్పువండించి
చుప్పనాతివదినలకు సూడిదపంపు

(శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావుగారు సేకరించిన పాతపాటలనుండి యుద్ధృతములు)

(1) మాఁడంత దీపమ్ము మేఁడలకు వెలుఁగు
మారాజుఅబ్బాయి మాకళ్లవెలుఁగు
(2) నాగబంధపు చెవుల పోగులున్నాయి
నామేనఅల్లుఁడ రారఅబ్బాయి
ఆచెట్లపైనుఁడి అబ్బాయిరాఁగ
బంగారుతలపాగ చెంగులల్లాడె
(3) కోటంతదేవుఁడకి మేటంతపత్రి
బ్రహ్మంత ఆయుస్సు నీకు నాబాబు
(4) చిలుకలు చిలుఁకలు అందురేకాని
చిలుఁకలకు రూపేమి పలుకులేకాని
(5) అత్తపోసినగంజి సత్తువలేదు
(6) చలికి వెఱచినట్లు పులికే నే వెఱవ
అలికి వెఱచినట్లు అమ్మకే వెఱవ
(7) కొడుకుల కననివాళ్ల కడుపేమికడుపు
కులముద్ధరించని కొడుకేమికొడుకు
(8) శ్రీరాముఁడుండంగ మనకేటిభయము
హనుమంతుఁడుండంగ మనకేటిభయమా

వీనిని బట్టి ద్వపదలలోఁ బ్రాసయతినిగూడఁ గ్వాచిత్క-ముగఁ బ్రాచీనులు వాడు చుండిరని మనము తలంపఁ దగును. ఉపజాతులుగా గణింపఁబడి చతుష్పాదనియతిగల సీసము లందును, తేటగీతి, ఆటవెలఁది మున్నగుగీతములందును బ్రాస యతిని లాక్షణికులందఱు నంగీకరించి యున్నారు. అందుకుఁ గారణము వానిలో జాతులందువలెఁ బాదద్వితీయాక్షరము నందుఁ బ్రాసనియమము లేకుండుటయే యని యెన్నఁదగును. అట్టివానికి మాత్రమే పద్యపాదములందుఁ బక్కన యతులతో పాటు ప్రాసయతినిగూడ వాడఁదగుననియుఁ బాదద్వితీయాక్షర ప్రాస నియమముగల జాతులకట్లు పనికిరాదనియు రానురాను గొందఱులాక్షణికులు తలంచియుందురు. అట్టిమతము సోమ నాథుని కాలమునాఁటికే యేర్పడియుండును. జాతులలోఁజతు ష్పాదనియతిగల కందము, ఉత్సాహము, అక్కరలు మున్నగు వానికే యిట్టినియమము విధింపఁదగునుగాని కేవలము ద్విపాద నియతి గల ద్విపదలందును రగడలందును దానిని బాటింప నక్కఱలేదని ప్రాచీనాచారము ననుసరించి సోమనాథుఁడు తలంచియుండును. ద్విపదలందువలె రగడలందుఁగూడ నీతఁడు ప్రాసయతిని బాటించిన విషయము పదునాఱవ ప్రకరణమున నిరూపించియుంటిని. ప్రథమవయస్సున రచించిన సోమనాథ స్తవము మున్నగు చిన్ని ద్విపదలలో సోమనాథుఁడు ప్రాస యతిని గొలఁది కొలఁదిగనే యుపయోగించి తరువాతరచించిన బసవపురాణము పండితారాధ్య చరిత్రము మొదలగు బహుళ ద్విపద కావ్యములందు మాత్రమే దానిని బాహాటముగాఁ

ప్రయోగించినాఁడు. కేవలము చతుష్పాద ప్రాస నియతిగల వృత్తములలోఁ జేరిన లయగ్రాహి, లయహారి, లయవిభాతి, త్రిభంగి మున్నగు కొన్నివృత్తముల విషయమున మాత్రము మరల లాక్షణికు లేకారణముననో ప్రాసయతినే శాసించియున్నారు. ఈవృత్తముల నడకలందు లయయే ప్రాధాన్యము వహించుటచే నందుకుఁ బ్రాసయతియే యనుకూలమగునని వారట్లు చెప్పియుందురు. ఇట్టిసంగతిలోఁ గేవలము గేయకృతులగు ద్విపదలందును రగడలందును బ్రాసయతి నంగీకరించుట దోషము కాఁజాలదు. దానినొక మతభేదముగా మనము గణింపఁదగును. ద్విపాదములతోఁగూర్చిన తరువోజయందుఁ గూడ ననుభవసారమున సోమనాథుఁడు ప్రాసయతిని వాడియున్నాఁడు.

"నవరసాంచితభక్తి నానార్థయుక్తి నలిఁబాల్కురికిసోమనాథుండు సెప్పె
శివభక్తవరులుమించిన వేడ్కఁ బొగడఁబ్రవిమలంబవు ననుభవసారమనఁగ"

రంగనాథుఁడు, గోరన తమద్విపదకావ్యములలోఁ బ్రాసయతిని వాడలేదని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినది సరికాదు. రంగనాథ రామాయణమునఁ బ్రాసయతిప్రయోగములు క్వాచిత్కముగఁ గానవచ్చుచున్నవి. ఈక్రింది దృష్టాంతములఁజూడుఁడు. వీనికిఁ బాఠాంతరములను జూపి శ్రీ శాస్త్రిగారు, వారి యనుయాయులు నివి రంగనాథుని పాఠములు కావని నిరూపింపనెంతురు. భిన్నభిన్న తాళపత్ర ప్రతులలో భిన్న భిన్న పాఠములు గానవచ్చునపుడు వానిలోనేవి కవిసమ్మతములో నిరూపించుటయెట్లు? సోమనాథునివలెనే రంగ

నాథుఁడు (ఈతఁడు సోమనాథుని శిష్యుఁడు చక్రపాణి రంగ నాథుఁడే కాఁదగునని నామతము నిదివఱకే ప్రకటించి యుంటిని) కూడ ద్విపదలలోఁ బ్రాసయతిని గూర్చుట ప్రాచీనార్య సమ్మతమేయని తలంచియందు కనుగుణముగాఁ గ్వాచిత్కముగ దాని నెడనెడఁ బ్రయోగించెనని యంగీకరించుటయే సమంజసమని నాతలంపు.

రంగనాథ రామాయణము (వావిళ్లవారి 1927 సంవత్సర ముద్రణము)
ఎనసిగోహత్య చేసినవానిగతికి (పుట 131)
శరణార్థిఁ బోవని దురితాత్ముగతికి (పుట 131)
రసరసాన్నములను మెసవెడు వాఁడు (పుట 137)
నిలువగాకుండని చ్చలునొసంగుదువె (పుట 138)
అనిలసపెండ్లివా ర్తనునంతఁదాను (పుట 146)

గౌరన హరిశ్చంద్రోపాఖ్యానమునఁ గానరాకున్నను సంతకు మున్నాతఁడు రచియించిన నవనాథ చరిత్రమునందుఁ బ్రాసయతిప్రయోగములు కొన్ని క్వాచిత్కముగఁ గానఁగును.

పొలుచుజవ్వాదిలప్పలు సోఁడుముట్ట
విరుల రేఖలును జుం జురువెంద్రుకలును (పుట 36)
చిన్నెలువాఁడుఁ దీర్చినపట్టుకాసె
సన్నపుకటిమీఁదఁ జెన్నొందువాని (పుట 42)
జనకజఁ జెఱగొన్న చెనఁటిరాక్షసుని (పుట 200)

"శ్రీమందిరాకారు జితదైత్యధీరుఁ గీర్తించుచోఁ బుణ్యవర్తనుండనుచు యతిమాఱుప్రాసమట్లచ్చోటనిడక" అని యనంతుఁడును, "యతులలోపలఁ బ్రాసయతిదక్క సకల యతులుచెల్లును బ్రయోగానుసారమున" అని తాళ్లపాక చిన్నన్న మున్నగు వారు చెప్పిన యర్వాచీన లక్షణములు వారి కాలము

నాఁటి కేర్పడిన మతము ననుసరించినవేగాని యవి ప్రాచీనా చారము ననుసరించినవిగావు. "ద్విపదతో ద్విపద సంధిలనేక శబ్ద మపుడు ప్రయోగింప నదియయుక్తంబు" అని తాళ్లపాక చిన్నన్న చెప్పిన లక్షణమును రంగనాథాదులు పాటించిరనియు సోమనాథుఁడు గూడ బసవ పురాణమున నీలక్షణాను గుణము గనే చాలవఱకు ద్విపదలను గూర్చి యున్నను పండితారాధ్య చరిత్రమున నా నిర్ణయమును బాటింపలేదని శ్రీప్రభాకర శాస్త్రిగారీ క్రింది యుదాహరణములఁ జూపియున్నారు.

"జాతులు మాత్రాను సంధానగణని నీతులు గాన" యనియతిగఙ్ఞౌర నియును బ్రాసోవాయనియు యతిర్వాయనియుఁ జెప్పఁ ఛందో విహి తోక్తిగాన"

"అతిశయప్రీతి బ్రహ్మాండపురాణ మతమహో మోహాస్య మాహాత్మ్య" మన మొదలఁ ద్రిపుండ్రం మోక్షదం త్యక్త "మన విరలమే తదన్యత్రి రమతే యనఁగనుచిత సూక్తియట్ల వాసిష్ఠ లైంగంబు"

ద్విపద రచన విషయమునఁ జిన్నన్నగారు చెప్పిన పయి లక్షణము శాసనమనఁ జెల్లదు. తత్పూర్వులట్టి లక్షణమును జెప్పియున్నట్లు కానరాదు. ఒక్క ద్విపదయే యననేల! ఏపద్య మందయినను నేపాదమున కాపాదము విడివడిపాదాంత శబ్ద మందలి కొంత భాగము ముందటి పాదముతో సంధిల్లకుండ సాధ్యమయి నంతవఱకు రచించుట శ్రవణసుభగతకు శైలీ రమ్యతకుఁ దోడ్పడఁగలదు. కానియట్టి నియమమును గొంత వఱకు మాత్రమే పాటించుట కనువగును గాని మహాకావ్య రచనమున గ్రంథ మామూలాగ్రమట్లు రచించుట యేరికిని బొసఁగనేరదు. సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున

శ్రుతిస్మృత్యాది ప్రమాణములను బుంఖానుపుంఖములుగ ద్విపదలలోఁ జొనిపియున్నాఁడు. అట్టియెడనవి యాద్విపద పంక్తులయందు ఛందో నిబద్ధములవుటకయి వానిముందు వెను కలఁగొన్ని యెడల జిల్లిపదములఁ గూడ నాతఁడు సంధింపవలసి వచ్చినది. అట్టి యెడలనే కొన్ని తావుల నేకశబ్దమందలి యక్ష రములు గూడ నిరుపాదము లందును సంధిల్లుట జరగినది.

"సంధి పూర్వాపర సంఘటనముల బంధురఛందో నిబద్ధముల్గాఁగ వేదసూక్తములకు వెరవైనమాట లాదటఁగల్పిం చునవి జల్లియనక వలనె ఱింగియు వేదవాక్యంబు ద్విపదకొలఁ దిన పలుకుటకును మతిమెచ్చుఁ" డనియాతఁడే గ్రంథావతారిక యందుఁజెప్పి యున్నాఁడు కావున సోమనాథుఁ డెడనెడ నొన ర్చిన యీ విధానముగూడ లక్షణవిరుద్ధ మనరాదు.

"మూఁకకునెగయుచు ముస్సుముస్సనుచు"

అనుసోమనాథుని బసవ పురాణప్రయోగమును బురస్కరించు కొని శ్రీప్రభాకరశాస్త్రిగారు బసవపురాణ పీఠికలో ముకార యతి మువిభక్తి యతులఁగూర్చి కొంత చర్చగావించిరి. పైపా దమునందలి"ముస్సు"అను ధ్వనివాచకము నేటి వ్యవహారమున "బుస్సు" అను రూపముతో నున్నదనియు సోమనాథా దిపూర్వకవులు ప్రథమావిభక్తి ప్రత్యయముగాని ముకారము ను ఉత్వవిశిష్టములగు పఫ బభలతో యతిని గూర్పలేదనియు, ప్రథమావిభక్తి ప్రత్యయ ముకారమునకుఁ బ్రాచీనకాలమున 'బు' 'బు' 'మ్బు' అనురూపము లుండుటచే నట్టి విభక్తి ప్రత్య య ముకారముతో మాత్రమే ప్రాచీన కవులు, ము విభక్తి

యతి యను పేరితో ఉత్వముతోఁగూడిన పఫ బభ లతో యతిని గూర్చిరనియు రానురాను దర్వాతికవులందుకు విలక్షణముగఁ గేవల ముకారయతిని గూడఁదమ కృతులలో నుపయోగించిరనియు శ్రీశాస్త్రిగారి యభిప్రాయము. కాని యది కేవల మట్లేయని నే నంగీకరింపఁ జాలను. ఇందుఁగూర్చి సమదర్శిని పత్రిక (ది 30-7-32, 8-8-32) లోఁ బ్రకటితమయిన "పాలకురికి సోమనాథకవి కావ్యవిశేషములు" అను వ్యాసమునఁ జర్చించియున్నాను.

అప్పకవి ముకారయతికి లక్షణమొసంగుచు

క॥ హెచ్చరికను పుఫుబుభులకును నచ్చుపుమాకొమ్ములే మహాకవులార్య
మెచ్చులఁగనిలిపిరచ్చట నచ్చటను ము కారయతులటంచునుగృతులన్

అని పూర్వమహాకవులీ యతిని దమకృతులలోఁ గ్వాచిత్కముగ వాడినట్లు చెప్పినాఁడు. ఆనందరంగరాట్ఛందములో గస్తూరిరంగకవి దీనినే చక్కటి యతియని పేర్కొని నన్నయభట్టు లక్షణసారములోనిపని యీక్రింది లక్షణము నొసంగినాఁడు.

"పుఫు బుభులకు ముకారంబుపూర్వమునను
గాని పైఁగానిచెప్పఁ జక్కటియతియగు
మాప్పఁగొని కృష్ణుఁడురమునఁ బొడిచెననఁగ
బుధులవినుతులఁ దగెవ్యాసమునియనంగ."

ఈముకారయతికి లక్ష్యములనఁదగిన ప్రయోగములు సోమనాథుని కృతులలోఁగూడ నెడనెడఁ గానవచ్చుచున్నవి. కొన్ని యుదాహరణములు చూడుఁడు.

॥అందెలు గంటలు నలవడఁగూర్చి పొందు గాఁజనిడికొమ్ములుగొరిజయలు
వెట్టిఫాలంబునఁ బట్టంబు వెలయఁ గట్టినందికిన లంకారంబు సేసి
(బసవ పురాణము పుట 14)
ప్రవిమలభక్తి విభ్రాజితలీల భువినరువాద్దడి మువ్వురిలోన (పుట 48)
పురహరార్చితునకము న్నెత్తుకేలఁధర నెత్తఁగూడు నేత్రాటినూలలకు(పుట237)

నన్నిచోడ ప్రముఖ ప్రాచీన కవుల కృతులలోఁగూడ
నిది క్వాచిత్కముగఁ గాననగును-

సీ॥ ఆలమట సెడియుండె నిలువదు చిత్తంబు మూర్ఛిల్లి పెడఁబాసిపోవదొండె
(నన్నిచోడుని కుమార సంభవము ఆ 5 ప 580)

చ॥ సంధ్యలు దివసత్రియామలును దత్పురిపౌర జనంబెలుంగుఁద
మ్ములము చవిఁ విహంగగతిఁ బువ్వులతావి రతి ప్రసంగలీఁ.
(డిటో ఆ 6 ప 942)

సీ॥ మొవిలత్తుకఁబూయఁ బోవుచు లాలాట పట్టికఁదిలకంబుఁ బెట్టుకొనుచు
(డిటో ఆ 8 ప 16)

పొందుగామిమ్ము నిమ్ములఁగొల్వవలయు(రంగనాథరామాయణముపుట106)

మ॥ ననుమున్నీవు సెలుంగు దారయఁగ నా నాగాస్త్ర పాశంబులే
పునబంధించిన యద్దియుఁ మఱచితే మోహంబునుం గల్గెనే.
(భాస్కరరామాయణము యుద్ధకాండము ప 1342)

గీ॥రాజన్మనో మోదంబారఁగనట్లుచేయఁదలఁపుఁ భూతేశ్వరుండల్కతోఁ
(నాచనసోమన: ఉత్తరహరివంశము ఆ 6 ప 222)

క॥ తనమొదలు రెండు సేతులు
మును పొందిన యొప్పుతోడఁ బురుడించెడు స
జ్జనసుత శోభను వెలుగఁగ.
(ననూనవరమిాశువలన ననురుఁడుపొందెఁ) (ఆ 7 వ 235)

వీనిలోఁ గేవలము ఉత్వవిశిష్టములేగాక ఉకారముతో మైత్రి
గల ఒకార ఓకారములతోఁ గూడినవి గూడ ముకారయతికే
లక్ష్యములు కాఁదగును.

అసాధారణములగు యతివిశేషములు సోమనాథుని కృతులలోఁ గొన్నియున్నవి. వానిని శ్రీ ప్రభాకర శాస్త్రిగారు బసవపురాణపీఠికలోఁగాని శ్రీ చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్య చరిత్ర పీఠికలోఁగాని పేర్కొనలేదు.

(1) వరనిజధారా ప్రవాహఝుత్కార : విరచితధ్వానంబు విన్నయంతటన
భూరిపాతక కోట్లఁ బొలియించురుద్ర ! ధారాంబువులఁ గృతస్నా
నులై పరుస యామహేశ్వరదేవు నర్థిభజింప
(పం॥చ॥ పర్వతప్రకరణము పుట 207-298)

(2) ఒత్తిలి చదువుచు నుబ్బుచుఁ జనుచు । న త్తతి భట్లుకైవారంబుసేయ
(పం॥ చ॥ వాదప్రకరణము)

(3) దంభమయాన్యదర్శనవిడంబనుఁడష్టమదాపహారియా
శుంభదుదాత్తకీర్తియగు షోడ్డలదేవరబాచిరాజువి
స్రంభసఖుండ వీవని ప్రశంసయొనర్తుఁ జరిత్రపూత ! వి
శ్వంభర ! శంభుమూర్తి ! బసవా ! బసవా ! బసవా! వృషాధిపా !
(వృ॥ శ॥ ప 84)

(4) వసుమతిఁ బేరుకొన్న నరు వత్తురుమువ్వురి కూర్మిబంట షో
డసులసుతుండ తే రసుల దక్కనభృత్యుఁడ వీరలాదిగా
నెసఁగు మహానుభావులకు నెల్ల ననర్గళమైన భక్తునన్
వసిగొని ప్రోవుమయ్య బసవా ! బసవా ! బసవా! వృషాధిపా !
(వృ॥ శ॥ ప 103)

(5) అనయము భక్తులీడ్యకులులంచును వేదములా ద్విజోత్తముల్
విననుతియింపఁగుక్కఁ జదివించిన హావినహాళ్కి కల్లిదే
వునకుననుంగువాఁడవని యుత్సుకతన్ నుతియింతు భక్తహృ
ద్వనజవిహారలోల! బసవా! బసవా! వృషాధిపా?
(వృ॥ శ॥ ప 98)

(6) రురువర్ణదేహంబు ఋగ్వేదమునకు (పం॥ చ॥ వాదప్రకరణము)

స్నానశబ్దము వైదికోచ్చారణము నందు తకార సంయుక్తమై స్త్నాన మని వ్యవహరింపఁ బడును. దాని ననుస రించియే సోమనాథుఁడు పై రీతిగ సంయుక్తాక్షరయతికి లక్ష్యముగా స్త్నాన శబ్దమందలి ప్రథమాక్షరమునకు తవర్గా క్షరముతో యతినిగూర్చినాఁడు. సోమనాథుని పదము నాధారముగాఁ గొనియే శ్రీనాథుఁడు గూడ హరవిలాసమున

„ధీనిధిసెట్టి నంబితన దేహరమింటి విభూతి మంగళ
స్త్నానముసేసి ధౌత పరి ధానముగట్టి

అని ప్రయోగించినాఁడు. శ్రీనాథుని ప్రయోగమునకు సోమనాథుని ప్రయోగమే యాదర్శకమని గుర్తింపక కొందఱు

"స్నానముచేసి ధౌతవసనంబును గట్టి" అనికవి పాఠమును మార్చు సాహసమునకుఁ బూనుకొనిరి. మఱి కొందఱు లౌకికోచ్చారణము ననుసరించి "స్త్నాన" శబ్దమును "స్నాన" మని గ్రైకొన్నను తెనుఁగులో దానికి "తాన" మనుతద్భవ రూపమున్నది గాన వైదికోచ్చారణ ప్రశంసతో నిమిత్తము లేకుండఁగనే "స్నానముచేసి ధౌతపరిధానముగట్టి" యను శ్రీనాథ ప్రయోగ మందలియతిని తద్భవవ్యాజయతిగా గణింపఁ దగునని సమర్థించిరి. ఈ మార్పులు సమర్థనములు కేవల మనవసరములు. తానమను తద్భవ రూపము "స్త్నాన" మను వైదిక రూపమును బట్టి యేర్పడినదే కాని "స్నాన" మను లౌకికరూపము ననుసరించినది కాదు. సోమనాథ శ్రీనాథు లిరువురు గూడ వైదికవాఙ్మయపారంగతులు కావున "స్త్నాన" శబ్దమును తకార సంయుక్తముగా గ్రహించి

పూర్వోక్త ప్రయోగములను సంయుక్తాక్షరయతికి లక్ష్యములుగానే కూర్చియుందు రనుట సత్యసమ్మతముగా నుండును. నేటికిని వాడుకలో నీ శబ్దమును గొందఱు ఛాందసులు నకారోచ్చారణ లోపముతో "స్తాన" మని జానపదులు కొందఱు తకార నకార సకారోచ్చారణ లోపములతో సానము తానమనియుఁ బలుకుట గలదు.

క॥ మానవనాథుఁడు గంగా
స్నానానంతరమ సకల దానములు మహా
దీనులగు విప్రకోటికి
సేనాదయతోడనిచ్చి శివుసేవించెన్.

అని భీమన నృసింహపురాణమునను "తావకనగ జల స్నాత పాపహారాయ" అని గణపవరపు వేంకటకవి ప్రబంధ రాజవిజయ వేంకటేశ్వర విలాసమునను గూడ నిట్టి యతి ప్రయుక్తమయి యున్నది. ప్రౌఢకవి మల్లన ఏకాదశీ మాహాత్మ్యమునఁ గూడ నీ యతినివాడి యున్నాఁడు

కైవార శబ్దము సంస్కృతమని కొందఱు దేశ్యమని కొందఱు తలంచు చున్నారు. "ఏమెల్లనుం గలిభూపాలుని యొద్దఁ జారకుల మీఁ కైవారదుర్భాషణం బులకుంగాని యతండు మెచ్చఁడు (శృం॥నై॥ ఆ 7 ప 89) అని శ్రీనాథుఁడు దీనిని సంస్కృత సమాసమునందే ప్రయోగించినాడు. తెనాలి రామకృష్ణకవి మున్నగువారు "కయివారము" అనురూపముతో దీనిని దమ కృతులలో దేశ్యపదముగా వాడియున్నారు. కైవారమను రూపమే కొన్ని కర్ణాట భాషాకృతులలో

దేశ్యముగా వాడఁబడినది. శబ్దమణి దర్పణమునఁ గేశిరాజు కన్నడ దేశ్యపదములలోఁ బదమధ్య వత్వమునకు ఔత్వము చు యత్వమునకు ఐత్వమును వికల్పముగ నగునని చెప్పినాఁడు.

కII పదమధ్య వత్వయుత్వ
కొఁదవుగు మౌత్వైత్వవిధి యదంత కొఁత్వం
పుది దిర్ఘంహ్రిస్వ తెయిం
విదిత వికల్పంతగుళ్గు మీ మాఱఱూళం.

దీని ననుసరించి "కెయ్యారం" అను దేశ్యరూపము వైకల్పికముగా "కైవార" మగును. "అత్తఱిభట్లుకై వారంబు సేయ" అనుచోట సోమనాథుఁడు కైవారశబ్దమును సాంస్కృతికముగా గ్రహించి దానిని నిత్యసమాసముగా గణించి యందలి ద్వితీయాక్షరముతో స్వరవ్యంజనములు రెంటికిఁ గూడ యతిని గూర్పనగునని ఉభయ వళికిలక్ష్యముగానట్లు ప్రయోగించి యుండుననియు లేదా "అత్తఱిభట్లు కెయ్యారంబు సేయ" అని దేశ్య రూపమునే యాతఁడు ప్రయోగించి యుండుననియు నేఁదలంచు చున్నాను.

(3,4) ఆంధ్ర గ్రంథమాలయందు శ్రీ నాగేశ్వరరావు గారు ప్రకటించిన వృషాధిపశతకములో 84 పద్యమున "దంభమయాన్య దర్శనవి డంబనుఁ" డనుచోట దంభ యను టకుమాఱుగా "డంభ" యని ముద్రించినారు.

శ్రీ డంభడిండీర డోలికా డాడిమాది
శబ్దముల కాదివర్ణముల్ సంస్కృతమున
నుపరివర్గ తృతీయమై యొప్పునట్లు
దెనుఁగున డకారము దవర్గ మొప్పుచుండు.

అని యప్పకవి చెప్పినాఁడు. కావున డంభ దంభ రూపములలోనేది కవి ప్రయుక్తమన్నను ఈ పద్యమునను 10వ పద్యమునను సోమనాథుఁడు దడలకు యతిమైత్రిలాక్షణిక సమ్మతమను నభిప్రాయముతోడనే తానుగూడఁ గూర్చి యుండునని నేఁదలంచుచున్నాను. భీమన కవిజనాశ్రయమునందు

క॥ దడలకు భేదము లెంచక
వడియును బ్రాసంబు నిలుపవచ్చును గృతులం
దదియెట్లన్నను శ్రీహరి
దొడిబడి దానవులఁ జంప ధులియాయెననన్.

అని దడలకు యతి ప్రాసములు రెండును గూడఁ జెల్లునని చెప్పియున్నాఁడు. కాని యప్పకవి యీ మతమును బూర్తిగా నంగీకరింపక

ఆ॥ వికట కవులుకొన్ని వింతలు గల్పించి కవిజనాశ్రయమునఁ గలిపినారు
వాని గైకొనంగ వలద ప్రయుక్తంబు లేలసెప్ప భీమఁడెటిఁగియెటిఁగి.

అనివ్రాసి దడలయతిమైత్రి విషయమున భీమన చెప్పిన పయిపద్యమునుగూర్చి "అగ్రాహ్య సంబంధవళులు" అనుశీర్షిక క్రింద "ఈ చెప్పిన దడలకుంబదాది నున్న చతుర్థవర్గ సరళమాదేశమై వచ్చునప్పుడాదేశయతిగాఁ జెప్పవచ్చు నదియుంగాక యారెంటికిని దాపలించి నెఱసున్న లున్నప్పుడనుస్వార సంబంధయతులు గనుక నటువలెను జెప్పవచ్చునవి గలుగఁ జెప్పలేదు గాన నిది సమ్మతి గాదు" అని చెప్పియున్నాఁడు. బిందు పూర్వకములయిన 'ద డ'లకును డకు ఆదేశముగావచ్చు 'ద'కును మాత్రమే యతి చెల్లును గాని తక్కిన వేళలందు

వానికి యతిమైత్రి పొసఁగనేరదని యప్పకవి యభిప్రాయము 'డక్కు' అను రూపమునకు 'దక్కు' అని యాదేశరూపము కూడ నుండుటచే సోమనాథుని పూర్వోక్త పద్యములలో 102 పద్యములో ద్వితీయ పాదమందలి యతిని అప్పకవి చెప్పిన ఆదేశయతి క్రింద గణింపవచ్చును గాని 84 పద్య ప్రథమ పాదమునందలి యతినట్లు సమర్థింప వీలులేదు. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలోఁ గూడ నిట్టి యతిని కూర్చియున్నాఁడు. కావున అప్పకవి పరిశోధనము సరియైనదని నిశ్చయింపఁజాలము. దడలకుఁ బ్రాసమైత్రి మాటయెట్లున్నను యతిమైత్రి మాత్రము ప్రాచీనకవి సమ్మతమేయని సోమనాథాదుల ప్రయోగములనుబట్టి మనము గ్రహింపఁదగును. కస్తూరి రంగకవి యానంద రంగరాట్ఛందమున ఆభేద యతి క్రింద దకార డకారములకు యతిమాత్రము చెల్లునని వ్రాసి యీ క్రింది లక్ష్యముల నొసంగినాఁడు.

సీ॥ రంగనరపాల! విష్ణుకళావిలాస!
దీనజన పారిజాత! పాటించినిన్ను
డాయు వారికి లేమి లేదారఁగలుగు
సకల సామ్రాజ్య గరిమ పొసంగుఁగాక.

ఉ॥ గొబ్బున నానతిమ్ము రఘుకుంజర నీకరుణా సముద్ధతిఁ
డెబ్బదిరెండు వెల్లువల దేవర లక్ష్మణులంకఁ జేర్తునో

(భాస్కర రామాయణము)

క॥ దాచే యంకతలంబు జేర్చివలచేతఁ మాలికఁ దాల్చి

(కేతన కాందబరి)

శా॥ డిండీరోత్తర వీచులం దరసియుద్రేకించి కూలంకషల్.

(జైమిని భారతము)

చ॥ ఇలఁ గలవస్తుసంతతుల నెల్లను గెల్చెడు మత్స్యజాతపా
టలరుచి యింక వేఱె యొకదారికివచ్చునె.

(ఆముక్తమాల్యద)

(వీనిలో నొక్క దకార డకారములకేగాక టకార డకారములకు తకార డకారములకుఁగూడ యతిమైత్రి గల్పించిన ప్రయోగములు గాననగును.)

(5) వృషాధిప శతకమందలి 98 పద్యమున మూఁడవ పాదమున జూపిన

"కల్లిదేవునకు ననుంగువాఁడ వనియుత్సుకతన్"

అనుయతి సోమనాథునకు సమ్మతమై యతఁడు కూర్చినదయియుండదని నాతలంపు. ఇటసరియైన కవిపాఠము మఱుఁగుపడి యపపాఠము నెలకొని యుండును: "ప్రోత్సుకతన్" అని ప్రాదియతిని సోమనాథు డిచ్చట వాడియుండును. సోమనాథుని మతములో ప్రథమావిభక్తి ప్రత్యయములమీఁదను క్రియా పదములపైని, సంఖ్యావాచక పదములమీఁదను, సాంస్కృతిక పదములలోఁ గూడఁ బరుషములకు గసడదవాదేశము చెల్లునుగావునఁ బయిపద్యమున "కల్లిదేవునకు ననుంగువాఁడవని ప్రోత్సుకతన్" అని యాతఁడు రచించియుండునేమో! లేదా యానాఁడా ప్రాంతమున శిష్టవ్యవహారములో "వృత్సుకత" అను వాడుకయున్నచో నట్టి రూపమునయిన నాతఁడు గ్రహించియుండును.

(6) ఋవర్ణము నుచ్చారణ సామ్యమును బట్టి కొన్ని యెడలఁ బూర్వకవులు కొందఱు రుకారసమముగా గణించి యందు కనఁగుణముగానే దానికి యతిని గూర్చినట్లు కనఁబడు చున్నది. ఋషి శబ్దమున కేర్పడిన "రుసి" యను వైకృత రూపముకూడ దీనిని బలపఱచును.

"రురువర్ణ దేహంబు ఋగ్వేదమునకు" అనుచోట ఋగ్వేదమనుటకు మాఱు "రుగ్వేదమునకు" అనియే సోమనాథుఁడు ప్రయోగించి యుండవచ్చును. పాలకురికి సోమేశ్వర స్వామి శివరాత్రి మహోత్సవమున యాత్రికులుపాడు "పాల కుర్తినిలయా సోమయలింగా పాదములకు శరణు ఉరవుగ బమ్మెరపోతరాజుకు మీరు కోరిన వరములు క్రుపచేసినారఁట" అను పాటలోనిట్టి యతియే వాడఁబడి యున్నది. గౌరన నవ నాథ చరిత్రములో

"జడికొన్న భావజుసాయక నిహతిఁ దొడరిదొప్పగఁ దోగి ధ్రుతిఁదుప్పఁ దూలి" అనుచోటఁ గూడ నీయతిగాన నగును. మఱికొన్ని కృతులలోఁగూడ నెడ నెడ నిట్టియతులు ప్రయుక్తములయి యున్నవి.

## ప్రాస విశేషములు

పయి శీర్షికక్రింద శ్రీ ప్రభాకరశాస్త్రిగారు బసవ పురాణ పీఠికలో సోమనాథాది శివకవులు కర్ణాట భాషా లాక్షణిక మతము ననుసరించి తమ కృతులందు శాంతప్రాసము (పద్య ప్రథమ చరణ ద్వితీయాక్షరము సంయుక్తాక్షర మయి నప్పుడు దానిలోనున్న యన్నియక్షరములను బాటింపక

తక్కిన పాదములందుఁ గతిపయహల్ సామ్యముతో మాత్రమే ప్రాసమునుగూర్చుట) వర్గప్రాసము (కవర్గాదికాక్షరము లన్నిటికిబరస్పరముప్రాసమునుగూర్చుట) సమీపప్రాసము (శషసలకుఁ బరస్పరము ప్రాసము గూర్చుట) లను గూర్చి రనియు వానితోపాటు నన్నిచోడ సోమనాథాదులు సంపూర్ణార్థబిందుప్రాసమునుగూడ నంగీకరించిరనియు వ్రాసి యున్నారు. శాస్త్రిగారి యీ నిర్ణయమును గూడఁ బూర్ణముగ సత్యేయని యంగీకరింపరాదని నాయభిప్రాయము. ఈవిషయమునఁ గర్ణాట భాషా మర్యాదనే పూర్తిగ ననుసరింపక యాంధ్రకర్ణాట లాక్షణికు లిరువురకు సమ్మతములయిన ప్రాసములను మాత్రమే సోమనాథుఁడు మన్నించి తన కృతులం దాంధ్ర భాషా మర్యాదనే పాటించెనని నేఁదలఁచుచున్నాను. ఆతని బసవపురాణ పండితారాధ్య చరిత్రలం దేవుటలఁ దిలకించినను నన్నయాదుల ప్రాససాంప్రదాయమునే పాటింపనెంచి ప్రాసాక్షరములకొఱకాతఁడు ఊఁతపదములను విశృత్యాది రూపములను బలుతావులఁ బ్రయోగించినట్లు కానఁగును. కర్ణాటకవులవర్గ ప్రాసాదిక సంప్రదాయములఁబూర్ణముగ నంగీకరించుచో నింతశ్రద్ధ నాతఁడు ప్రాసవిషయమునఁ బ్రదర్శించు నవసరముండ నేరదు. మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారమునఁ గానవచ్చు

క॥ నమ్మిన భక్తుఁడు గన్నడ బమ్మయ సద్భక్తిమహిమ పరికింపఁగ లో
కమ్ములఁ జోద్యముగాదె యధర్మంబును ధర్మమయ్యెఁ దత్త్వాతీతా!

క॥ ఇవ్వసుమతిఁ గడుఁగమ్మని పువ్వులలోఁ బుట్టినట్టి పువ్వులుగొఱనే
సర్వజ్ఞభక్తి విరహితుఁ డెవ్వడును త్రిపటజాతుఁ డేటికిఁ గొఱనే.

"ధర్మంబు" "సర్వజ్ఞ" శబ్దములందలి ప్రాసములను వలపలిగిలక ప్రాసములని పేరిడి రేఫసంయుక్తాక్షరముల లేఖ ససరణిననుసరించి యివి ప్రాత వ్రాఁతప్రతులలో "ధర్మ్మంబు" "సర్వ్వజ్ఞ" అను విధంబున లిఖింపఁబడి యుండునని శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు తలంచిరి. బద్దెన సుమతిశతకములోఁ గూడ నిట్టి ప్రాసముగలదు.

క॥ ఎప్పుడుఁ దప్పులు వెదకెడు నప్పురుషుని గొల్వఁగూడ దది యెట్లన్నన్ సర్పంబు పడగ నీడను గప్ప వసించిన విధంబు గదరా సుమతీ.

ఈ ప్రాసము నొక విధమున శాంతప్రాస భేదముగా గణింపఁదగును. సోమనాథుఁడు దన కృతులలో నిట్టి ప్రాసమును వాడెననుటకు బలిబలాధారములు కానరావు.

"కర్జంబు నావుడు బిజ్జలుండంత। లజ్జయు సిగ్గును బుజ్జగింపంగ"

(బ॥ పు॥ పుట॥107॥)

"బిజ్జలునకు వినిపింపంగ నతఁడు కర్జమెందో నియఁ గలదు తేరాదు"

(పుట 193)

"బుజ్జగించుచు వెడ్లు బుడ్లును బెట్టు। నిర్జీవికిప్రియఁబుకు నివ్వెఱగందు"

అను తావులఁ గొన్ని వ్రాఁత ప్రతులలో "కజ్జము" "విజ్జవి" అను వికృతిరూపములు గానవచ్చుచున్నవి. అట్టియెడ నవియే సోమనాథకవి ప్రయుక్తములని మనము తలంపఁదగును గాని పయి ప్రయోగములను శాంతప్రాసములుగ గణింప నవసరము లేదు. ఇఁక

మర్త్యలోకమునకు మఱి వేఱె యొకఁడు। కర్తయు న్నాఁడె లోకత్రయ వరద మధ్యాహ్నమగుటయు మారయ్యలింగ। తద్ధ్యాన సుఖనిరంతరవర్తియగుచు ఆక్షణంబునఁ బంచభక్ష్యముల్ గుడిపి (భక్ష్యశబ్దమునకు భక్షమను రూపాంతరముగూడఁ గలదు)

తత్త్రిపురాంతకస్థాన వాస్తవ్యుఁడై త్రిపురాంతకుఁ డభినుతిఁ బేర్చు

మున్నగు తావులందలి ప్రాసములు నన్నయ తిక్కనాదులకుఁగూడ సమ్మతములయిన త్రివర్ణప్రాసము (ప్రాసాక్షరములో మూఁడు వర్ణములున్నప్పుడందలి యేరెండువర్ణములతోఁ గూడిన పదముల నయినను దక్కిన పాదములందుఁ గూర్చునట్టి ప్రాసము) సంయుతా సంయుత ప్రాసములు ననురెంటిలో నెద్దానికిఁ జెందినయున గణింపఁదగినవే గాని కేవలము శాంతప్రాసములని శాసింపనయినవికావు. మఱియు సోమనాథుఁడిట్టి ప్రాసములను, స్వరాక్షర సామ్యము గలిగి, అంతస్థములు (Semi - vowels) అని వ్యవహరింపఁబడు యరలవలతోఁ గూడిన సంయుక్తాక్షరముల విషయమున నే ముఖ్యముగ వాడినట్లుకాననగును. నన్నయాదులిట్టి ప్రాసములను వాడిరనుట క్రిందిదృష్టాంతముల నరయునది.

ఉ॥ క్షత్త్రియ వంశ్యులై ధరణిఁగావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్త్రియ వైశ్యశూద్రులనఁగాఁ దగునాలుగు జాతులన్ స్వచా
రిత్రముఁ దప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు రామమాం
ధాతృరఘు క్షితీశులు ముదంబునఁ గాచిరి యేయుగంబునన్
(భారతము : ఆదిపర్వము)

క॥ ఈ క్షితికివచ్చి వేగమ దక్షారామమున వార తరుణులనృత్యం
బీక్షించి యంతకంటెను దక్షిణమున నేర్చిరంభ తగ వేర్పడఁగన్
(భీమన : నృసింహపురాణము)

“పాండురాంగంబైన పఁడతి గర్భమున బోఁడిగా వెలుఁగుచుఁ బుత్రుఁడీ క్రియను”
(బ॥ పు॥ ఆ॥ పుట 16)

మున్నగుతావులఁ బూర్ణార్థబిందు ప్రాసమును సోమనాథుఁడు వాడెననియు వర్గప్రాస, సమీపప్రాసముల నంగీకరించునప్పుడు పూర్ణార్థబిందు ప్రాసము నంగీకరించుట సంగతమే యగుననియు నన్నయాదులీ ప్రాసము నంగీకరింపరసియుఁ గూడ శ్రీ శాస్త్రిగారు వ్రాసినారు. ఈ విషయమునఁగూడ నభిప్రాయ భేదములు గలవు. తెలుగు పదములందు నేఁటి వ్యవహారమున దీర్ఘముల మీఁదఁ గానవచ్చు నర్థబిందువు తొలుదొలుతఁ బ్రాచీనకాలమునఁ పూర్ణబిందువుగానే యుండెడిదనియు రాను రాను బూర్ణబిందూచ్చారణము దీర్ఘాక్షరములపై సడలి నెఱసున్న యరసున్నగా మాఱిన దనియు నర్థానుస్వారతత్త్వవిదులు వచింతురు. ఇందుకుఁ దార్కాణముగాఁ బ్రాచీనశాసనములలోఁ బద్యములందు వచనములందుఁ గూడ దీర్ఘముల మీఁది యరసున్న నెఱసున్నగానే పెక్కుతావులఁ జెక్కఁబడి యున్నది. పదుమూఁడు పదునాల్గు శతాబ్దులు దీర్ఘముల మీఁది పూర్ణానుస్వార మర్థానుస్వారముగ మాఱుచుండిన కాలమని పలువురు తలంచుచున్నారు. తిక్కనకు సమకాలీనుఁడగు కేతన కాలము నాటికిఁ గూడఁ బద్యములలో నవసరమయినప్పుడు దీర్ఘముల మీఁది యరసున్న నెఱసున్నగనే యూఁదఁబడు చుండెడిదని యాతని యాంధ్రభాషాభూషణమందలి యీ క్రింది పద్యముల వలనఁ దెలియనగును.

క॥ కుఱుచల తుదిహల్లులకున్
బిఱుఁదన్నెల కొన్న యట్టి బిందువు లెల్లన్

తెలియఁగ నూఁదుచుఁ దేలుచు
నొలపై యిరుదెఱఁగుఁ జెల్లుచుండుర్ గృతులన్.

క॥ ననుఁ ను నన్నుంగనుఁదా
ఘనుఁడు ఘనుండనఁగఁజెల్లుఁ గవ్యనుమతిచేఁ
దనుబోఁటి లోభివాఁడితఁ
డననిదుపుల మీఁదిబిందు లరబిందులగున్

క॥ కులుచలపై నరబిందు ఙ
తెలియఁగ నూఁదిననుఁ జెల్లునిదుపుల మీఁదన్
తెలియఁవు గద్యంబులలో
తెలబిందు పులూఁదుఁ బద్యనికరమునలోనన్

సోమనాథుని కాలమునాఁటికి దీర్ఘముల మీఁధి యను .స్వారము కేవలము పూర్ణముగానే యుండి యుండునని గాని యథవా యవసరమును బట్టి పద్యరచనమునందు నెఱసున్నగా నది యూఁదఁబడు చుండెననిగాని మనము తలంచుట కభ్యంత రములు గానరావు. నన్నయకాలముననే రాజరాజ నరేంద్రుని కూఁతురు సోమలదేవి వెలయించిన దక్షారామ శిలా శాసన మునఁ గూడ నొక పద్యమున నిట్టి ప్రాసము గూర్పఁబడినది.

"సకల వసుమతీశ మకుట లసద్రత్న
కిరణరుచి విరాజి చరణుఁడయిన
నిజభుజ పరిఘాని బెజయిత దేవని
కూంతు సరిరెు పొల్పఁ గాంతలెందు."

శ్రీ ప్రభాకర శాస్త్రిగా రీపద్యమును దాము గూడ నుదాహరించి యిందలి "కూంతు" పద మధ్యబిందు విశిష్టముగ నెన్నఁ బడవలసినదే యనియు నది పూర్ణబిందూచ్చారణ ముతో నుండవలసినదే యగునేని శాసనమున "కూంతు"

అని చెక్కింపఁబడి యుండునని మఱియొక యసంగతవాదమును బ్రకటించిరి. కాని యది సరికాదు. శాస్త్రిగారి యభిప్రాయము సత్య సమ్మతమయినచో శాసనమున "కాంత" యను రూపముగూడ ద్విత్వయుక్తముగ "కాంత్త" యనియే చెక్కఁబడి యుండునుగదా! కాని యదిగూడ నట్లు చెక్కఁబడలేదు. ఈ శాసనమును బరిశోధించి రాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో మొట్టమొదట దీనిని బ్రకటించిన శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు ద్విత్వరహిత రూపమునే పఠించి ప్రకటించి యాశాసనమును గూర్చిన తమ వ్యాఖ్యానములో "రెండవ పద్యము గీతముయొక్క 4 వ చరణమునందు" "కూంతు"తో "కాంత" ప్రాసయతి మైత్రిం జెందినది. అందుచే "కూంతు" లో నిదియా కాలమున నిండుసున్నయేగాని యరసున్న కాదనుట స్పష్టము" అని వ్రాసినారు. తరువాత శ్రీజయంతిరామయ్యగారు ప్రకటించిన శాసనపద్యమంజరిలోను దొరతనము వారి దక్షారామ శాసన సంపుటమునందును నిది వయిరీతినే ప్రకటింపఁబడినది. (S. I. Vol. IV No. ) ఈ సోమలదేవి శాసన కాలము శ. స. 987. ఆకాలముననే నన్నయభట్టు సహాధ్యాయి నారాయణభట్టు కూతురు కుప్పమ వేయించిన దక్షారామ శాసనము గద్యములో "నారాయణభట్టుకూంతుఱు కుప్పమ వెట్టిన అఖణ్డవర్తి" అని ద్విత్వరహితరూపమే చెక్కఁబడినది. (South Indian Inscriptions Vol. IV No. 1015). కావున నప్పటికింకను శాసనపు వ్రాఁతలలో బిందు పూర్వక తవర్గా

క్షరములకు ద్విత్వము నిచ్చునలవాటు రాలేదనియు, ఆ కాలమున నింకను సున్దరి, మన్దగమన, మణిబన్ధ, మిచ్చెందనకు, అనునెడల ననునాసికాక్షరయుత రూపములును బిందుయుత రూపములును తవర్గాక్షములయెడ వాడఁబడుచుండెననియుఁ దేటపడఁగలదు. అటు తరువాత నొక యేఁబదియేండ్ల లోపల నిట్టియలవాటేర్పడి యుండునని శకసంవత్సరము 1030లో వెలసిన శాసనములలోని యీ క్రింది వాక్యముల వలన గ్రహింపఁదగును,

" వారిజ బన్ధుకాంత్తకును వాసవు కాంత్తకు లక్ష్మిదేవికిఁ"
"మ్యంబు దివాకరాత్మ కల యంత్తకు భక్తినఖణ్డమైనదీ"

సోమనాథుని వలెనే నన్నెచోడుఁడు భీమకవికూడ నాకాలపు మర్యాద ననుసరించి యిట్టి ప్రాసములను దమ గ్రంథములందు వాడియున్నారు.

"వీండెఖలుండు దక్షుఁడను వీటేఁడి పొలుఁచు వీఁడు సర్వవ
ధ్యుండెడ సేయకుండు
"ఘోండిగ నగజ తపశ్శిఖి
మూండు జగమ్ములను దీవ్రముగఁ బర్వినబ్ర
హ్మాండముఁ గాఁచిన కాంచన
భాండము క్రియఁదాల్చెఁ దత్ప్రభా భాసితమై"

(నన్నెచోడుని కుమార సంభవము)

"వాఁడిమినల్ల సిద్ధిజనవల్లభుఁ డోర్చినరాజు భీతితో
నాఁడురఁ గావకుండ వృషభాంకము వెట్టికొనంగఁ జూచితో
నేండిది యేమినీవనుచు నెచ్చెలు లెల్ల హసింపనంతలో
మూండవకంటితోఁడి దొరమూర్తి వహించిన క్రొంకిఁదంగనల్."

(భీమనన్నృసింహ పురాణము)

"మూండునే నినగణ ములురెండు నలములు
మూండి నగణములును మొగినహంబు
పొండిగాఁగ నగ్గమున కగుమీఁదని
ట్లుండఁ జెప్పవలయు నొగిఁబ్రిగీతి"

(భీమన కవిజనాశ్రియము)

ఇక సోమనాథుని కావ్యములందుఁ గానవచ్చు

జగతిఁ బద్మపురాణ సంహితలం దెసఁగెళంభు రాఘవ
సంవాదమునను (పం॥ చ॥)

షోడశపందువు నూడబోదండుగానీ పాలుపురహర కొనుమ
(బ॥ పు॥ పుట 71)

చీరచించుచు విపులా అడివైచి కారించతతి నుదకము లేదుగంట
అటిముటిఁ జన్నుఁబ లర్థించి వేఁడఁ జలుశ చేనొకపిండి కరుడిచ్చితల్లి
(బ॥ పు॥ పుట 120)

మొదలగు రేఫ ద్వయ ప్రాసములును

హఠయోగరాజ యోగాది విభ్రాంతిఁ
బటువగు పశురోగ బంధఁబులేమి (పం॥చ॥ 2-327)
రూఢినసంఖ్యాత రుద్రులబంటఁ
బాడానఁ బాడిన ప్రమథులబంట (పం॥ చ॥ 1- 38)
వసుధ "గృహేయస్మిక ప్రినూతా" యనంగ వదరుచునంద
(పం॥ చ॥ 1-48)

మేధావి రుద్రుండు మిండసంగయ్య
మైథునరామయ్య మగతిలకవ్వ (పం॥ చ॥ 2-90)
శశిలేని నిశి దివస్పతి లేని పగలు
బసవన్న లేని సద్భక్తలోకంబు
దూషక! వినుము "మా దుష్టలిర్ వృషభ
మాసహబాత్రి" యనుచు మహిమ్రోయుచుండ

మున్నగు స్వవర్గజ సమీప ప్రాసములును, ఇంచు
మించుగ సకలాంధ్ర కవిలాక్షణిక సమ్మతములయినవే. వానిని

గూర్చి విశేషచర్చ యవసరములేదు. దధథధ ప్రాసములను నన్నయయే వాడియున్నాఁడు.

ఉ॥ కాదనకిట్టి పాటియపకారము తక్షకుఁడే కవిప్రసం
బోధనఁజేసి చేసె

ఉ॥ అంధక వృష్ణిభోజ కుకురాన్వయ భూపతులెల్ల నీదెసన్
బాంధవ సౌహృద ప్రణయభక్తి విశేషము లొప్ప నీమనో
గ్రంథి యడంగఁజేయనె సకంబును బూనినవారు లోభసం
బంధులు ధార్తరాష్ట్రులు నయమ్మె మెయిన్ మన కుర్వి యిత్తురే.

శసప్రాసములు భాస్కరుఁడు, తిక్కన; జక్కన, శ్రీనాథుఁడు మున్నగు ప్రామాణికకవులు కూడ వాడియున్నారు. షసప్రాసమునకు సాంబోపాఖ్యానాదిక గ్రంథములనుండి యప్పకవ్యాదులు లక్ష్యముల నొసంగియున్నారు. పయిని బేర్కొనిన

"శశిలేనినిశి దివస్పతిలేని పగలు
బసవన్నలేని సద్భక్తలోకంబు"

(పం॥ ౧॥ మహిమప్రకరణము)

అను పాదముల నడుమ శ్రీ చిలుకూరి నారాయణ రావుగారు

"పసుల కాపరిలేని పశునివహంబు
రసహీనమైన నిస్సారంపుఁ గవిత"

అని మఱిరెండు పాదములను ముద్రించివీనికి సంస్కృత గ్రంథములో అనువాదము లేదని 218 పుట అధోజ్ఞాపికలో నుదాహరించి, ఇందు "రసహీనమైన నిస్సారంపుఁగవిత" యను చోట యతిభంగమయినట్లు కనబడుతుందిగాని నిర్ + సారము = నిస్సారము అని యిక్కడ సంధికాఁబట్టి సోమనాథుడిక్కడ

ఉపసర్గయతి విశేషముగ వాడిఉంటాఁడు" అనిపీఠికలో వ్రాసి యున్నారు. కాని యిది సరిగాదని నాయభిప్రాయము. ఈ రెండు పాదములు ప్రక్షిప్తములుగఁ గానవగును వరంగలు నందు మొదట ముద్రితమయిన పండితారాధ్య చరిత్రమున వీని గానరావు. "రసహీనమైన నిస్సారంపుఁగవిత" అనుచో స్వయుక్తిద్యోతకమయి యందలి యప్రౌఢతను వెల్లడించు చున్నది. ఈపాదము సోమనాథ రచితమని గాని శ్రీనారాయణరావుగారు నిర్వచించిన రీతిగలయతి సోమనాథు నకు సమ్మతమనిగాని నేను నమ్మఁజాలను.

సోమనాథుని బసవపురాణములో నీక్రింది తావుల గణభంగములు గానవచ్చుచున్నవని తలంచి శ్రీ ప్రభాకర శాస్త్రిగారు వీనిని సమర్ధించుట యెట్లను విషయమునఁ గొన్ని యసంగత ప్రసంగములఁ గావించిరి.

ప్రేమంచెలర్పంగ "భృత్యాపరాధస్వామినో దండ" యన్నదువునిష్ఠించి (పుట 106)

నాయకశ్రుతి రసాన్న భక్తస్య జిహ్వాగ్రేయని యేప్రొద్దుఁబ్రోయ్యఁ గావునను (పుట 164)

అంధక కరి దైత్య వ్యాఘ్ర లాలా జలంధరాదుల నిర్దళనము సేయం డె (పుట 204)

శునక గార్దభ మ్లేచ్ఛ శుక దర్దురాది జనిత మునీంద్రాది జా తములెల్ల శివభక్తిఁ గాచె విశిష్టములయ్యె. (పుట 225)

వీనిలో ౧,౨, తావులలో 'రాధ', "జిహ్వా" యనునవి సంయుక్తాక్షర పూర్వకము లగుటచే గలములకు మాఱుగ గములగుటచే గణభంగ మేర్పడు చున్నదనియు సంస్కృత

మున జరణాంత మందలి లఘువు గురువు కావచ్చుననుటకు "పాదాంతస్థం వికల్పేన" అను విధియునందు కనువగు ప్రయోగములు కాననగును గాని పాదాంతమందలి గురువులఘువగుట కానరాదనియు వీనిని సమర్థించుటకు "లఘుర్భ వేద్గురుః క్వచి చిద్గురుః క్వచి చిద్గురుశ్చలఘు స్తథా ఉచ్చారణస్య కల్ప్యత్వా న్నిదానం తత్రసద్వచః" అను నథర్వణ కారిక గతి కావలె నేమోయనియు వ్రాసి మూడు నాలుగు తావులలో నలములుగా నుండవలసినద్వితీయ గణములలో త్య భ, లుగూడ సంయుక్తాక్షరపూర్వకము లవుటచే గురువులయి గణభంగ మేర్పడుచున్నదనియు నన్నిప్రతులందును నీ పాఠము లే కలవనియు వీనిని సమర్థించుట యెట్లనియు శ్రీ శాస్త్రిగారు వ్రాసినారు. వీరుదాహరించిన యథర్వణ కారికయందలి గురు లఘు ప్రశంస ఛందోవిషయిక మయినది కాదనియు నది గురు లఘు రేఫలకు సంబంధించిన దనియు నథర్వణకారికలఁ జదివిన వారికిఁ దెల్లము కాకమానదు.

అసందర్భముగ వానిని శాస్త్రిగారిచ్చుట నుదాహరించుట ప్రామాదికమని చెప్పనక్కఱ లేదు. సంస్కృతమునఁ బాదాంతమందలి గురువు లఘువగుట కానరాదని శాస్త్రిగారు వ్రాయుట యవిచారమూలకము. పాదప్రథమాక్షరము సంయుక్తాక్షరమయినప్పుడు తత్పూర్వపాదాంత వర్ణమునాది పలుకక యవసరమయినచో లఘువుగాఁ జేసికొనవచ్చును. వృత్తరత్నాకరమందలి యీ క్రింది శ్లోకములను జిత్తగించునది.

«సానుస్వారో విసర్గాంతో దీర్ఘో యుక్త పరశ్చ లః
వాపాదాంత స్తసౌగ్వర్ణో ౽క్షే యోర్యోమాత్రికో ౽ల్పజః"
«పాదాదా విహవర్ణస్య సంయోగః క్రమ సంజ్ఞకః
పురస్థి తేన తేనస్యాల్లఘుతాపి గురోః క్వచిత్"

ఇందుల కుదాహరణముగా నీశ్లోక వ్యాఖ్యానమునందు వ్యాఖ్యాతిచే రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామ మందలి యీ క్రింది శ్లోక ముదాహరింపఁ బడినది.

«తరుణం సర్ష పశాకం
నవౌదనం పిచ్ఛిలానిచ దధీని
అల్పవ్యయేన సుందరి!
గ్రామ్యజనో మృష్టమశ్నాతి"

ఇది యార్యావృత్త శ్లోకము. 1, 3 పాదములందు 12 మాత్రలును, 2 వ పాదమునందు 18 మాత్రలును, 4 వ పాదమున 15 మాత్రలును ఉండవలెనని యార్యావృత్త లక్షణము. ఈ శ్లోకమున రెండు నాలుగు పాదముల చివరనున్న 'ని' 'తి' అను నక్షరములు లఘువులయినను పాదాంతస్థములవుటచే నవసరమును బట్టి వికల్పముగా గురువులగును. అవి యట్లు గురువులు కానిచో శ్లోకలక్షణము చెడును. అట్లే 3 వ పాదము చివరనున్న 'రి' అను నక్షరము నాల్గవపాదము మొదటనున్న "గ్రా" అను సంయుక్తాక్షరమునకు ముందుండుటచే సాధారణముగా గురువు కావలయును. కాని యది యట్లు గురువయినచో గణ భంగమయి లక్షణము చెడును. కాన నవసరమును బట్టి యాదఁబడక యదిలఘువే యగును.

అట్లే "భృత్యాపరాధ" అనుచోఁ బాదాంతముననున్న

'ధ' అను నక్షరము తరువాత పాదముయొక్క యారంభమున నున్న 'స్వా' అను సంయుక్తాక్షరమునకు ముందున్న నున్నాదఁ బడక లఘూచ్చారణముతో లఘువేయగును. అందుచే నిట గణభంగము లేదు. 'రాధ' అనునది యిట గలమేగాని గగము కాదు. ఈలోకోక్తినే సోమనాథుఁడు చతుర్వేద సారమున

సీ. ధరధర్మమిట్లు "భృత్యాపరాధస్స్వామి
నోదండ" యననీక కాదెసిగ్గు

అని కూర్చి, అపరాధశబ్దమందలి ధకారమచ్చటఁ బాదాంతమున లేదు గనుక నూఁదిపలికి గురువుగాఁ జేసినాఁడు.

ఇఁక "భక్తస్య జిహ్వాగ్రే" యనుచోట జిహ్వాశబ్ద మాకారాంత స్త్రీలింగమగుటచే నిట్లు సాధింపవీలు లేదు. ఇటఁ గవిపాఠము మఱుఁగుపడి యపపాఠము నెలకొనినట్లు తోఁచు చున్నది. "భక్తజిహ్వాగ్రికే" యని యున్నచో గణభంగ ముండదని శ్రీ శాస్త్రిగారే 164 పుట అధోజ్ఞాపికలో సూచించినారు. అట్లో లేక "భక్తజిహ్వాంచ లేయని" అనియో కవిపాఠమయి యుండవచ్చును.

ఇఁక 3, 4, తావులయందలి ప్రయోగములఁగూర్చి యన్ని ప్రతులందు నీపాఠము లే కలవని శాస్త్రిగారు నొక్కి వ్రాయుట సరిగాదు. బసవపురాణమున కాంధ్రదేశమున వేర్వేఱు ప్రాంతముల భిన్నభిన్నములగు వ్రాఁతప్రతు లనేక ములు వెలసియున్నవి అవియన్నియు శాస్త్రిగారికి గ్రంథ పరి ష్కరణ కాలమునకు హస్తంగతములయియుండవనుట కెట్టి యాధారములును లేవు. "శునకగార్దభమ్లేచ్ఛ" అనుచోట

మ్లేచ్ఛ"యని పీఠికలో నుదాహరించినను గ్రంథమున 225 వ పుటలో దానిని "మేచ్ఛ" యని ముద్రించియున్నారు. అందుకు శుద్ధపత్రికలోఁగూడ సవరణనేమియు సూచింపలేదు. పండిత పరిష్కరణములలోనే యిట్టి ముద్రణదోషములు నెలయు చున్నప్పుడు సామాన్యులగు లేఖకులు వ్రాసిన వ్రాఁత ప్రతు లో నపపాఠములు నెలకొని కవి ప్రయుక్తపాఠములు మఱుఁ గుపడుటలో నాశ్చర్యమేమి? నిజాము రాష్ట్రమున సంపా దించిన బసవపురాణ తాళపత్రి ప్రతులు కొన్ని విభూతిపత్రికాధిపతుల శైవ భారతీభవనమున భద్రపఱుపఁబడి యున్నవి. వానిలోఁ బయిపాదములకీ క్రింది పాఠములు గానవచ్చుచున్నవి.

(1) పాలకురికి ప్రతి

శునకగార్దభ మ్లేంఛ ఆంధకకరి దైత్య
శుకదర్దురాది వ్యాఘ్రిలలాజ

(2) శంషాబాదు ప్రతి

శునకగార్దభమ్లేచ్ఛ అంధకమదగజ
శుకదర్దురాది వ్యాఘ్రిలలాజ

(3) సదాశివపేట ప్రతి

శునకగార్ద భమ్లెంఛ అంధకమదగజ
శుకదద్దురాది వ్యాఘ్రులాలాజ

(4) పోచన్నపేట ప్రతి

శునకగార్దభమ్లెచ్ఛ అంధకసామజ
శుకదద్దురాది వ్యాఘ్రులాలాజ

ఇట్లే వివిధభాండారము లందు సేకరింపఁబడిన వివిధ

ప్రతులఁ బరిశీలించినచో భిన్న భిన్న పాఠములనేకములుగ లభింపక పోవని నానమ్మకము. "కరిదైత్య" అనుచోట "మదగజ" "సామజ" అనువానిలో నేది కవి పాఠమయి యుండునని తలంచినను శాస్త్రిగారుదాహరించిన గణభంగము నకుఁ బ్రసక్తియే లేకుండఁ బోవును. ఈ పాదమునఁ బేర్కొనఁ బడిన యసురు లితరు లెవరికిఁ బ్రియుక్తముకాని (రాక్షసకుల సూచకమగు) దైత్యశబ్దము నొక్క గజాసురుని విషయముననే సోమనాథుఁడు చేర్చి యుండునా యనుట గూడనిచ్చట విచార ణీయము. బసవపురాణ పరివర్తన కర్తలలోఁ బ్రథముడనఁ దగిన భీమకవి వయిపాదము నిట్లు కన్నడించి యున్నాఁడు.

సింధురజటా భస్మశార్దూ లాంధలాలాతారకగుహాజ
లంధరప్రముఖా సురరన పహరిసనే శివను
(బెంగుళూరుప్రతి 54 సంధి 56 పద్యము)

కావున నిచ్చట సరియైన కవిపాఠము "అంధకసింధుర" "అంధకమదగజ" "అంధకసామజ" అను వీనిలో నేదియో యొకటియై యుండునని తలంచుటయే సమంజసము.

ఇఁక రెండవది శివనాగుమయ్యగారి కథలోనిది. మహా శివభక్తుఁడగు శివనాగుమయ్యగారిని బ్రాహ్మణు లంత్యజుఁడని నిరసించినప్పుడు బసవేశ్వరుఁడు బిజ్జలుని యెదుట బ్రాహ్మణుల గోత్రకర్తలగు ఋషులజననవృత్తాంతమును దడవిన సందర్భము లోనిది. పూర్వాపర సందర్భములఁ దిలకించినచో నివి యించు మించుగ వజ్రసూచ్యుపనిషద్వాక్యముల కనువాదములని నా యభిప్రాయము.

"ఎట్టిదు ర్జాతిని బుట్టిననేమి। యెట్టును శివభక్తుఁడిలఁ బవిత్రుండు
ఈయుగ్రిజన్ములకెల్లను గురువు। బోయతకునుగాదె పుట్టెవ్యాసుండు
పూర్వద్విజాచార్యుఁ డుర్విఁ వసిష్ఠుఁ।డూర్వశియను లంజె కుదయించెఁగాదె
మాతంగుఁడనఁగ బ్రహ్మర్షి యొకండు।మాతంగికినిగాదె మహిఁబ్రభవించె
శునకగార్దభమ్లేచ్ఛ।శుక దర్దురాది। జనిత మునీంద్రాది జాతియులెల్ల
శివభక్తిఁగాదె విశిష్టమై పరఁగ! నవనీశ యెఱుఁగవే యందఱ ననిన"

(బ. పు. సప్తమాశ్వాసము పుట 225)

ఇందు "శునకగార్దభ" అనుపాదమున నుదాహృతము లయిన వన్నియు జంతునామములు. మధ్య నచ్చట మానవ సంబంధితమగు మ్లేచ్ఛ శబ్దమునకుఁ బ్రసక్తి లేదు. అది యాట విక (కిరాత) పర్యాయపదముగూడఁ గాదు. ఆర్యధర్మాచార వ్యవహార విదూరులగు యవనాదుల విషయముననే యది ప్రయుక్తమగుచున్నది. కావున "మచ్ఛ" లేక "మత్స్య" యనునది యిచ్చటఁ గవి పాఠమై యుండునని నామతము. మత్స్యశబ్దమునకు మచ్ఛయను రూపముగూడఁ గలదు. దాని నుండియే మచ్చెమను తద్భవరూప మేర్పడెను. కవిపాఠము మచ్ఛయేగాని 'మ్లేచ్ఛ' యై యుండదని తలంచినచో నిచ్చట శాస్త్రిగా రుదాహరించిన గణభంగమునకుఁ బ్రసక్తియే కలుగఁబోదు. ఈ పట్టునఁగూడ భీమకవి పరిపర్తనమును జూచునది.

శునకగార్దభ కీరదర్దుర వనచరోష్ట్రకురంగమాదిక
జనిత సన్మునివల్లభ రజన్మంగళల్ల ఇవు

(బెంగుళూరు ప్రతి 57 సంధి 73 పద్యము)

పిడుపర్తి సోమనాథుఁడు తన పద్యబసవపురాణమున దీని నిట్లనువదించినాఁడు.

 

క॥ దర్దుర శునక వనేచర
గార్దభశుకముఖ్య జంతుగర్భజులయ్యుఁ
దుర్దమ శక్తులుగారె క
పర్దిపదారాధన ప్రభావము కతనన్.

భీమకవి తాను గైకొనిన నకారప్రాసమునకు సరిపడినట్లు మ్లేచ్ఛశబ్దమునకు (వనశబ్దమునకు జలమను నర్థముకూడ నున్నందున) "వనచర" అనెడియను వాదమునుగూర్చగాబిడుపర్తి సోమనాథుఁడు దానినే యలుక్సమాసముతోఁ దనపద్య పాదములో సరిపడునట్లు "వనేచర" అని ప్రయోగించియుండు నని నేఁ దలంచుచున్నాను. ఇరువురి యనువాదములను బరిశీలించిన, వారిందు గణించినది కేవల జంతుగణమే యనియు, నందు మానవ వాచక శబ్దములకుఁ బ్రసక్తి లేదనియు గోచరింపఁ గలదు. "వనచర" యని లుక్సమాసమునే గాని "వనేచర" యని యలుక్సమాసమువాడినప్పు డది జలచర వాచకముగా గణింపరాదనియు, ఆటవిక వాచకముగానే దానిని గణింపఁదగుననియు వైయాకరణులు చెప్పవచ్చును. "వనేచరాణాం వనితాసఖానాం" అని కాళిదాసుని ప్రయోగము. కాని యీ విధిని బిడుపర్తి సోమనాథుఁ డంతగాఁ బాటింపక జలచరవాచకార్థమునఁ యలుక్సమాసమగు వనేచరశబ్దమును గూడ వాడియుండునని నేఁ దలంచుచున్నాను. సమాసాంతమందలి "జంతుగర్భజులయ్యుఁ" అనుపదముల వలననే యాతనిదృష్టియందిట జంతుగణమే పరిగణింపఁబడెనని తలంపనగును. ఇంతకు మ్లేచ్ఛ శబ్దమునకు వనచర, వనేచర శబ్దములు పర్యాయపదములు కాఁజాలవని వెనుకనే చెప్పి యుం

టనిగదా ! తిరుపతి శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానమువారి Oriental Institute Journal (Vol. IV No. 1) లో శ్రీ చిలుకూరి నారాయణరావుగారి పండితారాధ్యచరిత్రపీఠిక విమర్శించు సందర్భములో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 6-8-1932 తేదిన సమదర్శిని పత్రికలో నే నీ మ్లేచ్ఛశబ్దప్రయోగమును గూర్చి యొనర్చిన విమర్శనమును మనములో నిడికొని దానికి సమాధానముగఁ గాఁబోలు నీక్రింది వాక్యములు లిఖించి యున్నారు. "ఇట్లే మఱియొక పాదము 'శునకగార్దభ మ్లేఛ్ఛశుకదర్దురాది' యని గలదు. అందు మ్లేచ్ఛపదము నునికి గణభంజకము. అయినను నా చూచిన వ్రాఁతప్రతులన్నింట నట్లే యుంటచే నూర్పక పీఠికలో దానిని వెల్లడించితిని. మ్లేచ్ఛపదము దొలఁగించి మత్స్యపదముఁ జేర్పఁ జేతకానివానినిగా నన్ను నిందించినవా రున్నారు ఈప్రయోగమెంత సమ్మతమో యెఱుఁగక; నేను నానాఁడెఱుఁగను." ఇట్టి పట్టుల నిట్టి సమాధానములవలనఁ బ్రయోజనము లేదు.

విమర్శకులు సద్భావముతో నొనర్చు విమర్శనములను నీవు నిందలుగాఁ బేర్కొనుట శోచనీయము. దేశమున ననంఖ్యాకములగు వ్రాఁతప్రతులుండి వానిలో వేర్వేఱు పాఠములతో నున్న కొన్ని కొన్ని మాత్రమే మనకుఁ గనవచ్చినప్పుడు ప్రక్రమ సందర్భములఁబట్టి సరియైన కవిపాఠమును నిర్ణయించుట సమంజసముగాని మనకు దొరకిన ప్రతులలో నెక్కువగ నేపాఠము గనవచ్చుచున్నదో యదియే కవిపాఠమయి యుండునని తలంపరాదని నా మనవి. సరియైన కవిపాఠముగల వ్రాఁతప్రతు లెన్నఁటికయిన లభింపవచ్చును.

మఱియు శాస్త్రిగా రుదాహరించిన యీ రెండుత్రావు లందలి సంయుక్తాక్షరములు అంతస్థములని (Semi-Vowels) వ్యవహరింపఁబడు య ర ల వ లకుఁ జెందినవి.

"సర్వాస్వపిచ భాషాసు ర హ యుక్తాక్షరే పరే
పూర్వవర్ణస్యవేష్టా లఘుతా మల్లాదికేపిచ"

అను సూత్రముచొప్పున రేఫసంయుక్తాక్షరమునకుఁ బూర్వమందుండు వర్ణమునకు లఘుత్వమును వికల్పముగా నందఱు నంగీకరించుచున్నారు. "భ వేదాద్యసమాసేపి రేఫయో గాత్పదం తథా" అను నథర్వణకారికగూడ నిందులకుఁ బ్రమాణము. దీని ననుసరించియే యాంధ్రశబ్ద చింతామణీ వ్యాఖ్యానమయిన తన కవిజనాంజనములో నరసింహారాజ పండితుఁడు

గీ॥ క్రారగల వాల్లుపరమునఁ గలిగనేని
తేల్చిపలుకఁగవచ్చును దెల్లముగను
రామచంద్రుఁడు విభుఁడాది బ్రహ్మయనఁగ
రాఘవేశ్వరుఁడిల సత్య వ్రతుఁడనంగ.

అనిలక్షణమును వ్రాసి యందుకు సంస్కృతాంధ్ర గ్రంథములనుండి కొన్నిలక్ష్యములఁగూడ నుదాహరించి 'ఈ లాగుననే కిత్యవడికిఁ బూర్వముననున్న యక్షరమునకు వికల్పమని కొందఱున్నారు.' అనికూడ వ్రాసినాఁడు. "కావునఅంధక కరిదైత్య వ్యాఘ్రలాలాజ" అనుచోట నదియే సోమనాథుని పాఠమని వాదించినను వ్యస్తపదమందును, అందునను విశ్రాంతి స్థానమందుననున్న 'వ్యా' అనునక్షరమును దేల్చిపలుకవచ్చును. అప్పుడు తత్పూర్వాక్షరమయిన 'త్య' గురువు కానేరదు. మఱియు నీ విధి యంతస్థములలోని (అకార, ఋకార సదృశ

ములగు) యకార రకారములకే గాక (ఋకార సదృశమగు) లకారమునకు, వకారమునకుఁ గూడఁ జెల్లు ననుటకుఁ బూర్వ ప్రమాణము లుండునేమో శోధింపఁదగును. "రలయోరభేదః" అనుట సుప్రసిద్ధమేగదా! కావున నిట్లు రకారము నెడఁజెల్లెడి విధి లకారమునకుఁ గూడఁ జెల్లుచో "శునకగార్దభమ్లేచ్ఛ" అను మ్లేచ్ఛపాఠమే సరియైనదని శాస్త్రిగా రిప్పటికి వాదించి నను నచ్చుటఁగూడ భ గురువు కానేరదు. ఇఁక వకార విష యమునఁ గూడ నీ విధి చెల్లుననుటకు

సీ. శ్రీ.రుద్రజాబాల శ్వేతాశ్వతరబృహ
దారణ్యతైత్తి రీయముల యందు

అను సోమనాథుని చతుర్వేదసారప్రయోగము లక్ష్యము కాఁగల్గునేమో విచారింపఁదగును.

## వ్యాకరణ విశేషములు . అసామాన్య ప్రయోగములు

ఛందోవిషయము లందువలెనే వ్యాకరణ విషయము లందుఁ గూడ సోమనాథుఁడు ప్రాచీన లక్షణములకు సంప్ర దాయములకు విరుద్ధముగ వర్తింపలేదనియే నా యభిప్రా యము. ఇదమిత్థముగ నాతనికాలమునాఁటికిఁ బ్రచారము నందున్నవని చెప్పఁదగు నాంధ్ర వ్యాకరణగ్రంథము లింత దనుక మనకు లభింపలేదు. "ప్రయోగశరణమ్ వ్యాకరణ" మ్మను నూక్తి గీర్వాణ విషయముననే వర్తించునప్పు డాంధ్ర భాషావిషయమున వేఱ చెప్పఁదగినది లేదు. శ్రీప్రభాకర శాస్త్రిగారు బసవపురాణ పీఠికలో "అసాధారణ ప్రయోగ

ములు" అను శీర్షికక్రిందను, శ్రీచిలుకూరి నారాయణరావు గారు పండితారాధ్యచరిత్ర పీఠికలో "పాల్కురికి సోమనాథునిభాష" యను ప్రకరణమునందును సోమనాథుని వ్యాకరణ ప్రయోగములఁ గూర్చి విశేషముగ వ్రాసియున్నారు. వానినెల్ల నిచ్చట బరామర్శించిన గ్రంథ విస్తరమగును. పాఠకులువాని నందుఁ దిలకింపఁదగును.

"ఏతెంచారగించె" "కలిగున్నదనుచు" మొదలయిన క్త్వార్థకేకారసంధులు, "వెండీల్గువారు" "కంచేడువాడలఁ" "వావెఱుంగని" మున్నగు ఇకారసంధులు, "సత్యమాహేశ్వరు లిండ్ల" "జినభక్తులిండ్ల," "బడుగులాదరువ" మున్నగు షష్ఠీ సమాసాకారసంధులు "కంతుసంహారుకైన" "కరికాలచోడుకు" వంటి కు షష్ఠికి ముందటి నుగాగమలోపములు సోమనాథుని గ్రంథములలోఁ బెక్కులు కానగును. ఇట్టివి యితర ప్రామాణిక కవుల కృతులలోఁగూడ ననేకములుగఁ గనవచ్చును. కావున నిట్టివానికి సోమనాథుని కృతులయందే విశిష్టత చూప నవసరము లేదు. అసాధారణములని మనము తలంచు సోమనాథుని ప్రయోగము లనేకము లాతని కాలమునాఁటికి సాధారణములేయని ప్రాచీనశాసనములను బట్టియు గ్రంథములఁ బట్టియు నిర్ణయింపనగును. సోమనాథునిఁ జూచియేమి తత్పూర్వకవి ప్రయోగముల ననుసరించియేమి యితర భావి కవులు గూడ నట్టివానిని దమకృతులలోవాడి యున్నప్పుడు వాని వైశిష్ట్యమును బ్రత్యేకముగ సోమనాథాది శివకవుల కృతులయెడనే నిర్ణయింపరాదని నాయభిప్రాయము.

అజ్లోపమును బదాంతములందును బద మధ్యములందును అకార ఇకార ఉకారములు మూఁటియెడలనుగూడ సోమనాథుఁడు బాహాటముగ వాడియున్నాఁడు.

ఉదాహరణములు:—కర్వ, కస్వ, ఎర్గి, చిక్కి, చెర్చి, కుర్య, తివ్య, పర్గెదరు, ఇస్మ, కుద్తురు, సెన్నడ్మ, పల్యర్స. శల్వరియు, తార్డెన, కేశ్వంతవాఁ డొకఁడు, వార్లిలుదుర్, ఏఁగెడువార్ జంగమములు.

ఆంధ్ర శబ్ద చింతామణిలో "నలడాదేర స్తరుతేశ్చ (వాస్యాల్లుక్)"అనిన, ల,డ మొదలగు వర్ణములమీఁది ఉకారమునకు మాత్రమే లోపమును వైకల్పికముగా విధించినను, ఆవెంటనే "అన్యేషాంచ ప్రయోగ మహితానామ్" అను మఱియొక సూత్రము విధింపఁబడినది. కావున సోమనాథుఁడు ఉకారేతరము లందుఁ గూర్చిన అజ్లోపము ప్రయోగమహితముగా మనము గణింపఁదగును.

సంస్కృత పదములతో దేశ్యశబ్దములకు సమాసమును గూర్చుట "వైరిపదము" అను కావ్యదోషముగాఁ గర్ణాటాంధ్రలాక్షణికులు గణించిరి. కాని రానురా నిది మిశ్రసమాసమను పేరితోఁ గొంతవఱకుఁ గవుల యాదరమును బడసి యానాఁటి శిష్టజనవ్యవహారము ననుసరించి కాఁబోలు నెడనెడఁ దత్కృతులందుఁ బ్రయుక్తమగుచు వచ్చినది. నన్నయ భారతమునందుఁ గూడఁ బ్రాణగొడ్డము, కఱకంఠుఁడు మున్నగు మిశ్రసమాసములు గాననగును. ఈ మర్యాదను సంప్రదాయమును దలంచి సోమనాథుఁడుగూడఁ దనప్రాంతమున

నానాఁటికి శిష్టవ్యవహారమం దుండిన మిశ్రసమాసములను దనకృతులలో నెక్కుడుగ వాడియున్నాఁడు.

ఉదాహరణములు:—శివవిధి, శివరాజు, దీపగంభంబులు, అర్ఘ్యపణ్యములు, పుడమిఱేఁడు, చాదళాబ్జము, నిత్యనేమము, భక్తసూటువ, సర్వాంగ కచ్చడము. అభిమానకత్తె, జీవగఱ్ఱ మొదలయినవి,

సోమనాథుని తరువాత వెలసిన భాస్కరుఁడు, గౌరన, బమ్మెర పోతన, కొఱవి గోపరాజు మున్నగు తెలంగాణా కవుల కృతులలోను, నన్నెచోడుని కుమారసంభవమునను గూడ నిట్టివి కొన్ని గాన నగును.

తెలుఁగుపద మొకటి మొదటనున్నప్పుడు దానిమీఁద నొక్క సంస్కృత పదమును మాత్రమే గూర్చి సమాసము చేయనగునుగాని కేవల మొక సాంస్కృతిక సమాసమును దానితోఁ గూర్పరాదని అనంతుఁడు తన ఛందోదర్పణమున.

గీ॥ మొదలి తెలుఁగుపై సంస్కృత పద మొకండు
జరగు లోకరూఢిని సమాసంబుచొరదు
పూని ముజ్జగంబులు ననఁబోలుఁ గాని
యతఁడు ముజ్జగద్వందితుఁడనఁగఁజనదు.

అను లక్షణమును జెప్పినాఁడు. కాని యిది యర్వాచీన లక్షణముగాఁ దోఁచును. సోమనాథుని కృతులందును దత్పూర్వశాసనములందును మూఁడు శబ్దములతోఁ గూర్చిన సంస్కృత సమాసములు గాననగును.

ఉదా:— ముల్లోక విభుండు సక్రి (ఓపిలిసిద్ధి శాసనము)
"నల్లవో! బసవయ్య! ముల్లోకవంద్య!" (బ॥ పు॥)
"ముల్లోక నాథుని ముట్టంగఁగొలిచి" (పం॥ చ॥)
"ముజ్జగదాధారమూర్తి! రక్షించు" (సోమనాథ స్తవము)

మహచ్ఛబ్దము కర్మధారయ సమాసమున 'మహా' యని మాఱుదగును గాని షష్ఠీసమాసమునందువలె దానిని "మహత్" యనియే ప్రయోగించుటయు, మఱికొన్ని యెడల ...లోపము చేసి 'మహ' యనియు నింకఁ గొన్ని తావుల హవ ...మునకు లోపమునుగూర్చి మీఁది హల్లునకు దీర్ఘము గలి ...చుటయు సోమనాథుని కృతులందుఁ గాననగును. దీనిలోఁ గొంతవఱకీతఁడు కర్ణాట వ్యాకర్తల మతము ననుసరించినట్లు గాననగును.

ఉదా: — ఇది సుమహత్తత్త్వము. (ప్రోద్గత మాత్రమహద్గుసపుత్తి) మండలిలో భవన్మహాదాజ్ఞ, మహదేవ, మహాలింగమూర్తి, ఈ మాజనమా మొదలయినవి.

నన్నెచోడుని కుమారసంభవమునఁగూడ నిట్టి ప్రయోగములు కాననగును.

అకారాంతములుగ వాడఁదగిన కొన్ని సంస్కృత శబ్దములను ఇకారాంతములుగా వాడుట సోమనాథునకుఁ గొంత పరిపాటి.

ఉదా: — భక్తసమూహి (సమూహమనుటకు మాఱు) సడిసన్న దాసి కాళిదాసి (దాసుఁడనుటకు బదులు) మున్నగునవి.

ఇట్లే స్త్రీ లింగరూపములకుఁ బుంలింగ రూపములఁ గూడఁ గొన్ని యెడల నీతఁడు వాడియున్నాఁడు

కొడుకులు లేమికిఁ గడుదుఃఖియగుచు (దుఃఖినియనుటకు మాఱు) వనిత యపూర్వలాంఛనధారిగాఁగ (ధారిణియనుటకు మాఱు)

ప్రథమ పురుష సర్వనామమగు "తాను" అనుశబ్దమును ఉత్తమమధ్యమ పురుషములలోఁ గూడ వాడుట ప్రాచీన

సంప్రదాయము. అట్టిది సోమనాథుని కృతులలో విశేషముగఁ గాననగును.

ఉత్తమపురుషము

తల్లిసచ్చినఁ గాదె తాను డస్సితిని
తానెట్లు పోవుదు నానందమూర్తి
తడయక కక్కడకైనఁ దనుఁ గొనిపొమ్ము

మధ్యమపురుషము

తమచింతలేల పొదండను కరణి

యుష్మదస్మత్సమాహారసంప్రార్థనాద్యర్థకములందు నేఁడు వాడఁబడు 'చెప్పుదము, చెలువుదము, పోదము, చూతము' మొదలగు రూపములు సోమనాథుని కృతులలో, చెప్పుదండు, చెలువుదండు, పోదండు, చూతండు మున్నగురీతిని బ్రయుక్తము లయియున్నవి. మఱియు బారెఁడు, జేనెఁడు, మూరెఁడు మొదలగు పరిమాణార్థకములు, ఔపవిభక్తికము లందు బారెంట, జేనెంట, మూరెంట మున్నగురూపములతో వ్యవహృతము లయియున్నవి. కర్త్రర్థకమునఁ గర్మణ్యర్థములఁ బ్రయోగించుట గూడ సోమనాథునకుఁ గొంతవఱకుఁ బరిపాటి.

ఉదా:— పురహరార్చితునకుఁ (శివభక్తుఁడను నర్థమున్న) మున్నెత్తు కేలు
ధరనెత్తఁగూడునే తాఁటిమాలలకు (బ. పు.)
"నమస్కృత (నమస్కరించువారి యను నర్థమున) భావపరంప
రావసాన మహితదేశ" (అక్షరాంక పద్యములు)

ఇట్టివి నన్నెచోడుని కృతులందును నితరకవుల కృతులందును గూడఁ గొన్నియెడలఁ గాననగును.

అఖిలసుధీలో కానఁ బిఁతకల్పానోకహుఁడు. (నన్నెచోడునికుమారసంభవము అ 3 ప 244)

అఖిల కులాచల పరిభావ విజిత రజతశిఖరి శిఖరరమణి రమ్య హార్మ్యతలాలంకృతోత్తుంగ సింహాసనాసీనుఁడు (అ 2 వ 245)

నీతవిషయమున—"సేవిత (సేవించుచున్న యనునర్థమున) దనుజవ్రాతర్" (మొల్లరామాయణము)

కారక విషయమున నేఁటిభాషా మర్యాదలకు విలక్షణములగు ప్రాఁత పలుకుఁబళ్ళు సోమనాథుని కృతులలో నెక్కువగఁ గాననగును.

ఉదా:— "బాహుయుగ్మము చాపఁదడవ"
"కానవా తప్పునగాఁ జేసి శివుని
మేనఁ బొక్కులుగడు మిక్క టంబయ్యో"
"అరుగుము భక్తజనావళిలో వెడలి"
"అటవార్త గలిగి"
"ఇటమీఁద సిరియాలు నీళ్వరువార్త మఱచియాడితిరేని
మాభక్తు లెడకు మటిమీరు హరుని కొమటితోఁడువారు
"బాణునకు మెచ్చి" "ప్రాణమునకు నలుగంగర్"
"కడజాము లేచి" "మఠమేఁగి" "శ్రీపర్వతం బేఁగి"
"మహాలింగదేవు సమ్ముఖుఁడై"

సోమనాథుఁడు బసవపురాణమునను బండితారాధ్యచరిత్రమునను జాతీయములగు పెక్కు సామెతలను వాడిన సంగతి పదునెన్మిదవ ప్రకరణమునఁ జెప్పియుంటిని అట్టి సామెతలలో నీ క్రిందిది యొకటి.

"చోళవాళిక కాక క్షోణీతలేశ!
వేళవాళికిఁ గర్తవే!"

దీనిని గూర్చి శివతత్త్వసార పీఠికలో శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారును బసవపురాణ పీఠికలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారును, పండితారాధ్య చరిత్ర పీఠికయందు శ్రీ నారాయణరావుగారును గొంత చర్చించి యున్నారు. ఫలితార్థమించుమించుగ నొక్కటియైనను నర్థవివరణములో వీరు భిన్నమార్గము లవలంబించిరి. ఇందుగూర్చి నాయభిప్రాయము గూడ వివరింతును. పూర్వము సేవకులకు రాజులు చోళ్ళు భత్యముగానిచ్చు నాచారము ననుసరించి చోళవాళి యనగా చోళ్ళవాళి (వతను)గాఁ గలది=ఐహికజీవనమనియు వేళవాళియనఁగా వేళ(జీవిత పరమావధికి జీవితావసానమునకు) వాళియైనది, ఆముష్మిక సౌఖ్యమనియు నాయభిప్రాయము. ఈ సామెతను సోమనాథుఁడు సమానములగు పట్టులలో బసవపురాణ పండితారాధ్య చరిత్రములందు రెండింటియందుఁ గూడ వాడియున్నాఁడు. చూడుఁడు.

పోడ్డల దేవు బాచయ్యగారికథ (బిజ్జలుఁడు ప్రతాపనారాయణ పురిని విష్ణ్వాలయము నిర్మించి గోవిందుని ప్రతిష్ఠించి యాయుత్సవమునకు నిజసేవకుఁడు బాచిరాజు రానందులకుఁ గినియు సందర్భము)

బాచిరాజుఁటయేమి భక్తుండననియె । యేచియో యాశార్య మెఱుఁగఁడో యెఱిఁగి । తాలెక్క సేయక తమకొలువొల్ల । డోలీల నిట్టి యొడ్డోలగంబులకుఁ । జను దేరకుండునే మనియాగ్రహింప । మనుజేశునకు బసవన మంత్రియనియెఁ । దవిలినీయుడిగంబు దప్పించెనేని । బవరంబుమట్టినఁ బాఱెనేనియును । దప్పని దండింపఁ దగవగుఁగాక । యిప్పరదైవంబు లిండింద్లకడకు । నేలరావనవచ్చునే పతివీవు । చోళవాళిక కాక వేళవాళిక కె । వత్తురే యన్య దైవంబులయిండ్లు । చొత్తురే భక్తులు నూతుకే వింఁడె)

(బ॥ పు॥ అ 6 పుట 195-196)

ధవళేశు నామయ్యకథ (ఈభక్తుఁడు నిజగురుండగు మల్లికార్జున పండి తుని సేవయందు నియుక్తుఁడయి రాజసేవ కించుక తామసించినందుకు ఉద యావనీశుఁడు కోపించుఘట్టము)

చోళవాళిక కాక క్షోణీశలేళ
వేళవాళికిఁ గర్తవే యటులైన
స్వార్థజంగమ పూజ నార్థమీయర్థ
మర్థ సంఘటనార్థ మదినీదు సేవ
యరయఁ దత్సేవార్థ మంగవిక్రియము
ధరణీశ! యటుగాన తనశరీరంబు
నమ్మినవాఁడఁగా కాచారనియతి
నమ్మినవాఁడనే యనవుడు నృపతి

(పం॥ చ॥ మహిమ ప్రకరణము పుట 185)

రాజా! నీ సేవకుని యైహిక జీవనమునకు మాత్రమే భర్తవయిన నీవు కర్తవుగాని యాముష్మిక జీవనమునకుఁ గూడఁ గర్తవేశావు॥ అని ఘట్టించుటయే యీ రెండు తావులందును గాననగును. సోమ నాథుఁడు వాడిన యాచ్ఛిక పదములనేకములు నేఁడు వాడుక యందు నశించుటచేతను, అర్వాచీన కృతులలో నవి మృగ్యము లగుటచేతను వానిలోఁ జాలవఱకు శబ్దరత్నాకరాది నిఘంటువుల కెక్కలేదు. వానినెల్లఁ జక్కఁగాఁ బరిశోధించి కథానరణి సంద ర్భములఁ బట్టి యర్థనిర్ణయ మొనరించి వానిని నేఁటి నిఘంటు వులలో సమగ్రముగఁ జేర్చుటకయి భాషాభిమానులు శ్రద్ధ వహింతురుగాక!

# ౨౦. సోమనాథు నారాధించిన యాంధ్ర కర్ణాట కవులు

ప్రకృతి ప్రబంధ కర్తయగు పరమేశ్వరుఁడు సకలజగదా రాధ్యుఁడు. కవీశ్వరునిసృష్టిజగదీశ్వరునిసృష్టి కారాధనరూపకమగు ననుకరణమే యనుట సర్వవిదితము. కావునఁ బూర్వకవీంద్రా రాధన రూపకమగు ననుకరణమేదియో యొక తీరునఁ గొలఁది గనో గొప్పగనో సకల కవిలోకమునను వ్యక్తమగుచున్నది. కాళిదాసాది మహాకవుల కృతులలోఁ గూడ నిది కాననగును. పూర్వకవ్యనుకరణములచ్చటచ్చటఁ గనవచ్చినంత మాత్రమున స్వతంత్రప్రతిభగల కవులు రచించిన కృతులకు న్యూనతగలుగఁబోదు. ఇతరవిధముల వారి ప్రత్యేక వ్యక్తిత్వ మాకృతులందుఁ బ్రకటితమగుచునే యుండును.

సోమనాథుని కృతులన్నియు స్వతంత్ర కావ్యములనియు నవి వేనికి ననువాదములుగాని యాంధ్రీకరణములుగాని కావనియు వెనుకనే చెప్పి యుంటిని. అట్లవుట నాతని కృతులందుఁ బూర్వకవ్యనుకరణముల కవకాశమంతగాఁ గలుగలేదు. మల్లికార్జున పండితుని శివతత్త్వసారములోని కంద పద్యము లందలి భావములు విషయములు గొన్ని సోమనాథుని పండితా రాధ్య చరిత్రమున వాద ప్రకరణమునఁగాననగును. ఇట్టి వాని ననుకరణములనఁ జనదు. ఈ వాద ప్రకరణము పండితారా ధ్యుని యన్యమత వాద ఖండనములను బ్రతిపాదించునది యవు

చే బండితుని పద్యభావములనే సోమనాథుఁడిందుఁ దన
పదపంక్తులలోఁ గూర్చుటకుఁ గారణమయినది. ఇకఁ బూర్వాంధ్ర
కృతులలో నన్నెచోడుని కుమారసంభవమును సోమనాథుని
పండితారాధ్య చరిత్రమును దిలకించిన స్థూలానుకర
ణములు కొన్ని హెచ్చుగఁ గానవగును. ఈయిరువురిలో నెవరు
పూర్వులో యింతవఱకు నిదమిత్థముగ నిర్ణీతముకాలేదు. కాని
యొకరి కృతుల నొకరు తప్పక చూచియుందురను విషయ
మును మనము నిర్వివాదముగ నంగీకరింపఁదగు సంవాదము
ఉభయుల కృతులందును మనకుఁ గానవగును. నన్నెచోడుని
తండ్రి చోడబల్లియనియు, తల్లి శ్రీసతియనియు, గురువు జం
గమ మల్లికార్జునుఁడనియు నాతని కృతివలనఁ దెలియుచున్నది.
తెలుఁగు చోడ రాజులలో బల్లిచోడ, చోడబల్లి, నన్నెచోడ
నామాంకితులు వేర్వేఱు కాలములందు బలువురు కాన్పించు
చున్నారు. ఉపలబ్ధములయిన శాసనములలో చోడబల్లి తండ్రి,
శ్రీసతి తల్లిగా నుదాహృతుఁడయిన నన్నెచోడుఁ డింతవఱకు
గాన రాలేదు. దొరకిన శాసనసామగ్రిలోఁ గాకతీయగణపతి
చక్రవర్తి సామంతుఁడు రెండవమల్లి చోడుఁడు క్రీ॥శ॥ 1260
ప్రాంతమున వెలయించిన పెద చెఱుకూరు శాసనమునందలి
వంశానుక్రమణికలో నాతని పూర్వులలోఁ జోడబల్లి పుత్త్రుఁడు
నన్నెచోడుఁ డాతని కాఱవతరమువాఁడుగా నుదాహృతుఁ
డగుట వలనను, కామచోడుని పుత్త్రులు కన్నరచో
డుడు, చోడబల్లి యను సోదరు లిరువురు పాలూరు గ్రామ
వాసియుఁ గాలాముఖవ్రతుఁడు నగు మల్లికార్జునయోగికిఁ

క్రీ॥ శ॥ 1115 సంవత్సరమునఁ గొప్పవర గ్రామమును దానమిచ్చినట్లు గానవచ్చుట వలనను, నన్నెచోడుని కాలనిర్ణయమునకుఁ గొంతవఱకివియే సంగతముగా నుండుననివానినిబట్టి యతఁడు క్రీ॥ శ॥1160-70 ప్రాంతమువాఁడు కాఁదగునని పలువురు చరిత్రజ్ఞులిప్పటికిఁ దలంచుచున్నారు. ఆతఁడు నన్నయ కంటెఁగూడఁ బూర్వుఁడని తలంచువారును, దిక్కనకంటెఁ దరువాతివాఁడని భావించువారును గూడ లేకపోలేదు. కుమార సంభవావతారికలో నన్నెచోడుఁడు సంస్కృత కవులలోఁ గాళిదాసుని, బాణుని, భారవిని, ఉద్భటునిఁ బేర్కొని యున్నాడు. కావున నాతఁడు క్రీ ॥శ॥ 900 కంటెఁ బూర్వుఁడు కానేరఁడని వేఱ చెప్పనక్కఱలేదు. ఇఁకనాతఁడు దేశమున నదివఱకు మార్గ (సంస్కృత) కవిత వ్యాప్తమయి యుండఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువురు భూపాలురు దేశికవిత నాదరించి యాంధ్ర దేశమునఁ దెలుంగు నిలిపినారని చెప్పుచుఁ దనకుఁ బూర్వమున్న దేశికవులను బేరుబెట్టి యుదాహరింపక దేశికవి స్తుతిని సాముదాయకముగ మాత్రము చేసియున్నాఁడు. ఈతఁ డుదాహరించిన చాళుక్యరాజు నన్నయభట్టుచే భారతము నాంధ్రీకరింపఁ జేసిన రాజరాజనరేంద్రుఁ డేయని పలువుర మతము. ఇఁక సోమనాథుఁడు తన గ్రంథావతారికలలో సంస్కృత కవిస్తుతిగాని దేశకవిస్తుతిగాని యేమియు నొనరింప లేదు గాని పురాతనశివభక్తప్రశంసలలోఁ బ్రసక్తానుప్రసక్తముగ గ్రంథమధ్యమునఁ గాళిదాస బాణ మయూరాది సంస్కృత కవులను బేర్కొనినాఁడు. మఱియుఁ బండితారాధ్య

చరిత్రమున మహిమ ప్రకరణమున మల్లికార్జున పండితుని ముఖమునఁ గావించిన సహస్రగణ మాలికావర్ణనములో కూడ నట్టివారిని జేర్చుచుఁ దనకుఁ బూర్వము సమీప కాల మందుండిన (మల్లికార్జునపండితుని సమకాలీనులయిన) బలిదేవ వేమనారాధ్యాదులగు శివభక్తులనేగాక భూపాలురలో శివభక్తి సంపన్నులగు కరయూరిచోడఁడు, వీరచోడఁడు చాళుక్యభీముఁడు మున్నగు నరపాలురఁ గూడఁ జేర్చి యున్నాఁడు. కాని నన్నెచోడు నాతఁడు వారిలోఁ గూడఁజేర్చ లేదు. సోమనాథుఁడు వాస్తవముగ నన్నెచోడుని కావ్యమును భక్తితోఁ జదివి యందలి వర్ణనములనే తన కృతులలో ననుకరించియున్నచో నాతనిఁగాని యాతని గురుని జంగమ మల్లికార్జునునిఁగాని సహస్రగణమాలికలోనయినఁ బేర్కొని వారియెడఁ దనకుఁగల భక్తిగౌరవములఁ బ్రకటింపక యూర కుండునాయని నాయనుమానము. తనకుఁ బూర్వమందు సమీపకాలమందు నుండిన కొందఱు రాజుల నామముల నుదాహరించు సందర్భమున నయిన నన్నెచోడుని నామము నాతఁడు స్మరింపకుండుటకుఁ దగు కారణము గానరాదు. నన్నెచోడుఁడు సోమనాథుని తరువాతనే వెలసియుండు ననుటకుఁ గల కారణములను ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక (సం. 28-సం1) విభూతి (సం. 1-సం. 3,4)లోఁ బ్రకటితమయిన "నన్నెచోడుని కాలము" అను వ్యాసమునఁ జర్చించియుంటిని. ఆ యభిప్రాయ మును మార్చుకొనుటకు బలీయములగు నుపపత్తులేమియు నింతవఱ కెవరును బ్రకటింపలేదు. కృత్యవతరణిక యందు

ఆశ్వాసాంత గద్యములందు గ్రంథమధ్య భాగములందు గూడ సోమనాథు ననుకరించిన జాడలు నన్నెచోడుని కుమారసంభవమునఁ గాననగును. భాషావ్యుత్పత్తి యందు సర్వంకష ప్రతిభయందు నిరువురుఁగూడ సమధికులే. కావున వీరిలో నెవరినెవ రనుకరించినను నది పరస్పర భక్తిగౌరవ ములకలిమిచే జరిగినదనియే తలంపవలెను గాని వారిలో నెవరికి నది న్యూనతాజనకము కాఁజాలదు.

## కృత్యవతరణిక

బసవలింగము కృతిపతియఁటె, కృతియు
రసికతఁ బండితారాధ్యచరిత్ర
మఁటె పాల్కురికి సోమనార్యుఁడు సుకవి
యఁటె కథాశ్రోత సూరామాత్యుఁడట్టె
కృతిపతి, కృతికవి, కృతికథాశ్రోత
తతిఁజెప్ప నొప్పదే శివభక్త సభల"

(సోమనాథుని పండితారాధ్య చరిత్రము)

చ॥ రవికులశేఖరుఁడు కవిరాజశిఖామణి కావ్యకర్తస
త్కవి భువి నన్నెచోడుఁ డఁటె కావ్యము దివ్యకథం గుమారసం
భవమఁటె సత్కథాధిపతి భవ్యుఁడు జంగమ మల్లికార్జునుం
డవిచలితార్థ యోగధరుఁ డట్టె వినంగొనియాడఁ జెల్లదే!

(నన్నెచోడుని కుమారసంభవము)

## గద్య

"ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య। పదపద్మసౌరభభ్రమ రాయమాణ।" (సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రములు).
"ఇది శ్రీజంగమమల్లికార్జునదేవ దివ్యశ్రీపాదపంకజభ్రమరాయమాణ"

(నన్నెచోడుఁడు)

## వేశ్యమాతవర్ణన

ట్టన నేలకు నింగికి సూత్ర। పట్టమోఁ కాళ్లను బట్టతలయును
బీపెట్టఁ దననీడఁ గడవంగఁబాఱ! వడిసెండమావుల, కడకాళ్లకట్టఁ
రాయక రెండుగాఁ బాఱెడు నీరు। వ్రేయఁబుజ్జలున్ను. గోరోయనియమ్మ
నారయులువఁజట్రాతిపైఁగ్రుఁక। నేనుంగుపురుడోయయినుక త్రాడ్వేన
గొనదిశలుతాలములువాయింపఁ। జెలఁగుచు రోఁకటఁజిగురులఁగోయఁ
వెన్నవుచ్చఁగొండలఁ దొంతిఁ బేర్ప। నిలమంచుకుంచాలఁగొలఁవ రేవగలు
మునాకసమునఁ జిత్రరూపములు। వ్రాయవాయువుఁబట్టవడగండ్ల గుళ్ల
ప్రవెన్నెలగుంపుగాఁజేయఁబుట్టి। పుట్టనప్పుడనేర్చు బుద్ధులప్రోఁక
ాసక త్తియ గొనములప్రోడ। యాలంజెతల్లిదానల్లునిఁజూచి

(పండితారాధ్య చరిత్ర – మల్హణునికథ)

నేలయు నింగియుఁ దాలముల్ వాయింప సెండమావులఁబట్టబండతలయుఁ
వఁకారుముడివెట్ట రోఁకటఁజిగుళులు గోయఁజట్రాతిపైఁ గ్రుంకనిడుపు
క చిత్రమువ్రాయనాకసమున దాఁపరము లిడ మంచు గుంచములఁగొలువ
నుగుపురుడోయ జానారఁగొన గాలి గంటిడనిసుమునఁగట్టుదాల్ప
నీరినడుముద్రెంపనేలఁదెన్నుండిచే వెల్వగలియుఁద్రచ్చివెన్నగొనఁగఁ
గడవనేర్పుగలిగి కందువు మానెఁడై కత్తిగొంటులయిన యత్తగంతు

(నన్నెచోడుని వేశ్యావర్ణనము)

ఇఁకభంగివోలె, కరణివోలె మున్నగు ప్రయోగముల
నేమి, కారకవైచిత్రియందేమి, ప్రాచీనపదజాలమునందేమి,
ను తెనుఁగు నుడికీరునందేమి, సీసకందములకూర్పునందలి
స్కారముపట్లనేమి, సూక్ష్మముగఁ బరీక్షించినచో వీరికృతు
లో ననుకరణములు పెక్కులు గానవగును.

సర్వేశ్వరస్తోత్రమును శా॥ శ॥ 1164 (క్రీ॥శ॥1242) లో
చించినట్లు చెప్పికొన్న యథావాక్కుల అన్నమయ్యకూడ
మనాథుని కృతులను బాగుగాఁ జదివి యందలి పదప్రయో

గములను భావములను గొన్నిటిని దన గ్రంథమునఁ గైకొని యున్నాఁడు.

"తలఁప" వేదాశ్చ శాస్త్రాణి" యనంగ
నిల" "సుపమంత్రై రనేకధా" యనఁగఁ
దఱితఱి శ్రుతులు శాస్త్రములు మంత్రములు
నెఱిఁ "బుర స్తాతై్రవ నిర్గతా" యనఁగఁ
బరఁగుచు సకల శబ్ద ప్రపంచంబు
వరుసనట్ల "యథాశివ స్తథా" యనఁగ
నడఁగు జనించుఁ బంచాక్షరియంద"

(పం॥ చ॥ మహిమ ప్రకరణము)

మ॥ అమితోద్యద్భవదీయ తత్త్వము మహీయస్తోత్ర వాణీ విలా
సములై యొప్పు సమస్తవేదములు శాస్త్ర శ్రేణియుఁ దివ్య వి
భ్రమ నాదంబులు నెన్నిచూడనివి నీ పంచాక్షరీ మంత్ర భా
వములై యుండు సమస్త లక్షణములఁ వ్వర్ణింప సర్వేశ్వరా!

ఆ. సకలేశుభక్తుల చరణోదకంబు। సకలతీర్థములకు జనయిత్రియనియుఁ
బలుతీర్థములఁగ్రుంకఁ బలుచుటకంటె।నిలభక్తపాదాంబువులుగొను టుఱవు
ఎట్లన్నఁ దీర్థంబులేఁగుటభారం। మట్లునుగాక స్వర్గాది ఫలంబు
లా రుద్రభక్తపాదాంబువుల్ ద్రావ'భారమేమియు లేదు ప్రాపించుముక్తి.

(పం॥ చ॥ పురాతన ప్రకరణము)

మ॥ పలుతీర్థంబులఁ గ్రుంకుకంటె మహిలో భక్తాంఘ్రి పానీయముల్
తలమీఁదంజిలికించుకోఁదగును దీర్థంబాడ భారంబు త
త్ఫలమత్యల్పము భక్తపాదయుగళాంభ స్స్పర్శ నిర్భారమై
యలరుఁ శాశ్వత భుక్తిముక్తి ఫలదంబై యుండు సర్వేశ్వరా!

క॥ జంగమ పరాఙ్ముఖుండై
లింగార్చనసేయు నతనిలీలఁ దలిర్పఁ
జెంగలియై శవమునకును
శృంగారముఁజేసినట్లు శివభక్తినిధీ! (అనుభవసారము)

లింగారాధన జంగమార్చనములో లిం భక్తి కంగంబుఁ బ్రా
ణాంగ వ్యాప్తియునై స్ఫురించునిది తత్త్వార్థంబగుం గాన యా
యంగాభ్యర్చన జంగమాహితకరుండై చేసినం దా శివ
శృంగారంబగు వానిభక్తి తుదిఁ జర్చింపంగ సర్వేశ్వరా.

జంగమభక్తి లింగపరిచర్యల మీఱుట యుత్తమంబు త
జ్జంగమ లింగపూజలవి సామ్యము సల్పుట మధ్యమంబు మఱి
జంగమ లింగపూజయెడ సల్పక లింగముఁ గొల్చుచున్కి యె
న్నంగఁ గనిష్ఠమాట శరణ ప్రతిప త్తియె ముఖ్య మెమ్మెయిన్.

(అనుభవసారము)

శమలింగార్చనకంటె జంగమము సౌందర్యమ్ముగాఁ గొల్చుటు
త్తమభక్తిస్థితి లింగజంగముల సత్సామ్యంబుగాఁ జేత మ
ధ్యమభక్తిస్థితి లింగపూజ నధికుండై జంగమోపాసనా
క్షముఁడై యుండుట భక్తియందలి కనిష్ఠత్వంబు సర్వేశ్వరా!

న్నమయ్య

అభిరమ్యంబుగ దూదికొండ మహనీయారాధ్య సోమేశ్వర
ప్రభు కారుణ్య వసంత సంజనిత మత్పద్య ప్రసూనావళీ
విభవం బొప్పఁగఁ గూర్చియెంతయు అసద్విఖ్యాతి సంపత్సుఖ
ప్రభవంబైన భవత్పదద్వయము నారాధింతు సర్వేశ్వరా!

అను పద్యమునఁ బేర్కొన్న సోమేశ్వరారాధ్యుఁడు మన
సోమనాథుఁడే యైయుండునని శ్రీ నిడదవోలు వేంకటరావు
గారు తలంచిరి. (భారతి సం 22, సం॥ 3 ) ఇదివిచారణీయము.
యన్నమయ్య గురువగు నాతఁడు దూదికొండ వాస్తవ్యుఁడగు
టచేయొక సోమేశ్వర నామాంకితుఁడై యుండునేమోయని నా
యనుమానము.

తిక్కనార్యుని క్రీ॥ శ॥ (1210-1290) జాతీయ కవితా
ప్రాణమునకు జాను తెనుఁగుపయి వలపును వెలార్చిన సోమ

నాథుని కృతులే మార్గదర్శకములను విషయమును వెనుకనే చెప్పియుంటిని. తిక్కన భారతము సోమనాథునికాలమునాటికి వెలువడియే యున్నచో నాంధ్రకావ్యరచనమున జాను తెనుఁగు నావశ్యకతను గూర్చి సోమనాథుఁడంతగాఁ బలవరించి లోకమును హెచ్చరించు నవసరము గానరాదు నేలయు నింగియు......" నను సోమనాథుని ద్విపదపంక్తులను దిక్కన గూడఁ గొంతవఱ కనుకరించినాఁడు.

సీ॥ నేలయు నింగియుఁ దాలముల్ గాఁజేసి । యేపునరేఁగి వాయించియాడఁ
గులపర్వతంబులుగొల్చి యొండొంటితోఁ । దాఁకంగవీఁక మైఁదన్నియాడ
నేడు సాగరములు నిక్కడక్కడఁబెట్టి । పలుచనిరొంపి మైనలఁదికొనఁగ
దిక్కులునాలుగు నొక్కచోటికిఁదెచ్చి । పిసికిపిండలిచేసి పిడుచగొనఁగ

గీ॥ మిగిలిబ్రహ్మాండ భాండంబు పగులవ్రేయ
నప్పళించుచుఁ బ్రళయ కాలానలమున
గండరించిన రూపంబు కరణి భీముఁ
డతి భయంకరాకారత నతిశయిల్లె

(విరాటపర్వము అ 2, ప 134)

సుప్రసిద్ధ శతకరాజమగు సుమతిశతకమునకుఁగర్త గణపతిదేవ రుద్రమదేవులకు సామంతుఁడయిన బద్దెన (క్రీ॥ శ॥1260-1320) యని పలువురు తలంచుచున్నారు. ఆశతకమున నాతఁడు కొన్నియెడల సోమనాథు ననుసరించిన జాడలు కానవగును.

"కసుఁగాయఁద్రించినఁగాయగుఁగాక।పసనిపండగునయ్య భ్రాంతిఁబొందినను
(బ॥ పు॥ పుట 98)

క॥ కసుఁగాయఁ గఱచిచూచిన । మసలక యది వగరుగాక మధురంబగునా
(సుమతి శతకము)

"నల్లవో భామల యుల్లం బెఱుఁగక ! గొల్లవాడైనను గోరునే కవయు
నొల్లని వెలయాలి నొల్లని నృపతి । నొల్లని చెలిఁబాయ నొల్లఁడేనియును
గొల్లండువాఁడు గాకొల్లెడజాతి । గొల్లడు గొల్లంiడె గొల్లడేనియును
(పం॥ చ॥)

ఒల్లనిసతి నొల్లనిపతి । నొల్లనిచెలి కాని విడువనొల్లనివాఁడే
గొల్లండుగాక ధరలో । గొల్లండును గొల్లఁడౌఁనె గుణమున సుమతీ!
(సుమతి శతకము)

సోమనాథుని యనుభవ సారమందలి కందములు బద్దెన
నీతిశాస్త్రముక్తావళి సుమతిశతకములలోని పెక్కుకందపద్య
ములకు వరవడులని తలంపనగును.

నాచనసోమనాథుని (క్రీ॥ శ॥ 1300-1380) యుత్తర
హరివంశమునందలి జాతీయకవితకు జానుతెనుఁగు పలుకు
బడుల చమత్కృతులకుఁ దిక్కన భారతమేగాక పాల్కురికి
సోమనాథుని కృతులుగూడ మార్గదర్శకము లయియున్నవి.
పలుతీరులనాతఁడు సోమనాథు ననుకరించినాడు. సీసపద్యరచన
మున నతఁడుచూపిన మెఱుఁగులకు సోమనాథుని సంస్కారమే
ప్రధానాధారము.

ఎరముందఱశిరంబుండ మోఁకాలి। కిని నేసపెట్టంగఁగ్రియగొనినట్లు
(పం॥ చ॥)

ఏలికనాదు మఖాంశ । శ్రీలకు నొరుఁదడవనేల శిరసుండఁగమోఁ
కాలను నేసలుపెట్టుట । చేలుదనముగాక మాకుఁ బెద్దతికంబే
(ఉత్తరహరివంశము ఆ1, ప 96)

వర్ణిత విషయముఁ బాఠకుల మదిని లెస్సగా హత్తిం
చుటకయి సమానార్థకములగు పదములను మార్చిమార్చి
ప్రయోగించుటలో నాచనసోముఁడు శ్రీనాథుఁడు సోమనాథు

నతివేలముగ ననుకరించినారని పదునెనిమిదవ ప్రకరణములోఁ జెప్పియుంటిని. అందు కుదాహరణముగ నుత్తరహరివంశము నందలి యొండు రెండుపట్టులఁ జిత్తగించునది.

"ఇట్లు మధుసూదనుండేయు సాయకంబులు గాలువలు గట్టిగట్టి మెయి మలువులు సించియుఁ గాయంబులు నొంచియు మర్మంబులు గీఁటియు మహీతలంబులు దూటియుఁ బ్రేవులు వెటికియుఁ బెనుమూఁకల కుటికియు ............... బైపయిం దోఁచిన నేచిన దనుజబలంబు చలంబుకొని పోరి పోరిలోఁ దునుకలయ్యును దుమురయ్యును నింతింతలయ్యును నిసుమంతలయ్యునుఁ జిఱుసగ్గయ్యునుఁ జిదురుపలయ్యును మంచయ్యును మడి మంచయ్యును రూపుచెడి తిరుగుడువడి వాహినులు చిక్కువడి చిందఱ వందలై మతిచెడి మల్లామడియై యేపుదెగి యవురుసవురయి యనువుదప్పి యదవదయై యంతంతవిచ్చి యరవరలై పొలలేక పలపలనై వెలఁగుపడి వెలవెల్లనై చిడుముడిపడి చెల్లాచెదరై పొడవడంగి ప్రోవున నొక్కండై పోవిడిచినఁ బోయినపోక్కై పోయినంగని" (అ 1, వ 148)

"ఇరువుర గదలును మసకంబునం బెనంగు పాములపగిదిం దాళించిపాసి కల పోలికఁ గ్రేతొట్టు కరళ్ళకై వడిఁగలయఁ బెరయు నిరువురు మెయిమలంచి పాసియుడాసియుఁ దట్టియుఁ బట్టియు హత్తియు నొత్తియు మలంగియుఁ దొలంగియు జడిసియు నొడిసియుం దాఁటియుం దూఁటియు విసరియుం గొసరియు నదలించియు వదలించియు లాసియు వ్రేసియుఁ దఱిమియు మెటిమియు నొండొరువుల దేహంబులు రుధిరాసారంబునం దడిసి" (అ 3, వ 64)

కొలనిగణపతిదేవుఁడు (క్రీ॥ శ॥ 1360-1420) తన శివయోగసారమున సోమనాథుని చక్రపాణి రంగనాథుని స్తుతించిన పద్యము నిదివఱకే యుదాహరించి యుంటిని. గణపతిదేవుని శివయోగసార రచనమున కసమ శివభక్తి రసాత్మకములగు సోమనాథుని కృతులు చాలఁ బ్రోద్బలము గలిగించియుండునని వేఱ చెప్ప నక్కఱలేదు.

నన్నెచోడ నాచన సోమనలవలెనే జక్కన (క్రీ॥శ॥ 1420) కూడఁ దన విక్రమార్క-చరితమున సీసకందపద్య రచనాసర ణులలో సోమనాథుని మార్గము వరవడిగాఁ గొనియున్నవిషయ మాతనిపద్యములఁ బఠించిన వారికి బాగుగాగోచరించును.

శ్రీనాథకవిసార్వభౌముఁడు (క్రీ॥ శ॥ 1370-1450) సోమనాథుని పండితారాధ్యచరిత్రమును నిగమార్థసార సంగ్రహమని నుతించి దానిని బద్యకావ్యముగా ననువదించి నాఁడు. అందు సోమనాథుని ద్విపదలనే యాతఁడు తఱచు నిలిపినాఁడని పిడుపర్తి సోమనాథుఁడు తన పద్యబసవపురాణావ తారికలోఁ జెప్పినాఁడు. శ్రీనాథుని గ్రంథము మన కింతవఱకు లభ్యము కాలేదు. అది దొరకియుండినచో నాతఁడు సోమనాథు నెడనందుఁ బ్రకటించిన భక్తిగౌరవములు బాగుగా వ్యక్తమయి యుండును. నాచన సోమనకు జక్కనకువలెనే సీసపద్యరచనా సంస్కారమున శ్రీనాథునకు సోమనాథునిసీసములే మార్గదర్శక ములని వెనుకనే చెప్పియుంటిని. సోమనాథుని యనుభవసారము నందలి "అచ్యుతబ్రహ్మము. రాగోచరుండయ్యు వరశుద్ధ భక్తైకవత్సలుండు," అనుపద్యము శ్రీనాథుని యనేక సీసపద్య ములకు వరవడియని నామిత్రులు శ్రీ కుంహూరి ఈశ్వరదత్తు గారు "శ్రీనాథుని కవిత్వతత్త్వము-ఆదికావ్యోక్తులు" (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం॥ 30 సం॥ 4, 5, 6) అను వ్యాస ము లోవ్రాసియున్నారు. ఛందోవ్యాకరణ విశేషములందును

జాతీయ పదప్రయోగములందును గూడ నీతఁడు సోమనాథు ననుకరించినాఁడు.

ఇసుమంత బూడిద నొసలఁబూసినను
మసలక కొండంతమరులెత్తెననుట
తెల్లమనుచు రాజు వెల్లననగుచుఁ
జెల్లవో! బసవయ్య, శివమరుల్ గొంటె (బ॥ పు॥)

గీ॥ ఆవగింజంత బూది మైనలఁది కొనిన
వెలఁది గుమ్మడికాయంత వెట్టిపుట్టఁ
గటకటా! యెట్లు తనబుద్ధి కాటఁగలియ
నిసువుఁజంపంగఁ దలఁచెనో నీమగండు. (హరవిలాసము)

రసవిస్ఫురణమునకయి సమానార్థకములగు పదములను మార్చి మార్చి ప్రయోగించువిధానమున నాచన సోమన వలెనే యీతఁడు సోమనాథు ననుకరించిన పట్టుల కొండు రెండు దృష్టాంతములు;

సీ॥ అనువు దప్పిరి నొచ్చి రలసి రాపదనొంది రదవదలైరి చీకాకుపడిరి
యంగలార్చిరి విచ్చి రారడిఁబొందిరి బ్రమసిరి పాటిరి పల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాపికలైరి సొలసిరి కులకులఁ గూసిరి కుతలపడిరి
గగ్గలకాడైరి కలఁగిరి పోటాటిరి వెలవెల్లనైరి నివ్వెఱఁగుపడిరి
గీ॥ యసవుసవులైరి గుజగుజలైరి డస్సి
రొల్లఁబోయిరి వెగ్గిరి తల్లడిలిరి
సిగ్గువడి రొచ్చవడిరి యిస్సి యిసిరైరి
తారకుని చేతమునులు బృందారకులును (హరవిలాసము ఆ 3, ప10)

"డమరు డిండిమ తమతమధ్వానంబుతోఁ గీనాశకింకరుల మసల భిండి పాల తోమర మండలాగ్ర త్రిశూలపట్టసంబులఁ బ్రహరించిన విచ్ఛిన్న బాహూరుచరణవక్షః......అలాటకృకాటులయి విచ్చియు నొచ్చియుఁ జచ్చియుఁ జెదరియుఁ బొరలియుఁ దోఁగియు డాఁగియుఁ గ్రిస్సియుఁ డస్సియుఁ గుందియుఁ గందియు దారియు...మొగ్గియు డగ్గియు నలసియు

పాలసియు వికావికలై దిక్కు మొగంబులయి యాపసొరులయి గురిరై బంద బంధై ఖండనంబు విడిచి వలయు......బారి వెలవెలంబోయి కృతాంతు సన్నిధికిం బోయిరి. (శివరాత్రిమాహాత్మ్యము ఆ 4, వ 83)

జనవశీకరణమునకు ద్విపదను సాధనముగాఁ గొను టలోఁగూడ నీతఁడు సోమనాథు ననుకరించి దేశీయవీరచరిత ములగు పల్నాటి వీరచరితమును గాటమరాజు కథను ద్విపద కావ్యములుగా రచించి కీర్తిఁగాంచెను.

ఇఁక రంగనాథుఁడు, గౌరన, సోముని మార్గము నను సరించియే తమ ప్రధానకావ్యములను ద్విపదలోఁ గూర్చి యున్నారు.

బమ్మెర పోతనామాత్యుని భక్తిపారవశ్యపుఁ గవిత్వ మునకు[1] సోమనాథుని బసవపురాణ పండితారాధ్యచరిత్ర ములే మార్గదర్శకములని నా మిత్రులు శ్రీ పంచాగ్నుల ఆది నారాయణశాస్త్రిగారు లిఖించిన వాక్యముల ముందే యుదా హరించి యుంటిని. అనుప్రాస ప్రియత్వమున సయితము పోత నకు సోమనాథుఁడే యాదర్శకుఁడను సంగతి కూడ నిదివఱకే యుగ్గడించి యున్నాను.

[1] పలికెడిది భాగవతమఁట పలికించెడువాఁడు రామభద్రుండఁట నేఁ బలికిన భవహరమగునఁట పలికెద వేఱొండుగాథ పలుకఁగనేలా?

యను పోతన కృత్యవతరణిక పద్యము "బసవలింగము కృతిపతియఁటె......" యను సోమనాథుని పంక్తుల కనుసర ణమే యనుట గుర్తింపఁదగును.

మఱియు,

సీ॥ మందారమకరందమాధుర్యమునఁదేలు । మధుపంబువోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికలఁదూగు । రాయంచసనునె తరంగిణులకు
లలితరసాలపల్లవ ఖాదియై చొక్కు । కోయిలసేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక । మరుగునే సాంద్రనీహారములకు,
గీ॥ నంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపాన విశేషమత్త
చిత్తమేరీతి నితరులఁ జేరనేర్చు వినుతగుణశీల! మాటలు వేయునేల?

అను పోతన సుప్రసిద్ధ పద్యమునకు మూలములు సోమనాథుని కృతులలోఁ గాన నగును.

క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించుహంస । గోరునే పడియల నీరుద్రావంగ
జాతఫలంబులుసుంబించుచిలుక । ప్రాతిబూరుగుమ్రానిపండ్లుగన్గొనునె
రాకామలజ్యోత్స్నద్రావు చకోర । మాకాంక్ష సేయునే చీకటిఁద్రావ
విరిదమ్మివాసన విహరించు తేఁటి । పరిగొనిసుడియునే బబ్బిలివిరుల
నెఱుఁగునేయలదిగ్గజేంద్రంబుకొదమరొ ఱపందిచనుసీక యొఱుఁగవుగాక

(బసవపురాణము)

సీ॥ రాకామలజ్యోత్స్నద్రావ నిచ్చలుగన్న । నాచకోరంబులకరుచియగునె
సహకారపల్లవ చయములు దొరకిన । జాతిగోయిలలకుఁ జప్పనగునె
క్షీరాబ్ధిలోపలఁ గ్రీడింపఁగలిగిన । భువిరాజహంసకుఁ బుల్లనగునె
విరిదమ్మివాసనవెల్లిముంచినఁగ్రోలు । షట్పదముల కనాస్వాదమగునె
గీ॥ బహుళతర దయార్ద్రభావఁప్రభావనామహిమ దనరు జంగమంబురాఁగ
నతులభక్తిపరుల కాహ్లాదకంబగుఁ బరిహృతాభిషంగ !బసవలింగ!

(చతుర్వేదసారము)

ఇట్లే సోమనాథుని కవిత్వమును పోతన పలురీతుల నారాధించి యనుకరించియున్నాఁడు.

పిదుప ర్తికవులు సోమనాథునిఁ దమకులగురువుగానారాధించి యాతఁడు చూపిన తెరువు ననుగమించి వీరశైవమత

సేవ నొనరించిన విధము నయిదవ ప్రకరణమునందును బది రెండవ ప్రకరణమునందును వివరించియున్నాను.

సోముని ద్విపద బసవపురాణమును బిడుపర్తి సోమనాథుఁడు పద్యకావ్యముగా ననువదించియున్నను నంతతోఁ దనివి సెందక విజయువాడవాస్తవ్యుఁడు శ్రీపతి పండితారాధ్య వంశ్యుఁడునగు మహాదేవారాధ్యుఁడు మఱియొక పద్యాను వాద మొనర్చియుఁ దుమ్మలపల్లి నాగభూషణకవి బసవ విజయమను పేరఁ బ్రబంధమును గూర్చియు సోమనాథు నారాధించిరి. మఱియు ఏలూరిలో నారాధ్యబ్రాహ్మణులు కందుకూరివారి పూర్వులెవ్వరో వ్యాసప్రోక్తముగ, స్కందాగస్త్య సంవాదరూపకముగ సోమనాథుని కావ్యము ననుసరించి బసవేశ్వరపురాణ మను నొక సంస్కృత గ్రంథము నవతరింపఁజేసిరి.

ఎడపాటి యెఱ్ఱాప్రెగ్గడ (క్రీ॥ శ॥ 1530) సోమనాథుని పండితారాధ్య చరిత్రమందలి పురాతన ప్రకరణములోని మల్హణుని కథ ననుసరించి మల్హణచరిత్రమను ప్రబంధము నిర్మించి యందు వేశ్యావర్ణనాత్మకములగు నేలయునింగియు... ను సోమనాథుని పంక్తుల నిట్టులనువదించినాడు”

శ్రీ నేలకు నింగికి నెఱయఁ దాపలు పెట్టు। జెలరేఁగి కోఁకటఁ జిగురుఁగోయు గడుబట్టతల మోకాళ్ళను మడివేయుఁ। గొసరక వడగండ్లగుళ్ళుగట్టు బాన్కమై సంగళ్లఁబులిజున్ను లమ్మించు నయమున జటాప్రితనారదీయు నొండొండఁ గొండలఁగుండుగాఁ దాఁకించు।వదలక నడురేయిఁబగలుసేయు ౘూఢి మెఱయంగనిసుమునఁద్రాడుఁ బేను। లెక్కసేయక చుక్కల లెక్కపెట్టు గాలినొడిగట్టుమంచుగుంచాలఁగొలచు । మదనసమాయాక శాధీనమదనసే

శ్రీశైలఖండమును రచించిన నాగలూటి శేషారాధ్యుఁడు సోమనాథుని పండితారాధ్యచరిత్రమునందలి పర్వతప్రకరణములోని పంక్తుల ననేకములుగఁ దనపద్యములలోఁ గూర్చికొనియున్నాఁడు. మఱియు సోమనాథుని యక్షరాంకగద్యగూడ నందలి ద్వితీయాశ్వాసమునఁ జేర్చికొనినాఁడు.

ఘనతర ధర్మార్థ కామమోక్షములు । దనరు శ్రీ పాదపద్మంబులనంగ
గన్నులం దీపవృక్షంబులనంగ । జెన్నగు శృంగముల్ శృంగములనఁగ
గుహలు నాసాపుట కుహరంబులనఁగ।మహితభూజములురోమమ్ములనంగ
వరచతుర్ద్వారనివాస లింగములు । సరసత నొప్పారు చన్నులనంగ
దొరఁగు పుణ్యంబులందుల దుగ్ధమనఁగ । వరపరిషత్కోటివత్సంబులనఁగ
నందితంబైవ శ్రీనగ కామధేను । వం దె కాకెవ్వి యిష్టార్థముల్ మఱియు
(పం॥ చ॥ పర్వత ప్రకరణము)

మ॥ పురుషార్థంబులు పాదముల్ శుభము తత్పుచ్ఛంబు తచ్ఛృంగముల్
గిరిశృంగంబులు రోమరాజి తరువుల్ కేశిపుల్ దిదృక్షాపరుల్
వరపుణ్యంబులు దుగ్ధధారలు చతుర్ద్వారస్థ లింగంబు లు
ద్ధురవత్సోజము లీ నగంబు నుతులొందుణ్ గామధేనుశ్రియణ్
(శ్రీ శైలఖండము)

సాలోక్య సామీప్య సారూప్యముక్త । లోలినీజాలు మహోర్మిదోర్లతిక
అనిమిషజనలోచనా వర్తనాభి । ఘనతర పులినజఘన కమలాస్య
యురురథాంగస్తన యుగ ఫేనహార । వరహంసగమన ప్రవాహాంగయగుచు
(పం॥ చ॥ పాతాళగంగవర్ణన)

సీ॥ అనిమిషలోచన యావర్తనతనాభి పృథురథాంగస్తని ఫేనహార
శృంగారసైకత శ్రీజఘునస్థలి వికచపద్మాసన............
(శ్రీ శైలఖండము)

తంజావూరు రఘునాథ భూపాలుఁడు (క్రీ॥ శ॥ 1600-1650) గూడఁ దన రామాయణములో వేశ్యావర్ణన సందర్భము

సోమనాథుని ద్విపద పంక్తుల కీ క్రిందియనుకరణ మొనర్చి యున్నాఁడు.

ఉ॥ నేలకు మింటికిన్ దొడరి నేర్పున నూత్రము పన్నమంచుఁ గుం
చాలను గొల్వఁ దార్కొనుక చాలునఁ జేనఁగఁ జుక్క లెన్నఁ జ
టాలను నారలొల్చి నెగడన్ వడగండ్లను గుల్ల గట్టఁగాఁ
జాలిన మీకు నిచ్చటికి సంయమిఁ దెచ్చుట యేమి సోద్యమే!

పింగళి యెల్లనార్యుఁడు (క్రీ॥ శ॥ 1650) సర్వేశ్వర మాహాత్మ్యమను తన తోభ్యచరిత్రావతారికలో సోమనాథు ను నమోవాకమును గూర్చినాఁడు.

ఇట్లే పరిశీలించిన కొలఁదియు సోమనాథుని కృతుల నుండి యాతని యనంతరము వెలసిన యాంధ్రకవుల గ్రంథము లోఁ బూర్వకవీంద్రారాధన రూపములగు ననుకరణము లనేకములు కాననగును.

శ్రీ శైలఖండము, చెన్నబసవపురాణము రచించిన చిత్తలూరి పాపకవి సోమనాథుని సర్వజ్ఞ శిఖామణిగా నుతిం చుచు నారాధించిన పద్యమును పదునొకండవ ప్రకరణములోఁ జేర్కొనియుంటిని.

ద్విపద కావ్యరచనముఁ గూర్చి సోమనాథుఁ డొనరించిన యుద్బోధన ఫలితముగా నాతని యనంతరము ద్విపద వాఙ్మయ శాఖ కొంతవఱకు బాగుగనే వర్ధిల్లినది. శైవకవులే గాక యితరులు గూడ ననేకులు ద్విపద కావ్యముల రచించిరి. పండి తారాధ్య చరిత్ర పీఠిక 7 వ ప్రకరణమున శ్రీ చిలుకూరి నారాయణరావుగారిట్టి ద్విపద కావ్యములఁ గూర్చిన వివరము

లను విస్తరించి యున్నారు. శైవకవులలో సోమనాథుని ప్రశిష్యు లయిన పిడుపర్తి బసవన, యాతనిపుత్త్రుఁడు సోమ నాథుఁడు రచించిన వీరశైవ దీక్షాబోధ, పిల్లనయనాగు కథ, బ్రహ్మోత్తర ఖండము, ప్రభులింగలీల మున్నగు ద్విపదకావ్య ములు గాక వారి తరువాతఁ గూడ ననేకులు సోముని మార్గము ననుసరించి యాతనియెడ భక్తిని బ్రకటించుచు ద్విపద కావ్యముల రచించియున్నారు. వారిలో నీక్రింది కవులు గణింపఁ దగినవారు.

| కవి పేరు | గ్రంథము పేరు |
|---|---|
| పోచిరాజు వీరకవి | విభూతి రుద్రాక్ష మాహాత్మ్యము |
| ఈమని వీరభద్రకవి | సీమంతినీ కథ |
| భద్రకవి లింగన | దేవాంగపురాణము, సానందోపాఖ్యానము |
| బచ్చు సిద్ధకవి | మఱి బసవపురాణము |
| శ్రీగిరి మల్లికార్జునస్వామి | సోమవార మాహాత్మ్యము |
| గద్దె చంద్రశేఖర కవి | ఉత్తర హరిశ్చంద్ర కథ |
| చిత్తారు గంగాధర కవి | గంగా వివాహము, భల్లాణచరిత్ర సిరియాళ చరిత్ర, కొలనుపాక మాహాత్మ్యము. |
| పోశెట్టి లింగన | నవచోళ చరిత్ర |
| జోబలకవి | శివరహస్య ఖండము |
| సిద్ధయోగి | యోగీశ్వర విలాసము |
| పర్వత మంత్రిలింగన | రుద్రాక్ష మాహాత్మ్యము |

ఆంధ్రమున వెలసిన శతక వాఙ్మయమునకు సోమనాథుని వృషాధిపశతక, బసవలింగశతక (చతుర్వేదసార) ములే మార్గ దర్శకములని యిదివరకేఁ జెప్పియుంటిని. కంచెర్ల గోపన్న (రామదాసు) కృతమగు దాశరథిశతకము బరిశీలించినచో నది

వృషాధిపశతకము వరవడి నేకూర్పఁబడినట్లు గోచరింపక మానదు. శతకకవుల నేకులకు సోమనాథుఁ డారాధ్యుఁడని వేఱ చెప్పనక్కఱ లేదు. అన్యవాదకోలాహల శతకకర్తయా శతకము సోమనాథుని కే యంకిత మొనర్చియున్నాఁడు. వీరశైవశతకకర్తలలో గ్రంధి రామలింగకవి (చోడలింగశతకకర్త) పుత్తోట సోమనారాధ్యుఁడు (బసవలింగశతకకర్త) మున్నగువారు సోమనాథునిఁ దమ శతకావతారికలలో నారాధించిరి. సుమతిశతకములో వలె వేమనపద్యములలోఁ గూడ సోమనాథుని భావముల ననుకరణములు గాననగును. వేమన పూర్వకవిస్తుతిలోఁ జేర్కొనిన సోమశేఖరగురుఁడు మన సోమనాథుఁడే యై యుండునని నేఁ దలంచుచున్నాను.

¹ భవదూరుఁడు శరభాంకుఁడు । శివశీలుఁడు వేయుగోటి సిద్ధేశ్వరుఁడున్ శివభృత్యుఁడు పటమాలుఁడు। శివమయచిన్మయుఁడు సోమశేఖరగురుఁడున్

పిడుపర్తి సోమనాథుఁడు పద్య బసవపురాణావతారికలో నొకచో సోమనాథుని సోమశేఖరుఁడనికూడ వ్యవహరించి యున్నాఁడు

గీ॥ గవనిపైలచ్చి ప్రతిమయుఁ గరులు రెండు
నుండఁగాడికిఁ గట్టిన యుక్షయుగము
గవనిఁ జొరకున్న సోమశేఖరుఁడెఱింగి
తొలఁగుమనిపంప నపిసేలఁ దునిసి పడియె.

ఇఁకఁ గన్నడకవులలోఁ బ్రిప్రథమమున సోమనాథు నారాధించినవాఁడు, ఉద్భటకావ్యకర్తయగు సోమరాజు (క్రీ॥ శ॥ 1222). అతని పద్యమును బదియవ ప్రకరణమునఁ జేర్కొని యున్నాను. అటుతరువాత భీమకవి క్రీ॥శ॥ 1369 లోఁ

దలుచుసోముని వాక్యములనే గయికొనుచు నాతని బసవపురాణమును గన్నడించిన సంగతికూడఁ బయిప్రకరణముననే వివరించి యుంటిని. "సర్వజ్ఞుఁడగు సోముని బసవపురాణ మేడ? జడమతి యగునేను దానిని గన్నడించుటేడ?" యని తలంచుచు శివయోగనిద్రాముద్రితుండయిన యవసరంబునఁ బాల్కురికి సోమనాథుఁడు, అనఘదేవుఁడు స్వప్నగోచరులయి "మేము నీయందావేశమయి కృతిరచనమును సాగింపఁ జేయుదుము. కృతిని బ్రారంభింపుము" అని తన్నాదేశించినట్లుగా భీమకవి గ్రంథావతారికలోఁ జెప్పికొసినాఁడు. అందుచేతనే "పాల్కురికి సోమేశ్వరకారుణ్యజనిత సకలకళాప్రపూరిత హృదయుఁడ"నని కూడ నీతఁడాశ్వాసాంత గద్యలందు సోమనాథునందుఁ దనకుఁ గలభక్తిని బ్రకటించినాఁడు.

భీమకవి భామినీషట్పదులలో బసవపురాణమును గన్నడించిన తరువాత శంకరారాధ్యులు బసవేశ విజయమను పేర సంస్కృతమున నొక యనువాదమును, సింగిరాజు (క్రీ॥ శ॥ 1500) మహాబసవరాజచరిత్రము (సింగిరాజపురాణము) అనుపేరితో వార్ధకషట్పదులలో మఱియొక కర్ణాటానువాదమును, షడక్షరకవి (క్రీ॥ శ॥ 1655) బసవరాజ విజయము (వృషభేంద్ర విజయము) అనుపేర నొకచంపూ కావ్యమును రచించి సోమనాథు నారాధించిరి.

ఇట్లే సోమనాథుని పండితారాధ్య చరిత్రమునకు గురురాజకవి (క్రీ॥ శ॥ 1430) సంస్కృతానువాదమును, నీలకంఠాచార్యుఁడు (క్రీ॥ శ॥ 1485) వార్ధకషట్పదులలో ఆరాధ్యచరిత్ర

మను పేరితోఁ గర్ణాట భాషానువాదమును వెలయించి యాతని నారాధించిరి. తోంటదసిద్ధలింగకవి (క్రీ॥ శ॥ 1560) శిష్యుండగు గూళూరుసిద్ధ వీరస్వామి యాదేశమున సోమనాథుని చరిత్రమును "పాల్కురికె సోమేశ్వర పురాణ" మను పేరితో 15 సంధులుగల యొక ప్రత్యేక గ్రంథముగనే వార్ధకషట్పదులలో రచించెను.

వీరశైవమతోద్ధారకులగు బసవేశ్వర మల్లికార్జున పండితారాధ్యుల చరిత్రములను మునుముందు తెనుఁగుబాసలో రచించి యాంధ్ర కర్ణాట దేశములందు వీరశైవవ్యాప్తికి దోడ్పడిన మహనీయుఁడయి, తమకు మార్గదర్శకుఁడవుటచే బైనిచెప్పఁబడిన వారేగాక పలువురు కర్ణాటవీరశైవకవులు సోమనాథునెడ నపారభక్తిగౌరవములఁ బ్రకటించుచుఁ దమ కృత్యవతరణికలలో నతనినారాధించిరి. అట్టివారిలోఁ బ్రముఖులగు వారి గ్రంథనామములను నీక్రింద నుదాహరించెదను.

(1) పద్మణాంకుఁడు (క్రీ॥ శ॥ 1385) పద్మరాజపురాణము
(2) బొమ్మరసు (క్రీ॥ శ॥ 1450) సౌందరపురాణము
(3) చతుర్ముఖ బొమ్మరసు (క్రీ॥ శ॥ 1500) రేవణసిద్ధేశ్వరపురాణము
(4) గుబ్బిమల్లనార్యుఁడు (క్రీ॥ శ॥ 1515) భావచింతారత్నము, వీరశైవామృత పురాణము
(5) కుమార చెన్నబసవన (క్రీ॥ శ॥ 1550) బసవపురాణద పురాతన చరితము
(6) కిక్కేరియారాధ్య నంజుండయ్య (1550) భైరవేశ్వర కావ్యము
(7) సదాశివయోగి (1554) రామనాథ విలాసము
(8) శాంతేశయ్య (1561) తోంటదసిద్ధేశ్వర పురాణము

(9) విరూపాక్ష పండితుఁడు (1584) చెన్నబసవ పురాణము
(10) మల్లికార్జునకవి (1500) సహస్రగణమాలిక (ఇది పండితారాధ్య చరిత్రమున సోమనాథుఁడు గూర్చిన దానికనువాదము)
(11) సంగన బసవేశ్వరుఁడు (1600) రథోద్ధరణావాచ్యము
(12) బసవలింగకవి (1600) శివాధిక్యపురాణము
(12) హరీశ్వరుఁడు (1606) ప్రభుదేవర పురాణము
(14) సిద్ధనంజేశకవి (1650) గురురాజ చరిత్ర (15) వీరనార్యుఁడు (1650) ప్రసాదచరిత్రము (16) శాంతవీరదేశికుఁడు (1650) శివలింగ చరిత్రము
(17) బసవలింగకవి (1679) కొట్టూరు బసవేశ్వర పురాణము (18) సంపాదనెయ పర్వతేశ్వరుఁడు (1696) చతురాచార్య పురాణము (19) చెన్నమల్లేశకవి (1700) దీపద కలియారు చరిత్రము.

## ౨౧. సోమనాథుని శివైక్యము

"పాలకురికి వృత్తాంతము" అను నాలుగవ ప్రకరణమునఁ బాలకురికిలో నిప్పుడు సోమేశ్వరస్వామి యాలయమే గాక సోమనాథ లింగాలయము కూడ మఱియొకటి కలదనియు రోగపీడితులు నిరామయత కొఱకుఁ గామార్థులు కామితసిద్ధి కొఱకు సోమనాథలింగమును సేవించుటకై పరిసరగ్రామములనుండి ప్రతి దినము చనుదెంచు చుందురనియు వ్రాసియుంటిని. విశేషమహిమాన్వితమగు నీ సోమనాథలింగము సోమనాథుని సమాధిపయిఁ బ్రతిష్ఠితమైన లింగమని యచ్చటివారు విశ్వసింతురు. కావునఁ బ్రత్యక్షముగఁ గానవచ్చు నీ సోమనాథ లింగమును బట్టియుఁ దదాలయమును బట్టియు సోమనాథుఁడు తాను జనన మొందిన పాలకురికి యందే

శివైక్యమును జెందెనని స్థూలదృష్టికి గోచరించును. కాని పిడుపర్తిసోమనాథుని పద్యబసవపురాణావతారికనుబట్టి సోమనాథుఁడు తనయంతిమ దశలోఁ గన్నడదేశమునకేఁగి యచ్చట శివగంగకుఁ జెంగటనున్న "కల్లె" మను గ్రామమున సమాధి నేర్పఱచుకొని యందు బయలయ్యెనని తెలియుచున్నది. తోంటదార్యుఁడు కన్నడమున రచించిన సోమేశ్వర పురాణమునుబట్టియో తన వినికిడిని బట్టియో పిడుపర్తి సోమనాథుఁడీ విషయమును చేర్కొని యుండునని నేఁదలంచుచున్నాను. వావిళ్ళవారి ముద్రణాలయమున నామిత్రులు కీ॥ శే॥ శ్రీ గంగపట్టణపు సుబ్రహ్మణ్య దేవరగారు 1916 సంవత్సరములో ముద్రించి ప్రకటించిన పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురాణములో నీ సందర్భమును గూర్చిన పద్యమిట్లు ముద్రింపఁ బడినది.

చ॥ కలిమల భంగచంగ శివగంగకుఁ జెంగటఁ గల్లుమత్పురిం
బలకలగుంటి మాయిన సమాధిరచింపఁగఁజేసి భూతిలో
దలముగఁబోసి యందుపయిఁ దా వసియించుచుఁ గావఁగన్నుభౄ
త్యుల నియమించి నిశ్చలతనుండె వృషేంద్ర పదాంతరంగుఁడై.

"కల్లుమత్పురిఁ" అనునది "కల్యాణమన్పురిఁ" అనుటకు మాఱుగ జరగిన యపముద్రణమని శ్రీ ప్రభాకరశాస్త్రి గారు బసవపురాణ పీఠికలో వ్రాసినారు. కాని వారి పాఠము కూడ సరికాదని మనవి చేయుచున్నాను. "కల్యామన్పురిఁ" అని కవిపాఠమయి యుండును. తోంటదార్యుని సోమేశ్వర పురాణములో నీ గ్రామ నామము కల్లెయమనియే చెప్పఁ

బడినది. పయిపద్యమున "బలకల గుంటిమాయిన" అనుచోటఁ గూడఁ "బలకల గుండ్రి మానొక" అనియో లేక "పలకల గుంటలో నొక" అనియో కవిపాఠ మయియుండును. సోమనాథుని కర్ణాటదేశ నిష్క్రమణమునకుఁ గారణములను బిడుపర్తి సోమనాథుఁడిట్లు పేర్కొనినాఁడు.

"అట్లుండియు సోమనాథుఁడు కాలత్రియవేది గావున నాగామి కార్య కౌశల్యంబు లెఱింగి పిడుపర్తి శివరాత్రి కొప్పయ్యాదిగాఁ గల తన శిష్యుల నందఱఁ బిలిపించి యీ దేశంబింకఁ దురుష్కులచే నాక్రాంతంబుగాఁ గలదు. మాబోటి నియమస్థుల కిందునికి పొందు పడదని వారితో నిట్లనియె.

క॥ ఈ రాజ్యంబున మాకిఁక । నారూఢిఁ జరించుచుండ ననువుపడదు మీ కీరాజ్య సీమలో నొక । యూరు ఘటించిత్తునందు నుండుండనుచున్.

సీ॥ తనశిష్యుఁడును నాప్రతాపుని మంత్రియు నగునిందులూరియన్న య్యాఁబిల్వఁ బనిచి నీ వెప్పుడు భక్తితో నరువత్తు మూగుర నర్చింతువు ముఖ్యవృత్తిఁ దత్ప్రీతిగా మావ్రతస్థుల కొకగ్రామ మిప్పించుమీ ధరాధీశుచేత ననవుడు నతఁడు మహాప్రసాదం బని యిప్పించె దొంకిపర్తిద్ధభక్తి.

గి॥ నందుఁ బ్రతివసించి రరువత్తుమువురును । దామ ప్రేమఁగనడభూమి కరిగి యచటి భక్తులెల్ల నతి భక్తి సేవింపఁ । గొంత కాలముండి యంతమీఁద.

పిడుపర్తి సోమనాథుని యీ పద్య బసవపురాణావతారికనుబట్టి పాలకురికి సోమనాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని కాలము వాఁడని కాన్పించుననియు నందుచే నాంధ్రకవిచరిత్ర కారులు మున్నగువారు మొట్టమొదట నట్లే తలంచిరనియు ననంతరము కన్నడకవిచరిత్ర వెలువడిన తరువాత నందుఁ బ్రకటితమయిన బలవత్ప్రమాణములఁబట్టియుఁ దదితర పరిశోధనములఁ బట్టియుఁ బూర్వాభిప్రాయము నిరాకృతమయి

సోమనాథుఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమువాఁడను నిర్ణయ మేర్పడెననియు నాతని తరువాత 300 సంవత్సరములకు వెలసిన పిడుపర్తి సోమనాథుఁడు వినికిడినిబట్టి వ్రాసిన వ్రాఁతలలోఁ గొన్ని వ్యత్యాసము లేర్పడియుండుననియు "సోమనాథుని కాలము" అను పదియవ ప్రకరణములో వెనుకనే వ్రాసియున్నాను. పాలకురికి సోమనాథుని తరువాతఁ గూడఁ గాకతీయ సామ్రాజ్య మవిచ్ఛిన్నముగ నొక శతాబ్ది వఱకు వర్ధిల్లినది. దేశము త్వరలోఁ దురుష్కాక్రాంతము కానున్నదని దివ్యజ్ఞానముచేఁ దెలిసికొని తన వీరశైవాచార నియమముల కట భంగము గలుగు ననుభయముతో సోమనాథుడు కన్నడభూమి కరిగెననుటలో సత్యముగాని సారస్యముగాని లేదు. వాస్తవముగ నప్పుడే కాకతీయ సామ్రాజ్యమునకు ముప్పువాటిల్లినను రాజధానికి దూరముగ నున్న పాలకురికిలో నివసించు సోమనాథునివంటి తపశ్శాలికిఁ దురుష్కుల వలన భంగము ప్రాసంగునని తలంచుటగూడ సంగతము కాదు. అంతటి మహిమాన్వితుఁడు దేశీయులను దేశాధీశులను వారి పాట్లకు వారిని విడిచి తాను మాత్రము పరదేశీయుల దాడులకు వెఱచి దేశమునుండి వెడలిపోయె ననుటగూడ సత్యసమ్మతము కాఁజాలదు. ఇంతకు నక్కాలమున నాంధ్రదేశముతోపాటు దక్షిణాపథము నందలి కన్నడ భూమికూడఁ దురుష్కుల దాడులకు గుఱియయ్యెనేగాని సురక్షితముగా నుండలేదు. కావునఁ బిడుపర్తి సోమనాథుని యవతారికలో దొరలిన వ్యత్యయములలో నొకటిగ దీనిని

మనము గణింపఁదగును. అతఁడెట్లు వ్రాసినను విరక్త త్తోంట దార్యుఁడు తన సోమేశ్వర పురాణములో మాత్ర మిట్టిగాఁడవల నేమియుఁ దడవ లేదు. అతఁడీ సందర్భమునఁ జెప్పిన వృత్తాంతమిది.

"సోమనాథుఁడు వాదమునఁ జక్రపాణిరంగనాథునోడించిన తరువాత నాతని ననుగ్రహించి, నిజతనయుండగు చతుర్ముఖబసవేశ్వరుని చే నాతనికి వీరశైవదీక్ష నిప్పించి యాతఁడర్పించిన వీరభద్రవిజయము శరభ చారిత్రాది కృతుల గ్రహించి భక్తులతోఁ బాల్కురికి యందువసించుచుండెను. అప్పుడు కర్ణాటదేశమునుండి యొక చరమూర్తి పాలకురికి కేతెంచి సోమనాథుని పూజలనొంది కకుద్గిరి దక్షిణభాగమునవిలసిల్లు తారకాచలమున "కల్లెయ" మనుపురంబు గలదనియుఁ బూర్వమచ్చటఁ దారకాసురుని తనయుఁడు తపమాచరించి కల్లేశ్వరాహ్వయలింగము ను భక్తితో నారాధించుటచే నాలింగము ను బట్టి యా పురమునకుఁ గల్లెయమను పేరు వెలసెననియు, అంద గణిత శీలసంపన్నులు, నతులమహిమాన్వితులు నగు పరమశివభక్త లనేకులు వసించు చుందురనియు వారిలో 'చెన్నమ్మ' యను భక్తురాలగ్రగణ్యయై చతుష్షష్టిశీల నిర్వాహణమున సోమనాథుని వలెనే యసదృశకీర్తితో విరాజిల్లుచున్న దనియు విన్నవించెను. ఈ వార్త విన్నంతనే యామెను సందర్శించు వేడ్క సోమనాథున కధికమయ్యెను. అంతనాఁతఁడు పుత్త్రుఁడు చతుర్ముఖ బసవేశ్వరుని మిత్రుఁడు పాల్కురికి సూరనామాత్యుని శిష్యులు రంగనాథాదు లను వెంటఁగొని మహోత్సవముతోఁ గల్యెమున కెద్దులబండిపయిఁ బయనమై చెన్నమ్మయింటి కేఁగెను. ఆమెయు వారి చరణముల కెరఁగి యఖిలోపచారములఁ గావింప సోమనాథుఁడామె భక్తిశీలములకుఁ బ్రీతుదమంది యచ్చటనొక మాసమువఱకు నుండెదనని మాటయిచ్చి యామెయొసంగిన విభూతివీడ్యమును స్వీకరించెను. అంత నాతఁడటఁ గొన్ని దినములు మాత్రమే వసించి తాను వాగ్దత్తమొనర్చిన గడవు ముగియకుండఁగనే శిష్యుల తొందరచేఁ గాఁబోలుఁ బాంకురికికి మరల నరుగనెంచి యెద్దులను బండికిఁ గట్టించి చెన్నమ్మగారి యింటిముందట నాఁపి సెలవు గైకొనుటకయి యామె యొద్ద కేతెంచెను. ఈ సంగతి విన్నంతనే యామె "మహాత్మా! సర్వజ్ఞ

లగు మీకు నేఁజెప్పఁదగిన దేమున్నది? తాము సెలవిచ్చిన గడువైన గతింపకముందే మీరు మమ్ము విడనాడి చనసెంచుట న్యాయ్యమే! కావున నా ప్రార్థన మ్మంగీకరించి యిచ్చుటనే మఱికొంత కాలము నివసింప వేఁడుచున్నాఁను" అని విన్నవించెను. అందుపై నాతఁడు "అమ్మా! నీ వనుజ్ఞ యిచ్చినచో గడువుతో నిమిత్తమేమి? నాశిష్య జనములు నాకై పరితపించుచుందురు. నీవు సంతోషముతో నాప్రయాణమున కనుమతి యొసంగినఁ జాలును. నేను బోయివచ్చెదను" అని బదులుపలికెను. అంతనామె యట్లే యనుమతించుటనని పునవిసేయ సోమనాథుఁడు తనయనుచరులతో బండియొద్దకేగి యందుఁ గూర్చుండి ప్రయాణ మయ్యెను. కాని వృషభములట్లే స్తంభించి ముందునకొక యడుగైనఁ గదలనేర వయ్యెను.

సోమనాథుఁడందుకు దిగ్భ్రమపడి యాస్తంభన కారణముల నడుగుట భక్తుల విచారింపఁగా వారు "ఆర్యా! తమకు మేము వేఱ చెప్పవలయునా? విభూతి వీడ్యము మర్యాద నతిక్రమించి మీరు మీగ్రామమునకు మరలఁ బ్రయాణింపసెంచుటయే యీ నిరోధమునకుఁ గారణము. మున్ను కళ్యాణపట్టణములోఁ గొందఱు జంగములు గానుగులకన్నప్పనింట శివపూజచేయుట కంగీకరించి యాతని హస్తమునుండి విభూతి వీడ్యమును గ్రహించియు నాతని యింటికేఁగిభుజించుట కుదాసీనత వహించిరి. అంతవారి యిష్టలింగము లదృశ్యములై యాభక్తవరుని యభిషేకపాత్రియందు నెలకొనెను. అందుపై వారు తమలింగము లాకస్మికముగ మాయమగుటకు గారణమారయనేరక బసవేశ్వరుని కావృత్తాంతము నివేదించి వేఁడికొనఁగా నాతఁడు జరిగినసంగతి వారికిఁదెలియఁజేసెను. అప్పుడువారు కన్నప్పయొద్దకేఁగి యాతనివలనఁ దమ యిష్టలింగములఁ బడసి యాతనితో భుజించిరి. ఇట్లే కాశిరాజు కూడఁ దెలుఁగు జొమ్మయ్యగారియింట భుజించుట కాతని విభూతివీడ్యమును స్వీకరించి యాతని మృగయాజీవనమునకు రోఁతగొని కాఁబోలు నాతని గృహమునకుఁ జనకుండెను. దానిపై నాతని యిష్టలింగ మెగసి యొకనదిలోఁ బడిపోయెను. దానికాతఁడు బెదరి జొమ్మయ్యయింటికిం జని ప్రార్థించి యదనుగ్రహమువలనఁ దనలింగమును మరలఁ బడసెను. అప్పుడు జొమ్మయ్య వేఁటాడి తెచ్చిన మృగముల మాంసఖండము లన్నియు వివిధములగు పుష్ప

ములుగ మాటిపోయెను. జొమ్మయ్య మహిమమున కబ్బురపడి కేసిరా జాతనితోఁ గలిసి భుజించెను. కావున మహాత్మా! యెట్టివారికిని విభూతి వీడ్య మును మీటిచరింపరాదు. దాని మహత్త్వమట్టిది, అని నివేదింప సోమనాథుడు ప్రియాణము గట్టిపెట్టి యప్పటినుండి కల్యమునందే చెన్నమ్మగారి సత్కా రముల నందుచు సుఖంబుండెను. అచ్చట సమావేళమైన భక్తవరు లానాఁడు ప్రత్యక్షగోచరమయిన యావృషభస్తంభన సమాచారము సెక్కుపఁగా జెప్పి కొనుచుఁ బూర్వమా కైలాసమున నిందుఁడొనర్చిన యపచారమొండు కార ణముగా నాదివృషభేంద్రమూర్తి కుద్ధుఁడై కావించిన యుపద్రవములను బ్రతిష్టంభనాదికవృత్తాంతములను, కాంచీపట్టణమున సున్మత్తాకృతిని జరించు రేణుకాచార్యుఁడు తన్ను గట్టి తీసికొని రమ్మని విజయేంద్ర చోళు డాజ్ఞాపింప నాతని భటులొనర్చిన ప్రయత్నమ్ములను వమ్మొనర్చి యించు కయినఁగదల కుండిన కథయును లోనుగా నేతాదృశపూర్వగాథలను స్మరించి యానందముఁ జెందిరి"

సోమనాథుని శివైక్య విధానమును గూర్చి కూడ, తోంటదార్యుని సోమేశ్వర పురాణమునకుఁ బిడుపర్తి సోమ నాథుని యవతారికకుఁ గొన్ని విషయములలో వ్యత్యాసము లున్నవి. ఇందుఁగూర్చిన పిడుపర్తిసోమనాథుని పద్యముల ముందుగా నుదాహరింతును.

సీ॥ వాగ్ధకమ్మ గదియవచ్చె నింద్రియములఁ పాటవంబుడిగిన మద్రవ్యతంబు
గడిఁదిగానఁ బాహ్యకర్మములఁ మానిసమాధినుందుననుచు మదిఁదలంచి.

క॥ నాపట్టిన వీరవ్రత! మేపట్టున వదలకుండ నిన్నిదినంబుల్
గాపాడిరి భక్తులీకన్ । వ్యాపారము మానవలయు నని తలఁచిమదిన్

చ॥ కలిమలభంగ...............(అను పూర్వోక్త పద్యము)

గీ॥ అప్పుడీశ్వరుఁడు నిజాకృతిఁదాలిచి।పరమపురుషు కడకు నరుఁగుదెంచి
రమ్ము కొని చనియెద రజతాద్రి కనవిని।సోమధరున కనిరెసోమగుఁడు.

సీ॥ ఈసమాధి లోకులందఱు నెఱుఁగంగ।నిచ్చునున్ననన్ను నితరులెఱుఁగ
కుండఁదలుపు వెడలికొనిపోవ జనులెల్ల।బూటకీఁడు పాటిపోయెనందు

సీ నను నీసమాధిఁ జెఱవక । కొనిపోయినవింత కతఁడు కుశ్శకయన్నే
యని కొందురితరులీ నిందను జెందకయుండ నన్నుఁదగఁ గొనిపొమ్మా.
గీ భవిచూడనంచు నాపట్టిననియమంబు।కడమకాకుండఁగఁ బుడమిజనులు
నారూపునీరూపునడుమఁగాంచుటదోప।నాకుఁబ్రియంబైన నిందిరూపుఁ
బటికంబునను వాల్చి భర్గ నీగర్భంబు।నందు నన్నుభరించి సందియంబు
మానునట్లుగనీసమాధి మీఁదటఁగొంత।లేడవుండి సద్భక్తతతి నుతింపఁ
గీ గొంచుఁబొమ్ము రజతకుధరంబునకు నన్ను।నవినట్ల కొంచునరుగుశివుని
సమ్ముఖంబునందు సమ్మదంబునసుండె।సోమతుల్యుఁడగుచు సోమగురుఁడు

ఇఁక సోమేశ్వర పురాణమున దొంట దార్యుఁడు వివరించిన వృత్తాంతమిది.

“సోమనాథుఁడు కల్యాక్షేత్రమున సకలభక్తమాహేశ్వరులను పాలించుచు విలసిల్లుచుండ నొకనాఁడు శివుఁ డాతనికిఁ బార్వతి నంది భృంగి సమేతముగాఁ బ్రత్యక్షమయ్యెను. అంతసోమనాథుఁడు పరవశుఁడయి యా పరమేశ్వరునకుఁ బ్రణమిల్లి గద్గదకంఠుఁడయి బహువిధముల సంస్తుతింప “సాంబశివుఁడాతనిఁ గౌఁగిలించి మెచ్చుచఱచి “వత్సా! నీవలె శీలవ్రతాచారములను సంపూర్ణముగ నిర్వహించి నామహిమను జగమందెక్కువగ వెల్లడించి మతసేవగావించినవారు మఱియొకరులేరు. నీభక్తికి మెచ్చి నిన్నుఁ బ్రత్యక్షముగఁ గైలాసమునకుఁ గొంపోవనే తెంచితిని, కావున నాతోరమ్మ” అని యాదేశించెను. అందుకు సోమనాథుఁడు “దేవా! రేపు సోమవారమునాఁడీ దేహమును భూమియందు నిక్షిప్తమొనరించి భవత్సాన్నిధ్యమున కరుదెంతును” అని విన్నవించెను. శివుఁడు “నీశరీరము రత్నమువలె మిక్కిలి పవిత్రమైనది. కావున దానితోడనే నావెంట శీఘ్రముగరమ్మ” అని మాఱుపలికెను, అంత సోమనాథుఁడు “మహాదేవా! నా యీ దేహ మీ భూమిపయినే పుట్టి శీలములనిక్కడనే నిర్వహించి చరితార్థమయినది. స్థూలదేహమునకుసమాధిరూపమే సమంజసము. అందు చేతనే సోమిదేవయ్య, చిక్కయ్య, మాదన్న, అజగన్న, సొమ్మవ్వ మున్నగు మహాత్ములు సమాధినొందియే నిన్నుఁజేరికొనిరి. రేవణసిద్ధ మరులాచనాదులు దివ్యశరీరధారులు కావున లింగములందుఁ బ్రత్యక్షముగ నైక్యమొందిరి. నా యీ స్థూల సూక్ష్మ దేహముల గజగర్భమునందుఁ గపి

త్థమువలె భూగర్భమున నిక్షిప్తమొనర్చుట కనుమతింపుము. పాంచ భౌతిక లింగసంజనితమయిన శరీరమును భూతలము నందిడుటయే కర్తవ్యము. కావున నట్లు కావించిరేని నీసన్నిధికిఁ జనుదెంచెద'' నని విన్నవించెను. అట్లే కావింపు మని మందహాసముతో మహేశ్వరుఁ డంతర్హితుఁడయ్యెను. రాఁబోవు సోమవారమున సమాధినొందెదనని సోమనాథుఁడు ప్రకటింప శివశరణులు కల్యాణనకు గుంపులుఁగ నరుదెంచిరి. అంత నాతఁడొక మంటపము కట్టించి దానియందు షట్సమ్మార్జనము గావించి, షడక్షరీమంత్రమును పంచప్రణవములను లిఖించి, శుభ్రవస్త్రముపయి నధివసించి, శరణులందఱకు విభూతి తాంబూలముల సమర్పించి, శివసిద్ధాంతతంత్రోక్త విధానమున నిర్యాణ దీక్షగ్రహించి, సమస్తభక్త మాహేశ్వరులుజయజయధ్వానములతో స్తోత్రపాఠములు గావింపుచుండ, శరణుల నెల్లరఁబిలిచి నమస్కరించి “అయ్యలారా! ఇఁకఁ గొంతకాలమున కీనగరము కూష్మాండఫలనిమిత్తముగఁ బాడువడును. దానిని మీరు చిత్తగింతురుగాక! అని విన్నవించి, శివగణారాధనమొనరించి, భక్తులెల్లరుమహాపంచాక్షరిని జపించుచుండఁ దనప్రాణముల నెల్ల నొక్కచోఁ గూర్చి బయలయ్యెను. అంత భక్తమాహేశ్వరు లాతని నొసట విభూతినిడి, దేహమును బుష్పాదులతో నలంకరించి, మహా సంభ్రమముతో భజనలుసలుపుచుఁ గర్త్యేశ్వరుని ప్రాంగణము ముందర సోమనాథుని కోరిక ననుసరించి సమాధిని రచించిరి. మకుటాగమోక్తసరణి సోపానక్రమమును వేదికనుగూర్చి సమ్మార్జనమొనర్చి రంగవల్లులుదీర్చి సమంత్రకముగ లింగముద్రల స్థాపించి, నలుదిక్కులఁ బ్రణవముల లిఖించి పత్రపుష్పాదులఁ బూజించి మధ్యమునఁ బంచ బ్రహ్మమంత్రముల వ్రాసి లింగముద్రలతోడి ఇటుకల నల్గడల నిలిపి యారఁటికంబముల జెఱుకుగడలను బయినిస్థాపించి. ఫలపుష్ప సంభారములతో శృంగారించి శ్రీగురుసోమనాథుని విజయముచేయించికొని సమాధిమధ్యత్రికోణమున గూర్చుండఁబెట్టి యారతులొసఁగి పంచాక్షరోచ్చారణ పూర్వకముగ విభూతితో దళముగ సమాధినిగప్పి నేలనుజదునుచేసి వేదికను రచించి దానిపయి లింగవృషభముల నెలకొలిపి యథోక్తముగ బూజాదికముల నిర్వర్తించిరి. అనంతరము సోమనాథునితనూజుఁడు చతుర్ముఖ బసవేశ్వరునకు వారెల్లరు గురుపట్టము కట్టి విరాజిల్లిరి.''

ఇట్లు కన్నడభూమిలో జరిగిన సోమనాథుని శివైక్యవిష యమున మనము కర్ణాట దేశీయుఁడు పిడుపర్తి సోమనాథున కించుకపూర్వుఁడునగు తోంటదార్యుని వాక్యములకే విశేష ప్రామాణ్య మీయఁ దగును. పయిసంగతులనెల్లఁ బర్యాలోచింప సోమనాథుని కర్ణాటదేశ నిష్క్రమణము నచ్చట ఘటిల్లిన యాతని శివైక్యము పరమేశ్వరోద్దిష్టములే గాని యాతఁడు స్వయముగ వాంఛించినవి కావనికూడ మనము గ్రహింపనగును.

ఇందుచే సోమనాథుని భౌతికశరీరమాతఁడు జన్మించిన పాలకురికియందుఁగాక కర్ణాటదేశమందలి కల్లెయక్షేత్రమందే శివైక్యమయ్యెనని నిస్సంశయముగ మనము నిర్ణయింపవచ్చును. పాలకురికిలో సోమనాథలింగ మిప్పుడు ప్రతిష్ఠితమయియున్న ప్రదేశము లెస్సఁగా బరీక్షించినచో గద్దెవలెఁ గాన్పించునేగాని యొక సమాధిస్థలముఁగాఁ దోఁపదని శ్రీ వీరభద్రశర్మగారు తెలిపియున్నారు. అన్యవాదకోలాహలశతక కర్త చెప్పిన సీస పద్యములోఁగూడ "యుష్మదీయాశ్రమా భ్యున్నతిం జెందెనే భాగ్యంబుచేసెనో పాలకురికి" అని యున్న దేకాని యందాతని సమాధిప్రశంస లేనే లేదు. పాలకురికిలో నిప్పుడు యాత్రికులచే నిత్యము సేవింపఁబడుచు వారికి గామితార్థములఁ బ్రసాదించుచు విశేషమహిమాన్వితమయి వెలయు సోమనాథలింగము సోమనాథుఁడు తపోనుష్ఠానముల నాచరించుచుండిన యాశ్రమ స్థలముపయి భక్తులాతని యనంతరము ప్రతిష్ఠించి యుందురనియు సోమనాథుని యాధ్యాత్మికశక్తి చిరకాలమావేశిం

చిన పవిత్రస్థలమందుఁ బ్రతిష్ఠితమగుటచేతనే యాలింగమును కట్టి మహిమ సిద్ధులు కలిగెననియు నేదలంచుచున్నాను.

సోమనాథుని శివైక్యస్థలమగు కల్లెయమిప్పుడు గూడ "కల్య" "కల్యము" అను నామములతో వ్యవహరింపఁ బడుచున్నది. అది బెంగుళూరుజిల్లా మాగడితాలూకాలో బెంగుళూరునకు నాలుగుయోజనముల దూరమున నున్నది. దానికిఁ దారకాద్రియను నామాంతరమిప్పుడుగూడఁగలదఁట. ఆ గ్రామమున వీరశైవపంచాచార్య సింహాసనములలో నాల్గవదియగు శ్రీశైలసింహాసనమునకుఁ జెందిన శాఖామఠముగలదు. ప్రస్తుత మఠాధ్యక్షులగు శ్రీ పట్టదసిద్ధలింగదేవరగారికి వ్రాసి కనుఁ గొనఁగా వీరి మఠావరణములోఁ దమ పూర్వస్వాములసమాధులేగాక యొక గుహలో "పాలకురికి సోమనాథుని సమాధి" యని యనుశ్రుతముగఁ జెప్పఁబడు పదియంగుళము లెత్తుగల సమాధిగూడ నొకటి యున్నదనియుఁ బ్రాఁతది శిథిలము కాఁగాఁ బ్రస్తుతము దానిని సిమెంటుగచ్చుతో భద్రమొనర్చితిమనియుఁ దెలియఁబఱచియున్నారు. కావున నిప్పటికిఁ గూడఁ గల్యక్షేత్రమున నిలిచియున్న యీ సమాధి తోంటదార్యుఁడు పిడుపర్తి సోమనాథుఁడు వ్రాసినసంగతులను బలపఱుచు చున్నది. కాని విదేశమునసున్న యీ సోమనాథుని సమాధి కాతనిజన్మస్థలమునఁ దదీయాశ్రమ స్థలిపయి నాతని యనంతర మాతని శిష్యులు వెలయించిన సోమనాథలింగమునకు వలెఁ బూజాదికములు జరుగుచుండుట గానరాదని వేఱ చెప్పనక్కఱ లేదు. అది సహజమే.

మహాశయులారా!

సోమనాథుని భౌతికశరీరము నిక్షిప్తమయిన సమాధి శల్యమందున్నను బాలకురికియందున్నను ననంత తేజోవిరాజితమై వెలుంగునాతని దివ్యమూర్తి మాత్రి మాంధ్రి హృదయాంతరాళములందును నాంధ్రిభాషాభిమానుల మానస గుహాంతర సీమలందును, భక్తప్రివరుల ప్రాణలింగ భావ లింగములందును సుప్రితిష్ఠితమయి సమాధినిష్ఠమయి యిప్పటికిని నిలిచియున్నది. ఆంధ్రిదేశము, ఆంధ్రిభాష, ఆంధ్రికవితయిలపై వెలయునంతదనుక నది చెక్కుచెదరక యెప్పటికిని నట్టులే వెలయఁగలదు. కావున వినశ్వరమగు నాతేజోమూర్తినే మనము సతతము సభక్తికముగ నారాధించి చరితార్థులమయ్యెదముగాక!

ఓం తత్సత్



# శుద్ధపత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 41 | 15 | శ్రేష్మ | శ్రేష్ఠ |
| 43 | 23 | స్రోంత్యజో | సోంత్యజో |
| 45 | 18 | మదన | వదన |
| 46 | 19 | మేధాద్యాగ | మేధాఽయాగ |
| 87 | 7 | పటాలా | పటులా |
| 90 | 6 | సిరిద్ | సిర్ది |
| 92 | 21 | సంస్కృతాను | సంస్కృతీ |
| 108 | 22 | నానూత్సింద | నానూబ్సింద |
| 109 | 2 | | |
| 126 | 18 | త్రైష్ణ్య | త్రైష్ణ్య |
| 129 | 1 | మలవాటుపడ | మలవడ |
| 132 | 10 | గాక | గాకతీయ |
| 135 | 21 | సోమేశ్వర | సోమేశ |
| 138 | 2 | గూల్చి | గొల్చి |
| 142 | 10 | దేశము | దేశమున |
| 180 | 2 | కగపడిన | కగపడి |
| 185 | 22 | మహేశ్వర | మాహేశ్వర |
| 188 | 12 | నోవిద | వినోద |
| ,, | 18 | భిన్నముగ | భిన్నముగ నను |
| 191 | 3 | నాల్గింటితో | గణములునాల్గింటితో |
| 193 | 19 | వర్య | వీర్య |
| 198 | 8 | యాద్యంతరము | యాద్యంకము |
| 210 | 10 | గావున | గావుత |
| ,, | 14 | నిల | వలి |
| ,, | 22 | భక్ర | భక్తి |
| 211 | 1 | వరివు | వరవు |
| 234 | 23 | య్యంబ్దంది | యిబ్బంది |
| 238 | 6 | ప్రతిజ్ఞా | ప్రతిభా |

| | | | |
|---|---|---|---|
| 257 | 5 | యుద్వృత | యుద్ధృత |
| 263 | 4 | జిల్లి | ఝల్లి |
| ,, | 22 | ఋ, ఋ | ఋా, ంఋ, |
| 264 | 10 | లకుసు | లకు |
| 268 | 4 | పరులు | పదులు |
| 274 | 14 | సాంప్ర | సంప్రి |
| ,, | 28 | వువ్వులు | పువ్వులు |
| 273 | 10 | నికరమున | నికరము |
| 281 | 10 | తరువాత "మున్నగుసబిందు నిర్బిందుప్రాసములును" అని చేర్చవలెను. | |
| 285 | 2 | స్తసా | స్త్వసా |
| 296 | 20 | శబ్దములతో | శబ్దముతో |
| 297 | 2 | షష్టి | షష్ఠి |
| 298 | 19 | మున్న | మున |
| 305 | 307 | సోమనాథుని | సోమనాథు |
| 311 | 313 | శిక్ష ఛందోవ్యాకరణ | నారాధించిన |
| 315 | 317 | అసామాన్య | యాంధ్రకర్ణాట |
| 319 | 323 | ప్రయోగములు | కవులు |

నోటు:— థ, ధ, న, స లొకదాని కొకటి తప్పుగా ముద్రిత మయిన తావులు, సంయుక్తాక్షరము లంటునివి, అరసున్నలనవసరముగను, స్థానములుతప్పి, ముందువెనుకల వ్యత్యస్తముగను, ముద్రితమయిన తావుల దండుగలవు చదువరులిట్టి సామాన్యస్ఖాలిత్యములు గుర్తించి సవరించి కొనప్రార్థితులు.

